# లోక బాంధవి

## అనుభవాల వల్లరి



రచయిత : మన్నవ దత్తాత్రేయ శర్మ

**లోకబాంధవి**

**అనుభవాల వల్లరి**

రచన
మన్నవ దత్తాత్రేయ శర్మ

ప్రథమ ముద్రణ
ఏప్రిల్, 2003

ప్రతులు : 500

ప్రతులకు
**శ్రీ విశ్వ జనని పరిషత్**
జిల్లెళ్ళమూడి - 522 101
బాపట్ల తాలూకా, గుంటూరు జిల్లా.

మూల్యం
50/-

ముద్రణ
**ఆకృతి ఆఫ్‌సెట్ ప్రింటర్స్**
చిక్కడపల్లి, హైద్రాబాద్.
ఫోన్: 2766 4525

# కృపా లబ్ధి

అమ్మ ను ఆరాధించడం వేరు, ఆమెను పూర్తిగా తెలుసుకోవడం వేరు. ఆమెను సాక్షాత్తు దైవంగా భావించి,విశ్వసించి, ఆరాధించిన, ఆరాధిస్తున్న వారు వేల సంఖ్యలో ఎక్కడెక్కడో ఉన్నారు. దైవమనుకోవడానికి మించిన అవగాహన కోసం వారు ప్రయత్నించి ఉండరు. ప్రయత్నించినా విజయం సాధించి ఉండరు. విజయం సాధించినా తాము అలా సాధించామని చెప్పిన వారు నాకు తటస్థపడలేదు. అమ్మను పూర్తిగా తెలుసుకోవడం కష్టమన్నవారే నా ఎరుకలో ఎక్కువమంది నేనూ అంతే ఇప్పుడు మీ చేతుల్లో ఉన్న మన్నవ దత్తాత్రేయ శర్మగారి పుస్తకాన్ని చదివిన తరువాత అమ్మనే కాదు, ఆమె దగ్గరకు తీసి అందరింటిలో చేర్చిన సోదరీసోదరులను అర్థం చేసుకొనడం, వారిని అంచనా వేయడం కూడా కష్టమని నాకు గ్రహింపు కలిగింది. దత్తాత్రేయ శర్మ గారికి దత్తు గారని పిలవడం నాకు అలవాటు. ఆయన నాకు మూడు దశాబ్దులుగా తెలుసు. అమ్మదగ్గర కలిసి మెలసి తిరిగిన అన్నయ్యలు, అక్కయ్యలలో ఆయనొకరు. ఇద్దరం చాలా సన్నిహితంగా తిరిగిన జ్ఞాపకాలు ఉన్నాయి. ఎన్నోసంగతులు మాట్లాడుకునేవాళ్ళం. సరదాగా కబుర్లాడుకొనేవాళ్ళం. అప్పుడు దత్తుగారు రచయిత అనిగాని, అమ్మను గురించి ఇంతగా అధ్యయనం చేస్తున్నారని గాని నాకు అనిపించలేదు. ఇప్పుడీ పుస్తకం చదివాక, దత్తుగారేమిటీ, ఈ పుస్తకం రాయడమేమిటి? అని ఆశ్చర్యం కలిగింది. అమ్మను గురించి ఇంతకు పూర్వం రెండో మూడో వ్యాసాలో కరపత్రాలో ఆయన రాసి ఉండవచ్చు. అంతకు మించినాకు తెలియదు. నాకు జ్ఞాపకం ఉన్నంతవరకు అమ్మ దగ్గర సంభాషణలను ఆయన గుర్తుకోసం కూడా రాసుకోలేదు. నాకు తెలియకుండా ఏరాత్రి వేళనో రాసిపెట్టుకొన్నారేమో తెలియదు. అమ్మను గురించి అందరికీ తెలిసే అవకాశం లేని చాలా విషయాలు తెలిసి ఉంటేనే, అమ్మ మాటలను చాలా చాలా వినిఉంటేనే, శాస్త్రగ్రంధాలు చాలా చదివి ఉంటేనే ఈ పుస్తకం రాయడం సాధ్యమవుతుంది.

అమ్మను గురించి ఇప్పటికే ఎన్నో గ్రంధాలు వెలువడ్డాయి. ఇంగ్లీషులో, తెలుగులో నేను కొన్ని పుస్తకాలు చూశాను. ఇతర భాషలలో కూడా కొన్ని పుస్తకాలు వచ్చాయని విన్నాము. ఇంగ్లీషు, తెలుగు భాషలలో అమ్మ బోధనలను, అన్నయ్యలు, అక్కయ్యల అనుభవాలను తెలియచేసే పత్రికలు వెలువడుతున్నాయి. ఐనా, అమ్మను గురించి తెలుసుకోవలసినవి మరెన్ని ఉన్నాయో అనిపిస్తుంది దత్తుగారి పుస్తకాన్ని చదివితే

దత్తుగారు కొన్ని చోట్ల వ్యాసుడి సూక్తులను ఉదహరించారు. మరికొన్నిచోట్ల రమణ మహర్షి ఏమన్నారో, రామకృష్ణ పరమహంస ఏమన్నారో చెప్పారు. యోగసూత్రాలను, గీతా వాక్యాలను, రామాయణ భారతాది గ్రంధాలనుంచి సందర్భోచితమైన ఇతివృత్తాలను అందించారు. అందుకే నాకు ఆశ్చర్యం. అమ్మను గురించే కాదు, అమ్మ చుట్టూ ఉన్న సోదరీ సోదరులను గురించికూడా

నాకు తెలిసింది చాలా తక్కువని బోధపడింది. నేననే కాదు,చాలామంది ఇతరుల సంగతీ అంతేనేమో. ఈ రచన అమ్మ కృపే అనిపిస్తుంది. ఏది కాదు గనుక! దత్తుగారు కొన్ని విలువైన అభిప్రాయాలను వ్యక్తం చేశారు. అవి అమ్మతో అనుబంధం కలిగిన అందరం మననం చేసుకొనదగినవి. అమ్మలో దైవత్వం ఉన్నదని నమ్మేవారు గుర్తించవలసినది - అమ్మ దైవత్వం ఏదో సాధన వల్ల సాధించినది కాదు. దైవత్వమే అమ్మగా వచ్చింది!. విశ్వాసమే దైవమని చెప్పిన అమ్మ మూఢవిశ్వాసాలను విరించింది అంటారు దత్తుగారు. విరిచింది! ఇక్కడ ఎంత చక్కని అభివ్యక్తి!

అభ్యుదయ భావాలుగా మనం చెపుతున్న కొన్ని అభిప్రాయాలను ఎలా చెప్పిందో వివరిస్తూ దత్తుగారు అంటారొకచోట-

మతవాదాలతో జ్ఞానవిభాగం దూరమై ఆచార విభాగానికి ప్రాముఖ్యం పెరిగింది. అనేకత్వంలో ఏకత్వాన్ని తెలియజేస్తుండెడి సమరస భావం పోయింది. అమ్మలో విశిష్టత ఏమిటంటే అమ్మ అనెడి నామం, రూపం. రూపం ఉండి కూడా సకల నామాలతో రూపాలతో అనుసంధానం కలిగి రాగద్వేషాలు, అసూయ లేని అనసూయ అని తన ప్రత్యేకతని తెలియజేయడం... అన్ని నామాలు నావే, అన్ని రూపాలు నావే. ఏపాదాలకు మొక్కినా ఈ పాదాలకు మొక్కినట్లే - అని వివిధ నామ, రూప, ఆరాధనా పద్ధతుల మధ్య ఐక్యతానుసంధానం చేసింది.

అమ్మ తనను చూడ వచ్చిన ప్రతి ఒక్కరిని భోజనం చేయమంటుంది. పూజ చేసి భోజనం చేస్తామంటే ముందు భోజనం చేసిరాండని అంటుంది. అమ్మ ఇలా భోజనం చేయమనడంలో ఆంతర్యాన్ని అంతరార్థాన్ని దత్తుగారు సాధించారు. లక్షమంది తిన్నారన్న తృప్తికన్నా ఒక్కరు తినకపోతే ఎక్కువ అసంతృప్తి..... అన్నారట అమ్మ. ధర్మ ప్రబోధం కాదు అమ్మ చేస్తున్నది ధర్మాచరణ అంటారాయన. నేను ఈ విధంగా ఎందుకు పెడుతున్నానంటే మీరు మరొకరికి పెట్టడానికి ! అన్నారట అమ్మ. తననుపూజించండని అమ్మ ఎన్నడూ చెప్పలేదు. పూజచేసుకోండి అని అమ్మ అంటుందని గుర్తు చేశారు దత్తుగారు. అంతా అదే అనే అమ్మ సిద్ధాంతాన్ని దత్తుగారు అనేకానేక వాదాల బలంతో పాఠకులకు మనస్సుకు పట్టే విధంగా నివేదించారు.

చమత్కారంగా కనిపించేవైనా మరచిపోలేని కొన్ని సందర్భాలను, సంభాషణలను గ్రంథం అందిస్తుంది. పిల్లిని చూసి భయపడే తల్లి పిల్లలను రక్షించుకొనడానికి పులిని చంపే సాహసం చేస్తుందట. దరిద్రులలో రెండు రకాలవారుంటారట. ఒక రకం ఏపూటకాపూట తిండికోసం వెతుక్కోవలసి వచ్చేవారు. కోట్లకొలది ధనం మూలుగుతున్నా ఎప్పుడూ లేదూ అని ఏడ్చే దరిద్రులు రెండో రకం! అమ్మ విపరీత సహనాన్ని పరీక్షించిన కొందరు ఘనుల ఉదాహరణలను పేర్కొని, ఒక పెద్ద మనిషి ఎవరో స్త్రీని ఒకాయన ఇలా జుట్టు పట్టుకొని లాగారని అమ్మ జుట్టు లాగి చూపించాడట! ఇట్లా పొడిచాడు అని పొడిచి చూపిస్తాడేమో అని చమత్కరించారు శ్రీ దత్తు.

అమ్మని చూడవచ్చే వారందరికి ఒకే విధమైన భక్తి గౌరవాలు ఉండవు. నాస్తికుడైన ఒక

మానవతావాది అమ్మదగ్గరకు వస్తే అమ్మ ఆయనకు ఇష్టమైన నూకల అన్నం వండించి పెట్టేది. పూజలు మొదలైనవి ఆయనకు ఇష్టం. కాని అమ్మ అందరిని తన బిడ్డలవలె ఆదరించడం చూసి సంతోషించేవాడు. కాని అమ్మ దగ్గరకు వచ్చేవారిలో ఎక్కువ మందికి ఏవో కొన్ని అనుభవాలు జరుగుతుండేవి. విజ్ఞాన శాస్త్రం చదువుకొని అలనాటి పత్రికలలోవైజ్ఞానిక వ్యాసాలు అసంఖ్యాకంగా రాసిన సుప్రసిద్ధ విద్యా వేత్త, సాహిత్య వేత్త డాక్టర్ శ్రీపాద గోపాలకృష్ణ మూర్తి గారు తనకు కలిగిన ఒక అద్భుతానుభవం కారణంగా అమ్మ వద్దకు రావడం ప్రారంభించారు. మీరు కూడా ఇవన్నీ నమ్ముతున్నారా? అని అడిగితే సైంటిస్టుగా నేను పరిశీలించి, పరిశోధించి తెలుసుకొన్న విషయాలను నమ్మకపోవడం ఎలా? అని ఎదురు ప్రశ్నవేసేవారాయన. (అక్షరాలా ఇవే మాటలు కాకపోవచ్చు కాని, భావం ఇదే.) ఎవరి అనుభవాలు వారివి. అద్భుతాలను కొందరు నమ్మరు. అమ్మని అద్భుతాలను గురించి అడిగితే ఎవరి అనుభవం వారిదనే అర్థం వచ్చేటట్లు మాట్లాడేది. ఒకసారి ఈ వ్యాసకర్తతో నీకు సాధ్యం కానివి ఇతరులకు సాధ్యం కావని ఎలా అనగలవు? అని ప్రశ్నించారు అమ్మ. అలాగని తాను అధ్భుతాలు చేయగలననిగాని, చేస్తానని గాని నాకు తెలిసినంతలో ఎన్నడూ అనలేదు. ఒకరి అనుభవాలను కాదని ఖండించనూ లేదా. కనుక, నమ్మకం ఉన్నవాళ్ళకే ఈ అద్భుతాలు లేనివాళ్ళకు లేవు. దత్తుగారు తనకు కలిగిన అనుభవాలను చెప్పి, ఇతరుల నుంచి సేకరించిన అనుభవాలను కూడా గ్రంథంలో చేర్చారు. దత్తుగారు సేకరించినంత సమాచారం ఇంతవరకు వెలువడిన ఇతర గ్రంథాలలో లేదోమో. అమ్మ జన్మించడానికి చాలాకాలం ముందునుంచే అమ్మ జరిపించినవిగా చాలా మంది నమ్ముతున్న అద్భుతాలు జరిగాయి. వాటిని ధ్రువపరచిన పెద్దలు కొందరు ఇటీవలి వరకు ఉండేవారు. మన రాష్ట్రానికి చెందినవారికేగాక, ఇతర రాష్ట్రాలవారికి, ఇతర దేశాలవారికి కూడా అమ్మ అద్భుతాలు అనుకోదగిన అనుభవాలను ప్రసాదించింది. నమ్మకం ఉన్నవాళ్ళకు ఈ పుస్తకంలో ప్రతి పేజీలోనూ అద్భుతమనుకొనదగిన అనేకానేక ఆసక్తికర సంఘటనలు కనిపిస్తాయి, అలరింపజేస్తాయి. అమ్మ పట్ల భక్తిని, విశ్వాసాన్ని అవి ఇనుమడింపజేస్తాయి.

దత్తుగారు తన రచన మొదటి భాగంలో అమ్మను రూపుదాల్చిన మహాచైతన్యంగా చిత్రించారు. రెండవ భాగంలో తనను అమ్మ ఎలా దగ్గరకు తీసుకొన్నదో, తన జీవితం అమ్మ సేవకు ఎలా అంకితమైనదో తెలియజేశారు. రెండవ భాగం చివర తనకు ఏర్పడిన భావాలు రాశారు. ఇందులో తాత్త్వికాంశాలూ ఉన్నాయి. నిత్యజీవితానికి ఉపయోగించే అభిప్రాయాలూ ఉన్నాయి. మూడవ భాగంలో ఇంతవరకు ఎవరూ రాయడానికి ప్రయత్నించని కొందరు సోదరీ సోదరులను గురించిన విశేషాలు ఉన్నాయి. ఇవి చదివాక అమ్మను గురించి మాత్రమే కాదు. అమ్మ దగ్గరకు తీసిన అన్నయ్యలను, అక్కయ్యలను అర్థంచేసుకొనడం కూడా చాలా కష్టమనే అభిప్రాయం ధ్రువపడుతుంది. ఉదాహరణకు డాక్టర్ పొట్లూరి సుబ్బారావుగారు సాధారణమైన వ్యక్తికారు ఆయన

బహుముఖ ప్రజ్ఞాశాలి. అమ్మను గురించి మొదట తేలికగా మాట్లాడిన వ్యక్తి. ఒక అనుభవం తరువాత మరొకటి వరుసగా జరిగి ఆయన ఊపిరిసలుపుకోలేనంత వేగంగా పరిణామాలు వచ్చాయి. అలాగే హరిదాసు గారు, ఆయన భార్య కృష్ణవేణమ్మ గారు, వరుసగా కొన్ని అనుభవాలైన తరువాత అమ్మ వద్దనే ఉండిపోయారు. వారుభయులు అపారమైన లోకజ్ఞానం ఉన్నవారు. నెల్లూరు రెడ్డి గారు మరొక అద్భుత వ్యక్తి. ఎందరో మహనీయులను దర్శించిన అనుభవం వారికి ఉంది. కవి యార్లగడ్డ రాఘవయ్య గారు రాజా పాటలు గా వర్ణించిన రాజు పాటల కర్త బుచ్చిరాజు గారు అమ్మకు జన్మరీత్యా బంధువైనప్పటికీ అత్యాశ్చర్యకరమైన అనుభవాలతో ఆమె పట్ల భక్తి భావన పెంచుకొన్న ఒక మహా వ్యక్తి. తపశ్శక్తి వల్ల అతీంద్రియ శక్తులు సంపాదించినట్లు కొందరు భావిస్తున్న రహి అనే ఒక సిద్ధ పురుషుడి ప్రస్తావన ఇందులో ఉంది. తనకు తెలిసినవేగాక, అనేక మంది సోదరీ సోదరులతో మాట్లాడి సేకరించిన విలువైన సమాచారాన్ని కూడా అందించారు దత్తుగారు తమ ఈ గ్రంథంలో

దత్తుగారు ఒక రచయిత మాత్రమే కాదు. ఆయన గొప్ప సాధకుడు. ఎంతవరకో తెలియదుగాని ఎంతో కొంత మంత్రసిద్ధి పొందినవాడు. అనుభవాల మాటకొస్తే ఆయనకు కలిగిన అనుభవాలకు మించినవి ఇతరులెవరికైనా కలిగి ఉండవచ్చు. కాని, ఆయన చేసిన సాధన అసాధారణమైనది. జిల్లెళ్ళమూడిలో ఉంటున్నప్పుడే ఆయన చాలా ఆధ్యాత్మిక గ్రంథాలను పఠించారు. వాటిల్లో కొన్ని - రామతీర్థ, వివేకానంద, రామకృష్ణ పరమహంస బోధలు, కృష్ణ లీలా తరంగిణి. ఇవన్నీ ఒక ఎత్తు, గాయత్రిమంత్రం చేయడం మరొక ఎత్తు. రోజుకు మూడు నాలుగు వందల జపంతోమొదలై పది పన్నెండు వేలదాకా పెరిగింది. కూర్చొని పడుకొని, నడుస్తూ జపం చేస్తుండేవాడు. కళ్ళు మూసుకొని జపం చేస్తుంటే దేవతా రూపాల దర్శనం అవుతుండేవి. గాయత్రి చేస్తున్న దశలోనే కుండలిని యోగ సంబంధమైన అనుభూతి ఒకటి ఆయనకు కలిగింది. ఆయన ఎందువల్లనో ఆ సాధనను కొనసాగించినట్టు కనిపించదు. ఆయనకు అంతవరకు చాలునని అమ్మ అనుకొన్నదేమో. సాధకులకు అమ్మ ఫలానా విధంగా జపం చేయమని చెప్పకపోవచ్చు. కాని, అమ్మ మార్గ దర్శకత్వం ఉండి తీరుతుందని పలువురి విశ్వాసం.

ఇదొక విలక్షణ రచన. అమ్మ మీద నమ్మకం ఉన్నవాళ్ళు చదివి ఆనందించవలసిన రచన. దీనిని చదవడం వల్ల లోకజ్ఞానం పెరుగుతుంది. శాస్త్రజ్ఞానమూ పెరుగుతుంది. అమ్మ మీద విశ్వాసం మరింత బలపడుతుంది. నమ్మకం లేనివాళ్ళు దీని జోలికి పోనక్కరలేదు. నాకు అమ్మను గురించి ఇంత మంచి రచనను చదివే అవకాశం కలగడం నాలుగు మాటలు రాసే అవకాశం కలగడం అమ్మ కృపా

**పొత్తూరి వెంకటేశ్వరరావు**
(Ex. ప్రెస్ అకాడమి ఛైర్మన్)

హైదరాబాద్, 500 057

# అంకితం

ఏ జగజ్జనని నన్ను తన

ఒడిలోకి తీసుకుని

నాజీవిత సర్వసం తానే అయి

నా చేత వ్రాయించిన

ఈ గ్రంధాన్ని అమ్మకే

అంకితం

చేస్తున్నాను

# ఉపోద్ఘాతం

ప్రేరేపించే శక్తి కనబడదు. వచ్చిన ప్రేరణ తెలుస్తుంది. చేతులు చేతలూ రెండూ భగవంతుడివే. ప్రేరేపించే శక్తి నేనే అని అమ్మ ప్రబోధం.

నేను అమ్మ సాన్నిధ్యంలో 1965 నుండి ఉండడం జరిగింది. నేను దేశభక్తి ప్రపూర్ణమయిన గ్రంధాలు, ఆధ్యాత్మిక గ్రంధాలు, మహాత్ముల గ్రంధాలు అనేకం చదవటం జరిగింది. అమ్మ వ్యక్తిగా అవ్యక్తం అగుటకు ముందు నాతో నువ్వుకూడా రాయారా. పెద్దఅనుభవం, చిన్న అనుభవం అంటూ ఏమి లేదు. అనుభవమే పెద్ద. నువ్వు ఏమిటో నీ అనుభవం ఏమిటో నువ్వు ఇక్కడ చూసింది అనుభవించింది నీ ఆశయం నీలో వచ్చిన మార్పులు వ్రాయమన్నది. నేను అమ్మ మహాసిద్ధి పొందిన తరువాత ఈ గ్రంధాలు వ్రాయటం జరిగింది. ఒకనాటి మాట మరొకనాటికి బాట అవుతుంది. అని అమ్మవాక్యం.

అదే విధంగా 1984 సెప్టెంబర్ నెలలో అన్నమాట 1985 జూన్-12 అమ్మ మహాసిద్ధి పొందిన తరువాత వ్రాయడం జరిగింది. చేతులు, చేతలు, ప్రేరేపించే ప్రేరణ సర్వం తానే అయి అమ్మ వ్రాయిస్తే వ్రాయడం జరిగింది. వీనిలో అమ్మ తత్వాన్ని, అమ్మని అనేక రకాలుగా సమన్వయం చేస్తూ సర్వతోముఖ చైతన్యం అమ్మ అని ఒకటి రెండవది అమ్మ - నా అనుభవ చరిత్ర అనెడి గ్రంధాలు నా చరిత్ర నాకు ఏర్పడిన భావాలు, నా అనుభవాలు, సంస్థ చరిత్ర కొంత వరకు చరిత్రగా వ్రాయడం జరిగింది. అనేక మంది సోదరీ సోదరుల అనుభవాలు అనుభవ జ్ఞాన దీపికలు అనెడి పేరుతో వ్రాయడం జరిగింది. అ మూడు గ్రంధాలు కలిపి ఒకే పుస్తకంగా ప్రచురించటం జరిగింది. మౌలికమైన శీర్షికగా లోక బాంధవి అనుభవాల వల్లరి అనేడి శీర్షికతో ఈ గ్రంధం పాఠకులకు అందిస్తున్నాను. సూర్యునకు లోకబాంధవుడని పేరు - ఆధ్యాత్మిక తేజో విరాజితమైన విశ్వజనని అమ్మ ఎవరికి వారికి అమ్మ అయి విశ్వానికంతా జగజ్జననియై విలసిల్లినది.

ఒక సూర్యుండు సమస్త జీవులకు తానొక్క క్కడై తోచుపో
లిక నే దేవుడు సర్వకాలము మహాలీల ౯ నిజోత్పన్న జ
న్యక దంబంబుల హృత్సరోరుహముల ౯ నానా విధానూన రూ
పకుడై యొప్పుచునుండు నట్టి హరినే బ్రార్థించు శుద్ధుండనై

ఒకే సూర్యుడు ఎవరికి వారికి, ఒకనిగానే కనబడుతూ సర్వాన్ని తన తేజస్సుతో నింపినట్లు

అమ్మ ఎవరికి వారికి అమ్మ అయి విశ్వజనని అయి విరాజిల్లినది.

నింగిలోని భానుండు నీ ఒడిలోని బాలుండు అని సోదరుడు నదీరా గానం చేసినట్లు ఈ సూర్యుడు సహితం అమ్మ ఒడిలో బాలుడే.అమ్మ దివ్యాత్మ సూర్యుడు అందువలన లోకబాంధవి అనెడి శీర్షిక పెట్టడం జరిగింది. నా అనుభవ చరిత్ర. అనేకమంది అనుభవాలు కలిసిన గ్రంధాలు ప్రచురించడం వలన అనుభవాల వల్లరి అనెడి శీర్షికతో ఈ గ్రంధం సోదరీ సోదరులకు అందచేయడం జరిగింది. చక్కగా విశ్లేషించి అపారమయిన వారి ప్రజ్ఞాపాటవంతో ముందు మాట వ్రాసిన శ్రీ పొత్తూరి వెంకటేశ్వరరావు గారికి నా హృదయ పూర్వక కృతజ్ఞతలు తెలియచేసు కుంటున్నాను.

నా పుస్తకాలు వందల పేజీలు ఉన్నప్పటికీ అదొక తపస్సుగా నిష్కామ కర్మగా చక్కగా ఫెయిర్ చేసి వ్రాయటమే కాక ఈ పుస్తకాలు ప్రూఫ్ దిద్దటంలో కూడా సహకరించిన చిరంజీవి మన్నవ వేణుగోపాల్ (మా 5వ అన్నయ్య కుమారుడు) వాని కుటుంబానికి అమ్మ అనిర్వచనీయమైన ఆశీస్సులతో ఆయురారోగ్య ఐశ్వర్యాలతో వర్ధిల్లాలని హృదయ పూర్వకంగా వేడుకుంటున్నాను.

అదే విధంగా చిరంజీవి కొమరవోలు రవి అనెడి సోదరుడు ఈ పుస్తకం ప్రూఫ్ దిద్దడంలో ఎంతో శ్రద్ధగా అపారంగా సహకరించి సహాయ సహకారాలు అందచేసిన వానికి వాని కుటుంబానికి అమ్మ శుభాశీస్సులు అంది ఆయురారోగ్య ఐశ్వర్యాలతో వర్ధిల్లాలని కోరుకుంటున్నాను.

## ఈ పుస్తక ప్రచురణానికి ఆర్థిక సహాయం అందజేసిన సోదరీ సోదరులు

| | | |
|---|---|---|
| వఝ హేమ కుమార్ | 5000.00 | హైదరాబాద్ |
| శ్రీమతి సుశీల రమేష్ నాగాల | 5000.00 | ఇంగ్లాండ్ |
| బ్రహ్మాండం రవి | 1000.00 | హైదరాబాద్ |
| బి.పి. మోహన శర్మ గారు | 2000.00 | హైదరాబాద్ |
| బి.జి.కె. శాస్త్రి గారు | 500.00 | హైదరాబాద్ |
| ఎస్. ఉషారావు | 500.00 | హైదరాబాద్ |
| కె. నరసింహ మూర్తి | 1000.00 | హైదరాబాద్ |

వీరందరికి నా హృదయ పూర్వక కృతజ్ఞతలు తెలియజేసుకుంటున్నాను. అమ్మ ఆశీస్సులతో ఆయురారోగ్య ఐశ్వర్యాలతో, వీరి కుటుంబాలు వర్ధిల్లాలని వేడుకుంటున్నాను.

# విషయసూచిక

ఓం అం ఆ

# అమ్మ - నా అనుభవ చరిత్ర

గుంటూరు జిల్లా పొన్నూరు మండలం మన్నవ గ్రామంలో నా తండ్రి, తాతలు పుట్టి పెరిగారు. నేను పుట్టినది పొన్నూరులో, మా నాన్న అఖండ రామ భక్తులు. ఆంధ్ర వాల్మీకిగా బిరుదు పొందిన వాసుదాస స్వామి దగ్గర రామ మంత్రం ఉపదేశం పొందారు. మా నాన్న నిరంతరం రామాయణ పారాయణం, రామజపం, రామకోటి వ్రాయటం ఈ విధంగా జీవితం అంతా రామస్మరణ మయమయి గడిపారు. మా నాన్న పేరు రామ బ్రహ్మం, మా అమ్మ సీతారత్నం. కాని అసలు పేరు చాలా మందికి తెలియదు. పుల్లమ్మ అంటారు చాలా మంది. మా అమ్మ ఎక్కడ లేని ఆచారం పూజలతో కాలం గడిపేది. నాకు నలుగురు అన్నయ్యల తరువాత ఒక అక్కయ్య, తరువాత మరొక అన్నయ్య, ఆ తరువాత నేను. మా రెండవ అన్నయ్య, నాల్గవ అన్నయ్య ఎక్కువగా ఆర్. ఎస్. ఎస్. లో తిరుగుతూ వుండేవారు. భారతం చదువుతూ వుండేవారు. సంఘశాఖలో శివాజీ, రాణాప్రతాప్ కథలు వింటూ వుండేవాడ్ని. ఈ విధంగా మా ఇల్లు దైవభక్తికి, దేశభక్తికి నిలయంగా వుండేది. ఇది మా ఇంటి వాతావరణం. నాకు చిన్నతనం నుండి దైవభావం - ఆస్తిక భావం వుండేది. రఘువర దాసు గారు పొన్నూరులో ఏకాహాలు, సప్తాహాలు, నగర సంకీర్తనలు చేస్తూ వుండేవారు. ఒక్కసారి రెడ్డిపాలెం కాంతయ్య యోగి గారు మా యింటికి వస్తే మా నాన్న వారికి నమస్కారం చేయించారు. రఘువరదాసుగారు గారికి నమస్కరిస్తే వాసుదేవ అని , కాంతయ్య యోగి గారికి నమస్కారిస్తే నారాయణ అని దీవించే వారు. నేను ఒక పట్టాన చదువుకి లొంగే వాడ్ని కాను. బడి పంతులు వెంటపడితే బజార్లు తిప్పించి, ఇంటి వెనుక వేప చెట్టు ఎక్కి కూర్చుండే వాడ్ని. మరొక విషయం, మా నాన్న చిన్నతనంలో మహా బలిష్ఠులు. ఆయన సాహసం, బలం గూర్చి మా నాన్న యువకుడుగా వున్నప్పుడు తెలిసిన వ్యక్తులు చెబుతూ వుండేవారు. మా అమ్మ నా చిన్నతనంలోనే చనిపోయింది. మా అమ్మతో కొన్ని సంఘటనలు గుర్తేకాని, అన్నీ బాగా గుర్తులేవు. తల్లి వాత్సల్యాన్ని చూపించినా, పూర్తిగా గ్రహించి అనుభవించే ఊహ, పరిపక్వత నాకు రాకముందే మా అమ్మ చనిపోయింది. మా అమ్మ చనిపోయిన 10వ రోజున

మా అక్కయ్య వంట మీదికి వచ్చి మాట్లాడింది. మా అక్కయ్య చాలా సన్నగా, బలహీనంగా వుండేది. మా అమ్మ వచ్చిన సమయంలో కొద్దిగా శరీరం ఉబ్బినట్లు వుండేది. అప్పుడు మా అమ్మ -మా అక్కయ్యకు జరిగిన సంభాషణ కొంత నేను విన్నాను. అది ఈ విధంగా సాగింది.

మా అమ్మ :- మీ నాన్నకి శత కోటి నమస్కారాలు చెప్పు.

మా అక్కయ్య:- నాన్న రాజా - నీవు రాణివి

మా అమ్మ :-నేను వైకుంఠం వెళ్ళాను. విష్ణుమూర్తి దగ్గర వున్నాను. నీ వివాహం అయితే పాండురాజు పాండవుల పెళ్ళి చూసినట్లు నేను కూడా చూస్తాను.

నేను బాగా చిన్న వాణ్ణి, సంభాషణ మొత్తం గుర్తు లేదు. నిద్ర లేవగానే మా అక్కయ్యకి ఏమీ గుర్తులేదు. మంచం చుట్టూ కూర్చున్న మా అందర్నీ చూస్తూ కళ్ళు నల్చుకుంటూ "ఏమిటీ ఇట్లా కూర్చున్నారు. వీళ్ళంతా?" అని అడిగింది. అప్పుడప్పుడు ఇట్లా జరుగుతూనే వుండేది కొంత కాలం. అప్పుడు నేను అనుకొనే వాణ్ణి విష్ణులోకం, ఇటు వంటివి . వుంటయ్యేమోనని, భక్తిగా వుంటే అట్లా వెళ్ళ వచ్చని, ఇట్లా ఏవో లోకాలని గురించి ఆలోచనలు వస్తూ వుండేవి. ఆ తరువాత మా అక్కయ్య వివాహమయింది. గుంటూరు ఇచ్చారు. నేను ఎక్కువగా బయట గంతులు వేస్తూ తిరుగుతూ వుండటం, మా అమ్మ పోవటం, మా ఇంటి వాతావరణంలో మార్పు వచ్చింది. మా 4వ అన్నయ్య కొంతకాలం ఆర్.ఎస్.ఎస్. ప్రచారక్‌గా వెళ్ళిపోయాడు. అప్పుడు మా పెద్ద అన్నయ్య హైదరాబాద్‌లో ఉద్యోగం చేస్తున్నాడు. మా పెద్ద వదిన పొన్నూరు వస్తే మా వదినకి నన్ను అప్ప చెప్పి, హైదరాబాద్ పంపించారు. నా ఫస్ట్ ఫారమ్ పూర్తి అయిన తరువాత మా 3వ అన్నయ్య వివాహం అయింది. హైదరాబాద్ ట్రూప్ బజార్‌లో వుండే వాళ్ళం. ఆ రోజులలో, సెకండ్ ఫారమ్‌లో చేరాను. అప్పుడు. మా 2వ అన్నయ్య, మా 4వ అన్నయ్య కూడా ఆ రోజులలో అక్కడే వున్నారు. మా బంధువు మన్నవ రామారావు గారికి. మా పెద్దన్నయ్యకి అపారమయిన స్నేహబంధం వుండేది. ఒకసారి రామారావు గారి దగ్గర్నుండి మా పెద్దన్నయ్యకు ఉత్తరం వచ్చింది. దాని నిండా జిల్లెళ్ళమూడి అమ్మని గురించి వ్రాశారు. అమ్మ తండ్రికి తండ్రి, మా తండ్రికి తండ్రి సొంత అన్నతమ్ములు. ఆ విధంగా అమ్మ మాకు పెద్ద నాన్న కూతురు, అక్కయ్య అవుతుంది. మా పెద్దన్నయ్య - అమ్మ చిన్న తనంలో మన్నవలో ఆడుకున్నారు. మా నాన్న అమ్మని ఎత్తుకుని తిప్పేవారు. అమ్మ జీవిత చరిత్రలో వాసుదాస స్వామి దగ్గరకి

అమ్మని తీసుకుని వెళ్ళిన సంఘటన వుంది. అది మా నాన్న తీసుకుని వెళ్ళిన ఘట్టమే. అందు వలన మా ఇంట్లో అందరికి అక్కయ్య అన్న భావన. అంత కాకపోతే సాధనలు చేసి మన కంటే గొప్పదయిందని వుండేది. పైగా మా పెద్దన్నయ్య అమ్మతో కలిసి ఆడుకున్నారు. మా అక్కయ్య వివాహానికి అమ్మ వచ్చింది. అయితే నాకు తెలీదు. వడ్డన్లు చేసింది. ఎప్పుడైతే రామారావుగారి దగ్గర్నుండి ఉత్తరం వచ్చిందో మా పెద్దన్నయ్య, మా 4వ అన్నయ్యని "ఏవిట్రా! వీడు అక్కయ్యని గురించి ఇట్లా వ్రాశాడు. సాక్షాత్ దైవమని . హనుమంతుడు ( మా 3వ అన్నయ్య) అమ్మని దర్శించిన తరువాతే ఉద్యోగం వచ్చింది. వివాహము మొదలైన శుభకార్యాలు జరిగినవని, ఇంకా ఏవో మహత్తర శక్తులు వున్నవని వ్రాశాడు. నిజమేనా! అని అడిగాడు. మా 4వ అన్నయ్య "నిజమే మొత్తానికి చాలా మంది వెళ్తున్నారు" . అన్నాడు. అప్పుడు నేను అనుకున్నాను. "మా కొక అక్కయ్య వున్నదని, ఆమెకు ఏవో దేవతా శక్తులున్నవని" భావించానే కానీ వాళ్ళతో అనలేదు. 1957లో జరిగిన సంఘటన ఇది. తరువాత మేము గౌలీగూడా రామ మందిరం దగ్గర ఉన్న ఇంట్లో చేరాము. మా 4వ అన్నయ్య నాగార్జున సాగర్ వెళ్ళాడు. మా 2వ అన్నయ్య హైస్కూల్‌లో టీచర్‌గా చేరాడు. ఫీల్‌ఖానాలో మా 2వ అన్నయ్య వుండేవాడు. మా నాన్న మా 2వ అన్నయ్యకి వండి పెడుతూ రామకోటి, రామాయణ పారాయణం చేసుకుంటూ వుండేవాడు. నాకు చిన్నప్పటి నుంచి భయం తెలీదు. కానీ విచిత్రంగా గౌలీగూడాలో వుండే రోజులలో అదే పనిగా భయంగా వుండేది. చీకటి పడి చదువు కుంటుంటే గుమ్మం అవతల ఏదో గుసగుసలు లాగ వినపడుతుండేవి. ఈ విపరీతమయిన భయంతో చదువు సాగేది కాదు. ఇదంతా చూసి మా పెద్దన్నయ్య నన్ను మా నాన్న, రెండవ అన్నయ్యల దగ్గరకి పంపించాడు. మా నాన్న దగ్గర వుంటే ఏభయం వుండేది కాదు. నిరంతరం రామ నామ స్మరణే తపస్సుగా చేస్తున్న ప్రభావమో ఏదో తెలియదు. కానీ మా నాన్న తిరిగి పొన్నూరు రావలసిన పరిస్థితి ఏర్పడింది. నేను తిరిగి గౌలీ గూడా రావాలి. అప్పుడు మా నాన్నతో "భయంగా వున్నది ఎట్లా" అని అడిగితే మా నాన్న నవ్వారు. తరువాత "**ఆంజనేయం మహా వీర్యం - బ్రహ్మ విష్ణు శివాత్మకం**

**బాలార్క సదృశా భాసం - రామ దూతం నమామ్యహం**

**శ్రీ రామ దూతం నమామ్యహం - జయ రామ దూతం నమామ్యహం**"

అని వ్రాసి ఇచ్చి, చెప్పి , అది రోజు 10 సార్లు చదవమని, రామ మందిరం,

ఆంజనేయ స్వామి గుడి చుట్టూ 10 సార్లు ప్రదక్షిణాలు చేయమని చెప్పారు. ఆ విధంగా 10 రోజులు చేసేటప్పటికి అన్ని భయాలు పోయినయ్. అప్పుడు మొదటి సారిగా అనుకున్నాను. "ఆధ్యాత్మిక వ్యవస్థలో ఏదో వుంది. ఇది ఊరికే చెప్పేది కాదని" అప్పట్నుంచి అదే శ్లోకం చదువుకుంటూ వుండే వాడ్ని. సెకండ్ ఫారమ్ సెలవలలో పొన్నూరు వచ్చాను. మా అక్కయ్య - మా 5వ అన్నయ్య అమ్మ దండకం చదువుతూ వుండేవారు. నాకు ఇదేవిటి! అక్కయ్య దండకం చదువుతున్నారు" అనుకుండే వాడిని. ఆ రోజులలో మా 5వ అన్నయ్య, మా అక్కయ్య అమ్మ దగ్గరకి వస్తే అమ్మ "దత్తుని తీసుకుని రారేవిటి? అని అడిగేదట. ఆ విషయం వాళ్ళు నాతో అంటే "ఆ ....మన అక్కయ్యేగా వెళ్ళవచ్చులే" అనే వాడిని. మా 2వ అన్నయ్య" అంతేరా! అంతే" అనే వాడు. తరువాత నాగార్జున సాగర్ వెళ్ళాను. మా 5వ అన్నయ్య అమ్మని గురించి అక్కడ కూడా అదే పనిగా చెప్పే వాడు. ఎదురుగా ప్రకృతిని చూపిస్తూ ఇదంతా అమ్మ అని! జిల్లెళ్ళమూడిలో తాను వున్నప్పటికి ఎక్కడో అడవిలో వున్న వారు ఆర్తిగా అరిస్తే అమ్మ కనపడుతుందని" ఈ విధంగా ఒక రోజు విపరీతంగా చెప్పాడు. నాకు అమ్మను గురించి చెప్పి, లేబర్ కాలనీ వెళ్ళాడు మా అన్నయ్య. నేను ఇంటికి బయలుదేరాను. ఇంత కాలం వింటున్నా నాకేమి అనిపించలేదు. "కాలం - తరుణం అంటుంది" అమ్మ.

## అమ్మ. తాను సర్వమూ అయినది కనుక సర్వం తన సన్నిధే.

జిల్లెళ్ళ మూడి వచ్చి వ్యక్తిగా చూడ లేదు అమ్మని. కానీ ఎక్కడో నాగార్జున సాగర్‌లో నాకు అయిన మొదటి అనుభవం తీవ్రమయిన తాత్విక అవగాహన వున్న వారికి మాత్రమే విదితమవుతుంది. ఎందుకంటే అది దృశ్యానుభూతి కాదు. హృదయానుభూతి. అంటే 5 శిరస్సుల గాయత్రీగానో మరొక దేవుని రూపంగానో కనపడలేదు. దృశ్యానుభూతి అంటే ఇటు వంటిది. అప్పుడు ఎదురుగా వున్న కొండలు, చెట్లు, బిల్డింగులు, ఏవి మారలేదు. అంటే ప్రకృతి ప్రకృతిగానే వున్నది. కాని పగలు కారు మబ్బులు కమ్మితే, చీకట్లు ఆవరించి ఎదురుకుండా ప్రకృతి ఎట్లా కనపడుతుందో అట్లా అమ్మ ప్రకృతి మీద ఆవరించి వున్నట్లు, నాలో కూడా తాను వుండి ఇదంతా అమ్మ, ఇదంతా అమ్మ, అనిపిస్తున్నట్లు ఒక హృదయానుభూతి అయినది. తరువాత ఎంతసేపటికి అమ్మ ధ్యాస, అమ్మ, అమ్మ అని మనస్సులో వదలని చింతన నిలిచింది. అమ్మని గురించి మా అన్నయ్య చెప్పినవి కొన్ని

అనుభవం లోకి వచ్చేవి. ఎక్కడికన్నా వెళ్తున్నప్పుడు సువాసనలు రావటం, హిల్‌కాలనీ నుండి లేబర్ కాలనీకి వెళ్తుంటే సువాసనలు రావటానికి వీలు లేని చోట కూడా వచ్చేవి. ఈ విధంగా వస్తే అమ్మ వచ్చినట్లు గుర్తని, మా అన్నయ్య చెప్పేవాడు. ఒకరోజు మా 5వ అన్నయ్య, నేను మాకు తెలిసిన ఒకరి ఇంటికి వెళ్ళాం. లేబర్ కాలనీలో. వాళ్ళ అమ్మకి జ్వరం వస్తే ఆవిడ మాంసం తింటానని గోల చేస్తున్నదని, చెబితే వినటం లేదని ఆయన మా అన్నయ్యతో చెప్పారు. మా అన్నయ్య జేబులో అమ్మ కుంకుమ వుంటే ఇచ్చి నీళ్ళల్లో వేసి ఇవ్వమని చెప్పాడు. ఆ విధంగా చేశారు ఆయన. మరునాడు మేము వెళ్ళి అడిగితే ఆమెకి జ్వరం తగ్గిందని విన్నాము. ఆవిడ జ్వరంతోనే మాంసం తిన్నది. అయినా కానీ జ్వరం తగ్గింది. అమ్మ కుంకుమ ఈ విధంగా పని చేసిందని అనిపించింది. నాకు. ఒక రోజు హిల్ కాలనీ నుండి లేబర్ కాలనీ వచ్చి అక్కడి నుండి రైట్ బ్యాంక్‌కి వెళ్ళి తిరిగి లేబర్ కాలనీ వస్తుంటే మైకం వచ్చి నేను పడిపోతానని అనిపించింది. అప్పుడు "అమ్మ, అమ్మ" అని స్మరిస్తూ నడిచాను. అడుగు ముందు వేయలేనని అనుకున్న నేను మళ్ళీ ఓపిక వచ్చి చాలా దూరం నడవగలిగాను. మామూలుగా శక్తి వచ్చింది. అమ్మ కుంకుమే కాదు అమ్మ స్మరణ కూడా పనిచేస్తుందని అనుకున్నాను. మా 5వ అన్నయ్యకి రక్త విరేచనాలు వచ్చి బాగా సీరియస్ అయి గవర్నమెంట్ హాస్పటల్‌లో చేర్చారు. నేను రేయింబగలు సేవ చేశాను. బట్టలలోనే అన్ని అయినప్పటికీ ఉతికే వాడిని. తరువాత కొంచెం ఉపశమించిన వెంటనే పొన్నూరు వచ్చి అమ్మని దర్శించాడు. అమ్మ పటిక బెల్లం, కుంకుమ, పళ్ళు ప్రసాదం ఇచ్చి పంపటం జరిగింది. అంతక ముందు కళ్ళు కూడా సరిగ్గా లేవని అనే వాడు. కానీ అమ్మ ఇచ్చిన ప్రసాదంతో పూర్తి ఆరోగ్యం వచ్చింది. నాకు అమ్మ మీద విశ్వాసం కాని, అమ్మని తలుచుకోవటం కానీ లేనప్పుడు ఎవరైనా జిల్లెళ్ళమూడి వెళ్తే నన్ను అడిగే అమ్మ ఇప్పుడు అడగటం మానివేసింది. అప్పుడు అట్లా అడిగే అమ్మ ఇప్పుడు అడగరేవిటి? అనుకునే వాడిని. IV th Form పూర్తి అయి నెలవలలో పొన్నూరు వచ్చాను. వచ్చినప్పటి నుండి అదే పనిగా అమ్మ ధ్యాస వుండేది. శాయి బాబా లాగ తల పాగా చుట్టుకున్న అమ్మ ఫొటో చూశాను. అప్పుడు దానిలో అమ్మ ముఖం బట్టి అదే విధంగా వుంటుందని అనుకునే వాడిని. ఆ రోజులలో మా పెద్ద అన్నయ్య పొన్నూరు వచ్చారు. ఆ రోజులలో ఎవరు వచ్చినా మా నాన్న అమ్మని చూడమని చెప్పేవారు. అమ్మని చూడక ముందే నాగార్జున సాగర్‌లో నాకు అయిన అనుభవాలతో, నాకు అమ్మను చూడాలన్న ఆకాంక్ష ఎక్కువయింది. మా పెద్దన్నయ్య నేను

కలిసి అప్పికట్ల వచ్చి ఆ రాత్రి అక్కడ వుండి మరునాడు మా పెద్దన్నయ్య, నేను రామకృష్ణ కలిసి పొలాల్లో నడుస్తూ జిల్లెళ్ళమూడి చేరాము. ఇది 1959 మే నెలలో జరిగింది. అప్పుడు చీరాల వాళ్ళు వేసిన పెద్ద మందిరం, ప్రక్కనే ఒక పాక , ఆ పాకలో ఒక వైపు వంటశాల, మరొకవైపు అమ్మ వుండేవారు. అనసూయేశ్వరాలయం పునాదులు లేచి వున్నవి. రావిచెట్టు ప్రక్కగా ఒక పాక, దాని ఎదురుగా మరొక పాక, మరొక వైపు పొగాకు బార్నీ వుండేది. పెద్ద మందిరం - అమ్మ వుండే పాకకి మధ్యలో సందుగా వుండేది. అప్పుడు ఒక వ్యక్తి వస్తున్నారు. రామకృష్ణ నమస్కరించాడు. ఆ వ్యక్తి రెండడుగులు ముందుకు వేసి మా పెద్దన్నయ్యతో ఏదో అని కొంచెము ముందుకు వచ్చి నా వంక చూస్తూ దత్తు కదూ? అంటూ చెంప మీద కొట్టినట్లు చిన్నగా చరిచి ముందుకు వెళ్ళింది. అందరూ ఆమె వెంట వెళ్ళారు. పెద్ద మందిరంలోకి ఆ వ్యక్తి వెళ్ళింది. అందరూ ఆమె వెంట వెళ్ళారు. అప్పటి దాకా ఆ వ్యక్తి అమ్మ అనుకోలేదు. శాయి బాబా వేషంలో వున్న ఫొటో చూశాను. దానిలో చామన ఛాయగా కొంచెం జారుడు మొహంగా వున్నది. దానిలో చూసిన రూపానికి ఇప్పుడు వచ్చిన అమ్మకి సంబంధం లేదు. అప్పుడు హరిదాసుగారు పూజ చేయించారు. ఎవరో వచ్చి అమ్మకి పళ్ళు ఇచ్చారు. వెంటనే హారతి ఇచ్చారు. చేతిలో పళ్ళు పట్టుకుని శిలా ప్రతిమ లాగ సమాధ్యవస్థలోకి వెళ్ళింది అమ్మ. అప్పుడు అనుకున్నాను జనం అనుకునే సమాధ్యవస్థ అంటే ఇదేనేమో. క్షణ మాత్రంలో ఈమెకి ఆధ్యాత్మిక స్థితులు వస్తయ్ కాబోలు అనుకున్నాను. తరువాత అమ్మ మంచం మీద కూర్చున్నారు. ఇంతలో ఒక వ్యక్తి వచ్చి క్రింద కూర్చున్నాడు. వెంటనే అమ్మ లేచి నిల్చున్నది. అక్కడ వున్న వారు ఆయనకి కుర్చీ వేశారు. "నేను క్రింద కూర్చున్నానన్నా?... సరే" అంటూ కుర్చీలో కూర్చున్నారు. ఆ తరువాత అమ్మ మంచం మీద కూర్చున్నది. ఒహో!....ఈయన అమ్మ భర్త అన్న మాట" అనుకున్నాను. ఎంతో మంది తనని పూజిస్తున్నా అమ్మ పతివ్రతా ధర్మాన్ని పాటిస్తున్నది అనుకున్నాను. పొన్నూరు నుండి ఒకామె బిడ్డతో వచ్చి అమ్మ వంక చూస్తూ "అన్ని హంసలు నీలోనే వున్నవమ్మా! లక్ష్మీ -పార్వతీ-సరస్వతీ, సర్వం నీలోనే వున్నవమ్మా" అని అంటూ తన బిడ్డని దీవించమని అడిగింది. త్రిమాతల తత్త్వం తానే అయిన అమ్మ ఆమెకు ఏమి అనుభవం ఇచ్చిందో తెలియని విషయం ఆమె అడిగినందుకు చేత్తో దీవించిందే కాని అదొక ప్రదర్శనగా కాని, అందర్నీ అట్లాగనే సహజమయిన పద్ధతిగా కాని అనిపించలేదు. అమ్మ కంటే పెద్ద వాళ్ళు కూడా బిడ్డల లాగా అమ్మ చెంత లాలన పొందుతున్నారు. కొందర్ని పెద్ద వారిని మంచం మీద కూర్చున పెట్టుకుని లాలిస్తున్నది.

నన్ను పిలవదు. నేను అమ్మ పిలిచే దాకా వెళ్ళకూడదు అనుకున్నాను. పైగా నాకు అమ్మ అంటే లక్ష్యం లేనప్పుడు నన్ను గురించి అడిగే అమ్మ , ఇప్పుడు ఎంతో మందిని దగ్గరకి తీస్తూ నన్ను పలకరించట్లా. నేను దూరంగా కూర్చున్నాను. కనురెప్ప వాల్చకుండా మంచం మీద పడుకుని ఓరగా అదే పనిగా నా వంక చూస్తున్నారు అమ్మ "అని మిషులు" అంటే రెప్పపాటు వుండదని , ఇది దేవతల లక్షణం అని పూర్వం వింటూ వుండే వాడ్ని. ఓహో! ఈమెకి దేవతల లక్షణం వుందన్న మాట అనుకున్నాను. ఏమిటి ఈమె.....ఇట్లా చూస్తుందని నేను కూడా చూద్దామని చూశాను. కాని ఎంతసేపు కనురెప్ప వాల్చకుండా చూడగలను. చూడలేక పోయాను. నాన్నగారి ఇంట్లో విడిగా వంట చేశారు. మన్నవ రామారావు గారి భార్య చిదానందం వడ్డన చేసింది. తరువాత అమ్మ పెద్ద మందిరం లోకి వచ్చి పడుకుని నా వంక ఉదయం చూసినట్లు చూశారు. ఆ రోజు నా పని, ఆలోచన ఏమిటంటే, ఒకసారి అమ్మ వంక చూడటం, మరొక సారి పాత మందిరం దూలానికి కట్టిన మేకులకి వున్న అమ్మ ఫొటోల వంక చూడటం 40-50 ఫొటోలు వున్నవి అక్కడ. కాని అమ్మకి , ఆ రూపాలకి ఏదో వ్యత్యాసం కనపడేది. ఒకే వ్యక్తి ఇన్ని రూపాలలో ఎట్లా వచ్చింది? అని ఆశ్చర్యం, సందేహం నాకు వచ్చింది. ఈ రకంగా గంటల తరబడి అట్లా చూశాను. రూపధ్యానంతో ఆ రోజంతా గడచిపోయింది. సాయంత్రం తిరిగి ప్రయాణానికి మా పెద్దన్నయ్య, రామకృష్ణ, నేను బయలుదేరాము. నమస్కారం చేసుకుని బొట్టు పెట్టించుకుని ప్రసాదం , కుంకుమ పొట్లాలు తీసుకొనటానికి దూరంగా కూర్చున్న నేను అమ్మ పాదాల వైపు కూర్చున్నాను. అప్పుడు సంపెంగ పూల వాసన ఘుప్పున కొట్టింది. మా అన్నయ్య వంక చూస్తూ టైం ఎంత అయింది? 5-40య్యా? అని మా అన్నయ్య గడియారం వంక చేసే లోగానే "ఆ .....5-30య్యా?అని అన్నది. మా అన్నయ్య 5-40 అని చెప్పారు. తనకు తెలిసిన విషయాన్ని తెలిసీ తెలియనట్లు అంటుందని విన్నాను. మొదట అసలుటైమ్ చెప్పి, మళ్ళీ 10నిమిషాలు తగ్గించి 5-30 య్యా అన్నారు. అప్పుడు అమ్మ "గడియారం బట్టి కాలం నడవదు కదా? కాలం తెలుసు కోవటానికి గడియారం " అన్నారు. అమ్మ నా వంక చూస్తూ "బుజ్జికి ఎట్లా వుంది." అన్నారు. నేను "బాగానే వుంది" అన్నాను. కళ్ళు సరిగ్గా లేవు" అంటూ వచ్చాడు. రక్త విరేచనాలు అయినవట? అన్నారు అమ్మ. నేను "నువ్వు ప్రసాదం ఇచ్చావుగా! తగ్గిందిలే " అన్నాను. అమ్మ అదేం లేదు నాన్నా! అంటే, నేను "అదేం కాదు , నువ్వు ప్రసాదం ఇచ్చావ్, తగ్గింది అన్నాను. తన ప్రక్కన కూర్చునమని , అరిచేత్తో మంచం పట్టె మీద తడుతూ సంజ్ఞ

చేశారు అమ్మ. వెళ్ళి కూర్చున్నాను. "నాన్న ఎట్లావున్నారు" అని కొంత సంభాషణ చేసింది. తరువాత శెలవు తీసుకుని బయలుదేరాము. మా పెద్దన్నయ్య , మన్నవ రామారావు గారు, నేను, రామకృష్ణ, పొలాల కుండా బయలుదేరి నడుస్తూ అప్పికట్ల వచ్చాము. మధ్యలో రామకృష్ణకి, రామారావుగారికి కొంత సంభాషణ జరిగింది. అమ్మని గురించి రామకృష్ణ, రామారావు గారిని అడిగారు. వారు కొంత సేపు మాట్లాడుకుని అమ్మ చెప్పిన మాట గుర్తు తెచ్చుకుంటూ "అర్థం కాందే వేదాంతం" అన్నారే ఆవిడ, అని నవ్వు కుంటూ అన్నాడు రామకృష్ణ. అప్పికట్లలో ఆ రాత్రి వుండి మర్నాడు పొన్నూరు చేరాము. మా అన్నయ్య హైదరాబాదు వెళ్ళిపోయాడు. నేను మా స్నేహితులతో అమ్మని గురించి చెబుతూ వుండే వాడ్ని. అమ్మ ఫొటో ముందు కూర్చుని మనస్సులో కొన్ని అనుకుంటూ వుండే వాడ్ని. రెండవసారి నేను, నా స్నేహితుడు రమణ ఇద్దరం కలిసి అమ్మని దర్శించటానికి పొన్నూరు నుండి జిల్లెళ్ళమూడి వెళ్ళాలని అనుకున్నాము. నా స్నేహితుడు జానకి రామ శర్మ ఇంటికి వెళ్తే, వారి ఇంట్లో కొబ్బరి చెట్లు వున్నందు వలన కొబ్బరి కాయలు కోస్తావా? అని అడిగితే, చాలా ఎత్తుగా వున్న చెట్టు ఎక్కి కొబ్బరి కాయలు కోశాను. వాళ్ళు నాకు రెండు కొబ్బరి కాయలు ఇచ్చారు. మరునాడు ఉదయం 5-30కి పొన్నూరు నుండి బయలుదేరి మట్టిపూడి - పూండ్ల మీదగా జిల్లెళ్ళమూడి చేరాము. ఇది రెండవసారి జిల్లెళ్ళమూడి రావటం. పెద్ద పూజలో అమ్మని చూడటం మొదటిసారి . మందిరంలో నిండుగా వందలాది జనం వున్నారు. లలితాంబ గారు (చీమల మట్టి గ్రామం రాచర్ల అనంత రామయ్య గారి చెల్లెలు) అమ్మ నామం చెబుతున్నారు. అందరూ పెద్దగా చేస్తున్నారు. గులాబి పూళతో అమ్మ పాదాల నుండి దరిదాపు కంఠం దాకా నిండిపోయేలా పూజ చేశారు. అరటి పండ్లు, రకరకాల పండ్లు సమృద్ధిగా వున్నవి. పెద్ద పెద్ద పూల మాలలతో నిండి వున్నారుఅమ్మ .అమ్మ కళ్ళు మూసుకుని వున్నారు. రకరకాల ముద్రలు వస్తున్నవి అమ్మకి. కాళ్ళు చేతులు కరెంటు బొమ్మలాగ రకరకాలుగా మారుతున్నవి అప్పుడు నేను నా స్నేహితుడు ఈ విధంగా అనుకున్నాము. "పెద్ద పెద్ద మాలలు, పూలు, స్వీట్లు, పండ్లు, ఇంత గొప్పగా పూజ చేశారు. చిన్న మాల, రెండు కొబ్బరి కాయలు మనం ఇస్తే బాగుండదు అనుకుని , అమ్మ కుర్చీ వెనకగా నెమ్మదిగా వెళ్ళి పాకదూలానికి కొట్టిన మేకులకి సంచీ తగిలించి, జనం వెనుకగా వెళ్ళి కూర్చున్నాము. "ఈమె కళ్ళు మూసుకుని కూర్చున్నది, కాళ్ళు చేతులు అప్రయత్నంగా ఆడుతున్నయ్. కనుక మనం తెచ్చినవి. చూడదులే" అనుకున్నాము. అమ్మని ఎవరో ప్రక్కనే

నుల్చుని పిలిచారు. ఒక్కసారి ఎక్కడో వున్న వార్ని పెద్దగా పిలిస్తే . ఉలిక్కిపడి చూసినట్లుగా చూశారు అమ్మ. మహాతేజోవంతంగా వున్నది అమ్మ ముఖం. తరువాత అందరికి బొట్టు పెట్టి, పండు కొరికి ఇచ్చి తీర్థం వేశారు. ఈ విధంగా అందరికి ఇచ్చారు. మేము కూడా బొట్టు - తీర్థం-ప్రసాదం పుచ్చుకున్నాము. తరువాత అమ్మ పెద్ద మందిరం ప్రక్కనే వున్న పాకకి వెళ్ళారు. మేము భోజనం చేసి, సాయంత్రం వరకూ అటూ ఇటూ తిరిగి అమ్మని దర్శించటానికి వెళ్ళి కూర్చున్నాము. అక్కడ వున్న వారితో సంభాషణ చేస్తున్న అమ్మ , నా వంక చూస్తూ, నాన్నా! నాకేమైనా తెచ్చారా? అంటూ "ప్రభావతో ఎవ్వరో చెప్పారు" అన్నది. తెచ్చామమ్మా! అన్నాను. "మరి తీసుకురండీ" అన్నది. వెంటనే నేను, రవణ మందిరం లోకి వెళ్ళి సంచీ తీసుకుని వస్తూ మాలని తీసి చూస్తే బాగా వాడిపోయింది. అందుకని మాల పారేసి కొబ్బరి కాయలు కొట్టి అమ్మకి ఇచ్చాము. అమ్మ ఎక్కడ లేని ఇష్టంగా ఆ కొబ్బరితిని "అబ్బ-అబ్బ ఎంత తియ్యగా వున్నదో ఎంత బాగుందో అంటూ కొబ్బరిని తిన్నది. తెచ్చిన వస్తువుని కాక తెచ్చిన హృదయాన్ని చూస్తుంది అనిపించింది. కుచేలుడు అటుకులు కృష్ణుడు తిన్నట్లు తిన్నది. రెండు నిమిషాలు ఆగి ఇంకా ఏమైనా తెచ్చారా? అన్నది. మేము వాడిన మాల పారేసిన సంగతి చెప్పి చిన్న మాల కదా! అమ్మా! అందుకుని ప్రొద్దున పూజలో వేయలేదు. ఇప్పుడు వాడిపోయింది. పారేశాము. అన్నాము. అమ్మ:- పెద్ద ఏమిటి? చిన్న ఏవిట్రా ? ఇందాకే వేయద్దు ? అన్నారు. లేస్తూ నాలుగు రోజులు వుండమన్నారు. నేను "వుండేటట్లు ఏమీ తెచ్చుకోలేదమ్మా! వెళ్ళాలి" అన్నాను. అమ్మ " నేనేమి చెప్పాను? నాలుగు రోజులు వుండేటట్లు రమ్మనలా? అన్నారు. "ఈసారి వస్తాం" అని బయలు దేరాం. ఈ రెండవ దర్శనంలో మూడు విషయాలు అవగతమయినయ్. ఒకటి అమ్మకి అవలీలగా ఆధ్యాత్మిక స్థితులు , ముద్రలు వస్తయ్, ఎంతగానో సాధనలు చేస్తే కూడా రాని ముద్రలు అమ్మకి అవలీలగా వస్తయ్. అంటే సాధ్యమయిన అమ్మకి ఇవి అన్నీ సహజంగా ప్రతి స్పందించినవి. వీటికి మూలం అమ్మ అయినది. రెండవది అమ్మకి అంతా ప్రత్యక్ష దృశ్యమే. ఆఖరికి మా సంచీలో కూడా ఈమె కళ్ళు వున్నవా? అనుకున్నాము. ఎందుకంటే ఆ రోజులలో ప్రభావతి అనెడి వ్యక్తి అక్కడ లేదు. తన సర్వజ్ఞత్వాన్ని కప్పి పుచ్చటానికి ఎవరి మీదో పెట్టి చెబుతుందని అంతకు ముందే విన్నాను. "ప్రభావతో, ఎవరో చెప్పారు" అన్నదే కానీ ఎవ్వరూ చెప్ప లేదు. ఆఖరికి మేము పారేసిన మాల విషయం కూడా అడిగింది. ఈ విధంగా ఎక్కడ ఏది జరిగినా చూసెడి అనంత దృష్టి వున్నదని, కళ్ళు మూసుకుని కూర్చుని ముద్రలు

రావటమనేది మనలాంటి పరిసరాల ఎఱుకలేని గాఢ సుషుప్తితో, తమస్సుతో కూడుకున్న నిద్ర లాంటి స్థితి కాదని, విశ్వ చైతన్య అనుసంధానంతో కూడుకున్న మన పరిధికి అందని నిత్య జాగృత స్థితి అని గ్రహించాను. మూడవది అమ్మ అవ్యాజ అనంత వాత్సల్యం. కారణం నన్ను, నా స్నేహితుని ఈ విధంగా ఎందర్నో వుండమనటం. ఎవరి ఇంటి కన్నా వెళ్తే, మరునాడే మొదటి బస్సు ఎక్కడ ఆగుతుందో చెప్పి, వెళ్ళమనే ఈ రోజులలో నీ, నా, తర తమ బేధాలు లేకుండగ అందర్ని వాత్సల్యంతో చూసెడి విశ్వజనని ప్రేమకి ముగ్ధులమయినాము. ఈ విధంగా రెండవ సారి అమ్మ దర్శనం అనేక విషయాలలో స్ఫూర్తిదాయకముయినది. అమ్మకి నమస్కారం చేసి పొన్నూరు వెళ్ళాము. మా మేనత్త ( చిన్న అమ్మమ్మ) ఆ రోజులలో పొన్నూరులో వున్నది. మా నాలుగో అన్నయ్య నాగార్జున సాగర్‌లో వుంటున్న రోజులవి. మా అన్నయ్య అన్నం కూడా సరిగ్గా తీసుకోకుండగ చిక్కిపోయి బాధపడుతున్న రోజులవి. మా అత్త నాతో "చంద్రుడ్ని ఒకసారి రమ్మని" వ్రాయమన్నది. నేను ఆ విధంగా వ్రాశాను." ని కోరిక ప్రకారం వస్తున్నానని వ్రాశాడు మా అన్నయ్య. అదే విధంగా వచ్చాడు. మా అన్నయ్యతో మా నాన్న "నా మీద ఏమాత్రం గౌరవం వున్నా ఒకసారి జిల్లెళ్ళమూడి వెళ్ళి అమ్మాయిని చూసి రమ్మని" చెప్పారు. నేను, మా నాలుగవ అన్నయ్య కలిసి అప్పికట్ల వచ్చి మరునాడు బయలుదేరి పొలాల మీదగా నడిచి జిల్లెళ్ళమూడి చేరాము. అమ్మ చెంత గంటల కొద్దీ కూర్చున్నాము. నేను అమ్మతో "నాగార్జున సాగర్‌లో గోడకి బొట్టు పెట్టి దణ్ణం పెట్టుకునే వాడ్ని" అన్నాను. అమ్మ "ఏమని పెట్టుకునే వాడివోయ్ బోడి" అంటూ దగ్గరకి తీసుకుంది. మా అన్నయ్య "అది మాత్రం ఎందుకోయ్" అన్నాడు. వెంటనే అమ్మ " నీ స్థితి వేరు, వాడిది వేరు కదా"? అన్నది. అంటే ఎవరి ఎవరి స్థితి నుండి వారిని చెదరకొట్టకుండా వారి ఇచ్ఛా సాధన పద్ధతిని నడిపిస్తూనే వికసింపచేసే దృక్పథం అమ్మది. ఎక్కడికక్కడే ప్రతివారితో తాదాత్మ్యం చెందిన పరిపూర్ణమూర్తి అమ్మకి, విడిగా పుస్తకాల మనుష్యులకి , పరిమితమయిన సాధకులకి కల వ్యత్యాసం ఇదే. అమ్మ ఒక్క మాటగా ఆ సందర్భంలో " నీ స్థితి వేరు వాడిది వేరుగా" అన్నప్పటికి దాని వెనకాల అద్భుత తత్త్వ గాంభీర్యం వున్నది. అప్పుడు అమ్మ మా అన్నయ్యతో "నీ ముఖంలో కళ లేదే. రక్తం పట్టడం, క్షీణించటం, ఇవి వేరు, కాని నీ ముఖంలో కళ లేదే?" అన్నది. తరువాత తనే "మనస్సు సరిగ్గా వుండటం లేదా"? అని అడిగింది. మా అన్నయ్య "ఉండటంలేదు! ఏమైనా చెప్పు అక్కయ్య! చేస్తాను" అన్నాడు. అమ్మ "చేస్తావా?" అని చెయ్యటానికి చెప్పటం కోసం

అలవోకగా ఆలోచిస్తూ చూసింది. అప్పుడు అమ్మ తన కుడి కాలు మడమని మా అన్నయ్య గుండె మీదకి పోనిచ్చి కొద్దినిమిషాలు వుంచి దించింది. అమ్మ చెప్పక మునుపే మా అన్నయ్య "పద్యాలు వ్రాయమంటావా?" అన్నాడు. " ఊ (-వ్రాయి. తీరిక వున్నప్పుడల్లా పద్యాలు వ్రాయి" అన్నది. నేను " మా అన్నయ్య అట్లా అనకపోతే అమ్మ ఏమి చెప్పేదో' అనుకున్నాను. ఇద్దరం ప్రసాదం తీసుకుని మళ్ళీ పొలాలకి అడ్డం పడి నడుస్తూ మాట్లాడుతున్నాము. అమ్మ అనుజ్ఞ ఇవ్వక మునుపు 10 పద్యాల కంటే వ్రాయ లేక పోయాడు ఎంత ప్రయత్నం చేసినా. కానీ వూండ్ల దాటి పొలాల్లో అప్పికట్ల వైపు నడుస్తూ వుండగా, నేను నా ధోరణిలో మాట్లాడుతూ వుండగానే, మా అన్నయ్య, "అబ్బా వుండరా పద్యాలు వస్తున్నయ్. మాట్లాడ బాక" అని క్రొద్దిగా విసుగ్గా అన్నాడు. అప్పటి కప్పుడు పొలం గట్టు మీద కూర్చుని కొన్ని పద్యాలు వ్రాశాడు. అప్పికట్ల చేరి ఆ రాత్రి అక్కడే వుండి మర్నాడు పొన్నూరు చేరాము. తరువాత నాగార్జున సాగర్ వెళ్ళాడు. లేబర్ కాలనీలో వున్న మా అన్నయ్య హిల్ కాలనీలో వున్న మా మూడవ అన్నయ్య దగ్గరికి వెళ్ళాడు. క్రొద్ది రోజులలోనే బాగా కోలుకుని "మనిషి రూపంలో వున్న గాయత్రి అమ్మ నన్ను పిల్ల కాలవలో నడుపుతున్నది. తరువాత నది లోకి, సముద్రం లోకి నడుపుతుంది" అని వ్రాసేవాడు. అంటే ఉన్నతమైన నడక అనెడి పిల్ల కాలవలో నడుపుతున్నదని, దాని యొక్క పురోగతి యొక్క వివిధ దశలుగా నది, సముద్రం అని వ్రాశాడు. నేను ఆ సంవత్సరం పొన్నూరులో హైస్కూలులో చేరాను. అమ్మ "నేను ఇది చేస్తాను" అనదు. కానీ అమ్మ పాద స్పర్శతో , ఒక్క మాటతో, ప్రసాదంతో వాని జీవితంలోనే అద్భుతమయిన మార్పు వచ్చింది. యోగ వాశిష్ఠంలో వశిష్ఠ మహర్షి ఈ విధంగా అంటారు, "సముద్రాన్ని ఇంకించటం అయినా తేలిక కాని మనస్సు నిలవటం కష్టం" అని. అట్లాంటిది స్థిరమయి రూపాంతరం చెందటం అపురూపం కదా? అమ్మ చెప్పినట్లు తీరిక వున్నప్పుడల్లా పద్యాలు వ్రాయటం జరిగింది. శతకం మించి పోయింది. తరువాత వివాహం జరిగింది. ఈ విధంగా శుభ కార్యాలు, సుఖమయ జీవితం నడవటం మొదలిడింది. 1960 ఆగష్టు 15కి జిల్లెళ్ళమూడి వెళ్ళాను. ప్రసాదరాయ కులపతి, ఇంకా ఎందరో కవులతో కవితా గోష్ఠి జరిగింది. అమ్మని చండికగా, రాజ రాజేశ్వరిగా అభివర్ణిస్తూ రక రకాలుగా ఉపన్యాసాలు, కవితలు చెప్పారు. రకరకాల జన సందోహం అమ్మ సాన్నిధ్యానికి రావటం చూస్తూ వుండే వాడ్ని. తరువాత పొన్నూరు వెళ్ళాను. క్వార్టర్లీ సెలవలలో అప్పికట్ల వచ్చాను. అప్పికట్లలో ఒక రోజు వుండి, రెండవ రోజు అక్కడ లైబ్రరీ

దగ్గర ఆటలు జరుగుతుంటే చూద్దామని వెళ్ళాను. అక్కడ నుండి బస్ స్టాప్ దగ్గరికి వెళ్ళాలి అనిపించి వెళ్ళాను. అక్కడి నుండి మఱ్ఱిపూడి గుడి దాక వెళ్ళాలి అనిపించింది. ఇక్కడ దాకా వచ్చాను కనుక జిల్లెళ్ళమూడి వెళ్ళాలని గట్ల మీదగా కొంత దూరం వెళ్ళి, ఒక చోట ఆగి ఎదురుగా ఒక తుమ్మ చెట్టు కొమ్మకి ఏదో వ్రేలాడుతుంటే అది పామో, మరొకటో అర్థం కాక కంగారుగా నుల్చుని చూస్తున్నాను. అప్పుడు అదే గట్టు మీదగా మరొక వ్యక్తి వచ్చి "యాందబ్బాయా? ఈడ నుల్చున్నావు" అని అడిగాడు. నేను " జిల్లెళ్ళమూడి వెళ్తున్నా! అన్నాను. "రా! వెళ్దాం"! అన్నాడు. ఆయనతో కలిసి జిల్లెళ్ళమూడి చేరాను. జిల్లెళ్ళమూడి మాలపల్లి సందువైపు ఆయన వెళ్ళాడు. నేను పెద్ద మందిరం బావి దగ్గర కాళ్ళు కడుక్కుంటున్నాను. పెద్ద మందిరంలో అమ్మ మంచం మీద కూర్చుని, నా వంక చూస్తూ "వీడు వచ్చాడే! దత్తూ..."అన్నది. విపరీతంగా అలిసిపోయి వున్నాను. కాళ్ళు కడుక్కుని అమ్మ మంచం దగ్గర కూర్చున్నాను. అప్పుడు పాలకొల్లు నుండి ఒకాయన వచ్చి అమ్మతో మాట్లాడుతున్నాడు. అమ్మ మాటలకి పరవశించిపోతు 'ఓ అమ్మ, ఓ అమ్మ' అని అరుస్తున్నాడు మధ్య మధ్యలో. ఆయన ఒక విచిత్రమయిన వ్యక్తి ఎక్కడో జరిగిన విషయం చెబుతూ, ఒక వ్యక్తి ఎవర్నో జుట్టుపట్టుకుని లాగాడని చెబుతూ ఎట్లా లాగాడో చూపిస్తూ అమ్మ జుట్టు పట్టుకుని లాగి చూపించాడు. అమ్మ నవ్వుతూ వూరుకుంది. నాకు ఆశ్చర్యం వేసింది. "ఇంకా కాసేపు వుంటే ఇట్లా పొడిచాడమ్మా అని పొడిచి చూపిస్తాడా ఏమిటి?ఈయన" అనిపించింది. అప్పికట్లలో చెప్పి రాలేదు. ఎందుకు వచ్చానో, ఎట్లా వచ్చానో నాకే తెలిసీ తెలియని రీతిలో అమ్మ చెంతకు చేరాను. కారణం లేకుండా జరిగే పనులు ఆశ్చర్యంగా వుండవచ్చు. కాని అదే మూలమయిన చైతన్యపు ఉనికి. స్పందన కనపడదు, చైతన్యం కనపడుతుంది. నడిపంచే శక్తి కనపడదు. నడిచే నడక కనపడుతుంది. ఆ మూలమయిన స్పందన శక్తి కనపడదు. నడిచే, నడక కనపడుతుంది. ఆ మూలమున స్పందన - శక్తి తానయిన అమ్మ అయస్కాంతం, లోహపు ముక్కని ఆకర్షించినట్లు అప్రయత్నంగా అకారణంగా నన్ను తన దరికి చేర్చుకున్నది. లోతైన చింతన లేని పచ్చి భౌతిక వాదులకి ఇది అయోమయంగా తోచవచ్చు, కాని సరియైన చింతన కల వానికి దీని లోని పారమార్థిక అర్థ తాత్పర్యం అర్థమవుతుంది. "నిష్కారణా, నిష్కంలంకా, నిరుపాధి, నిరీశ్వరా" అని ఆర్యోక్తి. అట్టి దివ్య పథశిఖరాగ్రమయిన అమ్మ ఆ విధంగా నన్ను తన దగ్గరికి చేర్చుకున్నది. మా అత్త, మా నాన్ననే కోపం వస్తే అరుస్తుంది. ఇక నన్ను చెప్పనే అఖ్ఖర్లేదు. వచ్చానే కాని

అప్పికట్ల వెళ్ళే ఓపిక లేదు. వెళ్ళినా అరుస్తుంది కదా! అనుకుంటూ అమ్మతో "నిన్న అప్పికట్ల వచ్చానమ్మా! ఇప్పుడు ఇంట్లో చెప్పకుండా వచ్చాను. అప్పికట్లకి కబురందాలి" అన్నాను. అమ్మ "కబురందాలి, ఎట్లా? " అన్నది. నేను నువ్వే చెప్పు అన్నాను. ఇంతలో అధరాపురపు శేషగిరి రావుగారు వస్తే ఆయనతో "వీడు ఇంట్లో చెప్పకుండావచ్చాడు. అప్పికట్ల కబురందాలి' అన్నది! ఆయన "నువ్వే చెప్పు" అన్నారు. అమ్మ :- 'అది వాడు ఇందాక అన్నాడు' అన్నది. నేను వీలుంటే వెంటనే వెళ్ళాలి అనుకుంటున్నాను. ఓపిక లేదు. చీకటి పడుతున్నది. ఇంతలో అమ్మకి కాఫీ తెచ్చి ఇచ్చారు. అమ్మ క్రొద్దిగా త్రాగి ఆ కాఫీ గ్లాసు నాకు ఇచ్చింది. "త్రాగు" అన్నది. నేను "ఎందుకమ్మా నాకు వేరే ఇస్తారు కదా? నువ్వు త్రాగు', అన్నాను. "వస్తే మళ్ళీ త్రాగుదువు గానివి. ఇప్పుడు ఇవి త్రాగు," అన్నారు అమ్మ. నేను ఆ కాఫీ త్రాగాను. విపరీతంగా నీరసంగా వున్న నాకు ఎక్కడ లేని ఓపిక వచ్చింది. మళ్ళీ అప్పటికప్పుడు అప్పికట్ల వెళ్ళే ఓపిక వచ్చింది. అమ్మ స్నానానికి లోపలికి వెళ్ళింది. తరువాత నాకు ఎవ్వరూ కాఫీ ఇవ్వలేదు. "నాకు వేరే ఇస్తారు కదా?" అని అమ్మతో అన్నాను. కాని ఇవ్వరని తెలిసిన అమ్మ అట్లా అనకుండా తాను త్రాగే కాఫీ నాకు ఇచ్చింది. ఎక్కడ లేని ఓపికని ఇచ్చింది. ఆ రాత్రి అక్కడ పడుకుని మరునాడు ఉదయం అమ్మకి చెప్పి అప్పికట్ల చేరాను. "పరిగ్రహాన్ మునీనాంచ తీర్థానాం పుణ్యతాస్మృత" అని ఆర్యోక్తి. తా॥ మునులు, మహాత్ములు స్వీకరించిన తీర్థానికి పుణ్యత్వం, అఖండ శక్తి వుంటుందని ఆర్యులు వివరించారు. అదే విధంగా అమ్మ ఇచ్చిన కాఫీ పని చేసింది. అప్పికట్ల ఇంటికి వెళ్తున్నానే కాని ఏమి చివాట్లు పడతయ్యో అనుకుంటూ ఇంటికి వెళ్ళాను. కాని మా అత్త కాని, మరెవ్వరు కాని ఏమీ అనలేదు. "ఏరా! జిల్లెళ్ళమూడి వెళ్ళావా? నిన్న సాయంత్రం దాక చూసి 5, 5-30 మధ్యలో నువ్వు జిల్లెళ్ళమూడి వెళ్ళావని అనుకున్నాను" అన్నది. మా మేనత్త. "రా! కాఫీ త్రాగు" అన్నది. అప్పుడు "అమ్మయ్య, చివాట్లకి ఒడిపట్టకుండా సరిపోయింది" అనుకున్నాను. నేను అమ్మకి చెప్పిన సమయం, ఇక్కడ వీళ్ళకి మనస్సుకి తట్టిన సమయం ఒక్కటే. ప్రేరేపించే ప్రేరణ-కాల స్వరూపిణి, తానే అయిన అమ్మకిఇవి అన్నీ అత్యల్పం కదా!. ఆలోచనా తరంగం ద్వారా మాటతో, కబురుతో పని లేకుండగ తెలియ చేసింది. అరవింద యోగి ఈ విధంగా అంటారు. "నిక్కమయిన ఆధ్యాత్మిక శక్తికి భౌతికమయిన ఉపకరణాలు, వ్యవస్థతో పని లేకుండానే జరుగుతుంది" అంటారు. (భౌతికమయిన సంపర్గ). అరవింద యోగి ఘోషించిన దివ్యమూర్తి తాను అయిన అమ్మ ఆ విధంగా జరిపించింది. తరువాత పొన్నూరు

వెళ్ళాను. ఆ రోజులలో అమ్మ చెంత కూర్చుంటే, నేను ఫొటో ముందు కూర్చుని అనుకున్న విషయాలు మరొకరితో అంటూ వుండే వారు అమ్మ. (పొన్నూరులో ఫొటో ముందు కూర్చుని అనుకున్న విషయాలు) దేశ కాలతీతంగా మనం బయటకి అనేవే కాక అంతఃకరణం కూడా తానే అయినదని అనిపించేది. "నన్ను గురించి నీ స్నేహితులతో చెబుతూ వుంటావా"? అని అడిగేవారు. ఈ విధంగా బాహ్య మయిన సంభాషణ, అంతరంగపు ఆలోచన సర్వం తానే అని తెలియచేసేది. పొన్నూరు నుండి జిల్లెళ్ళమూడి నడవటమనేది సర్వ సామాన్యంగా జరిగేది. ఆ సంవత్సరం పుట్టిన రోజుకి మన్నవ వెళ్తూ పొన్నూరులో అధరాపురపు శేషగిరి రావు గారి ఇంట్లో దిగి అక్కడ దర్శనం ఇచ్చారు. బ్రహ్మాండమయిన ఊరేగింపుతో వేలకు వేల జన సందోహానికి దర్శనం ఇస్తూ మన్నవ వెళ్ళారు అమ్మ. మా అక్కయ్య పొన్నూరులో అమ్మని దర్శించుకున్నది. నేను, మా రెండవ వదిన- రెండవ వదిన గారి అక్కయ్య గారు, మా వదిన కూతురు కొడుకులు, మా మేనత్త అందరం మన్నవ వెళ్ళి అమ్మని దర్శించాము. మరునాడు పొన్నూరు చేరాము.

పొన్నూరులో మా విద్యాధరి అక్కయ్యని 62లో హాస్పిటల్‌లో చేర్చారు.. అప్పుడు మా అక్కయ్య తనకు అంతకు ముందు జరిగిన అనుభవాన్ని ఈవిధంగా తెలియచేసింది.

56-60 సంవత్సరంలో మా అక్కయ్యకి ఒంట్లో ఏమీ బాగుండలేదు. చాలా బలహీనురాలు. అప్పుడే ప్రసవించే రోజులు వచ్చి హాస్పిటల్‌లో చేర్చారు. మా నాన్న జిల్లెళ్ళమూడి వెళ్ళి అమ్మకి మా అక్కయ్య సంగతి చెప్పి వచ్చారు. కొద్దిరోజుల గడిచిన తరువాత అప్పికట్ల నుండి మా నర్సమ్మ అత్తయ్య జిల్లెళ్ళమూడి వెళ్ళింది 4 రోజులు ఉందామని, అప్పుడు అమ్మ "కక్కయ్య ఒక్కడూ ఇబ్బంది పడుతుంటే ( మా నాన్నని అమ్మ "కక్కయ్య" అనేది) విద్యలు అట్లా వుంటే ఇక్కడికి వచ్చి కూర్చుంటే ఎట్లా? ప్రసాదం ఇస్తాను వెంటనే పొన్నూరు వెళ్ళి వాళ్ళకి సహాయం చెయ్యమని, మా అత్తని పంపింది. ఆ రోజులలో ఫోనులు ఏమీ లేవు ప్రత్యేకించి అమ్మకి కబురు చేసిందేమీ లేదు. అయినా కాని అమ్మ ఆవిధంగా పంపింది. మా అత్త పొన్నూరు వచ్చి మా అక్కయ్యకి అమ్మ ఇచ్చిన ప్రసాదం ఇచ్చింది. తొలుతో సహా వదిలి పెట్టకుండా మా అక్కయ్య ఆ ప్రసాదం తిన్నది. మరునాడు మా అక్కయ్య ప్రసవించే రోజు. విపరీతమైన బలహీనంగా వున్నది. మా నాన్న కాఫీ వగైరా తీసుకుని ఇంటి నుండి హాస్పిటల్‌కి బయలుదేరారు. బారుకి అమ్మ మా నాన్న వెంట నడిచి మాట్లాడిన అనుభూతి కలిగింది.

హాస్పిటల్‌లో మా అక్కయ్య పరిస్థితి గర్భంలోనే బిడ్డ పోవటం జరిగింది. ఆపరేషన్ చేస్తే ప్రాణానికే పెద్దముప్పు వాటిల్లుతుందని, ఏమీ తోచని స్థితిలో డాక్టర్ గారు, స్టాఫ్ వున్నారు. మా అక్కయ్య విపరీతమయిన బాధ కలిగి తట్టుకోలేక "అందరి పాలిట అమ్మవైనా నా పాలిట కాళి వయ్యావా? భరాయించలేను బాధ" అని అన్నది. వెంటనే మంచం కోడు మీద, తోక మీద నిలపడ్డ పాము కనపడి అది ఒక వెలుగుగా మారి తనలో ప్రవేశించిన అనుభూతి కలిగింది. వెంటనే లోపల నుండి నెట్టినట్లు అయిపోయిన బిడ్డ బయటకు రావటం జరిగింది. డాక్టర్ గారికి, అందరికి ఆశ్చర్యం కలిగింది. ఇది మా సైన్సుకి అందని విషయం. ఇట్లా రావటానికి అవకాశం లేదని అనుకున్నారు. ఒక్కసారి మా అక్కయ్యకు బాధ తొలగి ఉపశమనం కలిగింది.

"నాగేంద్రుడు అంటే వెన్నంటి కాపాడేదని" అమ్మ ఉవాచ. నాగేంద్రుని రూపంలో కనపడి వెలుతురుగా మారి ఆ విధంగా రక్షించింది ఆనాడు. మా నాన్న వెంట నడిచింది. ఏ కబురు లేకుండా మా అత్తకి ప్రసాదం ఇచ్చి పంపించింది అమ్మ. " మీ బాధే నన్ను రప్పిస్తుంది. వేరే కబురు అక్కర్లేదు" అని ప్రకటించిన అమ్మ ఆ ప్రకటనకి అనుగుణమయిన అనుభూతిని ఇచ్చింది.

మా అక్కయ్యకి అమ్మ అంటే అపారమయిన భక్తి-దానికి మొదటి నుండి ఆరోగ్యం బాగా లేదు. దానికి తగ్గట్లుగా రక్తం పడేది. పొన్నూరు లో నల్ల చీరెతో కిరీటం పెట్టుకున్న అమ్మ ఫొటో వుండేది. దానిని మేకుకి తగిలించటానికి ఎత్తుగా వుండటం వలన కుర్చీ ఎక్కి తగిలించే ప్రయత్నం చేసాను. ఫొటోకి వున్న హుక్కు వదులుగా వుండటం వలన అది మరింత వదులై నా చేతిలో నుండి అమ్మ ఫొటో జారి క్రింద పడి బద్దలైంది. అక్కయ్య అది చూసి "నాకే ఏదో మూడింది" అన్నది. తరువాత దానిని పొన్నూరు హాస్పటల్‌లో చేర్చాము. మా నాన్న నాతో "విద్యల్ని (మా అక్కయ్య) గుంటూరు హాస్పటల్ లో చేర్చాలా? లేక హైదరాబాద్‌లో చేర్చమంటుందో అడిగి రమ్మన్నారు. మా అక్కయ్య నాతో "ఫొటో క్రింద పడిన సంగతి" చెప్పమన్నది. నాకు ఒక రకంగా ఇట్లా చెబటం ఇష్టంలేదు. కాని మానాన్న, అక్కయ్య అడగమన్నారు కనుక అడగటానికి వెళ్ళాను. అమ్మకి విషయం చెప్పి మా నాన్న అడగమన్న విషయం అడిగాను. అమ్మ "గుంటూరు కంటే హైదరాబాద్‌లో ట్రీట్‌మెంట్ బాగుంటుందేమో కాని ఎక్కడికి తీసుకుని వెళ్ళినా పొయ్యే ప్రాణాన్ని పట్టుకోలేము కదా?

అన్నది. నేను ఏ వైద్యం ఇప్పించమంటావు! ఎక్కడికి తీసుకుని వెళ్ళమంటావు ఖచ్చితంగా చెప్పమని అడిగాను. మంచం మీద అమ్మ లేచి లోపలికి వెళ్తూ "సుబ్బారావుకే చెప్ప లేదు' ' అన్నది. "సుబ్బారావేనా ఏమిటి నీ బిడ్డ, అందరూ నీ బిడ్డలేగా? " అంటే , అమ్మ " అట్లాంటప్పుడు అడగటం దేనికి"? అన్నది. నేను అమ్మ వెంట పడుతూ "అందరూ నీ బిడ్డలే కనుక అందరికీ చెప్పాలి" అన్నాను. "ఏవో (.....నాకు తెలీదు, నేను స్నానానికి వెళ్ళాలి" అంటూ లోపలికి వెళ్ళింది. సాయంత్రం అమ్మ దగ్గర ప్రసాదం తీసుకుని బయలు దేరి కొంత దూరం దరిదాపు రెండు మైళ్ళు పొలాలలో నడుస్తూ వచ్చిన తరువాత మా అక్కయ్య అడగమన్న మాట గుర్తుకు వచ్చి "అరెరే ఆ మాట చెప్ప లేదే!" అనుకున్నాను. ఆ మాట ఎంత చెబుదామన్నా గుర్తుకు రాకుండా పోయింది. పొన్నూరు వచ్చి ప్రసాదం ఇచ్చి, "గుంటూరు కంటే హైదరాబాద్‌లో అయితే వైద్యం బాగుండొచ్చు. వీలుని బట్టి చేయమని' ' అన్నది. అని చెప్పాను. మా అక్కయ్యని గుంటూరు జనరల్ హాస్పటల్‌లో చేర్చారు. నన్ను మరుసటి సంవత్సరం నాగార్జున సాగర్‌లో చేర్చారు. మా నాన్న మా మూడవ అన్నయ్యతో మాటిమాటికి "ఆయనకేం మళ్ళీ పెళ్ళికొడుకు అవుతాడు" అంటూ ఉండేవారు. మా మూడవ వదిన "ఆయన్ని ఆ మాట అనవద్దని చెప్పండి" అంటూ వుండేది. మా నాన్న జాతకాలు బాగా వేసే వారు. దానిని బట్టి అనేవారు. తరువాత గుంటూరు వెళ్ళారు మా నాన్న. ఒక రోజు మా 4వ అన్నయ్య హిల్ కాలనీ వచ్చాడు. నేను అప్పటి దాకా అమ్మ చెప్పిన ఒక మాట ఎవ్వరితో అనలేదు. మా 4వ అన్నయ్యతో "ఎక్కడికి తీసుకుని వెళ్ళినా పోయే ప్రాణాన్ని పట్టుకోలేము కదా?" అన్నది అమ్మ అని మా అన్నయ్యతో అన్నాను. మా అన్నయ్య "అట్లా అన్నదీ......అయితే ఆలోచించాల్సిందే" అన్నాడు. ఆ విధంగా అని పై లాన్ కాలనీ వెళ్ళాడు. మరునాడు సాయంత్రం మా అక్కయ్య అమ్మలో విలీనం అయినట్లు (చనిపోయినట్లు) గుంటూరు నుండి ఉత్తరం వచ్చింది. మా ఇంట్లో ఆడపిల్ల అది ఒక్కతే. ఇంటిల్లిపాదికి మా అన్న తమ్ములందరికి పెద్దషాక్ అయినది దాని మరణం. నేను అమ్మని "నువ్వు రాక్షసివి, అమ్మవి కావు, అక్కయ్యని కాపాడలేదు" అన్నాను.మా 3వ అన్నయ్య "తప్పు అట్లా అనకూడదు. ఆమె ఏమి చేస్తుంది. వాళ్ళ అత్త వాళ్ళని అనుకోవాలి రాక్షసులని, అమ్మని అనకూడదు" అన్నాడు. నా క్వార్టర్లీ పరీక్షలకు ముందు నన్ను తెనాలిలో మా రెండవ అన్నయ్య దగ్గర చేర్చారు. దసరా సెలవలలో రామలింగేశ్వర పేటలో మా అన్నయ్య ఇంటి ప్రక్కన ఒక ఇంటి పునాదుల మీద కూర్చున్నాను. ఒక దిశ నుండి ఆలాపనలో విన్నట్లుగా

"దత్తు రారా"! అని ఒక మాట వినపడింది. అది అమ్మ పిలుపు అనిపించింది. మా నాన్నకి అమ్మ దగ్గరికి వెళ్ళి వస్తానని చెప్పాను. మా నాన్న అమ్మాయిని అడిగి పటిక బెల్లం తీసుకుని రమ్మన్నారు. సరేనని బాపట్ల వచ్చి బాపట్ల నుండి బస్సు లేని కారణాన, నడిచి జిల్లెళ్ళమూడి వెళ్ళాను 4 రోజులు వుండి రావాలని. అమ్మ మా అక్కయ్యని తలుచు కుంటూ "రామాయణం చదవటమే కాదు, అట్లా ఆచరించింది" అన్నది. నాకు విపరీతంగా మళ్ళీ ఏడుపు వచ్చింది. ఒక రోజు అమ్మ ఆడ జనంతో కూర్చున్నారు. అమ్మ ఆడవారి మధ్య వున్నదని వెళ్ళటానికి జంకుతూ, వెళ్ళాలి అనెడి కుతూహలంతో అటూఇటూ తిరుగుతున్నాను. అమ్మ నన్ను రమ్మనమని పిలిచింది. ఒడి లోకి తీసుకున్నారు. కారణం లేకుండగ అవ్యక్త హృదయానుభూతితో కూడుకున్న ఏడుపు వచ్చింది. "ఆడ వాళ్ళ మధ్యలో వున్నదే అమ్మ , ఎట్లా వెళ్ళాలి అని చూస్తున్నావా? నాన్నా! ఎక్కడ వున్నా ఏరీ ఏరీ తీసుకుంటాను నిన్ను" అని కుడి చేతి బ్రొటన వ్రేలుతొ తన చూపుడు వ్రేలుని నొక్కి నొక్కి అన్నారు అమ్మ. తరువాత చాలా కాలానికి రమణ మహర్షి పుస్తకంలో చదివిన విషయాన్ని అమ్మతో ఈ విధంగా అన్నాను. "సూర్యుని తేజస్సు లాగ, చంద్రుని వెన్నెల లాగ మహాత్ముల దృష్టి అందరి మీద పడదు. వారు ఎవర్ని కావాలనుకుంటారో వాళ్ళే వారి చెంతకు చేరుతారని" అమ్మ నవ్వుతూ అవును అన్నట్లు తల ఊపింది. ఏనాడో అమ్మ అన్న మాట, రమణ మహర్షి వాక్యంతో నాకు అవగతమయింది. నా ఉద్దేశ్యంలో వారు కావాలి అనుకోవటం, దరి చేరటం అంటే కేవలం భౌతికంగా వ్యక్తుల దరి చేరటం, వారి చెంత వుండటమే కాక, వారిని గుర్తించి, విశ్వసించి వారి ఆరాధనలో, తత్త్వంలో జీవించటం. అప్పుడు చలపతి అని ఒక వ్యక్తి గుంటూరు నుండి వచ్చారు. ఆయన , నేను విపరీతంగా నవ్వుకునే వారం. జీవితంలో ఎన్నో సార్లు నవ్వుకున్నప్పటికి ఆ 4 రోజులు నవ్వినది ప్రత్యేకంగా ముద్రపడింది. తరువాత ఊరికి వెళ్ళబోతూ అమ్మకి వెళ్తానని చెప్పి "నాన్న పటిక బెల్లం తీసుకుని రమ్మన్నారు" అని చెప్పాను. అమ్మ కుంకుమ పొట్లాలు, పండ్లు ఇచ్చి, అమ్మ గదిలో వుండే రుక్మిణి అక్కయ్య, వరలక్ష్మిని పిలిచి "పటిక బెల్లం వుంటే ఇవ్వండి" అన్నారు. వాళ్ళు వెతికి "లేదమ్మా" అన్నారు. అమ్మ "ఉ(.. వెళ్ళు" అన్నారు! అడక్క అడక్క మా నాన్న నాతో అమ్మాయిని అడిగి పటిక బెల్లం తీసుకుని రమ్మన్నారు. అమ్మ ప్రసాదంగా పటిక బెల్లం తీసుకుని వెళ్ళ లేకపోతినే అని లోలోపల బాధ పడుతూ బాపట్ల నడిచి వచ్చి, అప్పికట్ల వెళ్ళి, ఆ రాత్రి అక్కడ వుండి మరునాడు మధ్యాహ్నం బయలు దేరి సాయంత్రానికి తెనాలి చేరాను. మా నాన్న ముందు కుంకుమ పొట్లాల పొట్లాం

పెద్దది ఒకటి వుంచి పండ్లు కూడా వుంచి, (మా నాన్నకి చెవుడు వుండటం వలన గొట్టంలో మాట్లాడే వారం). గొట్టం తీసుకుని "అమ్మని పటిక బెల్లం అడిగాను" అంటునప్పుడు మా నాన్న పెద్ద పొట్లాం తీసుకుని, "లేదన్నారు" అంటూ వుండగానే పొట్లాం విప్పారు మా నాన్న. "ఉందిగా" అని విరగపడి నవ్వారు. కుంకుమ పటిక బెల్లంగా మారిందా? అన్నట్లుగా ఎఱ్ఱవాగ్గా వున్నది. ఆ పటిక బెల్లం నాకు ఆశ్చర్యం వేసింది. ఎందుకంటే జిల్లెళ్ళమూడిలో లేదన్నారు. అమ్మ "ఊ ....వెళ్ళు" అన్నది. అణువుల మార్పు వలన ఒక పదార్థం మరొకటిగా మారుతుంది అంటారు. విశ్వజనని అమ్మకి ఇవ్వన్నీ అత్యల్పం. అయితే అత్యల్పమయిన మహిమల గారడీగా చేసి ఆకర్షించే పద్ధతి కాదది. మా నాన్న ఎంతో ఆకాంక్షతో అడిగారు. నేను ఎంతో శ్రద్ధాసక్తులతో అమ్మకి చెప్పాను. ఇట్టి హృదయ ఆవేదనని తీర్చెడి సహజ సిద్ధమయిన మాతృప్రేరకమయిన కృపా ప్రసాదం అది. పనిపెట్టుకుని మహిమలు చేసెడి ప్రక్రియ కాదది. నాకు ఆశ్చర్యం, ఆనందం వేసింది.

ఒకసారి అమ్మ మరి కొందరు పర్ణశాలలో మాట్లాడుతున్నారు. అప్పుడు నేను వెళ్ళి కూర్చున్నాను.మహిమలు, సిద్ధులు ప్రస్తావన వచ్చి అమ్మ ఈ విధంగా అన్నది. "ఏవిరా ! మహిమలు, మహిమలు, అంటారు, అంటూ అక్కడ గుమ్మాన్ని చూపిస్తూ "ఒక్కతాయిత్తు అక్కడ కట్టి నిల్చుంటా. కుప్పలకి కుప్పలు డబ్బు గోతాలకి ఎత్తుకుని వెళ్ళచ్చు. బిల్డింగు లేముంది. ఇట్లా అంటే లేస్తయ్" అంటూ బోగంది కూడా సంపాదిస్తుంది. ఒక గంట కష్టపడి' 'అన్నారు అమ్మ. మహాజ్ఞానులు, దివ్య మూర్తులకి, మనం అనుకునెడి సిద్ధులు అటువంటివి. చారత్వం, చోరత్వంతో సంపద సంపాదించటం లాంటిది. సృష్టికి ప్రతి సృష్టి చేసిన విశ్వామిత్రుడు రాజర్షి మాత్రమే అయ్యాడు. అంతరిక్షాన్ని జయించిన రావణుడు అంతరంగాన్ని జయించలేక లోక కంటకుడు అయిన రాక్షసుడు అయినాడు. కనుక ఇవ్వన్నీ దివ్య జ్ఞానానికి, తరించటానికి గీటు రాళ్ళు కావు. దివ్యమూర్తి అయిన అమ్మ అందుకే పై విధంగా ప్రబోధించింది.

తెనాలిలో ఆర్.ఎస్.ఎస్. శాఖకి వెళ్తూ వుండే వాడిని. చైనా యుద్ధం వచ్చిన రోజులవి. ఛత్రపతి శివాజి, రాణా ప్రతాప్ కథలు వింటూ వుండే వాడిని మిలటరీలో చేరాలి. దేశానికి ఏదో సేవ చెయ్యాలి అనుకుండే వాడిని ఫిఫ్తు ఫారమ్ పరీక్ష వ్రాసి ఎండా కాలంలో సెలవలలో జిల్లెళ్ళమూడి వెళ్ళాను. అప్పుడు అమ్మ చీరాల వెళ్తున్నారు. అమ్మతో చీరాల

వెళ్ళాను. రెండు లారీలు, నాలుగు అయిదు కార్లు, జీపులు పెద్ద ఎత్తున అమ్మ చీరాల వెళ్ళారు. నినాదాలు ఇచ్చుకుంటూ , భజనలు చేస్తూ ఎంతో ఆనందంగా చీరాల వెళ్ళాము. అక్కడ హైస్కూలులో దర్శనం ఇచ్చారు అమ్మ. మేమంతా హైస్కూలులోనే వున్నాము. ఆ విధంగా 5 రోజులు గడిచింది. ఒక రోజు రాత్రి 10 గంటలు అవ్వ వచ్చు, హైస్కూలు ముందు వున్న గ్రౌండులో అమ్మ కూర్చున్నారు. చాలా కొద్ది మంది కూర్చున్నారు. వారిలో ఒక వ్యక్తికి అమ్మ అంటే అంతు లేని స్ఫూర్తి ఏర్పడి పరవశుడై కదల లేకుండగ కూర్చున్నాడు. మిగిలిన వారికి ఏమీ అనిపించలేదు. అందరికి పండ్లు ఇచ్చారు అమ్మ. అమ్మ అంటే మహోన్నత భావం ఏర్పడిన వ్యక్తి మిగిలిన వారితో "ఏమిటోరా అసలు కదలాలి అనిపించటంలా మీరు పిలిచారు కనుక లేచి వచ్చాను" అన్నాడు. మిగిలిన వారు ఎందుకురా? అంటే , "ఏం నాన్నా నువ్వు కూడా ప్రసాదం తీసుకున్నావా? అని ఎంతో ఆదరంగా అన్నది" అంటే వారిలో ఒకరు "అదే ముంది, అది సహజం అని వ్యంగ్యంగా, తృణీకారంగా అన్నాడు. మరి అందరిలో ఒకరికే ఆ విధమయిన అనుభూతి ఇచ్చారు అమ్మ. అమ్మ తెలియబడటమే కాని మనం తెలుసుకోవటం కాదు. అమ్మ దరి చేర్చటమే కాని మనం చేరటం కాదు. మరి వారి నలుగురిలో ఆ ఒక్క వ్యక్తికే ఆ విధంగా ఎందుకు అనిపించింది. అమ్మ లీలా విలాసాన్ని భౌతికమయిన పరిధులతో అవగతం చేసుకోలేము. తరువాత తెనాలి వెళ్ళాను. నాకు వడుగు (ఉపనయనం) చేశారు మా నాన్న. రామలింగేశ్వర పేట శివాలయంలో జరిగింది. ఆర్.ఎస్.ఎస్. శాఖ కార్యక్రమాలు విపరీతంగా చేసే వాడిని. ఆ సంవత్సరం క్వార్టర్లీ పరీక్షలు అయిన తరువాత సెలవలలో జిల్లెళ్ళమూడి వెళ్ళాను. ఆ సందర్భంలో ఒకాయన " మీ మహిమలని గురించి చెప్పుకుంటూ వుంటారు వాళ్ళు" అని అన్నారు. అప్పుడు అమ్మ "ప్రపంచమే మహిమ. మహిమ అంటే ప్రపంచమే ఈ ప్రపంచమే మాయ అంటూ మాయలో ఇంకా మాయని కోరుకుంటున్నారు ఈ మహిమలు కావాలనుకుండేవారు" అన్నారు అమ్మ. మరొకాయన వచ్చి అమ్మని వారి ఊరు తీసుకుని వెళ్ళాలని అడుగుతూ " ఆస్తి, ఆస్తి బాగా వున్నదని ఒకటికి 4 సార్లు అన్నారు. అప్పుడు అమ్మ "ఆస్తి అంటావేమిటి? నేను చీరాల ఓడరేవు వెళ్ళాను. అక్కడ పల్లెకారుల గుడిసెలకి వెళ్ళాను. వారికేమి డబ్బు లేదు. వాళ్ళు ఎంతో మనస్సనే ఆస్తితో నన్ను తీసుకుని వెళ్ళారు. మేము చాలా పేదవాళ్ళం. అటు ప్రక్కనే వెళ్ళి చూడు, మాది చిన్న పూరి గుడిశ అన్నారు" . ఈ సంభాషణ విన్నప్పుడు భగవంతుని గురించిన కథలు పూర్వం విన్నాను. ఇప్పుడు

చూస్తున్నాను అనిపించింది. శబరికి గుహుడుకి దర్శనమిచ్చి -జటాయువుకి అంత్యక్రియలు మొ॥ రాముని ఘట్టాలు, కుచేలుని అటుకులు, సత్యభామ సంపదకి తూగని కృష్ణుడు, రుక్మిణీదేవి తులసీ దళానికి తూగాడని, ధృతరాష్ట్రుడు సార్వభౌముడయినప్పటికిని ఎంత అట్టహాసంగా ఆతిథ్యం ఏర్పాటు చేసినప్పటికి దానిని కాదని విదురుని ఆతిథ్యం పుచ్చుకున్నాడని, ఈ విధంగా ఎన్నో గాధలు విన్నాను. కాని ఇప్పుడు ఆ దైవాన్ని చూస్తున్నాను. తరువాత యోగ శక్తులు, మహిమలని గురించి వున్న భావన, ఊకదంపుడుగా చెప్పెడి పుస్తకాల మనుష్యులు అందించెడి లోతైన చింతన లేని విషయ పరిజ్ఞానం, అమ్మ "మహిమల" విషయంలో చేసిన ప్రకటనతో పూర్వపు భావం కడిగినట్లు అయి ఒక అవగాహన ఏర్పడింది. వున్న 5,6 రోజులలో ఒక రోజు నేను మువ్వల సత్యం హోటల్‌లో టిఫిన్, కాఫీ తీసుకున్నానని తెలిసి రుక్మిణక్కయ్య చేత కబురు పంపి ఆ విధంగా తీసుకొన వద్దని, అమ్మ గదిలో తీసుకొనమని చెప్పించటం జరిగింది. నన్ను గురించి నాకే సరియైన ఆలోచన లేదు. ఎందుకంటే తెచ్చుకున్న డబ్బు అట్లా ఖర్చు అవ్వటం అమ్మకి ఇష్టం లేదు. ప్రతి చిన్న విషయంలో పట్టించుకునెడి ఆ మాతృత్వం హృదయాన్ని పులకింప చేసేది. గుంటూరు నుండి వచ్చిన కుమార స్వామి గారు అప్పుడే ప్రసాదం తీసుకుని వెళ్ళారు. అప్పుడప్పుడే సత్యసాయి బాబా గారు జనంలోకి వస్తున్నారు. ఆ మధ్యనే రేపల్లె వచ్చి వెళ్ళారని వినటం జరిగింది. అమ్మ కుమారస్వామి గారితో "ఏరా నాన్నా సత్యసాయిని చూశావా? " అన్నారు. ఆయన "ఎవరూః....నేనేమి వెళ్ళలా. అయినా రూపాయి దొరికితే, కానీని పట్టుకోవటం దేనికి" అన్నారు. అమ్మ మారు తల్లి కామేశ్వరమ్మ గారు "అహ్హాహః....అనవలసిన కాస్త అని వెళ్ళాడు, రూపాయి దొరికితే కానీని పట్టుకోవటం దేనికని" అన్నాడు. అన్నది. పాగడ్తల మత్తులో దివ్యమూర్తులు పడరు కదా! వెంటనే అమ్మ అన్నారు "64 కానీలలో ఒక కానీ తీసేసినా రూపాయి విలువ తగ్గినట్లే కదా? - 63 కానీలు రూపాయి కాదు కదా?" అన్నారు. ప్రతి ఒక్క పరిమితత్వంతో విలీనమయి ఏ ఒక్క అణువుని, వ్యక్తిని తీసివేయటం కాక మహదాకాశంలో సర్వం వున్నట్లు, సర్వంతో తాదాత్మ్యం చెందిన అనుభూతిని తెలియచేసింది. కనుక పూర్ణత్వం అంటే ఏ ఒక్క దానిని అల్పంగా విడదీయక సర్వాన్ని పూర్ణంగా చూడటం సర్వంతో తన యొక్క తాదాత్మ్యం తెలియచేయటం జరిగింది. ఒక ముత్తైదువ అమ్మతో "నువ్వే నాకు అన్నం పెడుతున్నావ్ ఏమనుకున్నావో!" అన్నది. అమ్మ నవ్వుతూ ఆవిడ అన్న మాటని తిరిగి అన్నది. మిగిలిన వారి వంక చూస్తూ

అమ్మనే దబాయిస్తున్నట్లు అమ్మపై ఆవిడకి వున్న పూర్ణ విశ్వాసం ఎంతో అమాయకంగా పసిబిడ్డ లాగ ప్రకటించింది ఆ ముత్తైదువ. ఆమె మాటని, చేష్టని స్థూలంగా కాక ఆవిడ స్వచ్ఛందమయిన అంతఃకరణానికి ప్రతి స్పందించెడి దివ్యమూర్తి అమ్మ ఆమెను దగ్గరికి తీసి తల నిమురుతూ "పిచ్చి తల్లీ! అంటూ ఈ విధంగా అన్నది. "భర్త నడిస్తే కాలికి ఏమైనా గుచ్చుకుంటైె అని తను క్రింద అరిచేతులు పెడతాను నా చేతుల మీదగా నడవమనేదిరా!' అన్నారు అమ్మ. ఇటువంటి మహాభక్తులను, అమాయకపు భక్తులను దరి చేర్చి లాలించేది. ఇట్టి ఘట్టాలు మనకు చెప్పకనే చెప్పెడి పాఠాలు. ఎటువంటి వారిని మనం గుర్తించాలి ఎట్లా ఆదరించి సేవించాలో తెలిపెడి మార్గ దర్శనం అది.

మద్రాసు (చెన్నై)లో జన జీవనాన్ని తెలియచేస్తూ ప్రతి చేతి పని వారి దగ్గర్నుండి, అనేక మంది స్థితి గతులను గురించి మాట్లాడేది. ఆ నాలుగు రోజులలో సమాజంలో మంచి - చెడుగులను గూర్చి మాట్లాడుతూ "ఈనాడు జీవితానికి కావలసిన జీతాలు సరిగ్గారావు. లంచం పుచ్చుకుంటే అవినీతి పరుడంటారు. జీవనానికి కావలసిన ఫలితం రావాలి. ఖర్చుకి మితం ఎక్కడికి, క్లుప్తంగా సంతృప్తిగా సర్దుకోవాలి అనే వారు. ఒక శిల్పి వున్నాడనుకో నాన్నా! అట్లాగే చిత్రకారుడు, ఈ విధంగా వీరికి తగ్గ ఆదరణ ఫలితం దక్కలేదు. ప్రభుత్వం ఏమి పట్టించుకోదు. ఇటువంటి వారికి చేయూత నివ్వాలని చెప్పేవారు. అంటే సమాజంలో కృషి, సామర్థ్యం అనేది బహుముఖంగా వుంటుంది. ఏ కోణంలో కృషిని సామర్థ్యాన్ని గుర్తించి చేయూత నివ్వాలో తెలియచేసేవారు అమ్మ. ఇది నాలుగు మాటలలో చెప్పినట్లు వున్నా, వ్యక్తి-సమాజం, ఏ విధంగా జీవించాలో, ఎవరు గీసుకున్న గిరిలో వారే వుండక, ఎవరికి వారు, వారుగా అభివృద్ధి చెందుతూ, ఎక్కడికక్కడ అందరితో తాదాత్మ్యం చెందుటయే మానవతా వికాసం. మానవాళి సర్వతో ముఖంగా అభ్యున్నతికి దోహదం చేసెడి ప్రబోధం చేసేవారు అమ్మ.

1. మహిమ అనెడి విషయంలో, 2. ప్రతి చిన్న విషయంలో పట్టించుకొనెడి మాతృత్వం. 3. పూర్ణత్వం . 4. ఎటువంటి వారిని ఏ విధంగా అవగతం చేసుకుని సేవించాలి. 5. సామాజిక జన జీవనం సర్వతోముఖంగా ఏ విధంగా అభ్యున్నతి చెందాలి, అనెడి విషయాలలో ఒక అవగాహన ఏర్పడటం అనేది జరిగింది. ముఖ్యంగా పూర్ణత్వం అంటే అతీతం అంటే పరిమితత్వాన్ని, ఈ జగత్తుని అసంబద్ధంగా అల్పంగా పరిత్యజించటం కాక

ప్రతి ఒక్క దానిని మహోన్నతంగా విలీనం చేసుకొనుట అని అవగతం అయింది. అదే విధంగా మహిమ విషయంలో 6. భగవంతుడు ధనం ఆస్తికి తూగి వచ్చే వాడు కాడని వినటం కాక చూడటం జరిగింది. ఆస్తి వున్నది తీసుకుని వెళ్ళానని పిలిచినప్పుడు అమ్మ చెప్పిన విషయం. ఇవి అన్నీ స్ఫూర్తి దాయకం అయినవి. అయిదారు రోజులు అమ్మ చెంత వుండటం ఇతః పూర్వం వివరించినవి మనస్సుకి అవగతం అగుట జరిగింది. తరువాత తెనాలి వెళ్ళాను. సిక్సు ఫారమ్ పరీక్షలు అయిన తరువాత గుంటూరు వెళ్ళాను. గుంటూరులో కొద్ది రోజులుండి జిల్లెళ్ళమూడి వెళ్ళాను. అందరింటి బిల్డింగ్‌కి పునాదులు, శ్లాబ్ పోస్తున్న రోజులవి. నేను 4 రోజులు నీళ్ళ పీపాకి వెళ్ళటం జరిగింది. పని పాటలలో వున్నానే కాని అమ్మ దగ్గరికి వెళ్ళలేదు. 4వ రోజు వెళ్ళి కూర్చుంటే, వచ్చి 4 రోజులైతే అమ్మ చెంతకే రాలేదా? అన్నారు అక్కడ కూర్చున్న మా మేనత్త మరి కొందరు. అమ్మ "వాడు నన్ను చూశాడు, నేను వాడ్ని చూశాను" అన్నది. అట్లా వెళ్ళిన వాడ్ని దరిదాపు 30 రోజులు వున్నాను. శ్లాబ్ పోస్తుంటే కాళ్ళు చేతులు పుండ్లు పడినవి. ఒక రోజు అమ్మ అన్నపూర్ణాలయం వెళ్ళి అక్కడ వున్న వారితో దత్తు చేతులంతా పుండ్లు పడి అట్లా వుంటే వాడికి కలిపి పెట్టకూడదా? వాడు సరిగ్గా అన్నం కూడా తినటం లేదని గట్టిగా చెప్పి వెళ్ళింది. ఇట్లా చెబటం నా ఎదుట జరగలేదు. అది విన్న వాళ్ళు ఎవరో నాకు చెప్పారు. ఆరోజు నుండి 30 రోజులు మధ్యాహ్నం-రాత్రి, లక్ష్మి నరసమ్మ అక్కయ్య నాకు కలిపి పెట్టింది. ఎవ్వరూ పట్టించుకొనని అప్పుడు దైవం అయిన అమ్మ పట్టించుకున్నది. వారి భౌతిక మయిన ఉనికికి, సర్వత్రా నిండిన వారి ఆత్మైక్యతకి సంబంధం లేదు. కిరీటం పెట్టుకుని పూజలందు కోవటం కాదు, ప్రతి వారి కష్టసుఖాలతో ఐక్యత చెందటమే అమ్మ యొక్క దివ్య మాతృత్వం. ఈ 30 రోజులు ఒక విశేషమయిన అనుభూతి అయినది. మనస్సంతా ఒక నిర్మల, శూన్యాకాశంగా వున్నది. ధ్యానంలో శూన్యావస్థ ఏర్పడుతుందని 5 గంటలు 5 నిమిషాల వలె అయిపోతుందని విన్నాను. కాని బాహ్యమయిన స్మృతి, పనిపాటలు లేకుండగ తెలియకుండగ పోవటం కాదు. ఇవి అన్నీ తెలుస్తూ జరుగుతూనే మనస్సంతా నిర్మల శూన్యావస్థగా ఏర్పడింది. ఆధ్యాత్మిక అనుభూతులకి పరిధి గీయ లేము. దివ్య మూర్తుల సాన్నిధ్యంలో పొందెడి అనుభూతులు పుస్తకాల మనుష్యులకి, శాస్త్రాలకి అందవు. అందుకే రమణమహర్షి "శాస్త్రం ఎంత గొప్పగా విస్తృతంగా చెప్పినా, కార్యరూపంలో దానికి అపజయం కలుగుతుంది" అంటారు. నా అనుభూతి ఏ శాస్త్రానికైనా అందుతుందేమో తెలియదు. సర్వ సామాన్యుడ్ని

అయిన నాకు ధ్యాసంలో శూన్యావస్థని జాగ్రదావస్థతోనే ఇచ్చి నడిపింది. ఎందరో సోదరీ సోదరులు పెద్ద, చిన్న అపారంగా సేవ చేశారు. ఆ సమయంలో మా అయిదవ అన్నయ్య మన్నవ వెంకటేశ్వర్లు సిమ్మెంటు బస్తాలు మోయటం వలన వీపు మీద పెద్ద పుండు ఏర్పడింది. ఈ విధంగా ఎందరో అమ్మ బిడ్డలు అపారమయిన భక్తి భావంతొ చేసిన కృషి, అర్పించిన రక్త మాంసాలకి ప్రతి రూపం అందరి ఇంటి భవనం. ఈ విధంగా ఎండాకాలం సెలవలు అక్కడ గడిచిపోయినవి. అందరిలో పొంగే ఆత్మీయత, అమ్మ వాత్సల్యం చెప్పనే అక్కర్లేదు, ఆ వాతావరణాన్ని వదిలి రావాలంటే బాధగా వుండేది. సెలవలు అయిపోవటం వలన తిరిగి తెనాలి చేరాను.

తెనాలిలో ఎక్కువగా ఆర్.ఎస్.ఎస్. కార్యక్రమాల్లో పాల్గొంటూ వుండే వాడిని. వివేకానంద సందేశ తరంగిణి, హెడ్గేవార్ స్మృతికణాలు, మొదలైన పుస్తకాలు చదువుతూ వుండే వాడ్ని. మా రెండవ అన్నయ్య నన్ను మిలిటరీలో చేరమనే వాడు. మా నాన్న నన్ను చదవమనే వారు. ఆర్.ఎస్.ఎస్. ప్రచారక్ వడ్లమూడి రామ మోహనరావు గారు, స్టడీస్ కంటిన్యూ చేయమన్నారు. ఆ మాట అంటూ ఇట్లా అన్నారు "ఎందుకు మిలిటరీలోకి? కూటికా? లేక దేశం కోసమా? దేశం కోసం అయితే సమాజంలో చేయవలసినది చాలా వుంది". అని అన్నారు. ధ్యేయానికి అంకితమవటమంటే ఏమిటో వారి మాటలో అవగతమయినది. అదీ కాక తిండికి అంటావా? ఎట్లాగైనా సంపాదించ వచ్చు అని కూడా అన్నారు వారు. తరువాత సెవెంత్ ఫారమ్‌లో చేరి సంవత్సరం అంతా అమ్మ చెంతకు రాకుండా వున్నాను. మళ్ళీ ఎండా కాలం సెలవలలో జిల్లెళ్ళమూడి వెళ్ళాను. అప్పుడు మళ్ళీ అక్కడ జరిగే కార్యక్రమాలలో పాల్గొన్నాను. పోతుకూచి రవితో బాగా పరిచయం ఏర్పడింది ఆ రోజుల లోనే. పీపా నీళ్ళు, వడ్డనలు, పొట్టు లారీలకి వెళ్ళటం , ఈ విధంగా గడిచిపోయినవి ఆ రోజులు. ఆ సంవత్సరం మే 5కి అమ్మ కళ్యాణ దినోత్సవం వచ్చింది. నేను ఉదయాన బావి దగ్గర మొహం కడుక్కుంటున్నాను. అడవులదీవి శ్రీరామమూర్తి వచ్చి నాతో "దత్తు నువ్వుకాఫీ -టిఫెన్ క్యాంటిన్‌లో తీసుకో , ఈ రెండు రోజులు" అన్నాడు. మే 5కి సంస్థ ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన క్యాంటిన్ అది వేలాది జనం వచ్చే రోజది అటువంటప్పుడు అమ్మ ప్రత్యేకించి నన్ను గురించి ఆలోచించి శ్రీరామమూర్తికి చెప్పి కబురు చేసింది. నేను ఎప్పుడు జిల్లెళ్ళమూడి వెళ్ళినా తిండి ఎట్లా, బట్టలు ఎట్లా, కాఫీ-టిఫెన్ ఎట్లా గడుస్తుంది? అనెడి ఆలోచన వుండేది కాదు. " జీవితము-జీవనమూ భగవంతుడు ఇచ్చినవే" అన్నారు

అమ్మ. అట్టి భగవంతుడు అమ్మ చెంతకు చేరితే సర్వం అమ్మే చూసేది. ఈ విధంగా 4 రోజులు వుందామనుకున్న నేను 40 రోజులు వున్నాను. ఈ 40 రోజులలోనే జరిగిన ఒక సంఘటన, ఒకరోజు నేను, పోతుకూచి రవి, ఎద్దు ఒకటి తప్పిపోతే వెతకటానికి రాత్రి చీకటిలో పొలాల్లోకి వెళ్ళటం జరిగింది. అంత చీకటిలో మాకు స్పష్టమయిన వెలుగుపడి పొలాల్లో వెళ్తున్నాము. కొంత సేపయిన తరువాత నేను రవితో "ఏమిట్రా! ఇంత స్పష్టంగా వెలుతురు పడుతున్నది" అంటే రవి " అదేకదురా! మిత్రమా? అమ్మ అంటే" అన్నాడు. తరువాత కొద్ది రోజులకి అమ్మ చెంత వుండి పోదామనుకున్నాను. అమ్మ " వాళ్ళ చేత కాదనిపించుకుని రమ్మనమన్నది". అమ్మ చెంత ప్రసాదం తీసుకుని తెనాలి చేరాను. తెనాలి నుండి హైదరాబాదు చేరాను. హైదరాబాదులో ఆర్.ఎస్.ఎస్‌శాఖకి వెళ్ళాను. వెళ్ళితే అమ్మ చెంతకి, లేకపోతే మిలటరీలో చేరి దేశానికి అంకిత మవ్వాలి అనుకుంటూ ఉండేవాడ్ని. ఒకరోజు Recruiting Office కి వెళ్ళాను. ప్రతి దానిలో సెలక్ట్ అయ్యాను. 60-70 మందిలో 12 మంది సెలక్ట్ అయ్యాము. ఇక వెళ్ళిపోవటమే అనుకున్నాను. ఆ రోజు వచ్చిన ఆఫీసర్ తదేకంగా చూస్తూ "నీవు బ్రాహ్మిన్ కదా! మిలటరీకి వెళ్ళాలని ఎందుకు ఎన్నుకున్నావ్" అన్నాడు. "దేశం కోసం" అన్నాను. వెంటనే తదేకంగా చూస్తూ "ఎందుకో నీవు సివిల్ సైడ్ బాగా షైన్ అవుతావ్ అనిపిస్తున్నది" అని నన్ను చేర్చుకోలేదు. దేశం కోసం ఎక్కడికి అయినా వెళ్ళాలి, ప్రాణమయినా వదలాలి అని అనుకునే వాడ్ని నేను. ఆ ఆఫీసర్ సెలక్ట్ చేసిన వ్యక్తుల భావాలు ఎట్లా వున్నయ్ అంటే "మనం యుద్ధ భూమికి వెళ్ళనక్కర్లే" అనుకుండే వాళ్ళు. ఇటువంటి స్థితిలో అమ్మ ఈ విధమయిన అవరోధం ఎందుకు కలిగించిందో అర్థం కాలేదు. ఆ ఆఫీసర్ భావాన్ని సెకండ్లలో ఎందుకు మార్చిందో అయోమయమయింది. ఈ విధంగా ఒక అవరోధం జరిగింది. రెండవది రైల్వే ఇంటర్వ్యూకి వెళ్ళాను. కాని అది కూడా వెంటనే రాలేదు. తరువాత నా పొలం కౌలు డబ్బులు తీసుకుని రమ్మని, తీసుకుని కాని రావద్దని మా పెద్దన్నయ్య అన్నాడు. డబ్బు తీసుకుని మాత్రమే వచ్చేటట్లైతే వీళ్ళ ఇంటికే దేనికి? హోటల్‌కి అయినా వెళ్ళవచ్చని అనుకుని శాశ్వతంగా అమ్మ చెంత వుండాలని అనుకుని హైదరాబాద్ నుండి లారీలో విజయవాడ వెళ్ళి అక్కడ నుండి గుంటూరులో మా బాబాయి గారి ఇంటికి వెళ్ళి, తరువాత మన్నవ వెళ్ళి మన్నవ నుండి అప్పికట్ల వెళ్ళి పొలాలకి అడ్డంగా నడిచి 1965 జనవరి 18న సాయంత్రానికి జిల్లెళ్ళమూడి చేరాను.

చేరిన వెంటనే సాగర్ గారితో ఏపాకి వెళ్ళటం మొదలు పెట్టాను. జిల్లెళ్ళమూడి

వెళ్ళిన మూడవ రోజు అమ్మకి కనపడ్డాను. "ఏడెప్పుడొచ్చాడు"? అన్నది అమ్మ "రెండు రోజుల ముందు వచ్చాడు" అన్నానుతమాషాగా. అప్పుడప్పుడు పొలం పనులకి, పొట్టు లారీలకి వెళ్తూ వుండే వాడిని. అనేక రకాల కార్యక్రమాల్లో పాల్గొనటం, ఎన్నో రకాల వ్యక్తులు, ప్రవృత్తులు కలిగిన వారు అమ్మ చెంతకు రావటం గమనిస్తూ వుండే వాడిని. రాజుపాలెం రామచంద్రరావుగారు హెడ్‌మాస్టరుగా చేసి రిటైర్ అయ్యారు. వేటపాలెం వాస్తవ్యులు గ్రంథాలు, శాస్త్రాలు బాగా చదువుకున్నవారు. ఆయన అమ్మతో ఎక్కువగా చర్చ చేయటం జరుగుతూ వుండేది. 65 ఫిబ్రవరీ, మార్చిలో ఎక్కువగా చర్చ చేయటం నేను గమనించాను. అదే రోజులలో జిల్లెళ్ళమూడి గ్రామ కాపురస్తుడు ఖగ్గా సుబ్బయ్య బ్రహ్మం గారి తత్త్వం చదువుతూ వుంటే, వానిలో ఆయనకు అర్థం కాని విషయాలు అమ్మ విడమర్చి చెబుతూ వుండేది. ఎక్కిరాల భరద్వాజ రోజుల తరబడి గంటలకి గంటలు మాట్లాడుతూ వుండేవారు. ఈయన మంచి మేధావి. ఇంగ్లీషులో దిట్ట అయిన వ్యక్తి. ఆ రోజులలో హైదరాబాదు వివేకవర్ధని కాలేజీలో లెక్చరర్ గా పని చేస్తూ వుండే వారు. అడపా రామ కృష్ణా రావు గారు ఎం.ఎ.పిహెచ్‌డి. ఈయన కూడా అమ్మతో విపరీతంగా చర్చ చేస్తూ వుండే వారు. అదే రోజులలో శ్రీపాద గోపాల కృష్ణమూర్తి గారు ఎం.ఎస్‌సి.పిహెచ్‌డి, బాపట్ల, ఆర్ట్స్ కాలెజి ప్రిన్స్‌పాల్ గా పని చేస్తూ అమ్మని దర్శించటానికి వచ్చారు. వీరు కూడా అమ్మతో చర్చ చేస్తూ వుండేవారు. బాపట్లలో వీరి ఇంట్లో టేబుల్ క్లాత్ మీద పడిన సిరా అమ్మ రూపంగా వచ్చింది. మెరిసే ముక్కు బులాకీ కూడా స్పష్టంగా కనపడుతూ వున్నది. ఆ రూపంలో అమ్మ రూపం వచ్చిన టేబుల్ క్లాత్ ముక్కని తీసుకుని వచ్చి చూపించారు వారు. రామ భక్త రంగన్న బాబుగారు అమ్మని దర్శించి వెళ్ళారని విన్నాను. వీరు సిద్ధపురుషులు. ఒకే సారి ఒకే సమయంలో అయిదు ఆరుగురి ఇండ్లలో భోజనం చేసిన వ్యక్తి ఈయన. రాముడు ఇస్తున్నాడు అని రకరకాల వస్తువులు, తినుబండారాలు, పండ్లు ఇస్తూ వుండే వారు. ఇటువంటి సిద్ధపురుషులు అమ్మని దర్శించుకుని వెళ్తూ వుండే వారు. ఈయన మహిమాన్వితమయిన చరిత్రని గురించి నిరాడంబర జీవితాన్ని గురించి కథలు కథలుగా చెప్పుకుంటారు. ఇటువంటి వారు అమ్మకి ప్రణమిల్లి ఆదిశక్తి అని నమస్సుమాంజలులు అర్పించే వారు. ఎందరో కవులు, గాయకులు, సాధకులు, అమ్మని దర్శించి వెళ్ళేవారు. ఊర్లో చదువు సంధ్య లేని వారు సహితం అమ్మ చెంత తాత్త్విక విషయ పరిజ్ఞానం పొందే వారు. ఊర్లో పెద్దబ్బాయి అనెడి వ్యక్తి నాతో ఒక విషయం చెప్పాడు. ఒక రోజు అమ్మని ఈ

విధంగా అడిగాడు "యాందమ్మా పద్మాకా ఇక్కడ వుండే వాళ్లకి ఏమి అనుభవం ఇవ్వవూ. ఏమీ చెప్పవు. యాడ్నుంచో వచ్చే వాళ్లకి అనుభవం ఇస్తావు. అల్లు యాందేందో చెప్తారు' 'అన్నాడు. అప్పుడు అమ్మ "ఒరేయ్ మన ఊర్లో చెరువు వుంది కదురా? అంటే, పెద్దబ్బాయి " అదేంది అట్లా అంటావు రోజు 10 కావిల్లు నీళ్ళు తెచ్చుకుంటుంటే" అన్నాడు. (వీడికి హాస్యంగా మాట్లాడటం అలవాటు) అప్పుడు అమ్మ "చెరువులో కలువ పూలు ఉన్నయ్ కదా? దానిలో బాగా వికసించిన పెద్ద కలువ పూవులో తేనె ఎక్కడి నుండో తుమ్మెద వచ్చి వాలి తాగి వెళ్తుంది. దాని క్రింద వున్న కప్పకి ఏమీ తెలీదు. తేనె త్రాగదు. తెలుసు కదా? అంతేరా మీరు కూడా" అన్నది. ఇదే ఉదాహరణ రమణమహర్షి ఇస్తారు. ఈ విధమయిన తాత్త్వికమయిన వివరణలు సర్వ సామాన్యులకు ఇస్తూ తెలియచేసేది అమ్మ. కుక్క, పిల్లి, ఆవు, గేదె నుండి అన్ని జీవరాసులతో తాదాత్మ్యం చెంది లాలించేది. తనని దూషించి, ద్వేషించి, హింసించిన వారిని లాలించటం మరొక వైపు జరుగుతూ వుండేది. సరోజిని అనెడి ఒక సోదరి కొంత కాలం అమ్మ గదిలో వున్నది. ఆ సోదరి విషయంలో అమ్మ ఈ విధంగా అంటూ వుండేది. "మనకు కావలసిన దానికి వ్యతిరేకంగా చెప్పి చేయించుకోవాలి దాని చేత అనే వారు అమ్మ. ఉదాహరణకి ఇళ్ళు కడగాలనుకోండి. ఆ సోదరితో కడగద్దమ్మా" అంటే కడిగేది. ఈ విధంగా విచిత్రమయిన, విలక్షణ వ్యక్తులను తన చెంత వుంచుకుని వారికి తగ్గట్లు ప్రవర్తిస్తున్నట్లు కనపడి తన పని చేయించుకొనే వారు అమ్మ . అన్ని రకాల ప్రవృత్తులు కలిగిన వ్యక్తులను తన చెంత ఇముడ్చుకుని వారి బాధని, వారి అవసరాలని వారి కంటే ఎక్కువగా తనవిగా తీసుకుని తీర్చేవారు అమ్మ. డాక్టర్ పాట్లూరి సుబ్బారావుగారు చీరాల వాస్తవ్యులు. బహుముఖ ప్రజ్ఞాశాలులు. ఆయుర్వేద వైద్యం చేయటమే కాక ఆయుర్వేదం మందులు కూడా తయారు చేయటం వచ్చును. హోమియో వైద్యం చేస్తారు. ఫొటోగ్రఫీ, టేపరికార్డర్ బాగు చేయటం, రేడియో బాగు చేయటం, సినిమా తీయటం, ప్రొజెక్టర్ తయారు చేయటం, వీడియో తీయటం - ఆడియో రికార్డ్, కారు మెకానిజం, ఈ విధంగా అధునాతన టెక్నాలజీ అంతా తెలుసు. వడ్రంగం, బంగారపు పని, సిమెంటు రాళ్ళు తయారు చేయటం, వ్యవసాయం పని ఈ విధమయిన ఎన్నో చేతి వృత్తులు వచ్చును. కఱ్ఱ-కత్తి సాములు, కుస్తీ పట్లు, సర్కస్ ఫీట్స్. ఆసనాలు, దండాలు, బస్కీలు, లోడీలు త్రిప్పటం ఇట్లా ఎన్నో శారీరక వ్యాయామాలకి సంబంధించిన విషయాలలో నిష్ణాతులు. ఒక సందర్భంలో 50 మంది కఱ్ఱలు తీసుకుని వస్తే ఒక్కరే ఎదుర్కొని వారందర్నీ చావ కొట్టి

తరిమారు. ధ్యాన సాధనలు. మంత్ర తంత్రాలు. పాము మంత్రం. తేలు మంత్రం వేసి విషం పోగొట్టడం. సంకల్పంతో తన దగ్గరికి రప్పించుకుని వారితో తాను ఏమీ మాట్లాడకుండానే సాటివారు వారి సొంత విషయాలు వారే చెప్పేటట్లు చేయటం ఈ విధమయిన మానసిక ప్రక్రియలు చేసేవారు. ఇట్లా వ్రాసుకుంటూ పోతే ఎన్నో విషయాలు. విశేషాలు కలిగిన వ్యక్తి. వీరు సర్వ సామర్థ్యాలని అమ్మకి అంకితం చేశారు.

రావూరి నరసింహ మూర్తి గారు. ఏ మాట లేకుండా మౌన యోగియై నిరంతరం అమ్మ నామ స్మరణ. అమ్మ సేవ చేస్తూ నిరాడంబర జీవియై అమ్మకి అంకితమయిన మహానుభావుడు. రామకృష్ణ పరమ హంస శిష్యులలో నాగమహాశేయుని లాంటి వారు వీరు. సత్వ గుణ ప్రధానులు. ఇటువంటి వ్యక్తే యార్లగడ్డ భాస్కరరావు గారు. అమ్మ తన చరిత్ర చెబితే స్వయంగా వ్రాసిన మహాత్ములు. వీరు కూడా నిరాడంబర మౌన యోగి. సాగర్ గారు, వారి కుటుంబం మరియు లక్ష్మీ నరసమ్మ అక్కయ్య. మొదలైన వారు అమ్మ సేవలో వుండేవారు. లక్ష్మీ నరసమ్మక్కయ్యకి మనస్సులో ఏమీ వుండేది కాదు. కాని గలగలమని ఎప్పుడూ మాట్లాడుతూ వుండేది. అంధులైన యార్లగడ్డ రాఘవయ్య గారికి అమ్మ దివ్య దర్శనాలు చూపించి ఎన్నో అనుభవాలు ఇచ్చింది. పొన్నూరు హనుమంతరావు. పర్చూరు సుబ్బారావు. రాధాకృష్ణ రెడ్డి. వెంకటేశ్వర రెడ్డి కూడా అంధులు. అమ్మని అపారంగా విశ్వసించి ఎన్నో అనుభూతులు పొందారు. వీరందరూ ఉత్సవాలలో పందెం వేసుకుని పద్యాలు పాడటం, పాటలు పాడుతూ అందరికీ ఆనందం కలుగ చేసేవారు. ఈ విధంగా సకల సమాజాన్ని, అన్ని రకాల గుణాలు కలిగిన వారిని దేశ కాలాతీతంగా తన వాత్సల్యంలో ముంచి తనలో ఇముడ్చుకున్న అమ్మ యొక్క అనంత తత్వాన్ని గమనిస్తూ వుండేవాడిని. మహదాకాశం భౌతికమయిన విశ్వాన్ని తనలో ఇముడ్చుకుంటే, మహదాకాశాన్ని మించిన గుణాన్ని, కాలాన్ని సహితం తనలో ఇముడ్చుకున్న అమ్మ పరిపూర్ణత్వం సాక్షాత్కరిస్తూ వుండేది. చేసే పని పాటలలో చిత్ర విచిత్రమయిన అనుభవాలు వస్తూ వుండేవి. ఒక్కొక్కప్పుడు ఏ మాత్రం ఓపిక లేదు. అనుకున్నప్పుడు ఎక్కడ లేని ఓపిక, శక్తి వచ్చి, నేను ఊహించని రీతిలో పని చేసే వాడిని. సున్నపు గానుగలు వేస్తే శరీరమంతా పచ్చి పుండు అయి పుండ్లలో సున్నం పడి మంటలు ఎత్తి పోతుంటే అదే ఆరాధనగా పూజ అనుకుని చేసే వాడిని. ఆ రోజులలో యువతీ యువకులు, పెద్ద చిన్న అందరూ అదే దృష్టితో సేవ చేసేవారు. కట్టెలు

కొడుతుంటే బొబ్బలు పొక్కి చితికి పోయేవి. చేతికి గుడ్డలు కట్టుకుని అట్లాగే కట్టెలు కొట్టే వాడిని. ఈ విధంగా కాయిక కర్మ ఒకవైపు. చింతనా సంబంధమయిన విచార మార్గం మరొక వైపు. అమ్మ దర్శనం. అమ్మ మాటల శ్రవణం. సంధ్యా వందనం మొదలైన కీర్తనం, కొందరు పెద్దల అనుభవాలు. మాట్లాడుకుంటే తాత్త్వికమయిన విషయాలు వింటూ వుండే వాడిని. కాయిక. మానసిక. శ్రవణ. కీర్తన. నిధి ధ్యాసలు నా ఎఱుక లేకుండానే జరిగిపోతూ వుండేవి. ఆశ్చర్యమయిన విషయం ఏమిటంటే మామూలు లోకానికి దూరంగా ఎక్కడో వున్న నిలయం కాదు ఇది. కోపతాపాలు. అరుపులు , ఆరాటాలు. సంతోషం. ప్రశాంతత, అన్నిరకాల స్థితిగతుల మధ్య సాగిపోతూ వుండేది. ప్రకృతి జన్యమయిన గుణాలని కాని, సహజంగా లోకంలో ఉండే స్థితిగతులని గెంటి వేసి దూరంగా వెళ్ళటం కాకుండగ. వీటి అన్నింట్ల మధ్య జీవితాన్ని నడుపుతూ విలక్షణమయిన ప్రత్యేకమయిన పద్ధతిలో దివ్యమూర్తి అయిన అమ్మ సాన్నిధ్యంలో సర్వసాధారణమయిన, సహజమయిన రీతిలో సాధన జరుగుతుంది.

ఒకసారి నేను అప్పికట్ల వెళ్ళి మరునాడు ఉదయం సూర్యోదయం సమయంలో బయలుదేరి పొలం గట్టు మీద వస్తున్నాను. మనస్సులో గాయత్రీ మంత్రం జపిస్తూ నడుస్తున్నాను. ఎందుకో క్రిందకి చూశాను. ఒక్క అడుగు ముందుకు వేస్తే త్రాచుపాము మీద నా కాలు పడేది. పైగా ఆ పాము పడగ విప్పి గుడ్డు అటూ ఇటూ త్రిప్పుతూ వున్నది. నేను అదిరి పడుగెత్త లేదు. అట్లాగని ఏ రాయో తీసుకుని కొట్టలేదు. కట్టకి అడ్డంగా పడుకుని వున్న పాము వెనక నుండి దానిని దాటి వెళ్ళి వెనక్కి తిరిగి చూశాను. అది కదల లేదు. అట్లాగే వున్నది. ఈ సంఘటన సర్వం తానయిన అమ్మ క్షణ మాత్రంలో జీవ జంతువుల రీతిని ఏ విధంగా మారుస్తుందో తెలియచేస్తుంది. కారణం నేను భయాందోలనలకు అతీతమయిన వాడిని కాను. అది బుసలు కొట్టి, కాటు వేసే విషజంతువు. అదీ కాక మరొక అడుగు వేస్తే దాని మీద నా కాలు పడేది. ఒక్క క్షణంలో నా చూపు క్రిందకి చూడటం, అది పడగ విప్పి గ్రుడ్డుని త్రిప్పుతూ చూస్తూ కూడా ఏమి చలించకుండా వుండటం, నేను నిరామయంగా రావటం ఆలోచిస్తే ఒక్కసారి భావ తరంగాలని మార్చి ఏ విధంగా కాపాడుతుందో, జీవ జంతువుల దగ్గర్నుండి సర్వ సాధారణ మానవుడ్ని అయిన నా వరకు ఏ విధంగా అసాధారణంగా నడుపుతుందో అవగతమవుతుంది. అప్పికట్ల నుండి జిల్లెళ్ళమూడి చేరాను. జరిగిన సంఘటనలో తాత్త్వికమయిన విషయం తరువాత కాని అర్థం కాలేదు.

జరిగినప్పుడు యాంత్రికంగా జరిగిపోయింది.

ఎల్లవేళల అంతః చైతన్యం తానయినప్పటికి అప్పుడప్పుడు సంఘటనల ద్వారా వ్యక్తీకరింపబడుతుంది. ఒకసారి అప్పికట్ల పంపుతూ అక్కడ మాట్లాడవలసినది చెప్పి పంపారు అమ్మ. నేను వెళ్ళి మాట్లాడి వచ్చాను. జిల్లెళ్ళమూడి చేరిన తరువాత అప్పికట్లలో నేను, తదితరులు మాట్లాడిన మాటలన్నీ టేప్ రికార్డులాగ అడిగారు అమ్మ. సంకల్పం-మాట-సంఘటనని పూస గుచ్చినట్లు అడిగి, ఇవి అన్నీ తనేనని తెలియచేశారు అమ్మ. ఒక సందర్భంలో నేను, రావూరిప్రసాదు బిల్డింగ్ ముందు వున్న గ్రౌండ్‌లో కూర్చుని మాట్లాడుకున్న విషయం ప్రసాదుని అడిగారు. మరునాడు అమ్మ నాతో అన్నారు "మీ సంభాషణలో నేను వచ్చాను ఏమోరా?" అని. నేను, రాధా కృష్ణరెడ్డి, సాగర్ గారు, యడవల్లి లక్ష్మీ నారాయణ గారు, పెద్ద గుడి గర్భ గుడిలో కూర్చుని మాట్లాడుకుంటున్నాము. బయట ఘల్లుమని గాజుల శబ్దం వినపడింది. వెంటనే బయటకు వెళ్ళి చూస్తే ఎవ్వరూ లేరు. వ్యక్తిగా కనపడకుండా ఇటువంటివి ఎన్నో చేస్తూ వుండేది అమ్మ. నేను గుంటూరు వెళ్ళి మా బాబాయి ఇంట్లో పంచలో కూర్చుని మా అక్కయ్యలతో మాట్లాడుతూ కూర్చున్నాను. నాకు. మా అక్కయ్యలకి గంటల తరబడి సెంటు వాసన వచ్చింది. మా పిన్నికి ఏ వాసన రాలేదు. ఎంత మంది వున్నా ఎవరికి ఏ అనుభవం ఇస్తే అది అనుభవించటం జరుగుతుంది.

ఒకసారి సున్నపు గానుగలు సిమ్మెంటు పని విపరీతంగా చేసి కాళ్ళ దగ్గర్నుండి. భుజం దాక పుండ్లు పడ్డయ్. రెల్ల మందిరంలో సామూహిక బంతి జరుగుతున్నది. నేను పెద్ద మందిరంలో పడుకున్నాను. కాళ్ళు చేతులు పుండ్లు పడటం వలన కలుపుకుని తిన లేని స్థితిలో నేను వెళ్ళ లేదు. 300 మంది ఆ బంతిలో వున్నారు. అమ్మ "దత్తు ఏడి" అని అడిగారు. విషయం తెలుసుకుని నాకు కబురు చేశారు అమ్మ. నేను మందిరం లోకి వెళ్తే నా బాధంతా తనలో స్పందించిన రీతిలో బాధగా "ఏం ....నాన్నా ...ఇంత మందిలో కూర్చో లేను, అన్నం కలుపుకోలేనని రాకుండా పడుకున్నావా?" అన్నారు. నాకు విస్తరి వేయపోతే వద్దులే నేను కలిపి పెడతాను అని, రెల్ల మందిరం ప్రక్కనే వున్న వంటశాల పాకలోకి తను వచ్చి అన్నం కలిపి ఒక్కొక్క ముద్ద పెట్టారు అమ్మ. ఆ ఉత్సవంలో ఎవ్వరూ పట్టించుకొని సమయంలో మూరు మూల పడుకున్న నన్ను పిలవటం, ఆ విధమయిన మాతృ వాత్సల్యాన్ని చూపించటం, సర్వత్రా నిండిన నిరంతర దివ్య మాతృత్వానికి ప్రతి రూపం అమ్మ అని తెలియచేస్తుంది. ఉత్సవాలు, జన సందోహం, పొగడ్తల ప్రభావం మత్తు, గుణాతీత

దివ్యమూర్తి అయిన అమ్మపై పడవు కదా?. అమ్మకి దాసోహం అంటయ్ అవి. సహజ సిద్ధమయిన ఈ దివ్య మాతృత్వమే త్రిమూర్తులని, త్రిమాతలని, ముక్కోటి దేవతల్ని ఒడిలో పాపల్ని చేసి ఆడిస్తుంది. ఇట్టి వాత్సల్యమే హృదయాన్ని కదిలించి బంధించేది.

తరువాత రైల్వే ఇంటర్వ్యూకి వెళ్ళిన ఉద్యోగానికి సంబంధించిన ఆర్డర్ వచ్చింది. సంవత్సరం అయిన తరువాత వచ్చిన ఆర్డర్ ఇది. జిల్లెళ్ళమూడి నుండి తెనాలి వచ్చి, తెనాలి నుండి హైదరాబాదు చేరాను. హైదరాబాద్‌లో రైల్వే ఆఫీసుకి వెళ్తే ఆర్డర్ ఇవ్వలేదు. టెంపరరీ జాబ్ కోసం 5,6 చోట్ల ప్రయత్నం చేశాను. ఎక్కడ జాబ్ రాలేదు. మళ్ళీ రైల్వే జాబ్ కి సంబంధించిన ఆర్డర్ రావాలంటే రెండు, మూడు నెలలు పట్ట వచ్చని తెలిసింది. అందు వలన మళ్ళీ జిల్లెళ్ళమూడి వెళ్ళాలని అనుకున్నాను. హైదరాబాద్‌లో ఎక్కిరాల భరద్వాజ, వల్లూరి సత్యం, బ్రహ్మాండం రవి, మహాదేవ్, అందరూ కలిసి ఒక ఇల్లు తీసుకుని వున్నారు ఆ రోజులలో. నేను నా విషయంలో జరిగినది అంతా ఎక్కిరాల భరద్వాజ గారికి చెప్పి జిల్లెళ్ళమూడి వెళ్ళ తలుచుకున్నానని చెప్పాను. అప్పుడు ఆయన 20 రూ. ఇచ్చారు. ఆ డబ్బుతో మళ్ళీ జిల్లెళ్ళమూడి చేరాను. అప్పుడు నేను, తంగిరాల రాధ ఎక్కువగా కలిసి పని చేసే వారం. ఇసక లారీలు, పొట్టు లారీలు, పొలం పనులు, నీళ్ళ పీపాలు, సున్నం గానుగలు ఈ విధంగా అనేక పనులలో పాల్గొనే వాళ్ళం. అమ్మ పెడితే అక్షయం అవ్వటం ఎన్నో సార్లు ఎంతో మందికి అనుభవం. కాని 66, పుట్టిన రోజుకి నేను, పోతుకూచి రవి, దేవరకొండ పార్థసారథి, చద్దెన్నాల బంతికి వడ్డన చేశాం. ఉదయం 7గం. నుండి 11గం. దాక వడ్డిస్తూనే వున్నాము. ప్రతి బంతిలో 60 లేక 100 మందికి తక్కువ లేకుండగ ఏడు, ఎనిమిది బంతులు భోజనం చేశారు. ఇంకొక గంటలో మధ్యాహ్నం పెద్ద బంతులు మొదలు అవుతవి అనగా అంత వరకు వడ్డించిన అన్నం చేసిన పదార్థాలు ఏ మాత్రం తగ్గకుండా అట్లాగే వున్నవి. పోతుకూచి రవి "ఇదేవిట్రా ఇట్లాగే వున్నయ్ ఇవ్వన్నీ " అన్నాడు. వాడు ఆ మాట అనే వరకు , ఆ ఎఱుక లేకుండానే వడ్డన చేశాం. ఈ విధంగా అమ్మ కృప వల్ల అక్షయం అయింది. ఆ సందర్భంలో అమ్మ వ్యక్తిగా అక్కడ లేక పోయినా, అమ్మ సంకల్పం వల్లనే ఇటువంటివి ఎన్నో జరిగిపోతూ వుండేవి.

ఒకసారి రెండు రోజులు ఇసక లారీలు, పొట్టు లారీలకి వెళ్ళి అలిసి వున్నాను. మూడవ రోజు తెల్లవారు ఝామున బండి కట్టుకుని కొండ పాటూరు వెళ్ళాను. అక్కడ స్వర్ణ

కోటేశ్వరరావు ఊరు ముందర వుంటాను అన్నాడు. నేను మొదటిసారిగా ఆ ఊరు వెళ్ళాను, అక్కడ వరి నారు బండిలో వేసుకుని రావాలి. కాని కోటేశ్వర రావు కనపడలేదు. రోడ్డు ప్రక్కనే వున్న మెట్ట చేలలో బండిని త్రిప్పి వెళ్తున్నాను. రెండు, మూడు రోజుల నుండి నిద్ర లేకపోవటం, బాగా అలసి పోవటం వలన నాకు విసుగు వచ్చింది. వెంటనే మనస్సులో ఈ విధంగా అనుకున్నాను. "ఒరేయ్ దేవుడా! ఏమిటి ఇట్లా దుంప తెంచుతున్నావ్? కోటేశ్వర రావు కనపడని పక్షంలో ఖాళీ బండి తీసుకుని వచ్చి అక్కడ పడేస్తా. నారు లేదు. నాటులేదు' అనుకున్నాను. ఈ విధంగా అనుకున్న మరు క్షణంలో ఎడమ చేతివైపు వున్న ఎఱ్ఱదున్న ప్రక్కకి తిరిగి వెనక్కి బండిని లాగింది. "ఇదేమిటి? దీనంతట ఇదే వెనక్కి తిరిగింది?. ఇదేదో సంకేతం అనుకుని బండిని పూర్తిగా వెనక్కి త్రిప్పి, రోడ్డు వైపు తోలుకుని వచ్చాను. రోడ్డు మీద స్వర్ణ కోటేశ్వరరావు చుట్ట కాలస్తూ కూర్చున్నాడు. బండి, నారుమడి దగ్గరకు తోలుకుని వెళ్ళి, నారు వేసుకుని, తిరిగి బండితోలుకుని వస్తున్నాను. బండిలో కోటేశ్వరరావు కూర్చున్నాడు. కోటేశ్వర రావుని "నువ్వు అర్థం లేకుండా చేశావ్. నేను వచ్చేటప్పటికి , నువ్వు రెడీగా వుండద్దా?" అని అరిచాను. కోటేశ్వరరావు కూడా అరిచాడు. ఈ విధంగా కొంత దూరం బండి తోలుకుని వస్తూనే అరుచుకోవటం జరిగింది. ఇంతలో ఒక ముసలమ్మ కఱ్ఱపోటు వేసుకుని రోడ్డు ప్రక్కన నడుస్తూ. "అయ్యా, అయ్యా బండి ఆపండి, బండి ఎక్కుతా!" అని బండి ఎక్కింది. "అవ్వా నువ్వెక్కడ వుంటావ్" అని అడిగాడు కోటేశ్వరరావు. "ఆడ బిల్డింగుల కాడ" అన్నది. నేను మళ్ళీ కోటేశ్వర రావుతో అరవటం జరిగింది. అప్పుడు ఆ ముసలమ్మ " ఊరుకోండయ్యా, ఊరుకోండి, ఎందుకు అట్లా అరుచుకుంటారు?" అన్నది. వెంటనే మంత్ర ముగ్ధులయినట్లు మాట్లాడకుండా ఊరుకున్నాం. తరువాత కొంత దూరం వచ్చి అక్కడ పిల్లకాలవకి సంబంధించిన వంతెన దగ్గర "ఈడ ఆపండయ్యా ఈడాపండి" అని బండి దిగి కుడి వైపుగా వున్న కట్ట మీద కఱ్ఱపోటు వేసుకుంటూ తుమ్మల చెట్లు అక్కడ అక్కడ వుంటే కొంత దూరం వెళ్ళి తరువాత కనపడలేదు. అప్పుడు ఆశ్చర్యం వేసింది. చుట్టు ప్రక్కల అంతా పొలాలు, చెట్లు తప్పిస్తే, బిల్డింగులు లేవు. ఆ , అవ్వ "ఆడ ...ఆ బిల్డింగుల కాడ" అన్న సమయంలో నాకు అసలు ఆ, ఆలోచనే రాలేదు. ఈ విధంగా చెలరేగిన గుణాలని శాంతింప చేసి తను అదృశ్యమయింది. తరువాత బండి తోలుకుని కాలవ అవతల పొలానికి వెళ్ళి నారు వేసి అందరం ఆవరణకి తిరిగి వచ్చాం. అప్పుడు అమ్మ నీళ్ళ టాంకీ ప్రక్కన మంచం మీద కూర్చున్నారు. నేను అమ్మ చెంత కూర్చున్నాను. అమ్మ

కాఫీ ఇచ్చింది. కాఫీ త్రాగుతున్న సమయంలో అమ్మ "నాన్నా! అటువైపు గదిలో చెక్కలు ఇటు ప్రక్కకి మార్చండి అన్నం తిన్న తరువాత" అన్నది. దాంతో నాకు వొల్లుమండి "ఏం(....ఇంకా నలగ పొడుద్దామనేనా?. నేనేం....(చెక్కలు మొయ్యను. ఏమి మొయ్యను. గుండిగ వేడి నీళ్ళు పోసుకుని, అన్నం తిని పడుకుంటా ఒక్క చెక్క కూడా మొయ్యను" అని వేడి నీళ్ళ స్నానం చేసి, భోజనం చేసి, హైమాలయం వైపు వెళ్ళి, పోతుకూచి రవితో మాట్లాడి, తిరిగి బిల్డింగ్‌ల వైపు వస్తున్నాను. అప్పటికే గుండారం నుండి వచ్చిన సోదరులు, తంగిరాల రాధ, తదితరులు చెక్కలు మోస్తున్నారు. వాళ్ళలో సుబ్బారావు అనెడి సోదరుడు నాతో "అన్నయ్యా! ఈ నాలుగు చెక్కలు అటువైపు అందించండి"అన్నాడు. నాలుగే కదా అని ఆ నాలుగు చెక్కలు మోశాను. మరొకరు తెచ్చి ఇవి అక్కడికి తీసుకుని వెళ్ళండి అన్నారు. ఆ విధంగా పనిలో దిగిన నేను అందరి కంటే ఎక్కువ చెక్కలు భుజం మీద పెట్టుకుని మోశాను. మధ్యలో అమ్మ బయట పంచలోకి వచ్చి మేము మోస్తుంటే నవ్వుతూ, చూస్తూ నిలపడింది. ఎందుకో అర్థం కాలేదు. చెక్కలు మోసిన తరువాత కాని నాకు స్ఫురించలేదు. సాయంత్రం అమ్మతో "ఏమైనా సరే ఒక్క చెక్క కూడా మొయ్యను అన్న నేను. ఆ విధంగా మొయ్యటం, ఆ సందర్భంలో అమ్మ వచ్చి నవ్వుతూ చూడటం అన్నీ గుర్తుకు తెచ్చుకుంటే "యంత్రారూఢాని మాయయా" అని కృష్ణ భగవానుడు చెప్పినట్లు "యంత్ర గాడు బొమ్మలను త్రిప్పినట్లు, నా మాయ చేత అందర్నీ త్రిప్పుతూ వున్నాను"అని చెప్పినట్లు, అమ్మ ఏ విధంగా చేస్తుందో తెలియచేస్తుంది ఈ సంఘటన. మరొక విషయం ఏమిటంటే "చూశావా? ఏ విధంగా చేయిస్తున్నానో" అన్నట్లు అమ్మ నవ్వుతూ చూసింది. అయితే ఇది హిట్లర్, ముస్సోలినీ లాగ, హిరణ్య కశిపుడు, రావణాసురుడు లాగ బలవంతాన మనస్సుని, దేహాన్ని వేధించి చేయించటం కాదు. మనస్సుకి ఉల్లాసం, శరీరానికి శక్తి, కలిగించి మన ఎరుక లేకుండగ చేయించిన సంఘటన. ఇదే దివ్యమూర్తులకి, లోక కంటకులైన నియంతలకి ఉన్న బేధం. ఇద్దరు (దివ్య మూర్తులు. లోకకంటకులు) నియంతల లాగ కనపడతారు. కాని ఇరువురికి సహస్రం తేడా వున్నది.

నాకు హైదరాబాదు నుండి రైల్వే లో సెలక్ట్ అయినట్లు ఆర్డర్స్ తీసుకొనటానికి రావలసింది అని మా రెండవ అన్నయ్య తెనాలి నుండి ఉత్తరం వ్రాశాడు. కాని ఏ రోజు నేను జాయిన్ అవ్వాలో, ఆ రోజు రావటం వలన నేను వెళ్ళలేదు. ఇందు వలన ఇంటిల్లిపాది అందరికి వ్యతిరేకత ఏర్పడింది. అయినా అమ్మే నాకు రక్ష, సర్వం అని విశ్వసించి వున్నాను.

ఒకసారి అమ్మ తండ్రి సీతాపతి శర్మ గారిని కింద పడుకో పెట్టారు. ఆ సందర్భంలో ఈ విషయం చెప్పటానికి నన్ను మన్నవ పంపించారు అమ్మ. మన్నవలో అమ్మకి అన్నయ్యా గారైన మన్నవ రాఘవరావు గారికి ఈ విషయం తెలియచేయాలి. నేను అమ్మని అడిగాను "రాఘవన్నయ్యకి ఏమి చెప్పమంటావు" అన్నాను. అమ్మ "పెద్ద నాన్నకి సీరియస్ అయింది. క్రింద పడుకోపెట్టారు" అని చెప్పమన్నారు. ఇద్దరు ఊర్లో మనుషుల్ని తోడు ఇచ్చి రాత్రికి రాత్రి పంపారు అమ్మ. అప్పాపురం కాలవ కట్ట మీద నుండి, కొల్లిమర్ల మీదగా మన్నవ చేరాను. తెల్లవారు ఝామున ఇంటికి చేరి, రాఘవరావు అన్నయ్యతో అమ్మ చెప్ప మన్న మాట చెప్పాను. "పెద్ద నాన్నని క్రింద పడుకోపెట్టారు సీరియస్ అయిందని" చెప్పాను. ఆయన బాధ పడ్డారు. రాఘవరావుగారు, ఆయన కొడుకు రంగనాథం, నాతో వచ్చిన ఇద్దరు అందరం కలిసి జిల్లెళ్ళమూడి చేరాము. పాత మందిరం ముందు అమ్మ తండ్రి కాని, మరి ఎవ్వరూలేరు. లోపలికి ప్రవేశించగానే కుడి చేతి వైపు వున్న రెళ్ళ మందిరంలో మంచం మీద కూర్చుని ఠీవిగా పేపరు చదువుతున్న సీతాపతి శర్మగారు కనపడ్డారు. అసలు మనిషే పోయాడని అనుకున్న వారికి ఈ దృశ్యం చూసి ఆశ్చర్యం, ఆనందం వేసింది. అమ్మ "ఏదో హోమియో మందు వేశారురా? దానితో నాన్న త్రిప్పుకున్నారు" అన్నది. తాను ఆ విధంగా తిరిగి లేపి కూర్చోపెట్టినప్పటికి, ఏదో ఒక భౌతికమయిన కారణాన్ని చూపిస్తూ వుంటారు. ఇట్టి అద్భుతమయిన ఘట్టాలు సర్వసామాన్యంగా జరిగేవి.

1965లో అమ్మ అత్తగారు కనకమ్మ గారు చనిపోయారు. తరువాత 66లో సీతాపతి శర్మ గారు (అమ్మ తండ్రి) పోయారు. వాళ్ళకి గంటలకి గంటలుఅమ్మ సేవలు చేస్తూవుండేది. ఈ విధంగా ఒక కుటుంబిని ఆదర్శవంతంగా ఎట్లా జీవించాలో మాటలుగా కాకుండగ ఆచరణలో చూపించారు అమ్మ.

ఒకసారి అమ్మ వేదిక మీద వున్నది. పూజ చేస్తున్నారు. ఆ సందర్భంలో సాగర్ గారు బండి తోలుతున్నారు. వేదిక మీద వున్న అమ్మ సాగర్ గారిని పిలిచి దున్నల్ని కొట్టావంటే నీ మీద కొరడా తీసుకుంటాను అన్నది. వేదిక మీద గజమాలలు, పూజలు, వందలాది జనం దర్శనం, భజనలతో నిండిన ఆ వాతావరణంలో వాటి ప్రభావం ఏ మాత్రం లేని నిరహంకార స్థితిలో వుండటమే కాక, జీవరాసులతో సహితం తన తాదాత్మ్యతని ప్రకటించింది. మరొకసారి ఒక పండుగ సందర్భంలో జనం ఎక్కువగా వుండం వలన నీళ్ళు అవసరం కూడా ఎక్కువ అయింది. మధ్యాహ్నం దాక నీళ్ళపిపా వేసి, గంట రెండు గంటలు

అయ్యా అవ్వక ముందే కాలవ నుండి నీళ్ళు తీసుకుని రావాలని మళ్ళీ ఎద్దుని కట్టారు. తన పాకలో వున్న అమ్మ స్నానానికి వెళ్ళబోతూ ఎద్దుని కట్టారని విని, బాధగాను, ఆశ్చర్యంగాను, వినకూడని వార్త విన్న వారు స్వరం పెంచినట్లు, కళ్ళు పెద్దవి చేసి "ఎద్దుని కట్టారా? మళ్ళీ! అని మాంధాత మణిపూస" అంటూ రెండు చేతులతో నమస్కారం చేసింది. ఎటువంటి స్థితికి అమ్మ ప్రాధాన్యత ఇస్తుంది(..... అది కూడా సకల జీవరాసులతో ఐక్యత చెంది ఏ విధంగా నిలిచిందో ఈ సంఘటన మనకు తెలియచేస్తుంది. ఎండాకాలం ఎండలలో పని చేస్తున్న బేల్దార్లకి తనకు వచ్చిన పండ్లు, స్వీట్లు అప్పుడప్పుడు పంపుతూ వుండేవారు. పొలం పనులకు వెళ్ళిన మాకు కూడా అట్లాగే పంపేవారు. నేను జిల్లెళ్ళమూడి వస్తూ, పోతూ వున్న రోజులలో ఒకసారి అమ్మ , కోనా సుబ్బారావుగారు, నేను, శేషగిరి రావుగారు, ఆ రోజులలో గజేంద్రమ్మ పాక ముందు కూర్చున్నాము. ఆ సందర్భంలో తంగిరాల శాస్త్రి వచ్చారు. అప్పుడు అమ్మ అన్నది. "ఒరేయ్ నువ్వు పంపిన డబ్బుతో తినుబండారాలు చేసి కుష్టు ఆస్పత్రిలో వాళ్ళకి పంపించాను. సద్వినియోగం చేయమని వ్రాశావు. సద్వినియోగం అంటే అమ్మని కూర్చోపెట్టి, పూజచేసి వాటి కోసం ఖర్చు చెయ్యటం కాదు, అని ఆ విధంగా చేశానురా!" అన్నారు. శాస్త్రి "అందుకే అమ్మ! సద్వినియోగం అంటే ఏమిటో తెలియక అట్లా వ్రాశాను". అన్నారు. ఈ సంఘటనలన్నీ సకల జీవుల, సకలమానవుల అవసరాలు, బాధా గాధల విషాద ఘట్టాలతో ఐక్యత చెంది పొంగులు వారే ఆత్మైక్యతను తెలియచేస్తుంది. ఇటువంటివి వందల, వేల సంఘటనలు వున్నవి.

భద్రాద్రి రామశాస్త్రి గారు సంస్కృతం, ఇంగ్లీషు భాషలలో దిట్ట అయిన వ్యక్తి, మంత్రశాస్త్రం, నాదశాస్త్రం అనేకమయిన విషయాలలో బాగా తెలిసిన వ్యక్తి, అమ్మని రాజరాజేశ్వరిగా దివ్య తేజస్సుతో దర్శించారు. ఉపనిషత్తులు, శాస్త్రాలు బాగా చదివారు. అమ్మ కంటే చాలా పెద్దవారు. అందరూ భద్రాద్రి తాతయ్య అంటూ వుండే వారు. ఈయన అమ్మ చెంత బాలుని లాగ ఆదరణ పొందేవారు. వయోభేధానికి అతీతంగా ఎందరో ఈ విధంగా అమ్మ చెంత లాలన పొందేవారు. అమ్మ యందు పరిపూర్ణ దైవ విశ్వాసం వున్నప్పటికి ఒక్కొక్కప్పుడు అమ్మని బిడ్డని సంబోధించినట్లు "అట్లా చెప్పాను కదే"(....అని దీర్ఘం తీస్తూ అనేవారు. అమ్మ కూడా తండ్రితోనో, తాతతోనో అన్నట్లు " అట్లా చెప్పాను కదయ్యా"(....అనేవారు. సకల విశ్వానికి అధీశ్వరి అయిన అమ్మ అన్ని రకాల స్థాయిలోని

వారికి. ఎన్నో రకాల భక్తి మార్గాలలో అందుతూ లీలా విలాసినియై బాసిల్లినది.

1967 ఫిబ్రవరిలో వఝూ శివరామయ్య గారి పెద్ద కొడుకు వివాహం జరిగింది. శివరామయ్య గారు బాపట్ల నివాసి, నిండు కుండ లాంటి మనిషి. అమ్మ అంటే అపారమయిన భక్తి విశ్వాసాలు కలిగిన వ్యక్తి. ఆ రోజు ఉదయం వారి పెద్ద కొడుకు ప్రసాదు - అరుణ వివాహం జరిగితే ఆ రోజు సాయంత్రం పోతుకూచి రవి అమరుడై అమ్మలో విలీనం అయ్యాడు. వాడితో స్నేహ బంధం నాకు విపరీతంగా వుండేది. వాడు ఆ విధంగా అయినందు వలన ఆ షాక్ యొక్క ప్రభావం నా మనస్సు మీద చాలా కాలం వున్నది. అదే రోజు ఉదయం వివాహం, అదే రోజు సాయంత్రం పోతుకూచి రవి అంతిమ క్రియ, అదే రోజు రాత్రి ప్రసాదు-అరుణ వాళ్ళ బూజం బంతి జరిగింది. ఈ విధంగా శుభాశుభాల యందు సమ దృష్టి కలిగిన దివ్య మూర్తి అమ్మ. ఈ సంఘటనే పక్కా కమ్యూనిస్టు అయి ఈ సంఘటనకి ముందు అమ్మని వ్యతిరేకించిన అరుణ అన్నయ్య అయిన పరబ్రహ్మ మూర్తిని పూర్తిగా మార్చి వేసింది. అమ్మని దైవంగా విశ్వసించి, అపారంగా సేవించి చివరి ఊపిరి వరకు అమ్మని స్మరించి, చివరి క్షణంలో "అదిగో అమ్మ కనపడుతున్నది అని అమ్మని దర్శించి 1998 మార్చి నెలాఖరులో అమ్మలో శాశ్వతంగా విలీనం అయ్యాడు. అటు కళ్యాణం- ఇటు అంత్యక్రియ ఒకే రకంగా జరిపిన అమ్మ సమదృష్టి, స్థిత ప్రజ్ఞత్వం చూసి ముగ్ధుడైన పరబ్రహ్మ మూర్తి ఈ విధంగా అనుకున్నాడు. "ఇంతకు మించిన మార్క్సిజం, కమ్యూనిజం ఎక్కడుంది. పెద్ద-చిన్న చదువు కున్న వారు, చదువు కోని వారు, అన్ని రకాలు కులమతాల వారు, అన్ని వర్గాల వృత్తుల వారు అమ్మ చెంతకు చేరటం, సహజ మాతృ వాత్సల్యంతో అమ్మ దరి చేర్చి లాలించటం, సంప్రదాయాలకి అతీతంగా అమ్మ జరిపే సమ దృష్టితో కూడిన క్రియలు, అంటే వివాహ వ్యవస్థని కాని, మరొక దానిని రూపు మాపటం కాక దేనికదే నడుపుతూ ఒక సంఘటన కారణం వల్ల మరొక దానిని ఆపకుండా జరిపించటమనేది జరిపేది అమ్మ. ఇట్టి స్థితిని ప్రత్యక్షంగా చూసి "తుపాకులతో, కత్తులతో పని లేకుండా ఇట్టి సామాజిక వ్యవస్థని దివ్య మాతృ వాత్సల్యంతో అమ్మ ఏర్పరచినదని, పరబ్రహ్మ మూర్తి హృదయం పులకించి పోయి అమ్మని దైవంగా విశ్వసించి, ఆరాధించి, అమ్మలో ఐక్యమయ్యాడు. (1998 మార్చి నెలాఖరులో అమ్మలో ఐక్యమయినాడు)

67-68 సంవత్సరంలో అవసరమయినప్పుడు బయట ఊర్ల పనికి వెళ్తూ,

లేనప్పుడు ఆవరణలో ఏ పని అవసరమయితే ఆ పని చేస్తూ ఉండేవాడిని. ఒకసారి మజ్జిపూడిలో చండీయాగం జరిగింది. అక్కడికి వచ్చిన వారంతా జిల్లెళ్ళమూడి వచ్చారు. 10 రోజులపైన వచ్చారు. మధ్యాహ్నం 3,4 వందల మంది, రాత్రికి 5,6 వందల మంది, ఈ విధంగా వచ్చే వారు. ఆ రోజులలో కరెంటు లేదు. సాగర్ గారు, నర్సయ్య (మానుకోట నివాసి) నేను, ముగ్గురం ఉదయం, సాయంత్రం నీళ్ళు పీపాతో తెచ్చేవారం. నేను, పొతుకూచి రవి, దేవర కొండ పార్థ సారధి, అప్పుడప్పుడు నర్సయ్య, మధ్యాహ్నం, రాత్రి, అందరికీ వడ్డన్లు చేసేవారము. అటు పీపా నీళ్ళు, ఇటు వడ్డన్లు ఈ విధంగా పది రోజుల పైన యంత్రాల వలె పని చేశాము.

హెడ్గేవార్ పుస్తకంలో వున్న విశిష్ఠ ఆదర్శం నాకు స్ఫూర్తిదాయకమయింది. వారు ఈ విధంగా అంటారు "నీ ధ్యేయ దేవతకు పరిమళాలు విరజిమ్మే నీ యవ్వన కుసుమాన్ని సమర్పించు. నీ దైవానికి వాడిపోయి, వడిలిపోయిన పుష్పాన్ని సమర్పించవు కదా?" అంటారు.

రెండవది వివేకానంద వాక్యం "నీవు కష్టించటానికి పుట్టావనుకో. ఏ ధ్యేయం లేని వాడు 100 తప్పులు చేస్తే, ఆశయం వున్నవాడు 10 తప్పులే చేస్తాడు. అందుకని ఆశయం వుండాలి. ఆశయనిష్టలో 100 సార్లు విఫలుడ్ని అయినా ఆ ప్రయత్నంలో కన్ను మూస్తాను' అంటారు. అటు హెడ్గేవార్ ప్రబోధం , ఇటు వివేకానంద ప్రబోధం , రెండు కూడా అమ్మ చెంత వుండి అంకితమవటానికి స్ఫూర్తి దాయకమయినవి. సాధారణంగా లోకంలో అన్నీ ఉడిగిన తరువాత ఏదో ఆధ్యాత్మికంగా చేయాలి, అంకితమవ్వాలి అనుకుంటారు. కాని అది ఎంత అత్యల్పమో, ఇతః పూర్వం నేను వివరించిన మహాత్ముల ప్రబోధాలు తెలియచేస్తయ్. ఈ విధమయిన స్ఫూర్తి ఆ వయస్సులో అంకితమయ్యే ప్రేరణను ఇచ్చింది అమ్మ. ఈ విధంగా అమ్మ చెంత వుంటున్న రోజులవి. 1967-68 మధ్యలో బ్రహ్మాండం సుబ్బారావు సినిమా గాయకుల పాట కచేరీ గుంటూరులో పెట్టాడు. ఆ సందర్భంలో ఆ పనిలో కొంతకాలం బాగా తిరిగాను. 1968 సంవత్సరాదికి హైమని (అమ్మ కూతురు) ఔరంగాబాదు నుండి హైదరాబాదు తీసుకుని వచ్చి, హైదరాబాదు నుండి జిల్లెళ్ళమూడి తీసుకుని వచ్చారు. 68 ఏప్రియల్ 5వ తేదీ నాడు హైమ పోయిందని డాక్టర్లు నిర్ణయించారు. 6వ తేదీ సాయంత్రం అమ్మ హైమ భౌతిక దేహాన్ని తన పర్ణశాల ముందు, ఆనాడు పెద్ద మందిరానికి

ముందు అంటే అమ్మ మందిరానికి, పెద్ద మందిరానికి మధ్యగా భూగృహంలో ఖననం చేసి ప్రతిష్ఠించింది. తపో భూమికి శంఖుగా హైమని ప్రతిష్ఠించానని, హైమ అమరమని చెప్పారు అమ్మ. గోవిందరాజుల దత్తు గారు హైమకి నాడి ఆడటం చూశారు. శిరస్సు మీద రక్తంచిమ్మింది. శిరస్సు మీద అమ్మ వేసిన పసుపు కుంకుమ విభూతి ఇంకా హైమవాడిన వస్తువులు, అన్నింట్లతో ఆ సమాధి నిండిపోయింది. తరువాత అక్కడ భద్రాద్రి రామ శాస్త్రిగారు అభిషేకాలు, పూజలు చేయటం మొదలు పెట్టారు. అక్కడే హైమాలయం ఏర్పడింది. అప్పుడే అఖండ నామం మొదలైంది.

అందరింట బిల్డింగ్‌కి అందరం ఏ విధంగా పని చేశామో హైమాలయం నిర్మాణంలో కూడా అందరం అదే విధంగా పని చేశాము. 68 ఏప్రియల్ 6న హైమని భూ గృహంలో ప్రతిష్టిస్తే, 7వ తేదీ శ్రీరామ నవమి నాడు "పదార్చన" గ్రంథావిష్కరణ జరిగింది. అమ్మ ప్రతి సంవత్సరం వచ్చినట్లు వేదిక మీదకి వచ్చి కూర్చుని గ్రంథావిష్కరణ చేసి, అందరికి దర్శనం ఇచ్చింది. యధావిధిగా కార్యక్రమాలు జరిగినవి. అదే విధంగా ఆ సంవత్సరం అమ్మ జన్మ దినోత్సవం జరిగింది. సుఖ దుఃఖాలు సర్వం అమ్మకి సమానమే. స్థితి ప్రజ్ఞత్వాన్ని గురించి విన్నవి అమ్మ చెంత దర్శిస్తాము, అనుభవిస్తాం.

69 మే, 5కి అమ్మ మూడవ అంతస్తుకి వెళ్ళింది. ఇప్పుడు వాత్సల్యాలయం అని పేరుతో వున్నది అదే. ఇది కూడా ఆవరణలో అందరం కలిసి నిర్మించిందే. 68-69 మధ్యలో డాక్టర్ పొట్లూరి సుబ్బారావు గారి దగ్గర ఎక్కువగా పని చేస్తూ వుండే వాడిని. ఫొటోగ్రఫీ పనిలో సహాయం చేస్తూ వుండే వాడిని. లోడీ త్రిప్పటం, బస్కీలు, దండాలు తీయటం మొదలైన కొన్ని వ్యాయామాలు చేసే వాడిని. ఈ రకంగా ఆ రోజులు గడిచిపోయినవి. ఒకరోజు ఎక్కిరాల భరద్వాజ తన గదిలోకి వెళ్తూ నాతో "అంతర్ముఖుడ్ని అవుతున్నానయ్యా" అన్నారు. నేను "అంతర్ముఖం అంతటా ఒకే ముఖం కదా? అన్నాను. ఆయన "ఏవిటయ్యోయ్ సూక్తులొస్తున్నయ్యే నీకు?" అన్నారు. ఏది పలికినా అమ్మ పలికించటమే. తరువాత లలితా నామాల్లో "అంతర్ముఖ సమారాధ్యా బహిర్ముఖ సుదుర్లభా" అని చదివి నప్పుడు, ఏనాడో అమ్మ పలికించిన వాక్యం లోని తత్వార్థమే, లలితా నామాల్లో వున్నది. నేను అన్నప్పుడు ఏదో ఊహించి కాని, లలితా నామాలు చదివి కాని అన్నది కాదు. 69 మే 5 నాడు అమ్మ పెద్ద కుమారుడు బ్రహ్మాండం సుబ్బారావు పెళ్ళి జరిగింది. ఆ నెలలో పెద్ద వరద వచ్చింది.

అన్నపూర్ణాలయం గాడి పొయ్యి లోకి నీళ్ళు వచ్చినయ్. క్రింద గదుల్లోకి నీళ్ళు వచ్చి రెండు మెట్ల వరకు ఎక్కినవి. ఊరంతా మునిగి పోతుందేమో అని భయపడ్డారు. ఆ సమయంలో అమ్మ చీర, పసుపు కుంకుమ, వరద నీటిలోకి వదిలింది. మరుక్షణంలో వరద ఆగిపోయింది. శంకరుల వారు నర్మదా నది వరద వచ్చినప్పుడు కమండలం పెట్టి వరదని ఆపారని చదివాము. ఆయన నర్మదాష్టకం స్తోత్రం చేశారు. అమ్మ డాబా మీద సరదాగా గంతులు వేస్తున్నట్లు తిరుగుతూ ఆ వరదని చూసింది. పసిబిడ్డ వేసే గంతులు చూసి తల్లిదండ్రులు వినోదం చూసి ఆనందించినట్లు అమ్మ ప్రవర్తించింది. ఈ ప్రకృతి అమ్మకి బిడ్డ అయితే, ప్రకృతిలో వచ్చేడి ఇటువంటి మార్పులు అమ్మకి పసిబిడ్డ చిందులు త్రొక్కినట్లు వుంటుంది. మనకు భయానకమయినవి అమ్మకి లీలా విలాసం. వరద నీరు నీళ్ళ టాంకీల క్రిందకి వస్తే ఆవరణలో మేము, కొందరు ఊర్లో వాళ్ళు అందరం కలిసి పెద్ద పెద్ద నీళ్ళ టాంకీలు బుంగలతో పోసి నింపాము. మూడవ అంతస్తులో , ఆవరణలో వాళ్ళకి, ఊర్లో వాళ్ళకి భోజనాలు పెట్టారు. గాడి పొయ్యిలోకి నీళ్ళు వస్తే, గాడి పొయ్యి మీద రేకు వేసి దాని మీద రాళ్ళు, కట్టెలతో పొయ్యి ఏర్పాటు చేసి శేషయ్య గారు, భాగ్యమ్మ అక్కయ్య మొదలైన వారు వంట చేశారు. వరద తగ్గిన తరువాత ఆవరణం బాగు చేయటం జరిగింది. 70 లో గుంటూరు నివాసి రామరాజు కృష్ణమూర్తిగారు జిల్లెళ్ళమూడి వచ్చారు. 69 జూన్ తరువాత ఎక్కిరాల భరద్వాజ గారు నెల్లూరు జిల్లా వాకాడ విద్యానగర్ కాలేజీలో లెక్చరర్‌గా చేరి జిల్లెళ్ళమూడి నుండి వెళ్ళి పోయారు. 70లో ఒకసారి ఊరికి వెళ్తూ అమ్మ చెంత ప్రసాదం తీసుకోవాలని పైకి వెళ్ళాను. ఆ సందర్భంలో, శ్రీపాద గోపాల కృష్ణమూర్తి గారు ఒకవైపు కూర్చున్నారు. భద్రాద్రి రామశాస్త్రి గారితో అమ్మ సంభాషణ చేస్తున్నారు. మంత్ర శాస్త్రాన్ని గురించిన చర్చ సాగుతున్నది. భావం ప్రధానం గా అమ్మ మాట్లాడుతున్నది. భద్రాద్రి రామ శాస్త్రి గారు "మహామంత్రం క్షుద్రమంత్రం కానేరదు" అన్నారు. అప్పుడు అమ్మ "అది సరే నాన్నా మంత్రం ప్రధానమా, భావం ప్రధానమా" అన్నది. అమ్మ "మీరే అంటున్నారు. మరా, మరా , అంటూ కూర్చుంటే బ్రహ్మ ఋషి అయినాడని" అన్నది. (వాల్మీకి పేరు చెప్పకుండా) అప్పుడు అమ్మ ఒక ఉదాహరణ ఇచ్చారు. నా యింట్లో రోగాలన్నీ నశించాలి, దారిద్ర్యం మసి అయిపోవాలి. అని "నశి-మసి" అనే మంత్రం చేశాననుకో, ఏమవుతుంది? అంటూ "నశి-మసి" చేతబడి మంత్రం బయట పెడుతున్నాను" అన్నారు అమ్మ. భద్రాద్రి తాతయ్య ఏమీ మాట్లాడకుండా ఆలోచిస్తూ కూర్చున్నారు. నేను ప్రసాదం తీసుకుని బయలుదేరి వెళ్ళాను.

తరువాత ఒకసారి మన్నవ వెళ్తే సంభాషణలో పొట్ల తీగకి వేరొక కాయ కాయించారని. అమ్మ భర్త బ్రహ్మాండం నాగేశ్వర రావు గారు రాఘవరావు గారితొ "ఇంజక్షన్ చేశావు ఏవిట్రా? అన్నారు. రాఘవరావు గారు "హార్మోనియంలు మార్చటమేగా" అన్నారు. బాహ్యానికి రూపం ఏదైనా లోపల ప్రవేశపెట్టిన దాన్ని బట్టి బయట పడే ఫలితం వుంటుందని అర్థమయింది. శబ్దోచ్చారణ అవసరమయినప్పటికి , కేవలం దానికే ఎనలేని ప్రాధాన్యత ఇచ్చి. భావ శుద్ధిని. ఇచ్ఛాశక్తిని తొలగించి క్రియా శక్తిని, నిష్ఠకి విఘాతం కలుగ చేయటం నిజమైన ఆధ్యాత్మిక చింతనకి సరియైన మార్గదర్శనం కాదు. వేద స్వరాలు మొదలైనవి మంచివే. కాని అదే చివరి గీటు కాదని అమ్మ చెప్పిన దానిని బట్టి సహేతుకంగా అర్థమయింది. "శబ్దం యొక్క సూక్ష్మదశ భావం" అంటారు వివేకానంద. "మూర్ఖో వదతి విష్ణాయ, ధీరో వదతి విష్ణవేతయో: ఫలంతు తుల్యం హి భావగ్రాహీ జనార్దనః"

తా॥ ఉచ్చరించటం సరిగ్గా రాని చదువు లేని వారు ( మూర్ఖుడు అన్నారు) విష్ణాయ అంటే, ధీరుడు అయిన వాడు (ఇవి అన్నీ తెలిసిన ) విష్ణవే అంటాడు. కాని ఇరువురికి ఫలం ఒక్కటే. కారణం భగవంతుడు భావాన్ని గ్రహించేవాడు" అని ఆర్యోక్తి. భౌతికంగా మన్నవలో జరిగిన ఉదాహరణ మరొక రకంగా ఇతః పూర్వం వివరించినవి అన్నీ కూలంకషంగా ఆలోచిస్తే అమ్మ ప్రబోధంలో ఉన్నతమయిన తత్త్వసారం అవగతమవుతుంది. మంత్రశాస్త్రం, నాద శాస్త్రం, ఇంకా ఎన్నో శాస్త్రాలు చదివిన భద్రాద్రి తాతయ్యకి ఇంకా లోతైన తత్త్వం అంద చేశారు అమ్మ. మూల తత్త్వమే తానైనది అమ్మ. ఎన్నో నశించగా మిగిలిన శాస్త్రాలు పట్టుకున్న పుస్తకాల మనుషులు, అమ్మ ప్రబోధంలో ధర్మ సూక్ష్మం అవగతం చేసుకోలేరు.

70లో అమ్మ ఒక రోజున వున్నట్లు వుండి బాపట్ల సముద్రానికి ప్రయాణం కట్టింది. పులిహోర మరికొన్ని తినుబండారాలు చేసి తీసుకుని వెళ్ళాము. లారీలో కొందరు, కారులో అమ్మ, మరికొందరు జీపులోను ఈ విధంగా ఎంతో మంది బయలుదేరి వెళ్ళాము. నేను 700 బస్కీలు, 350 దండాలు, ఆ రోజు ఉదయం తీసి వున్నాను అటువంటి స్థితిలో బయలు దేరాను.గోపాలరావు గారి కొడుకు సదాశివ అప్పుడు చిన్నవాడు. వాడు ఆకలికి తట్టుకోలేక ఏడ్చాడు. అమ్మ వాడికి సమృద్ధిగా పులిహోర పెట్టింది. నేను , రావూరి ప్రసాదు మొదలైన కుఱ్ఱవాళ్ళం సదాశివ లాగ ఏడవక పోయినా. ఏడ్చినంత పని అయింది ఆకలి

నిరసంతో. మా స్థితి చూసి అమ్మ మమ్ములను పిలిచి మాకు కూడా సమృద్ధిగా ప్రసాదం పెట్టింది. ఎటువంటి స్థితిలోనైనా మన బాధతో తాదాత్మ్యం చెందేది అమ్మ మాతృ హృదయం సాక్షాత్కరిస్తుంది. తరువాత అమ్మ సముద్రం ఒడ్డున వున్న పల్లెకారుని ఇంట్లో స్నానం చేశారు. అప్పుడు పూర్ణానందస్వామీజీ నీళ్ళు అందించారు. "జయ హోమాతా" నామం వ్రాసిన ఇమామ్ ( ఈయన శ్యామ్ "అని పేరు మార్చుకున్నారు) కూడా ఆ సందర్భంలో వచ్చాడు. లారీ మీద వున్న ఇమామ్ "నేను స్వామీజీని, తాపస్వికుడ్ని అని అహంకారం లేకుండా సేవ చేస్తున్నారు" అన్నాడు. అందరం ఆనందంగా నామ సంకీర్తనలు చేస్తూ జయజయధ్వానాలు చేస్తూ బాపట్ల జేరాము. కన్యకా పరమేశ్వరి గుడి ప్రక్కనే వున్న బిల్డింగ్ ఎక్కి దర్శనం ఇచ్చారు అమ్మ. మరునాడు రెడ్డి పాలెం కాంతయ్య యోగి గారు ఆ క్రితం రోజు సిద్ధిపొందినట్లు కబురు వచ్చింది. అంటే సముద్రంలో అమ్మ ముద్దలు వదిలినది అందుకే అని నేను మనస్సులో అనుకున్నాను, ఆ క్రితం రోజు స్నానం చేసిన గుడిసెలోని వారికి అమ్మ తను కట్టుకున్న ఖరీదైన పట్టు చీర ఇచ్చిందని విన్నాను. అమ్మ దగ్గర కూర్చుంటే మరొకరితో అమ్మ అంటున్నది. "నేను వాళ్ళకి పట్టు చీర ఇస్తే వాళ్ళు "ఇంత ఖరీదైన చీర మేము కట్టుకుంటే దొంగతనం చేశామని తిడతారమ్మా? వద్దని వాళ్ళు అన్నారురా (..... అప్పుడు నేను " ఆ చీర ఇచ్చింది నేను. ముందు నేను దొంగని అవ్వాలి కదా? జిల్లెళ్ళమూడి అమ్మ దొంగతనం చేసి ఇచ్చింది అనాలి కదా?చూద్దాం, తీసుకోమని అన్నాను", అన్నారు అమ్మ. కొన్ని సందర్భాలలో దేవుడు కరుణించి ఇచ్చినా కొందర్ని లోకం ఎట్లా నిందిస్తుందో, అటువంటప్పుడు దైవం అయిన అమ్మ ఆ నిందని ముందు తనుగా ఏ విధంగా స్వాగతం పలికి సాటి వారికి ఉపశమనాన్ని, సంతోషాన్ని, ధైర్యాన్ని ఇస్తుందో తలుచుకుంటే ఆశ్చర్యం వేసింది. "భారం వహించే శక్తి ఎక్కడ వుందో, అదే మాతృత్వం" అన్నారు అమ్మ. నిందా భారం సహితం తన మీద వేసుకోవటానికి సంసిద్ధమయిన దివ్య మాతృత్వం అమ్మది. ఒకప్పుడు తన విషయం చెబుతూ ఎవరో అమ్మని గురించి మరొకరికి ఈ విధంగా చెప్పారట "అమ్మ యోగిని, నిమిషాల మీద సమాధ్యవస్థలు వస్తయ్" అని ఈ విధంగా చెప్పి తీసుకుని వచ్చారు. ఈ విధంగా అమ్మని గురించి విన్న వాళ్ళు చూడటానికి వస్తే అమ్మ తొక్కుడు బిళ్ళ ఆడుతున్నది. ఈ విషయాన్ని చెబుతూ "ఇంతగా నన్ను గురించి చెప్పి తీసుకుని వస్తే, నేను తొక్కుడు బిళ్ళ ఆడుతున్నానురా!" "ఈ (....వె(....యోగిని", అని వాళ్ళు ఆశ్చర్యంగా చూశారు. అని నవ్వుతూ చెప్పారు అమ్మ. పరిపూర్ణులైన మహాత్ముల భౌతిక స్థితి చూసి,

సాధారణ మానవులు అవగతం చేసుకోలేరు. జనకుని బాహ్యమయిన ప్రవర్తన. కృష్ణుని బాహ్యమయిన ప్రవర్తన చూసి దేవర్షి అయిన నారదుడు అంతటివాడు వాళ్ళు భోగలాలసులా? సాధారణ మానవులా? అని! భ్రమించాడని వింటాము. సాధన దశలని యోగం అని భ్రమిస్తారు చాలా మంది. పరిపూర్ణులకి వాటితో పని లేదు కదా? అందువలన వారి కృప వుంటే కాని వారిని గుర్తించలేము.

59 నుండి 68 వరకు సంస్థని చూసిన వారు, జిల్లెళ్ళమూడి నుండి వెళ్ళిన తరువాత కూడా సంస్కృత కాలేజి, కరెంటు, ఫోను వచ్చేటట్లు చేసిన వారు, మాతృశ్రీ ప్రెస్ తెచ్చినవారు, గవర్నమెంటులో సంస్థని పరిచయం చేసిన వారు, కొందరు నా పరిస్థితి ఏమిటి? నా కుటుంబం ఏమై పోతుందని, ఏమీ తోచని అయోమయావస్థలో వున్నటువంటి వారికి జిల్లెళ్ళమూడిలో ఆశ్రయం చూపించిన వ్యక్తి అయిన అధరాపురపు శేషగిరి రావు గారు 70-71లో అమరులై అమ్మలో విలీనం అయ్యారు. పొన్నూరులో వారి అంతిమ యాత్ర బ్రహ్మాండంగా వేలాది మందితో తిరునాల దేవుని ఊరేగింపు లాగ చారిత్రాత్మకంగా జరిగింది. జిల్లెళ్ళమూడి అంతా తరలి వెళ్ళింది. వారు వరంగల్‌లో అమరులైన సమయంలో వారికి చెంత నుండి దర్శన మిచ్చిన అనుభూతిని ఇచ్చినట్లు తెలియ చేశారు అమ్మ.

దరిదాపు ఇదే రోజులలో విశ్వజననీ పరిషత్ ఏర్పడింది. ఈ విధంగా సంస్థ నడవడికలో భౌతికంగా మరొక మలుపు వచ్చింది.

ఒక రోజు రాత్రి తొమ్మిది, పది గంటలకి అమ్మ చెంత మంచం దగ్గర, అమ్మ శిరస్సు వైపు క్రిందగా కూర్చున్నాను. అమ్మ కుడి చేయిని నాశిరస్సు మీద పెడుతూ దత్తన్నా (....అన్నది. రోజుకి వెయ్యి బస్కీలు, అయిదు వందల దండాలు తీసే రోజులవి. నేను బాగా ఆరోగ్యంగా వున్న యువకుడ్ని. అటువంటిది అమ్మ ఎప్పుడైతే అట్లా అంటూ చేయి పెట్టిందో ఎక్కడ లేని రొప్పు వచ్చింది. అది శరీరం అలిసేటట్లు పరుగిడితే, లేక ఏదైనా పని చేస్తే వచ్చే టటువంటి రొప్పు కాదు. చాలా విచిత్రంగా వున్నది. ఒక చాలా చిన్న బరువైన బస్తాని ఊపిరితో లోపల క్రింద నుండీ పైకి లాగితే ఎట్లా వుంటుందో, అటువంటి రొప్పు వచ్చింది. అటువంటి రొప్పు మళ్ళీ రాలేదు. ఇంతగా బస్కీలు, దండాలు తీసే నేను ఏమిటి? ఇట్లా రొప్పటమేమిటి ఏ కారణం లేకుండగ అని అనుకుంటూ, ఇతరులకి నా రొప్పు తెలియకూడదని తల వంచుకుని, కూర్చుని రొప్పుని ఆపే ప్రయత్నం చేసినా ఆగకుండా వచ్చింది. అట్లా

అయిదు నిమిషాలు వుంచి తీసేసింది అమ్మ. తరువాత మామూలుగా వుంది. ఈ విచిత్రమయిన అనుభూతి అమ్మ ఎందుకు ఇచ్చిందో అర్థం కాలేదు. చాలా కాలం తరువాత కొమరవోలు గోపాల రావు గారితో చెబితే కుండలినీని కదిలించింది అన్నారు. మరి నాకు అటువంటి లక్షణాలు కాని, స్థితి కాని లేదు కదా? అన్నాను. అది మనకు అర్థం కాదని వారు అన్నారు. అదేమిటో అర్థం కాలేదు. అవతార మూర్తులు ప్రదర్శనగా చేయరు. కాని వారు మనం తెలుసుకోలేనంతగా, చూడలేనంతగా సూక్ష్మదశలో మార్పు తెస్తారు. మార్పు, చేర్పులకి అతీతమయిన మూలతత్త్వం, కార్య కారణాలకి అతీతమయినది. అందువలన కార్య కారణాలకి అతీతమయిన ఆ అనుభూతిని మూలమయిన అమ్మ ఇచ్చినది. చాలా చిన్న సంఘటనగా కనపడిన ఈ అనుభూతిలో ఎంతగానో తాత్త్విక సూక్ష్మార్థం వుంది.

నెల్లూరు జిల్లా వెంకటగిరి నుండి పెంచలయ్య అనెడి సోదరులు వస్తూ వుంటారు. ఒక రోజు రాత్రి 9 గం. సమయంలో అమ్మ చెంత కూర్చుని తాను సత్యసాయి గారి చెంతకు వెళ్ళినప్పుడు జరిగిన సంఘటనను ఈ విధంగా వివరించారు. సత్యసాయి గారితో పెంచలయ్య గారు:-"స్వామీ మీరు చేస్తున్న ఈ పనులన్నీ ప్రభుత్వం చేయవలసినవి కదా? అది అట్లా వుంచి ఇదంతా తెర మీద బొమ్మలు అని ప్రబోధించారు కదా! సినిమా తెర మీద బొమ్మలను చూస్తున్నామనుకోండి. తెర దగ్గరికి వెళ్ళి, అందులోని పాత్రలకి ఇట్లా చెయ్యి, అట్లా చెయ్యి వద్దు అని చెప్పం కదా? ఉదాహరణకి ఓ విలన్ అట్లా చేయ వద్దు, ఓ గయ్యాలి ఇట్లా చేయ వద్దు" అని చెప్పంకదా? మరితెర మీద బొమ్మలుగా చూస్తున్న మీరు, ఇట్లా చేయండి అట్లా చేయండి, ఇది చేయ వద్దు, అది చేయ వద్దు అని ఎందుకు ప్రబోధిస్తున్నారు" అని అడిగారు. వెంటనే ఆయన "ఏం.....నువ్వు పొట్టి రౌడీ లాగ వున్నట్లు వున్నావ్" అని పెంచలయ్య గారి దగ్గరికి వచ్చారు. పెంచలయ్య గారికి సత్యసాయి గారు హిప్నాటిజమ్ చేస్తారేమోనని భయం పుట్టింది. కాని సత్యసాయిగారు పెంచలయ్య గారిని బయటకు నెట్టు కుంటూ వెళ్ళారు. ఇదంతా విన్న అమ్మ ఏమీ మాట్లాడ లేదు. నేను అన్నాను "అక్కడ ఏమి చెప్పారో ఆ స్థితి ఇక్కడ వున్నది" అన్నాను. అమ్మ నవ్వి ఊరుకున్నది. పెంచలయ్య గారు నేనన్నది సరిగ్గా వినిపించుకోలేదు. ఇట్లా అనేక రకాల వ్యక్తులు అమ్మ సన్నిధికి వచ్చి ఎన్నో రకాలుగా సమాధానపడే వారు. హైదరాబాదు రామచంద్రాపురం (బి.హెచ్.ఇ.ఎల్)లో పని చేసిన కె. సూర్య నారాయణ గారు బి.హెచ్.ఇ.ఎల్‌లో అమ్మ

ఉత్సవం చేసి జిల్లెళ్ళమూడి వచ్చి, అమ్మ నివసించిన 2 అంతస్తు పంచలో కొంత మంది సోదరులు కూర్చునప్పుడు ఈ విధంగా చెప్పారు. వారు 1964 పూర్వం అమ్మ చెంతకు వచ్చి, తరువాత కొన్ని సంవత్సరాలు రాలేదు. చీరాల ఐ.ఎల్.టి.డి. లో కొంత కాలం పని చేశారు. కమ్యూనిస్టు మూమెంట్ లో తిరిగారు. ఒకసారి వారి ఇంట్లో పెద్దలతో పుట్టపర్తి వెళ్ళారు. 20 రోజులు అక్కడ వున్నారు. వాళ్ళకి ఇంటర్వ్యూ లభ్యపడలేదు. ఆ సంవత్సరం శివ రాత్రికి సత్యసాయిగారు విభూది తియ్యటం-ఆత్మ లింగం తీయటం ఇటువంటివి చేశారు. ఆ ఇరవైరోజులు ఇట్లాగే బాహ్యమయిన మహిమలు చేయటం సూర్యనారాయణగారు చూశారు. ఎందుకో వారికి అవి నచ్చలేదు. ఎప్పుడెప్పుడు వెళ్ళిపోదామా! అని అనిపించిందట. కుటుంబ పెద్దల బలవంతాన అక్కడ వున్నారు. శివ రాత్రి నాడు ఇచ్చిన ఉపన్యాసంలో బాబా గారు "నేను అర్ధ నారీశ్వరుడ్ని, నాలో సగం శివుడు, సగం పార్వతీ ఉన్నారని" చెప్పారు. తరువాత వీరి కుటుంబ సభ్యులకు ఇంటర్వ్యూ లభ్యపడింది. అప్పుడు సూర్య నారాయణగారు, సత్యసాయి బాబా గారిని ఈ విధంగా అడిగారు "మీరు నాలో (అంటే సత్య సాయి బాబా గారిలో ) సగం శివుడు, సంగం పార్వతీ వున్నారు అన్నారు కదా? మాకు జిల్లెళ్ళ మూడిలో ఒక అమ్మ వున్నది. ఆమె.ని చాలా మంది పార్వతీ దేవి అని ఆరాధిస్తారు. మరి మీరు మీలో సగం పార్వతి వున్నదన్నారు ....పార్వతీ దేవి అక్కడ వున్నదా? ఇక్కడ వున్నదా? అని అడిగారు. అప్పుడు అర్ధనారీశ్వరానికి తాత్త్వికంగా బాబాగారు చెప్పబోతే, సూర్య నారాయణ గారు " నేను బండగా అడుగుతున్నాను, మూర్ఖుడ్ని, "మీరు గొప్పా? ఆమె గొప్పా? ఎవరు దేవుడు?" అని అడిగారు. వెంటనే బాబా గారు "ఆమెకేమి నాయనా! ఆమె ఆది శక్తి, మహా తల్లి" అని అన్నారు. తరువాత మళ్ళీ అమ్మ చెంతకు రావటం మొదలు పెట్టారు. అమ్మ యందు పరి పూర్ణ దైవ విశ్వాసంతో, చివరి క్షణం దాక జీవించారు. 74లో అమ్మ హైదరాబాదు వచ్చినప్పుడు అమ్మని రామచంద్రాపురం తీసుకుని వెళ్ళారు. ఏనుగ అంబారి ఎక్కించి, ఊరేగిస్తూ తీసుకుని వెళ్ళారు. అక్కడికి వెళ్ళిన వారందర్నీ ఎంతగానో ఆదరించారు. అక్కడ మహాజనం అమ్మని దర్శించారు.

కొన్ని రోజులు ఎక్కడ ఏ పని అవసరమయితే, ఆ పనిలో పాల్గొంటూ వుండే వాళ్ళం. తరువాత అమ్మ గదిలో అమ్మ బట్టలు ఇస్త్రీ చేయటం, రాత్రి పూట ఎక్కువగా అమ్మకి ఒళ్ళు పడుతూ వుండటం మొదలైన పనులు చేస్తూ వుండే వాడ్ని. అప్పుడప్పుడు పొట్లూరి సుబ్బారావు గారి చెంత సహాయం చేస్తూ, వారి అనుభూతులు వినే వాడ్ని. ఈ

రకంగా కొంత కాలం గడిచింది. పుట్టిన రోజు, అమ్మ కళ్యాణ దినోత్సవం, నవరాత్రులు మొదలైన పెద్ద పెద్ద ఉత్సవాలలో అనేక రకాల సేవలు చేసే వాళ్ళం. ఒక్కొక్కసారి అమ్మ వస్త్రాలు ఇస్త్రీ చేస్తూ వుంటే రాత్రి పదకొండు అయ్యేది. ఈ విధంగా కొంత కాలం గడిచింది. రామరాజు కృష్ణమూర్తి మొదలైన వారితో సంభాషణ చేసే వాణ్ణి. ఇట్లా కొంత కాలం గడిచింది.

## అమ్మ - నా అనుభవ చరిత్ర

## రెండవ భాగము

అమ్మను బహుముఖత్వంతో దర్శించటం, అనుభవించటం జరిగింది. దీనిలో ప్రస్తుతం వున్న వివిధ పండుగల సందర్భంగా ఏ విధముగా వున్నదో, నేను అనుభవించినది వివరిస్తాను. వెనక రెల్ల మందిరంలో వినాయక చవితికి దర్శనమిస్తూ అమ్మకి వేసిన గజమాలను ఒక దానిని ఒక భాగం ముందుకు లాగి దానిని తన మూతి నుండి తొండము లాగ ముందుకు పట్టుకుని క్రిందకి వదిలి, వినాయకుడు తొండమును కదిలిస్తున్నట్లు కదిలించింది. ఒకసారి అన్నదట "నేను అమాయకుడనైన, వినాయకుడను", అని ఈ విధంగా వినాయక చవితికి ఆ నామ రూప తత్త్వంతో తాదాత్మ్యం చెందేది. అమాయకుడు అంటే మామూలుగా లోకంలో, తెలియని తనాన్ని, మంచి వాడై యుండి ఏ సందర్భంలో ఎట్లా వ్యవహరించాలో తెలియని వ్యక్తిని అమాయకుడు అంటారు. లోకంలో వున్న ఈ అమాయకత్వం తనే, అనేటటువంటి వివరణ ఒకటి, రెండవది మాయలేనిది మాయ కానిది, ఈ మాయకు బద్ధం కానిది, అమాయ. అటువంటి వాడు అమాయకుడు, అంటే దీనికి అతీతమైన దైవాన్ని అని చెప్పటం.

నాగుల చవితినాడు నోట్లో పాలు పోసే వాళ్ళము. అనంతుని వ్రతం రోజున, నైవేద్యం ఇచ్చే సందర్భంలో "నేనే, అక్షరాలా అనంత పద్మనాభస్వామిని" అనేది. అట్లతద్ది, ఉండ్రాళ్ళ తద్దె మొ॥ పండుగల సందర్భంలో అమ్మ ఉయ్యాలలో కూర్చుంటే అందరూ ఉయ్యాల ఊపేవారు. ఆ సందర్భంలో అమ్మే బిడ్డయై, తక్కిన వాండ్లు తల్లులు, తండ్రులు అయ్యే స్థితి, ఇది భగవంతుని బిడ్డగా ఆరాధించే యశోదా భక్తి, ఇదంతా మనకు గమనిక లేనంత సహజంగా ఒక వేడుకగా జరిపించేది. అమ్మ నివసించే పర్ణశాల ముందు వెనక

సింగు పాలెం తాతయ్య గుండ్రంగా తిరిగే ఉయ్యాల వేశాడు. దానిలో అమ్మ కూర్చుని తిరుగుతూ వున్నది. అప్పుడు ఒక బిందె (చిన్నది) అమ్మ పట్టుకున్నదట. దానిలో అందరూ పాలుపోశారట అది ఎంతకీ నిండ లేదట. అప్పుడు అమ్మ "ఇంకా వెల్తి వున్నది. మీ పాలు నా పాలల్లో పోశారు. అందరినీ ఇప్పుడు తీసుకుని వెళ్ళటానికి సమయం లేదు. మళ్ళీ వస్తాను" అని పాలని ఉదాహరణగా తీసుకుని "పాలని కాచి, తోడు వేస్తే పెరుగు, దానిని మజ్జిగ చేసి చిలికితే వెన్న, దానిని కాస్తే నెయ్యి అవుతుంది. ఇదే జ్ఞానం అన్నదట. ఈ సంఘటన నేను స్వయంగా చూసింది విన్నది కాదు. ఏ ఆడంబరము లేకుండగ, ప్రశాంతంగా పని చేసుకుని పోయే వాడు, నిరంతరం నామం అంటే ఎక్కువ ఆకాంక్ష కలిగి, సత్వగుణ ప్రధానుడు అయిన భాస్కర్‌రావు గారు (సింగుపాలెం) చెప్పిన విషయాన్ని అందచేశాను. అంతఃకరణ భగవంతుని ఆవేదన అనే అగ్నితో కాగి స్థిరమైన అచంచల విశ్వాసమనే పెరుగుగా మారి, సదసద్వివేచన, లేక భగవంతుని స్మరణ, మననంతో మథిస్తే, ఇదే చిలకటము, ఏర్పడే దివ్యానుభూతే వెన్న, ఈ దివ్య భావం, అనుభూతి, సర్వత్రా వ్యాపించి అంతా అదే అనెడి జ్ఞానము నెయ్యి దీనినే అమ్మ "వెన్నని కాస్తే నెయ్యి, ఇదే జ్ఞానం" అన్నది. ఇంకొక విషయం "అందరికీ సుగతే, కాస్త ముందు, వెనక తేడా", అని అమ్మ చెప్పిన విషయాన్ని అందరం చెప్పుకుంటాము. ఆనాడు అమ్మ చెప్పిన విషయాన్ని బట్టి చూస్తే, మళ్ళీ వస్తానని అందరినీ ఇప్పుడు తీసుకుని వెళ్ళటానికి సమయం లేదని చెప్పినది. కనుక మళ్ళీ రావటం, తీసుకుని వెళ్ళటం అనేవి వున్నవనుకోవాలి. కాస్త ముందు, వెనకల తేడా, అన్నది కదా?. అఖండ కాల స్వరూపిణి అయిన అమ్మకి "కాస్త" అంటే మనకు 1000, లేక ఇంకా ఎంతైనా అవ్వవచ్చు. "సుగతే" సందేహం లేదు. "కాస్త ముందు వెనక తేడా, అన్నదానికి, "ఇప్పుడు అందరినీ తీసుకుని వెళ్ళటానికి సమయం లేదు. (అనటానికి) మళ్ళీ వస్తాను అని చెప్పిన విషయాన్ని రెంటినీ సమీకరిస్తే ఈ రెండు ఒకటే అనిపిస్తుంది.

శ్రీరామ నవమి సందర్భంలో రాముని గాంభీర్యత కనపడేది. కృష్ణాష్టమి సందర్భంలో ఉయ్యాల బల్ల మీద అమ్మని కూర్చోపెట్టి, చుట్టూతా తిరుగుతూ, పాటలు పాడుతూ సోదరీ సోదరులందరూ నృత్యం చేస్తుండేవారు. ఆ సందర్భంలో అమ్మ వెన్న చేతితో తీసుకుని ముఖాలకు, మూతులకు రాస్తూ నవ్వుతూ వుంటే కృష్ణుని లోని చిలిపితనమంతా ఉట్టి పడేది. నృశింహ జయంతికి తొట్టిలోదిగి స్నానం చేస్తూ అందరి మీద నీళ్ళు కొట్టేది. ఒకసారి ప్రస్తుతం బ్రహ్మాండం సుబ్బారావు వుండే భాగంలో అమ్మ వున్నది. అప్పుడే నృశింహ

జయంతి వచ్చింది. అమ్మ అటూ ఇటూ తిరుగుతూ, అందరి మీద నీళ్ళు కొట్టే సందర్భంలో నేను అక్కడికి వెళ్ళాను. అమ్మ నా వంక చూసిన చూపు నిదానంగా తల అటూ ఇటూ త్రిప్పుతూ వుంటే కాసేపు ఎవడు వీడు అన్నట్లు, ఒక దివ్యోన్మాదం కైపుతో చూస్తున్నట్లుగా వున్నది. అట్లా కాసేపు చూసి (కొద్ది క్షణాలు) నీళ్ళు కొట్టింది. నృశింహ తత్త్వంతో తాదాత్మ్యం చెందిన దివ్యోన్మాదం అనిపించింది. ఇది మామూలు ఉన్మాదం కాదు. సాధారణంగా నృశింహము అనేటప్పటికి ఉగ్రతత్వం, ఘోరంగా హిరణ్య కశిపుని సంహారము గుర్తుకి వస్తవి. కాని దివ్య మూర్తుల రోషతోషములు రెంటి వెనక ఆనందం, ప్రేమే వుంటయ్. ప్రకృతి సిద్ధంగా స్థూల దృష్టికి ఆ విధంగా చేయక తప్పదు. పైకి ఆ ఉగ్రమనేది ప్రదర్శనే కాని, సహజం కాదు. ఒకసారి ఒకాయన నృశింహుని ఉదంతం చెబుతూ, ప్రహ్లాదుని ఎత్తుకున్న నృశింహ మూర్తిని ఈ విధంగా అడిగాడట "స్వామి నా తండ్రి హిరణ్య కశిపునికి ముక్తిని ప్రసాదించమని" వెంటనే నరసింహుడు నవ్వుతూ "ప్రహ్లాదా! ఎప్పుడైతే నా చేయి నీ తండ్రి మీద పడిందో, ఆ క్షణాన నీ తండ్రితోపాటు మున్నేడు తరములు (21 తరములు) తరించినవి. ఇంకా నీతండ్రి వున్నాడను కున్నావా?" అని అన్నాడట. వున్నాడనుకున్నావా? అనే మాటని, మనం కేవలం స్థూల దేహంగా కాక, మనవారు చెప్పే సూక్ష్మ కారణ దేహం, చేసిన కర్మ ఫలం అనుభవించటం, అనే తత్వ విషయంగా తీసుకోవాలి. అంటే ఆ అవతారమూర్తి ప్రభావం వలన వానికి వున్న కర్మ ఫలం కూడా తొలిగింది అన్నమాట. కనుక ఆ ఉగ్రం వెనకాల వున్న అవ్యక్త కారుణ్యాన్ని మనం గ్రహించాలి. ఆనాటి అమ్మ చూపు స్థితి కూడా అటువంటిది. ఈ విధంగా ఆ తత్వం యొక్క తదాత్మ్యత వ్యక్తమయింది. ఆనాడు అమ్మ నవరాత్రుల సందర్భంలో వివిధ దేవతారూపాలలో దర్శనమిచ్చేది. మొట్టమొదటి రోజులలో అమ్మ తొమ్మిది రోజులు రోజుకి మూడు సార్లు వచ్చేది. ప్రతి రోజు మూడు పూజలు జరిగేవి. రెళ్ళ మందిరంలో పూజలు జరిగేరోజులలో 66-67 సం॥లలో కాళీ పూజ సందర్భంలో అమ్మ అతి తీవ్రంగా వున్నది. మరొకసారి 70 నవరాత్రులలో ప్రస్తుతం క్రింద వున్న పూజా వేదిక మీద, దుర్గాష్టమి పూజ జరుగుతున్నప్పుడు త్రిశూలాన్ని తనకు పూజ చేసిన పూలలో గుచ్చి, అక్కడ వున్న గజమాలను పైకి ఎత్తటం, తరువాత క్రింద పడేయటం, అప్పుడు త్రిశూలాన్ని రక రకాల భంగిమలలో త్రిప్పటం, వేదిక మీద అంత రౌద్రంగా వ్యవహరించటం అదే నేను చూసినంతలో అప్పుడు రామకృష్ణ ముందుకు వంగి ఏదో చేతితో సర్దబోతే ఎడమచేతిని విసురుగా విసిరింది. పూజ తదనంతరం ఒక్కసారి తనకు

వేసిన గజమాలలను లేచి వెనుకకు పడేసి త్రిశూలం, కిరీటంతో సహా అతివేగంగా గబగబా పైకి వచ్చింది. ఆ మరుసటిరోజు కాళీ పూజ. ఆ రోజు త్రిశూలం, కిరీటంతో వేదిక మీద అటూ ఇటూ తిరుగుతూ, చిరునవ్వుతో ఏ మాత్రం రౌద్రం, తీవ్రత లేకుండగ, పరమ సాత్వికంగా, ప్రశాంతంగా మల్లెలు విరిసినట్లు చిరునవ్వులతో వేదిక నాలుగు వైపుల తిరిగింది. నా ప్రక్కనే వున్న బ్రహ్మాండం సుబ్బారావు "ఏహెహె, ఏమి సీరియస్నే లేదు, అంతా చియర్‌ఫుల్ ఫేస్, కాళీకి వుండవలసిన ఆ ఇదే లేదు" అన్నాడు. ఆ క్రితం రోజున రౌద్రానికి , ఆ రోజు సౌమ్యతకి, ఆహ్లాదానికి పొంతనే లేదు. పైగా కాళీ పూజ రోజు. నాకు ఇదంతా చూస్తుంటేను, సుబ్బారావు అన్న మాట వింటుంటే ఏమి అవగతం కాలేదు. తరువాత రామకృష్ణ పరమ హంస పుస్తకంలో ఒక విషయం చదివాను. దానిలో పరమ హంసతో ఒకాయన (హల ధారి అనుకుంటా) ఈ విధంగా అంటాడు. "నీ కాళీ తామసిక దేవత, దానిని పూజించటం అనవసరం అని. ఎవరో దెబ్బ తిన్నారని, ఆ ఉదంతాన్ని వివరిస్తూ ఆ విధంగా అంటాడు. అప్పుడు పరమహంసకి ఏమి సమాధానం చెప్పాలో తోచక, అమ్మని అడుగుతానని అంటారు. అమ్మ దగ్గర సందేహ నివృత్తి చేసుకుని తిరిగి వచ్చి అతని భుజం మీద ఎక్కి నా అమ్మ త్రిగుణాత్మిక - సత్వ,రజ,స్తమో గుణాలు వున్నవని, వీటికి అతీతంగాను వున్నది. అదేనని కాళీ అంటే రౌద్రంగా, తీవ్రంగా వుండాలని లేదని, పరమ హంస చెప్పినట్లు త్రిగుణాత్మిక కనుక, ఆ క్రితం రోజు ఒక గుణం, మరుసటి రోజున సత్వ గుణ ప్రధానంతో ఆహ్లాదాన్ని విరజిమ్మిందని అనిపించింది. అమ్మ ఆ విధంగా తిరగటం, పరమ హంస చెప్పిన మాట మొ॥ వాటిని సమన్వయించుకుంటే ఆ తత్వం అవగతమయింది. కాళీ అంటే బయట ప్రపంచంలో భావించేటట్లు ఏక పక్ష భావం పోయి, సాత్వికంగా చిరుమంద హాసాలు విరజిమ్మేది కూడా కాళీయే అనే భావం ఏర్పడింది.

దీపావళి రోజున అందరితో సరదాగా తిరుగుతూ పువ్వొత్తులు, మతాబాలు, విష్ణు చక్రాలు కాల్చేది. ముక్కోటి ద్వార దర్శన సందర్భంలో విష్ణుమూర్తిగా దర్శన మిచ్చేది. జనవరి ఫస్టు కి కేకులు కోయటం, బిస్కెట్లు చక్కిలు, టీ ఇప్పించటం జరిగేది. సంక్రాంతికి భోగి పండ్లు పోసేది. మొట్టమొదట్లో అమ్మ బొట్టు పెట్టి, తీర్థమేసి, ఒక్కొక్కప్పుడు పండ్లు కొరికి కూడా ఇచ్చేది. అమ్మ పుట్టిన రోజు వస్తే అందరికీ బొట్టు పెట్టి, తలకి నూనె పెట్టి తలంట్లు పోయించేది. రాను రాను అవ్వన్నీ పోయినయ్ (అమ్మ స్వయంగా ) అట్ల తద్దె, ఉండ్రాళ్ళ తద్దె వస్తే అన్నం కలిపి ముద్దలు పెట్టేది. ఇవి అన్నీ పోయి తాను అందరికి మామూలుగా

చేసే వేడుకలలో భోగిపండ్లు పోయటం ఒక్కటే మిగిలింది. తల్లి , బిడ్డలకి పోసుకునే వేడుక, వయో బేధం లేకుండగ అమ్మకి అందరూ పాపలే కదా? అందరినీ వరుసలలో కూర్చోపెట్టి పోసేది. దీనికి సంబంధించిన దానిలో నా అనుభవం ఒకటి వివరిస్తాను. 85వ సంవత్సరం భోగి పండ్ల పండుగ రేపనంగా నన్ను శ్రీరామ మూర్తి (రాచర్ల) ని రాజమండ్రీ తీసుకుని వెళ్ళమని, అతని అన్నయ్య రాచర్ల లక్ష్మీనారాయణతో చెప్పింది. అతను నా దగ్గరికి వచ్చి "దత్తు! అమ్మ, నిన్నూ, మా తమ్ముణ్ణి రాజమండ్రి రేపు తీసుకుని వెళ్ళమన్నది. ఇప్పుడే కన్ఫరం అయింది అన్నాడు. నేను స్నానాల గది ప్రక్కనే వున్న అందరూ, టిఫిన్ , కాఫీలు తీసుకునే గదిలో కూర్చున్నాను.. ఎప్పుడైతే లక్ష్మీనారాయణ ఈ మాట చెప్పాడో నా మనస్సులో అతి తీవ్రమయిన వేదన బయలుదేరింది. అమ్మ స్వయంగా చేసే వేడుకలలో ఇది ఒక్కటే మిగిలింది. అటు వంటిది రేపు రాత్రికి తను అందరికీ భోగి పండ్లు పోస్తుంది. రేపు ఉదయం బయలు దేరమంటుందేమిటి? అని అనుకుని, ఏమైనా సరే అమ్మ చేత పండ్లు పోయించుకునే వెళ్ళాలి అని 10నిమిషాలు. తీవ్రంగా మనస్సులో అనుకున్నాను. చివరికి ఒక నిర్ణయానికి వచ్చాను. అమ్మ పిలిచి నాకు చెప్పినప్పుడు రేపు రాత్రికి భోగి పండ్లు పోయించుకుని కాని వెళ్ళనని మొండిగా అవసరమైతే చెప్పాలి అనుకున్నాను. ఇదంతా నేను లక్ష్మీ నారాయణతో అనలేదు. మనస్సులో నాకు నేనే తీవ్రంగా అనుకున్నాను. ఈ పదినిముషాలలో ఎందుకో, లక్ష్మీనారాయణ అమ్మ దగ్గరకు వెళ్ళటం, అతనితో అమ్మ "దత్తు వాళ్ళు రేపు భోగి పండ్లు పోయించుకుని వెళ్తార్లే! ఒక్క రోజేగా?" అని అన్నదట. కొద్ది సేపటిలో అతను వచ్చి నాతో ఆ విషయం చెప్పాడు. మరుసటి రోజు భోగిపండ్లు పోయించుకుని బయలుదేరాము. నా తీవ్రమైన వేదన తానే అయి మరుక్షణంలో మా ప్రయాణం మార్చటం జరిగింది. ఇంకొక ముఖ్యమైన విషయం ఏమిటంటే అమ్మ భోగిపండ్లు పోయటం అదే చివరిసారి. అమ్మ దైవంగా, అనంతంగా ఎప్పుడూ వున్నా నిరంతరం జరిగేది, జరిపించేది అమ్మే అయినా, మన ముందు ఒక మహోన్నతమైన దివ్య ప్రేమ మూర్తిగా, వ్యక్తిగా వున్న అమ్మ చివరిసారిగా పోయటం అదే. శివరాత్రికి పరమ శివునిగా దర్శన మిచ్చేది. ఆ సందర్భంలో అమ్మ పాదాలకి పాలు పోసి అభిషేకించే వాళ్ళు. ఒక శివరాత్రి సందర్భంగా పెద్ద గుడి, గర్భ గుడిలో అమ్మని కూర్చోపెట్టి పాలతో అభిషేకం చేశారు. అప్పుడు ఊరిలో నివసించే రాఘవమ్మ అనే వ్యక్తి పొయ్యి మీద వున్న వేడి వేడి పాలు ఒక గ్లాసులో తీసుకుని వచ్చి అమ్మ శిరస్సు మీద పోసింది. అందరూ పోస్తున్నారనే

ధ్యాసలో తను కూడా తొందరగా తీసుకుని వచ్చి అమ్మకి అభిషేకించుకోవాలనే భావంతో తాను చేస్తున్నపని గమనిక లేక తొందరలో ఆ పని చేసింది. అది కావాలని వేడి వేడి పాలు పోయటం కాదు. విదురుడు పండ్లు అవతల పారేస్తూ, తొక్కలు పెడుతూ తాను చేస్తున్న పని గమనిక లేక చేస్తే, కృష్ణ భగవానుడు స్వీకరించి ఆనందంగా తిన్నాడని వింటాము. అమ్మగా అవనీస్థలిపై ఆవిర్భవించిన దివ్యమూర్తి బిడ్డ తీసుకుని వచ్చి వేడి వేడి పాలను పోస్తే, ఆనందంగా స్వీకరించింది. అవతార మూర్తి, అందులోను మాతృ మూర్తి భక్తి మార్గంలో వివిధ సమర్పణలను ఏ విధంగా స్వీకరిస్తుందో తెలియ చేసింది. ఈ సంఘటన చూసిన వారు చెబితే అందచేస్తున్నాను. ఇక్కడ వుండి చూసినది కాదు. వస్తూ, పోతున్న రోజులు. ముక్కోటి నాడు అమ్మ శ్రీ మహా విష్ణువుగా ద్వార దర్శనం ఇచ్చేది. ఈ విధంగా వివిధ దేవ దేవీ రూపాలతో దర్శన మిచ్చి ఆ తత్వాన్ని తన నుండి వెలువరించేది.

72లో పుట్టిన రోజు, మే 5, అమ్మ కళ్యాణ దినోత్సవం అయిన తరువాత హైదరాబాదులో వుండే పరబ్రహ్మమూర్తి జిల్లెళ్ళమూడి వచ్చాడు. హైదరాబాదులో అమ్మ ఉత్సవాలు చేస్తున్నాడని విన్నాను. ఆ తరువాత హైదరాబాదులో జరిగే ఉత్సవాలకి, యార్లగడ్డ రాఘవయ్యగారు, ఆయన భార్య సుబ్బమ్మ గారు, పరుచూరు సుబ్బారావుని తీసుకుని హైదరాబాదు వెళ్ళమని చెప్పారు. అక్కడ అమ్మ ఉత్సవాలు 7 రోజులు జరిగినవి. శ్రీపాద, వీరమాచినేని, పర్నా జానకీదేవి, దుర్గా ప్రసాదు దంపతులు, భాట్టం శ్రీరామ మూర్తి, చంద్రమౌళి వెంకట కృష్ణ మొ॥వారు, ఇంకా కొంత మంది ఆ 7 రోజులు మాట్లాడారు. బి.హెచ్.ఇ.ఎల్. నుండి సూర్యనారాయణ బస్సు వేసుకుని వచ్చాడు. ( ఆ వారం రోజులలో ఒకరోజు) సాంబశివరావు బృందం నదీరా వ్రాసిన, అమ్మ బుర్ర కథ చెప్పారు. 15,20 మంది కుష్ఠ వాళ్ళు అక్కడ ఆ 7 రోజులు బాగా సేవ చేశారు. రాఘవయ్య గారు అమ్మ హరి కథ , సుబ్బారావు సక్కుభాయి హరి కథ చెప్పారు. రాధాకృష్ణరెడ్డి కచేరి జరిగింది. ( ఆ రోజు చివరికి ఇద్దరు వున్నారు) తరువాత రాధాకృష్ణరెడ్డితో చెబితే "ఆ ఇద్దరు కూడా ఎందుకు వున్నారు" అని నవ్వుతూ అన్నాడు. ముగింపు రోజున అమ్మ అంతరంగిక అనుంగు బిడ్డలైన బిక్షకులకు అన్నం పెట్టడం జరిగింది. రోజూ ఉదయం సుప్రభాతం, లలితా సహస్రనామ అర్చన, సాయంత్రం సంధ్యావందనం, ఉపన్యాసం జరిగేది. ఆ 7 రోజులు ఆ స్థలం, అమ్మ దగ్గరికి వచ్చే సోదరీ సోదరుల రాక పోకలతోను, నామ సంకీర్తన, అమ్మని గురించిన

సంభాషణలు, పాట్లూరి సుబ్బారావు గారు స్లైడ్స్ (అమ్మవి) ప్రదర్శనలతో కళ కళ లాడింది. అందరికీ టిఫిన్ - కాఫీలు, భోజనాలు మొ॥ వాటితో, అమ్మే అక్కడ వుండి జరిపిస్తున్నట్లు, అమ్మ సూక్తులతో అట్టలు, అంతా చూస్తూ, వింటూ , అనుభవిస్తుంటే, చిన్న జిల్లెళ్ళమూడి అనిపించింది. ఈ విధంగా అక్కడ జరిగిన తరువాత అక్కడ నుండి బి.హెచ్.ఇ.ఎల్. రామచంద్రా పురంలో సూర్య నారాయణగారు, అమ్మ ఉత్సవాలు జరిపారు.

బి.హెచ్.ఇ.ఎల్.లో మేము వెళ్ళిన తరువాత అక్కడ వున్న సోదరులను సమీకరించి, మాట్లాడి ఉత్సవాలు జరపటం జరిగింది. అక్కడ మేము 10 రోజులపైన వున్నాము. 3 రోజులు ఉత్సవాలు జరిగినవి. అక్కడ కూడా అంతా చిక్కడపల్లిలో జరిగినట్లు జరిగినవి. చివరిరోజు, ఒంటె మీద అమ్మ చిత్ర పటం పెట్టి ఊరేగించారు. ముగింపు రోజున భిక్షకులకు , విడిగా పనిచేసే వారికి (రోడ్లు వూడవటం మొ॥) అన్నం పెట్టడం జరిగింది. నేను, రావూరి ప్రసాదు మధ్యలో మెదక్ వెళ్ళాము. తక్కిన వారందరూ హైదరాబాదు నుండి మా కంటే ముందే వచ్చారు. నేను, పర్చూరు సుబ్బారావు, మరొక నెల రోజులకి వచ్చాము.

ఇక్కడికి వచ్చిన ఒక నెల రోజుల లోపల వరంగల్‌లో ఉన్న సోదరులు ఉత్సవాలు జరపటం జరిగింది. వరంగల్‌కి పాట్లూరి సుబ్బారావు గారు, గోపాలరావుగారు, వారి కొడుకు సదాశివ, మద్రాసు పార్థ సారథి అయ్యంగారు, రాచర్ల లక్ష్మీనారాయణ, రాఘవయ్యగారు, సుబ్బమ్మగారు, పర్చూరు సుబ్బారావు, నేను వెళ్ళాము. గుడియాత్తం చంద్రం వచ్చాడు. హైదరాబాదు నుండి శ్రీపాద, వీరమాచినేని, చంద్రమౌళి, వెంకట కృష్ణ, పర్సాదంపతులు, బి.హె.ఇ.ఎల్. నుండి సూర్యనారాయణ, మరి కొందరు వచ్చారు. అక్కడ కూడా అందరూ జిల్లెళ్ళమూడిలో వున్నట్లే భావించారు. స్లైడ్స్ ప్రదర్శన, ఊరేగింపు, పైన చెప్పిన వారి ఉపన్యాసాలు, భజన కార్యక్రమం, సంభాషణలతో అమ్మని గురించి తెలుసుకుంటూ అమ్మతో వున్నట్లుగా వుంది. పాలకొల్లు గోపి, శేషయ్య, మొ॥ వారు కూడా వచ్చారు. సాంబశివరావు బృందం బుఱ్ఱ కథ చెప్పారు. రాఘవయ్యగారు, సుబ్బారావు, హరి కథలు చెప్పారు. అక్కడి నుండి కూడా తక్కిన వారందరూ, వచ్చిన తరువాత నేను, సుబ్బారావు వచ్చాము. ఆ రోజులలో జిల్లెళ్ళమూడి ఆఫీసులో రామరాజుకృష్ణమూర్తి మేనేజర్‌గా వున్నాడు. ఆయన వచ్చిన కొత్తలలో ఇక్కడి వాతావరణాన్ని బాగా అధ్యయనం చేసాడు. ఇక్కడ సొంత ఇల్లు కట్టిన వాండ్లలో మొదటి వాడు. ఇతను అందరితో మాట్లాడటం, ఎవరు ఎవరి వల్ల

ఎట్లు బాధ పొందారు, ఎందుకు అసంతృప్తి చెందారు అనేది విడివిడిగా మాట్లాడే వాడు. కోన సుబ్బారావు గారు పబ్లికేషన్‌లో 69 నుండి వుండటం మొదలైంది. పబ్లికేషన్‌కి ఒక రూపాన్ని తెచ్చింది, ఒక వ్యవస్థని ఏర్పరచింది వారే. రోజుకి 12,13 గం. పని చేసేవారు. వచ్చిన వారికి పుస్తకాలలోని విషయాలు బాగా వివరించి చెప్పేవారు. ఇంగ్లీషులో అనర్గళంగా మాట్లాడేవారు. తెలుగులో మంచి కవిత్వం వ్రాసేవారు. టీచర్‌గా పని చేసి, రిటైర్ అయిన తరువాత ఇక్కడికి వచ్చారు. రంగన్న బాబు గారితో, బోదకాలు స్వామితో మంచి అనుభవాలు వున్న వ్యక్తి ఈయన. వసుంధర గారి తండ్రి. ఈవిడ అమ్మని వివాహం చేసుకున్న వ్యక్తులలో మొదటి వ్యక్తి . ఈయన కొడుకు కోన సత్యం ఇక్కడే గవర్నమెంట్ హోమియో డిస్పెన్సరీలో డాక్టర్‌గా వున్నాడు. అతని దగ్గర వుంటూ పబ్లికేషన్స్‌లో పని చేసే వారు. మాకు బాగా సన్నిహితం అయ్యాడు. ప్రేమగా ఉండేవాడు. ఇంకా అనేకమైన అనుభవాలు ఎన్నో చెప్పుకునే వారం. నేను, ప్రసాదు వీళ్ళతో కూర్చుని మాట్లాడేవారము.

తరువాత ఒక రోజు సాయంత్రం నేను, ప్రసాదు అమ్మ దగ్గరికి వెళ్ళాము. అప్పుడు ప్రసాదు "ఐదెకరాల్లో అరటి తోట వేద్దామనుకుంటున్నాము" అన్నాడు. తరువాత కొంత సంభాషణ సాగింది. ఏదైనా అదంతా స్వర్ణోత్సవం తరువాత కుదురుతుంది. అప్పుడు సాధ్యం కాదని అనుకున్నాము. తరువాత పనుల మీద గుంటూరు , అటూ ఇటూ వెళ్ళి రావటం జరిగింది. రాధాకృష్ణరెడ్డి అమ్మ దగ్గరకు వెళ్ళి, ఢిల్లీ అటంతా వెళ్ళి, నామం చేస్తూ కలెక్షన్స్ చేసుకుని వస్తామని చెప్పాడు. దానికి తనతో పాటు రావూరి ప్రసాదుని , నన్ను కలుపుకుని వెళ్తానన్నాడు. అమ్మ పిలిచి మాకు చెప్పింది. వున్నట్లుండి మా ప్రయాణం కొన్ని గంటలలో నిర్ణయింపబడింది. బాపట్ల నుండి హైదరాబాదు వెళ్ళి అక్కడి నుండి ఢిల్లీ వెళ్ళాము. ఢిల్లీలో ముసలి కంటి ఉషక్కయ్య వాండ్ల ఇంటికి వెళ్ళాము. అక్కడ నెల రోజుల పైన వుండి, నిర్మాణాత్మకంగా పని చేయాలనుకున్నాము. అమ్మకి సంబంధించిన సాహిత్యం, అక్కడ వారికి ఇచ్చి వచ్చాము. కొంత మంది సోదరీ సోదరులను కలిసి వచ్చాము. రామారావు గారు అనే సోదరుని ఇంట్లో, ఉషక్కయ్య వాండ్ల ఇంట్లో, పూజలు జరిగినవి. ఆ సందర్భంలో కొంత మంది సోదరీ సోదరులను కలిసి వచ్చాము. ఆ సందర్భంలో కొంత మంది అక్కడ సమావేశమైనారు. ఉషక్కయ్య వారికి విషయం వివరించింది. మాతో రామారావుగారు అనే వారు బాగా సహకరించారు. తిరిగి హైదరాబాదు చేరాము.

హైదరాబాదులో కొంత కాలం వుండి, సంవత్సరాది ముందు జిల్లెళ్ళమూడి చేరాము. చేరిన మరుసటి రోజే మన్నవ వెళ్ళివచ్చి, తరువాత వరంగల్ వెళ్ళాం. అక్కడ శేషయ్య లింగం గారు, మొ॥ సోదరుల సహకారంతో కొంత కలెక్షన్స్ చేశాము. అక్కడ నుండి శ్రీరామ నవమి మరుసటి రోజు ఇక్కడికి చేరాము. 73 ఏప్రియల్ 12 అమ్మ స్వర్ణోత్సవం. ఈ స్వర్ణోత్సవం అమ్మ అద్వితీయ సంకల్ప మహోత్సవం. అంతా వ్యతిరిక్త పరిస్థితిలో ఆ ఉత్సవం అనూహ్యంగా చాలా గొప్పగా జరిగింది. ఆంధ్రప్రదేశ్ ఉద్యమం ఉధృతంగా జరుగుతున్న రోజులవి. ఎక్కడ తిరగాలన్నా కాల్పులు, కొద్ది రోజులు పోస్టల్స్ కూడా సరిగ్గా జరగలేదు. బయటి వాతావరణం ఆ విధంగా వున్నది. సంస్థలో ఇక్కడ మా పరిస్థితిని గురించి వివరించాను కదా?. అటువంటి వాతావరణం లో అంతర్గతంగా వ్యక్తులను సమీకరించి, వివిధ కోణాలలో ఎవరిని ఎటువైపు పంపి, ఏ పని చేయించాలో, చేయించిన అమ్మ యొక్క ఆ ఘటనాఘటనా సామర్థ్యం వ్యక్తమయింది. రాష్ట్రంలో అనేక చోట్ల, ఇతర రాష్ట్రాలలో కొన్ని చోట్ల అనేక మంది కృషి చేశారు. ఇక్కడి స్థానికులని, ఇక్కడికి వచ్చే వారిని కొంత మందిని, అమ్మ వివిధ ప్రాంతాలకు పంపినది. 2 నెలలు ముందే సోదరులు, కొన్ని చోట్ల సోదరీ మణులు వివిధ ప్రాంతాలలో కృషి ప్రారంభించారు. కొన్ని వందల మంది ఆ సందర్భంలో జిల్లెళ్ళమూడిలో పని చేశారు. ఎంతో మంది వస్తువుల రూపంలో, డబ్బు రూపంలో సమర్పించారు. 13 అన్నపూర్ణాలయాలు ఏర్పాటు చేశారు. ఒక్కొక్క చోట వండేవారు, వడ్డించేవారు, అందర్నీ కలిపితే అన్ని అన్న పూర్ణాలయాలలో 7000 మంది పైన కృషి చేశారు. గవర్నమెంటు వైపు నుండి సహకారం బాగా వున్నది. ఎలక్ట్రిసిటి బోర్డు, వాటర్ సప్లై, పోలీసు, స్కౌట్ అన్నీ కూడా బాగా పని చేసినవి. పాల కేంద్రం నుండి పాల టాంకీలు వచ్చినవి. అలంకారం చేసేవారు, శుభ్రం చేసేవారు ఈ విధంగా అన్ని వైపుల నుండి ఎంతో మంది కృషి , సమర్పణ ఆ స్వర్ణోత్స వానికి మూలమైన పునాది. వీని కంతా శ్రద్ధా కేంద్రం, మౌళికమైన సంకల్పం అంతా అమ్మే. లక్షమంది ఒకే పంక్తిలో భోజనం చేయటమే కాక ఆ రోజు అర్ధరాత్రి 1,2, గం. వఱకు భోజనాలు జరుగుతూనే వున్నవి. 4,5 లక్షల మంది మొత్తం మీద భోజనం చేశారు. అమ్మ జీపులో అన్ని పందిళ్ళకి వచ్చి దర్శన మిచ్చింది. ఒక్క 13వ పందిరిలోకి అమ్మ రాలేదు. ఆ పందిరి లో నేను, ప్రసాదు, మన్నవ వాళ్ళు, ఆవరణలో పిల్లలు, ఇంకా బాగా సన్నిహితంగా వుండే వారు, అందరం వున్నాము. భోజనాల వఱకు 13 అన్నపూర్ణాలయాలు 25 ఎకరాలలో వేశారు. దిద్దుకూరు లక్ష్మీనారాయణ గారు కట్టెలు కొట్టే

చోటున వుండి స్వర్ణోత్సవం చూడకుండా, ఆ రోజు కూడా అక్కడే వుండి పోయాడు. ఏ స్వర్ణోత్సవ సందర్భంగా రోజుల తరబడి పని చేసి ఆఖరికి ఆ రోజు కూడా రాకుండా, చూడకుండా, ఉత్సవం చూడాలనే కోరిక విషయంలో సహితం నిరామయంగా వుండి సమర్పించిన కృషి (లక్ష్మీనారాయణ గారిలో) దీని వెనక వున్నది. అమ్మతో కొందరు "లక్ష మంది భోజనం చేయటానికి కావలసిన ఏర్పాట్లు చేయటం సామాన్యమా? ఎంతో గొప్ప!' అంటే, అమ్మ "వచ్చి కూర్చుని భోజనం చేసిన వారు కూడా గొప్పవారే!, ఇంత కృషి ఎవరి కోసం, వారందరూ వస్తేకదా?" అన్నది. చాలా మంది ఆ క్రితం రోజు రాత్రి కూడా "లక్ష మంది రారు" అనుకున్నారు. అటువంటిది ఆ మర్నాడు అనూహ్యంగా జన ప్రవాహం ఉధృతంగా వచ్చింది. మరునాడు వచ్చే జనాన్ని చూసి ఉన్న పదార్థాలు సరిపోతయ్యో లేదో అని సందేహం కలిగింది. కాని బోలెడు పదార్థం మిగిలింది. అమ్మ అన్నది "పాలు విరిగిపోతయ్ అని ఖంగారు పడ్డారు" అన్నది. అక్కడ వున్న నేను "అవి విరిచినా విరగనంతగా తోడుకున్నవి" అన్నాను. అంత గట్టిగా తోడుకున్నవి. "స్వర్ణోత్సవానికి ప్రకృతి మొత్తం సహకరించింది. లేకపోతే ఏ మాత్రం గాలి ఎక్కువ వీచినా, గాడి పొయ్యి మంట దగ్గర్నుండి, షామియానాల దగ్గర్నుండి, అన్నీ పడటము, మంట వలన పదార్థాలు దెబ్బతినటం మొ॥ జరిగేవి. ఆ పొలాల్లో వుండే తేళ్ళు, పాములు, పురుగుల నుండి ఎవరికీ ఏ ప్రమాదం చేయకుండగ సహకరించినవని, ఈ విధంగా మనుష్యులే కాకుండగ పంచ భూతాలు, జీవ రాసులు, సహితం సహకరించినవని, అమ్మ అన్నది. మిగిలిన పదార్థం డ్రైన్‌లో వేయమని చెప్పినది. భూచరాలు, జల చరాలు సహితం, ఆ ప్రసాదం తినాలని చెప్పింది. కనుక అమ్మ, స్వర్ణోత్సవానికి మానవులు, అన్నీ (జీవరాసులు) (ఆహారం తీసుకున్నవి) ప్రసాదం స్వీకరించటం జరిగినది. సమాజంలో అన్ని స్థాయిల వారు, అన్ని రంగాల వారు, ఒకే మహా సముద్రంలో కలిసిన అలల లాగ ఆ స్వర్ణోత్సవంలో కలిసి ప్రసాదం స్వీకరించటం ఒక సమతా మహోత్సవం అయింది.

" ఇయ మాత్మా పరమా నందః, పరమ ప్రేమా స్పదంయతః" ఈ ఆత్మ పరమ ప్రేమ స్థానం, కనుకనే ఆనంద స్వరూపము. అని పంచ దశీకర్త వివరణ. ఓ జోసి. సహోసి, బలమసి, అని గాయత్రీ ఆవాహనలో వున్నది. ఓజ శ్శక్తి తానయినది, సహనం తానయినది, బలం తానయినది. అందరిని కదిలించి ఎన్నో రకాలుగా బహు ముఖత్వపు సామర్థ్యంతో ఇంతటి మహోత్సవం, సహజ సహనం, పరికిస్తే వేదం ఘోషించిన "ఓ జోసి. సహోసి,

బలమసి" అమ్మే. అందరిపై, అన్నింటిపై పొంగిన, ఆ మాతృప్రేమ "పరమ ప్రేమాస్పదం యతః" అనే తత్వానికి ప్రతిరూపం అమ్మ అని, ఆ ప్రేమతో వెల్లివిరిసిన పరమానందంతో అమ్మ స్వర్ణోత్సవ సందర్శనానికి బిడ్డలకి వెళ్ళి దర్శన మివ్వటం. "ఇయమాత్మా పరమానందః" అనే దివ్యాత్మ తత్వాన్ని తెలియచేస్తుంది. సాధారణ మానవునికి ఒక అసాధారణతత్త్వం అవగాహన అవ్వటానికి, అట్టి భావం స్పందించటానికి, అమ్మ దివ్యత్వం సాక్షాత్కరించిన ఒక మహోన్నత దివ్యోత్సవం అది. ఇదే అమ్మ స్వర్ణోత్సవం.

ఈ విధంగా స్వర్ణోత్సవం జరిగిన మరుసటి రోజు కూడా తెంపు లేకుండగ వడ్డనలు మొ॥ జరిగినవి. అందరూ సొక్కి సోలి పోయారు. విపరీతమయిన పరిశ్రమతో అందరూ బాగా డసిలారు. ఆ మరుసటి రోజే నాకు జ్వరం ప్రారంభమయినది. నేను అదేదో వేడి చేయటమనుకుని, ఒకటి, రెండు రోజులు పట్టించు కోలేదు. తరువాత సత్యం హోమియో మందు ఇచ్చాడు. ఏ రోజు కారోజు టెంపరేచర్ పెరగటం మొదలు పెట్టింది. రావూరి ప్రసాదు ముఖ్యంగా రేయింపగళ్ళు విపరీతంగా నా కోసం శ్రమ పడి సేవ చేసాడు. తరువాత శేషు (గోపాల రావుగారి కూతురు) , మూడవ వ్యక్తి శ్యామ్, డి.ఎస్.పి. సత్యన్నారాయణ గారి అల్లుడు, నాకు బాగా సేవ చేశారు. నేను పందిట్లో క్రింద చాప వేసుకుని పడుకున్నాను. ఎక్కువగా కుఱ్ఱ వాళ్ళంతా నాతో పరిచయం వున్న వారు నాకు కావలసినవి చూసే వారు. ఈ విధంగా వారం రోజులు దాటింది. ఒక రోజు జ్వరం తీవ్రస్థాయికి పోయింది. టెంపరేచర్ విపరీతం అవటం వలన నాకు కండ్ల వెంట నీరు కారినవి. మాటలు తెలుస్తున్నవి. కాని చెప్ప లేని స్థితిలో వుంది. ఉడుకులం అవి వేసి వేయక ముందే ఆరిపోతున్నయ్ రావూరి ప్రసాదు, ధర్మామీటర్ పెట్టి టెంపరేచర్ చూశాడు. "ఎంత" అని నీరసంగా అడిగాను. ఆ ‹103 అని నాతో అన్నాడు. కాని అది 107 దాటింది. దాంతో బెదిరి పైకి పరుగెత్తుకుంటూ వెళ్ళాడు. పైన అమ్మకి చూపించాడు. చాలామందికి నన్ను క్రింద పడుకోబెట్టారని, దరిదాపు పోయాడని అనిపించింది. మామూలుగా రాని వారు కూడా చివరి చూపేమో అని చూడటానికి ఆ రోజు చాలా మంది వచ్చారు. పరబ్రహ్మ మూర్తి , రామచంద్రాపుర్కం సూర్యనారాయణ గారు, జొన్నాభట్ల వెంకట్రామయ్య గారు, అప్పుడప్పుడు డి.ఎస్.పి. సత్యన్నారాయణ గారు వచ్చి కనుక్కునే వారు. అమ్మ ధర్మామీటర్ చూసి కన్నీళ్ళు కారుస్తూ తనే మీటర్‌ని కడిగిందట. ఆ రోజు రాత్రికి అమ్మని బాపట్ల తీసుకుని వెళ్ళాలి అని అనుకున్నారు. కాని క్రిందకి దిగిన అమ్మ ఆ రాత్రి నా దగ్గరికి వచ్చింది. ఆ రోజు మధ్యాహ్నం అమ్మ చెప్పటం వలన నాకు

మంచం ఒకటి తెచ్చివేశారు. అమ్మ ఆ మంచం మీద కూర్చున్నది. నుదుట , చేయి పెట్టి చూసింది. నాలుక చూసి, పొట్ట నిమిరింది. అమ్మ రావటం, చూడటం, చూసిన జనం నేను పోబోతుంటే అమ్మ చూడటానికి వచ్చిందని అనుకుని పెదవులు విరిచారు. అమ్మ అరగంట నా దగ్గర కూర్చుని బార్లీ నీళ్ళు ఇవ్వమని చెప్పింది. దరిదాపు ఆ రోజు దాకా డాక్టర్ సత్యం నాకు వచ్చిన జ్వరం మలేరియా అని తేల్చు కోలేదు. అమ్మ బాపట్ల వెళ్ళటం మానుకుని మళ్ళీ పైకి వెళ్ళింది. ఆ రోజు రాత్రంతా నన్ను గురించే మాట్లాడిందట. చీర తడిసేటట్లు కన్నీరు కార్చిందని. మరునాడు సూర్యనారాయణ గారు చెప్పారు. మరుసటి రోజు ఉదయాన్నే జొన్నాభట్ల వెంకట్రామయ్య గారు నా దగ్గరికి వచ్చి "నేను వెళ్తున్నాను (గుంటూరు) రాత్రంతా అమ్మ నిన్నే తలుచుకున్నది., ఎంతగానో మెచ్చుకున్నది" అన్నారు. అన్నీ వింటున్నాను కాని, ఎవరికి నా భావాన్ని వ్యక్త పరచటానికి స్వరం రావటం లేదు. అందుకని, విని ఊరుకుంటున్నాను. మర్నాడు తగ్గింది. కాని మళ్ళీ మరుసటి రోజు వచ్చింది. రోజు విడిచి రోజు వస్తున్న జ్వరం అది. ఆ రోజు ఎందుకో సత్యం బాపట్ల వెళ్ళాడు. సత్యం వచ్చే లోగా "కామోక్విన్" టాబ్లెట్స్ తెప్పించి వేయించింది అమ్మ. ఒకటి, రెండు వేశారు. తరువాత సత్యం వచ్చి, అది వద్దని హోమియో మందు వేశాడు. సత్యం అన్నం పెట్టమని మాత్రం చెప్పలేదు. అప్పటికి 16,17 రోజులు అయిపోయినవి. అప్పుడు అమ్మ, బ్రహ్మాండం శేషు వాళ్ళ అమ్మ నాగమణికి చెప్పి నాకు పథ్యం పెట్టించింది. వేడి నీళ్ళ స్నానం చేయించింది. ఇన్ని రోజులు ఎక్కువగా ప్రసాదు , అంతకాకపోయినా దరిదాపు అట్లా శ్యామ్, శేషు కూడా నాకు అపారంగా సేవ చేశారు. మామూలు లోకంలో అనుకున్నట్లు ఏ రక్త సంబంధం లేని వీళ్ళు అంత అపారమైన సహాయం, సేవ చేయటం, విశ్వజనని అయిన అమ్మ అద్వితీయ మాతృవాత్సల్యంతో కూడుకున్న విశ్వ కుటుంబ ఆత్మానుబంధం. అది భాషకందని అవ్యక్త ఆత్మ బంధుత్వం. ఈ విధంగా 20 రోజుల తరువాత కోలుకోవటం జరిగింది. మే 1,2 తారీఖులకి కొంచెం లేవగలిగాను.నేను జ్వర పడి పథ్యం తీసుకున్న మూడవ రోజున పైకి వచ్చాను. అప్పుడు అమ్మ "నువ్వు చేయవలసిన పని ఏమీ లేదు. వాల్టికి అన్నం తిని, హాయిగా నిద్రపో. మే 5కి లేచి కూర్చునే ఓపిక వస్తే , కళ్యాణ దినోత్సవం చూడవచ్చు" అని అన్నది. "పథ్యం తీసుకుంటే నిద్ర పోకూడదని దుంప తెంచుతున్నారు, నిద్ర విపరీతంగా వస్తున్నది, వాళ్ళేమో పోవద్దంటారు" అన్నాను. అమ్మ "ఆ(ఆదేం కాదు, మన వాళ్ళు "నిద్ర పోకూడదూ?" అని వుంటారు. దానిని వీళ్ళు 'నిద్ర పోకూడదు" అంటున్నారు. అన్నది.

ఎందుకు పోకూడదూ?" "పోకూడదు" దీర్ఘంతో , దీర్ఘం లేకుండగ ఒకే పదాన్ని రెండు రకాలుగా ఉచ్ఛరిస్తూ, భావం స్పందించేటట్లు, చమత్కరిస్తూ, వున్న విషయం వివరించింది. ముఖ్యంగా జ్వరం పడినప్పుడు జ్వరంతో వున్నా సరే వేడి నీళ్ళు పోసుకోమనటం, పథ్యం తిన్నప్పుడు నిద్ర పొమ్మనటం, అమ్మలో ప్రత్యేకత. మే 5 అమ్మ కళ్యాణ దినోత్సవం. అదే రోజు బ్రహ్మాండం రవి కళ్యాణం కూడ. అడవుల దీవి వాస్తవ్యులు ఉమా మహేశ్వరరావు గారి కూతురు వైదేహిని, రవికి ఇచ్చి వివాహం చేయటం జరిగింది. తరువాత మే నెలలో విశ్రాంతి తీసుకుంటే కొంత కోలుకోవటం జరిగింది. జూన్‌లో బ్రహ్మాండం సుబ్బారావు అంతకుముందు అనసూయ విలేజ్ ఇండస్ట్రీస్ మొదలు పెట్టాడు. దానికి కోన వెంకటేశ్వర్లు ప్రెసిడెంట్‌గా వున్నాడు. కోనా వెంకటేశ్వర్లు తండ్రి (కోనా సుబ్బారావు గారికి) కోన వెంటేశ్వరరావు ప్రెసిడెంట్‌గా వుండటం ఇష్టపడలేదు. ఆ సందర్భంలో నన్ను, రావూరి ప్రసాదుని, ప్రెసిడెంట్, సెక్రటరీగా వుంచమని అమ్మకు చెప్పి, మమ్మల్ని అడిగాడు, బ్రహ్మాండం సుబ్బారావు. విడిగా అమ్మ కూడా చెప్పింది. అప్పటి నుండి రెండు, మూడు సంవత్సరాలు ఎక్కువగా ఆ పనిలో తిరగటం జరిగింది. తెనాలి, గుంటూరు, హైదరాబాదు, ఎక్కువగా తిరగవలసి వచ్చేది. ఇటుకల బట్టీకి, ఖాదీ బోర్డు ద్వారా లోన్ తీసుకుని రావటం జరిగేది. బయటి ఆఫీసులు, వాళ్ళు పెట్టే మడత పేచీలు, సినిమాలలో చూసినవి, ప్రత్యక్షంగా అనుభవించటం, చూడటం జరిగింది. మొత్తం రాష్ట్రంలో నర్సయ్యగారు అనే ఆఫీసర్ మినహా అందరూ డబ్బు కోసం పేచిపెట్టే వారేనని దానిలో అనుభవం వున్న ఒక వ్యక్తి ద్వారా తెలిసింది. ఈ విధంగా 1981 దాకా తిరగటం జరిగింది. తరువాత ఆ పని మీద తిరగలేదు.

స్వర్ణోత్సవం ముందు హైదరాబాదులో ఉత్సవాలు జరిపి, తరువాత చిత్తూరు జిల్లాలో బాగా కృషి చేసి, చైతన్యవంతంగా పని చేయటము చూసి, పరబ్రహ్మమూర్తిని, అతను ఇక్కడ వుండటానికి సిద్ధమయిన తరువాత, ఆఫీసులో మేనేజర్ స్థానం ఇచ్చారు. అతను వచ్చిన కొత్తల్లో ఒక సమావేశం పెట్టాడు. ఆ రోజు నేను ఇక్కడ లేను. వున్న కుఱ్ఱవాళ్ళు చాలా మంది వెళ్ళలేదు. జూన్, జులైలో ఇక్కడ అప్పర్ ప్రైమరీ స్కూలు ప్రారంభించారు. అనాది నుండి ఇక్కడికి వచ్చే మన్నవ వాస్తవ్యుడు భట్టిప్రోలు సుబ్బారావు, దానికి హెడ్ మాస్టర్‌గా వున్నాడు. ఒక వైపు కాలేజి, మరొక వైపు స్కూలు, దానిలోని, దీనిలోని పిల్లలతో ఆవరణం నిండిపోయింది. స్వర్ణోత్సవం జరిగిన తరువాత వచ్చే పోయే యాత్రికుల సంఖ్య విపరీతంగా పెరిగి పోయింది. టూరిస్టులు ఎక్కువగా వచ్చేవి. తెంపు లేకుండగ వడ్డనలు

జరిగేవి. ఆవరణలో పని పాటలు మామూలు కంటే ఎక్కువగా వుండేవి. లాలా మొ॥ ఒక రోజు మేము వడ్డన చేస్తుంటే నవ్వుతూ "అతిరథ, మహారథులు అందరూ దిగారే" అంటూ కలుపుగోలుగా మాతో పనిచేశాడు. తరువాత తెలిసింది. అమ్మ వీళ్ళందరితో "మమ్ములను కలుపుకుని మాతో పనిచేయమని" చెప్పిందట. అందుకని వీరందరూ ఆ విధంగా మారారు. పరబ్రహ్మ మూర్తితో కూడా అట్లాగే చెప్పింది. అతను చాలా భాగం కుష్ఠువాళ్ళు, ఇక్కడ పని చేసే రాజ్యలక్ష్మి అక్కయ్య, రాముడక్కయ్య, మొ॥ వారి అవసరాలు చూడటం . జ్వరం పడితే వచ్చి కనుక్కోవటం, చేస్తుండేవాడు. ఎక్కువగా సుబ్బారావు పని మీద బయట తిరగటం వలన ఇక్కడ వుండటము తగ్గేది. ఈ విధంగా నవ రాత్రుల్ల వరకు ఇక్కడ వున్నప్పుడు ఇక్కడి పనులు, బయటికి వెళ్ళినప్పుడు నేను సుబ్బారావు పనుల మీద తిరిగాను. నవత్రులలో అమ్మ దర్శనాలు ఇవ్వటం మొదలైంది. అప్పుడే మళ్ళీ నాకు మలేరియా జ్వరం తిరగబడింది. 105, 106 రావటం మొదలు పెట్టింది. సరస్వతీ పూజ రోజున క్రిందకి వచ్చిన అమ్మ, పూజానంతరం పైకి వెళ్తూ నా దగ్గరికి వచ్చింది. ఏ టాబ్లెట్స్ వేసుకోవాలో? ఏమేమి తీసుకోవాలో చెప్పింది. తగ్గుతుందిలే నాన్నా! అంటూ కాస్సేపు అమ్మనాదగ్గర కూర్చుని వెళ్ళింది. ఆ పది రోజులు నాకు కావలసినవి పై నుండి పంపించటం నా సంగతి కనుక్కోవటం, ఎవరు పండ్లు తెచ్చినా క్రిందకి నా దగ్గరికి పంపటం, ఈ విధంగా వేయి కళ్ళతో చూసేది. దశమినాడు కొంచెం పథ్యం తీసుకున్నాను. ఆ రోజు సాయంత్రం అంజన్ దానిమ్మ పండు తెస్తే, నాకు పంపింది. బ్రహ్మాండం శేషు వాళ్ళ ఇంట్లో ఆ రోజులలో కళ్యాణి వుండేది. నాకు ఆ రోజులలో ఆ పండు రసం తీసి యిచ్చింది కళ్యాణి. ఈ విధంగా అమ్మ కంటికి రెప్ప లాగ చూసుకున్నది నన్ను. విజయదశమి రాత్రికి కృష్ణా జిల్లాలో దర్శనం ఇవ్వటానికి మొదట విజయవాడ వెళ్ళింది. ఇదే సందర్భంలో అమ్మ బుఱ్ఱకథ వ్రాసిన, నదీరా, ఈ ఊళ్ళో ఎక్కువగా వుండే వాడు. అతను బుఱ్ఱ కథ చెప్పే 2 బృందాలను నిర్మాణం చేశాడు.

రావూరి ప్రసాదు - ప్రధాన కథకుడు, రావూరి లక్ష్మీ నారాయణ రాజకీయం పలికే వాడు, జొన్నాభట్ల రాముడు-హాస్యం , పై ముగ్గురు ఒక బృందం 2 ప్రధాన కథ- రావూరి వాణి, కొమరవోలు కుసుమ రాజకీయం కొమరవోలు రవి. హాస్యం. (వీడు అప్పుడు చాలా చిన్నవాడు).

పై రెండు బృందాలు అమ్మ బుఱ్ఱ కథ చెప్పారు. నవరాత్రులలో, విజయదశమికి కృష్ణా జిల్లా యాత్రకి వెళ్ళి పూర్తి చేసుకుని బాపట్లలో బ్రమ్మాండం రవి వాంళ్ళ ఇంట్లో వుండి, అక్కడి నుండి దీపావళికి జిల్లెళ్ళమూడి చేరింది అమ్మ . స్వర్ణోత్సవం తరువాత ఎక్కువగా ప్రయాణాలు చేసింది. 73 మే 11 అడవుల దీవి, 73 మే 12 రేపల్లెలో దర్శనాలు ఇచ్చింది. తదనంతరం, సెప్టెంబర్ 7 నుండి 9 వరకు నెల్లూరు లోను, ఆ జిల్లాలో కొన్ని చోట్ల దర్శనాలు యిచ్చి, 9 వ తారీఖు రాత్రి పరుచూరులో సిరిగిరి సుబ్బారావు ( అంధుడు) యింటికి వెళ్ళి రామాచార్యుల గారిని కూడా చూసి తిరిగి వచ్చింది. తరువాత దసరా పండుగ జరిగింది. అక్టోబర్ 7 నుండి 16 వ తారీఖు దాకా కృష్ణాజిల్లాలో దర్శనాలు ఇచ్చి, బాపట్లలో రవి వాంళ్ళఇంటిలో వుండి, దీపావళికి జిల్లెళ్ళమూడి చేరింది.

73, జూన్ 14 వ తేదీనాడు బాపట్లలో అగ్ని ప్రమాదం జరిగింది. తదనంతరం జిల్లెళ్ళమూడి నుండి బాపట్లకి పులిహోర పొట్లాలు మొ॥ కట్టి పంపటం జరిగింది. అమ్మ క్రిందకి వచ్చింది. దానిలో ఇక్కడ వున్న వాళ్ళందరూ పని చేశారు. స్వర్ణోత్సవం తదనంతరం ముఖ్యంగా ఆవరణలో అందరూ కలిసి ఒక పనిగా చేసింది ఇదే.

స్వర్ణోత్సవం తరువాత జూన్-జులై నెలలలో ( ఏ నెలో సరిగా గుర్తు లేదు) మన్నవ వెళ్తున్నాను. బాగా చీకటి పడింది. దొప్పల పూడి హైస్కూల్ దాటి వెళ్తుండగా కొద్ది దూరం అటూ ఇటూ తాటి చెట్లు ఉన్నవి. కొండ రాళ్ళు, గులకలేచి ఉన్న రోడ్డు అది. ఆ చీకటిలో కొండరాళ్ళు గులకరాళ్ళు కాళ్ళకి బాగా తగులతవి ఏమో చీకటిగా ఉన్నది అనుకుంటూ క్రొద్దిదూరం నడిచాను. ఉన్నట్లుండి మంచి వెలుతురు (ఫోకస్ లైట్) స్పాట్ లైట్ వేస్తున్నట్లు ఒక కాంతి ముందు వైపు పడింది. వెనక ఎవరో డైనమో లైట్ వున్న సైకిల్ త్రొక్కుతున్నట్లు శబ్దం వినపడింది. వెనక్కి తిరిగి చూస్తే ఏమీ లేదు. ఈ విధంగా వెనక శబ్దం, ముందు వైపు రాళ్ళు, గులక స్పష్టంగా కనపడుతూ వెలుతురు, మన్నవ చేరే దాకా పడింది. మన్నవలో అమ్మ అన్నయ్య రాఘవరావు గారి ఇంటికి వెళ్ళిన తరువాత ఆ వెల్తురు అమ్మ చూపించింది అనిపించింది. అంతవరకు ఆ స్మృతి లేదు.

తరువాత అమ్మ చెంత కూర్చుని మాట్లాడుతూ, ఎప్పుడూ సాధారణంగా నా అనుభవాన్ని అమ్మతో అనని వాడ్ని, ఈసారి అమ్మతో ఈ విధంగా అన్నాను, (లైట్ వేశావేమిటమ్మా!'' వెంటనే అమ్మ "లైట్ ఏవిట్రా!'' అంటూ సంభాషణ విషయాన్ని మార్చి

దాటవేసింది. కొంతకాలం సుబ్బారావు పని మీద బయట ఊర్లు, విడిగా ఇక్కడ వున్నప్పుడు వర్ధన మొ॥ పనులు చేయటం జరిగేది. మలేరియా వ్యాధితో 2,3 సంవత్సరాలు విపరీతంగా బాధపడటం జరిగింది. 74-75 సంవత్సరములో జరిగిన సంఘటన ఒకటి. నేను గుంటూరు వెళ్తున్నాను. ఆ సందర్భంలో అమ్మ దగ్గరికి వెళ్ళి, ప్రసాదం తీసుకున్నాను. నా ప్రసాదంతోపాటు, అమ్మ నందిపాడులో వున్న వీరాస్వామి గారికి కూడా ప్రసాదం ఇవ్వమని చెప్పింది. వారికి పసికర్లు వచ్చి, చాలా సీరియస్ అయింది. అందువలన ఆ సందర్భంలో వారికి ప్రసాదం, నా చేత పంపింది. నేను నందిపాడు వెళ్ళాను. కాని ఆయన అక్కడ లేరు. జబ్బు తీవ్రం అవ్వటం వలన గుంటూరు తీసుకుని వెళ్ళారని తెలిసింది. గుంటూరు నాజ్ థియేటర్ వెనకాల వున్న హాస్పిటల్‌లో వారిని చేర్చారు. నేను అక్కడికి వెళ్ళాను. వారు వున్న గది వైపు తిరిగాను. వారిని ఒక ఆడ మనిషి చేతితో నిమురుతున్నది. ఆ సందర్భంలో నేను కొంచెం, దూరంగా వున్నాను. నేను దగ్గరికి వెళ్ళేలోగా వీరాస్వామి గారు లేచి వెనక్కి చూడటం, ఆ ఆడ మనిషి వెళ్ళిపోవటం జరిగింది. ఈ సంఘటన జరగటం, నేను గదిలోకి వెళ్ళటం, దరిదాపు ఒకటి, రెండు నిమిషముల వ్యవధిలో జరిగింది. వారు వెనక్కి తిరిగేటప్పటికి నాకు ఎదురుగా మరొక వైపు నుండి ఏదో పని మీద బయటికి వెళ్ళిన వారి భార్య కృష్ణవేణమ్మగారు వచ్చారు. ఇటు వైపు నుండి నేను వెళ్ళాను. అప్పుడు వీరా స్వామిగారు మా ఇద్దరి వంక చూస్తూ ఆనందంగా ఈ విధంగా అన్నారు. "ఇప్పుడు అమ్మ నన్ను ముట్టుకుంది. ఆ చేతి స్పర్శ అమ్మ చేతి స్పర్శే! ఇక నాకు జబ్బునయం అవుతుంది." అన్నారు. నేను చూసిన ఆడ మనిషి వారి భార్య వచ్చిన దిశ నుండే వెళ్ళింది. రెండు, మూడు నిమిషములు వ్యవధి కూడా లేని ఆ సమయంలో హాస్పిటల్ మనిషి అయితే వారి భార్యకి కనపడాలి. కాని ఆవిడకి ఎదురుగా ఎవ్వరూ వెళ్ళినట్లు కనపడలేదు. నేను చూసినప్పుడు ఆ ఆడ మనిషి ఎవ్వరో గుర్తించ లేక పోయాను. గదిలోకి వెళ్ళిన తరువాత వీరాస్వామి గారు చెప్పిన తరువాత అంతకు ముందు నేను చూసినది అమ్మ అని తెలిసింది. తాను వచ్చినట్లుగా వారికి గుర్తింపు, అనుభవం ఇచ్చి, నాకు కనపడినప్పటికి అమ్మ అని గుర్తించకుండా కనపడి అదృశ్యమయినది. వారి భార్యకి అసలు కనపడలేదు. ఈ విధంగా దివ్యమూర్తి అమ్మ ముగ్గురికి మూడు రకాలుగా ఒకేసారి అనుభవం ఇచ్చినది. తరువాత వారికి ఆ వ్యాధి తగ్గినది.

అదే రోజులలో ఒకసారి నేను ఊరికి వెళ్తుంటే అమ్మ "చీరాల డాక్టర్ గారి దగ్గరికి పోయి పంచతిక్త కషాయం పాళ్ళుకనుక్కుని వచ్చి పెట్టుకొనమని చెప్పినది. నేను గుంటూరు

వెళ్ళి. గుంటూరు నుండి చీరాల వెళ్ళి డాక్టర్ గారిని వివరాలు కనుక్కుని జిల్లెళ్ళమూడి చేరాను. చేరిన రోజునే నాకు మలేరియా తిరగబడింది. అంటే ఏదో మాట వరసకి అన్నట్లు అన్నప్పటికి, ఆ కషాయం తొందరగా తయారు చేసుకుని తీసుకుంటే, జ్వరం రాదని, లేక మళ్ళీ జ్వరం తిరగబడబోతున్నది కనుక దానికి సంబంధించిన కషాయం చేసుకొనమని పరోక్షంగా సూచన ఇచ్చిందన్న మాట. ఒక వైపు సుబ్బారావు పని , మరొక వైపు ఆవరణలో ఏదైనా అవసరమయిన పనులు అందుకుంటున్నప్పటికి తీవ్రమయిన వేదనలో వున్న నాకు ఒక రకంగా ఆ రోజులు ఆధ్యాత్మిక సాధనకి వరం అయినది. ఆ రోజులలోనే ఎక్కువగా ఆధ్యాత్మిక గ్రంథపఠనం జరిగింది. రామతీర్థ, వివేకానంద, రామకృష్ణ పరమహంస, సాధన సామగ్రి కృష్ణ లీలా తరంగిణి, ఈ విధంగా అనేక పుస్తకాలు చదవటం జరిగింది. తరువాత గాయత్రీ మంత్ర జపం రోజుకి 300, 400 తో మొదలై, 10 వేలు, 12 వేలు దాక చేయటం జరిగింది. కూర్చుని, నడుస్తూ, పడుకుని గూడ జపం చేసే వాడ్ని. కళ్ళు మూసుకుని మంత్రం జపం చేస్తుంటే, సూక్ష్మమయిన దేవతా రూపాలు కనపడేవి. చేస్తున్నది గాయత్రీ అయినప్పటికి నృశింహస్వామి, కృష్ణుడు, రాముడు, శివుడు మొ॥ పురుష రూపములు కూడా నా ప్రయత్నం లేక కనపడేవి. ఒకరోజు కాలవ ఒడ్డున కూర్చుని రాత్రిపూట 8-9 గంటల మధ్యలో గాయత్రీ చేస్తున్నాను. ఉన్నట్లుండి ఒక అనుభూతి కలిగింది. నాభి స్థానం నుండి వర్తులాకారంగా ఏదోకటి తిరిగినట్లు తిరిగి నా అంతఃకరణం ఈ శరీరాన్ని వదిలి, దీనికంటే పైకి పోతున్నట్లు, ఒక నీటి బక్కెట్టును బావిలో ముంచి, పైన తాడుతో పైకి లాగుతుంటే మనకి నీరు నిండి, నీటిలో నుండి పైకి లాగుతున్న బక్కెట్టుకి ఏ విధమయిన బంధం, అనుభూతి వుంటుందో, ఆ రకంగా ఈ దేహానికి నాకు వున్నట్లు, పైకి ఎక్కడికో పీక్కు పోతున్నట్లు కొంత సేపు నా స్వాధీనం తప్పి తరువాత మామూలు స్థితికి వచ్చినట్లు ఒక అనుభవం అయినది. తరువాత ఆ అనుభవం గురించి అమ్మతో అంటే ప్రత్యేకించి ఏ వివరణ ఇవ్వకుండా చూస్తూ ఊరుకుంది. రాత్రిపూట చీకటిలో కాలవ ఒడ్డున పడుకొని ఒక్కొక్కప్పుడు జపం చేసే వాడిని. ఆ సందర్భంలో ఇదంతా, గాయత్రియే కదా? గాయత్రీ అంటే స్మరించే వాడ్ని కాపాడేదని అంటారు కదా? కనుక కాలవ ఒడ్డు అయితేనేమి?చీకటి అయితేనేమి? అనుకునే వాడ్ని. ఆ రోజులలో ఎవరైనా తెలిసిన వారు ఒక్క ప్రక్క నుండి పోతుంటే, వీళ్ళు నన్ను చూడకుండా వుంటే బాగుండును మాట్లాడించకుండా వుంటే బాగుండును. అనుకునే వాడ్ని. ఈ విధంగా రోజు మొత్తం మీద ఎక్కువ భాగం గాయత్రీ స్మరణతో మనస్సు వుండేది.

1975 జూన్‌లో ఆర్.ఎస్.ఎస్. సంస్థని నిషేధించటం జరిగింది. ఇక్కడ విపరీతంగా వేదనతో వున్న నా మనస్సు సంఘం వైపు తిరిగింది. బాపట్లలో జరిగిన సత్యాగ్రహంలో పాల్గొని 30 రోజులు కారాగారానికి వెళ్ళాను. ఆ సందర్భంలో ఇక్కడ నా ఆత్మీయులు మా బుజ్జన్నయ్య, రావూరి ప్రసాదు, రామరాజు కృష్ణమూర్తి, దేవరకొండపార్టు, ఒక రోజు గరుడాద్రి సుబ్రమణ్యం, గోపాల్ మొదలైన కొందరు జైలులో వున్న నన్ను చూడటానికి వచ్చి అమ్మ ప్రసాదం ఇచ్చారు. అది నాతో పాటు అరెస్టు అయిన తక్కిన 15 మందికి అందినది. అమ్మ వాత్సల్యానికి వారు కూడా సంతోషించారు. ఆ సందర్భంలో జైలుకి వచ్చిన వారు నన్ను "అమ్మతో ఏమి చెప్పమంటావు" అంటే "చెప్పవలసింది అంటూ ఏమీ లేదని చెప్పండి" అన్నాను. మా బృందం నాయకుడు పి. సాంబశివరావు గారు "జయప్రకాశ్ నారాయణ ఉద్యమం విజయం పొందాలని అమ్మ ఆలోచనలతో ఒక ఆలోచనగా సంకల్పించమని, పెట్టుకొనమని చెప్పండి" అన్నారు. జైలు నుండి విడుదల అయిన తరువాత చీరాల వెళ్ళి, జిల్లెళ్ళమూడి చేరాను. 75 డిసెంబర్ 30 రాత్రి నక్సలైట్ రైడింగ్ జరిగింది. బాంబులు వేసి నినాదాలు ఇచ్చారు. కొంత అమ్మ సొమ్ము దోచుకుని వెళ్ళారు. ఆ సందర్భంలో ఇక్కడి వారికి ఏ ప్రమాదం జరుగలేదు.అయితే మహాత్ములు సరాసరి ప్రతిఘటించకపోయినా వారిలోని సహనశక్తి అద్భుతంగా వారికి బుద్ధి చెబుతుందని ఈ సంఘటన ఋజువు చేస్తుంది. చెరుకుపల్లి పోలీస్ స్టేషన్ మీద దాడి చేసి నప్పుడుదొరకని నాయకులు సహితం సంస్థమీద దాడి చేసినప్పుడు దొరికారు. వారు తీసుకుని వచ్చిన కుఱ్ఱవాండ్లు సహితం దొరికారు. వాండ్లలో ఒకడ్ని రోజంతా మంచి నీళ్ళు కూడా ఇవ్వకుండా కొట్టి పోలీస్ వారు జిల్లెళ్ళమూడి తీసుకుని వచ్చారు. ఆ సందర్భంలో అమ్మ "వాడికి నీళ్ళు ఇచ్చి, అన్నం పెట్టండి ముందు" అన్నది. తరువాత ఒకటి, రెండు నెలలు గడిచినవి. మా నాన్నకి పెద్ద తనం చేత ఒంట్లో బాగుండక కబురు వస్తే, వెళ్ళాను. ఆ సందర్భంలో అమ్మ యాపిల్ పండు తీసుకుని తన వేలితో చిన్న ముక్కను తుంచి అవతల వేసి పండును నా ఒడిలోకి విసిరి వేసి"నాన్నకి ఇయ్యి" అన్నది. మా నాన్నని బాపట్ల నుండి రేపల్లె, అక్కడి నుండి తెనాలి తరువాత బందర్, హైదరాబాద్ తీసుకుని వెళ్ళాను. హైదరాబాద్‌లోవుండగా అమ్మ పుట్టిన రోజు వచ్చినందు వలన జిల్లెళ్ళమూడి వచ్చాను. తరువాత తెనాలి వెళ్ళితే, అక్కడ మా నాన్న వున్నారు. హైదరాబాదు నుండి అక్కడికి వచ్చారు. నా సర్వీస్ అవసరమా? అంటే అవసరం లేదన్నారు. మా రెండవ అన్నయ్యా వాళ్ళు . అందుకని అక్కడి నుండి తిరిగి

వచ్చాను. తరువాత సంఘం పని మీద నెల్లూరు, తిరుపతి, చిత్తూరు వెళ్ళి రెండు మూడు నెలలు పని చేసి జిల్లెళ్ళమూడి చేరాను. మా నాన్న బందరు వెళ్ళినట్లు, అక్కడ సీరియస్ అయినట్లు టెలిగ్రామ్ వస్తే అమ్మ దగ్గర ప్రసాదం తీసుకోవటానికి వెళ్ళాను. ఈసారి అమ్మ విభూది పండు, గంధం చెక్క, కుంకుమ ఇచ్చినది. తరువాత నేను బందరు వెళ్ళటం మా నాన్న పరమ పదించటం, అమ్మ ఇచ్చిన ప్రసాదంతో ఆయన అనంత అమృతత్వం పొందటం జరిగినది.

తరువాత జిల్లెళ్ళమూడిలో ఇ.సి. బాడి కొంత మారటం జరిగినది. అమ్మకి గడ్డ లేచి, నెల్లూరు తీసుకుని వెళ్ళారు. అక్కడ డా॥ శిష్టా సుబ్బారావు గారి ఇంట్లో అమ్మకి చికిత్స జరిగినది. అందరిని అమిత ఆదరణతో వారింట్లో చూశారు, వచ్చే, పోయే వారిని, వున్న వారిని అందరిని. అమ్మ నెల్లూరు నుండి తిరిగి వచ్చారు. 77లో రామకృష్ణ ఊరిలో లేనప్పుడు అమ్మ చెంత వుండి వచ్చే పోయే సోదరీ సోదరులకు అమ్మ దర్శనం ఇప్పించెడి కార్యక్రమంలో వున్నాను. అదే సమయంలో ఎన్నికలు జరగటం . ఆర్.ఎస్.ఎస్.మీద నిషేధం ఎత్తివేయటం జరిగింది. జిల్లెళ్ళమూడిలో ఆర్.ఎస్.ఎస్. శాఖ నడపటం జరిగింది. ఆ సందర్భంలో సంఘ సంస్థనుండి జిల్లెళ్ళమూడి సంస్థకి ఏదైనా సహాయం జరగాలనెడి ఆలోచన చేశాను. ఈ విషయం అమ్మకి చెప్పి ఆర్.ఎస్.ఎస్ కార్యకర్తలని కొందరిని అమ్మతో మాట్లాడించటం జరిగింది. ఆర్.ఎస్.ఎస్. కార్యక్రమాలు చుట్టు ప్రక్కల ఊర్లలో బాగా జరిపి ప్రచారం చేసే వాణ్ణి. అమ్మ దగ్గర సేవ చేసే వాణ్ణి దేశమాత, జగన్మాత సేవచేసుకొనుట జరిగింది. 1977 నవంబర్ 17న విలయతాండవం చేసే పెను తుఫాను వచ్చింది. ఆ సందర్భంలో అమ్మ గదిలో నేను తుఫాను ఆగేటంత వరకు వున్నాను. రావూరి లక్ష్మీనారాయణ, మతుకుమల్లి రాము, అమ్మ మారు తల్లి మన్నవ కామేశ్వరమ్మ గారు, గుంటూరు నివాసి అయిన పత్రిశాయమ్మ గారు, అమ్మగదిలో వుండెడి వసుంధర అక్కయ్య, మేము అయిదుగురం తుఫాను తీవ్ర మయినప్పటి నుండి ఆగేటంత వరకు వున్నాము. తుఫాను తీవ్ర మవ్వక ముందు, కొన్ని గంటల ముందు నాతో అమ్మ, "నీ పక్క బట్టలు సుబ్బారావు పాక నుండి తెచ్చుకో" అన్నారు. పరోక్షంగా బయటకి వెళ్ళటానికి వీలులేనంతగా, తుఫాను పెరగపోతున్నదని నాతో సూచనగా అమ్మ అన్నారు. కాని ఆఁ...ఏమంత ఖంగారులే అని నేను అనుకున్నాను. తరువాత తుఫాను పెరిగి తీవ్రమయితే కాని ఆ మాట ఎందుకు అన్నదో అర్థం కాలేదు. తుఫాను పెరగక ముందు రెడ్డి సుబ్బయ్య వచ్చి అమ్మతో "తుఫాను

వస్తుందని మాట మాత్రం చెబితే మేము జాగ్రత్త పడే వారం కదా?" అన్నాడు. అప్పుడు అమ్మ "చెప్పినప్పుడు ఏమి విన్నారు కనుక" అన్నారు. ఆ మాట విన్నప్పుడు నాకు ఈ విధంగా అనిపించింది.జ్ఞానులు జరగపోయేది చెబటం సహజం అయితే సాధారణ మానవునికి నిర్లక్ష్యం కూడా ఏర్పడవచ్చు. రాత్రి 7,8గం. ఆ ప్రాంతాల నుండి ఉత్తర దిశ నుండి దక్షిణ దిశకి గాలి తిరిగింది. అమ్మ ఎ.సి.రూమ్ ద్వారానికి వున్న తలుపులు వేసి లోపల గడియ, పైన బోల్టులు పెట్టినా గాలివేగానికి , తాకిడికి తలుపులు ఆగేటట్లు లేవు. గాద్రెజ్ మంచం కొంతకాలం అమ్మ శయనించినది పైన వుంటే, ఆ మంచాన్ని తలుపులకి ఆనించి పెట్టమని అమ్మ సలహా యిచ్చి ఎట్లా పెట్టాలో కూడా చూపించింది. అప్పటికి ఆగక పోతే నేను మంచానికి వీపు ఆనించి ఎ.సి. మిషన్ వున్న గోడకి కాళ్ళు పెట్టి తన్ని కూర్చున్నాను. గాలి వేగానికి మంచం తన్ను కుంటూ రావటం, నేను గట్టిగా తన్ని పట్టి మళ్ళీ వెనక్కి నెట్టడం ఈ విధంగా అయిదారు గంటలు కూర్చున్నాను. అట్లా నెడుతున్నప్పుడు అమ్మ "రామాంజనేయ యుద్ధం లాగ వున్నది" అన్నది. వసుంధరక్కయ్య, రావూరి లక్ష్మీనారాయణ, రాముడు, మెట్ల దగ్గర, ఇది కూడా ఉత్తర దిశగానే వుంటుంది. ఆ తలుపులు తన్నిపట్టి అక్కడ పోరాడుతూ వున్నారు. ఎప్పుడు ప్రకృతి విలయతాండవం చేస్తున్నా అమ్మ పకపకా నవ్వుతూ వుంటుంది. ఇప్పుడు కూడా అదే విధంగా నవ్వుతూ కూర్చున్నది. అమ్మ మారుతల్లి అమ్మతో "అ(....అ((....ఏవిటా అదరగండం, క్రింద చూడు జనం ఎట్లా పరుగులు తీస్తున్నారో? ఎట్లా కొట్టుకు పోతున్నారో" అన్నది. కొంత సేపైన తరువాత, మారుతల్లి మళ్ళీ "శాంతించు, శాంతించు", అన్నది అమ్మతో. అమ్మ "50 వేలు ఇయ్యి శాంతిస్తా" అన్నది. మనం ఎవర్నైనా ఏదైనా ఇవ్వుమన్నప్పుడు చేతివ్రేళ్ళని ఏ విధంగా కదిలిస్తూ అంటామో అట్లా అన్నది. "ఇస్తా, ఇస్తా శాంతించు" అన్నది అమ్మ మారుతల్లి. ఆ సందర్భంలో అమ్మ "శబ్దం పుట్టింది వాయువుతోనే" అన్నది. నేను "మనవాళ్ళు తత్త్వంలో శబ్దమే లక్షణంగా కలిగిన ఆకాశం అంటారు కదమ్మా?" అన్నాను. తరువాత నేను "వ్యక్తం అవుతుంది"అన్నాను. "అగ్గిపుల్లతో అగ్ని గీచినప్పుడు వ్యక్తమయినట్లు" అన్నాను. తరువాత అమ్మ అన్నది పరిపూర్ణంగా సరియైన పంచభూతాత్మకంగా ప్రబోధించిన తత్త్వ ప్రబోధం అని విశదమయింది. ఎందుకంటే పుట్టడం, వ్యక్తం అవ్వటం ఒకటే కదా? పూర్వీకుల ప్రబోధాలకి ఏ మాత్రం అటూ ఇటూ ఆలోచన లేకుండా మక్కీకి మక్కీగా వుండే పద్ధతి కాకుండగ స్వతంత్ర ఆలోచనతో వున్న విషయాన్ని వివరించే పద్ధతి అమ్మది. శబ్దమే లక్షణంగా కలిగిన ఆకాశం అన్నారే కాని, శబ్దం

పుట్టిందని ఇతః పూర్వం కూడా చెప్పలేదు. అయితే బయట లోకంలో జనం మరొక రకంగా చెబటం వలన అవగాహన లోపంతో జరుగుతున్న దానిని, వున్న దానిని, ఉన్నట్లు వివరంగా చెబటం లేదు. మరొక మాట అన్నది. "జ్వరం రావటం కూడా అవసరమే. భూకంపాలు వస్తే బొగ్గు అవ్వన్నీ ఇప్పుడు వున్న తరానికి అందుతున్నయ్. ప్రకృతిలో వచ్చే ఇటువంటి మార్పులన్నీ శరీరంలో వివిధ వాయువులు, పదార్థాలు ఒక చోటి నుండి మరొక చోటికి కదిలి సర్దుబాటు అవ్వటం లాంటిదని అర్థం వచ్చేటట్లు చెప్పారు అమ్మ. ఈ విధంగా ఆ సందర్భంలో శబ్దం పుట్టడం, ప్రకృతి యొక్క ప్రళయంలో జరిగే దేవిటి? మొదలైన విషయాలు వివరించింది. సీతారామాంజనేయ సంవాదంలో ప్రళయంలో పంచభూతాలు ఒక దానిలో ఒకటి ఏ విధంగా కలిసి పోతయ్యో వివరించి, ఇంత ప్రళయాన్ని బ్రహ్మతత్త్వం నిరామయంగా చూస్తుందని చెబుతారు. అదే విధంగా అమ్మ నవ్వుతూ కూర్చున్నది. భూత ప్రేత పిశాచాలు ఆకాశం దద్దరిల్లే వికటాట్టహాసం చేస్తున్నట్లు వుంటే, అమ్మ "శివతాండవం అంటే ఇదే"అన్నది తరువాత తుఫాను ఆగింది. రేకులు అన్నీ అప్పడాల ముక్కల లాగ ఎగిరి పోయి అరమైలు అవతల పడ్డయ్. విచిత్రం, అద్భుతమయిన విషయం ఏమిటంటే షెడ్డు క్రింద గేదెల్నీ, ఆవులను, దూడలని కడితే అంత వేగంగా వచ్చిన గాలికి ప్రతిరేకు ముక్క ఆ పశువులకి అటూఇటూ పడినవే కాని వాటికి తగలలేదు. వచ్చేది ప్రచండ ప్రభంజనం ఆగకపోయినా పశువుల దగ్గర్నుండి. ఎవ్వరికి ఏమీ కాలేదు. గ్రామస్తులు చాలా మంది ఆవరణలో తలదాచుకున్నారు. తుఫాను మొదలైన తరువాత అమ్మ చీర ఒకటి గాలికి ఎగిరినీళ్ళటాంకీ దిమ్మెలకి పట్టుకుని రెపరెప కొట్టుకుంటున్నది. అమ్మ " ఆ చీర అక్కడ వుంది! పోనీలే అని అయిదారు సార్లు అన్నది. ఎందుకు అన్నదో అర్థం కాలేదు. నేను ఆ గాలిలో వెళ్ళి మూడవ అంతస్తులో పిట్ట గోడకి, నీళ్ళ టాంకికి కలిపి బొంగులు, బద్దలతో ఏర్పాటు చేసిన నిచ్చెన ఒకటి వుంటే దాని మీద నుంచి టాంకీ మీదకి వెళ్ళాను. మరొక వైపు ఇంతకంటే వీలుగా సురక్షితంగా వచ్చే మార్గం వున్నది. నాకు తట్టలేదు. అమ్మ "అటు నుండి అటు, అటు" అంటూ చెయ్యి చూబిస్తూ అన్నది. కాని నేను మళ్ళీ ఇటు వైపు నుండే వచ్చాను. ఈ కాసేపట్లో తడిసి పోయాను. "ముద్దముద్ద" అన్నది అమ్మ. (తడిసి ముద్దయ్యాను కనుక) అంత గాలిలో ఆ నిచ్చెన మీద నుండి ఎట్లా వెళ్ళానో , ఎట్లా వచ్చానో నాకే అర్థం కాలేదు. ఆ విధంగా అమ్మ చీర తీసుకుని రావటం జరిగింది. తుఫాన్ ఆగగానే రావూరి ప్రసాదు కొంత మంది సహాయంతో స్టోర్స్ బాగు చేశాడు. మరునాడు రేకు ముక్కలన్నీ ఏరి

బాగు చేశారు. మరునాడు డాబా మీద తిరుగుతూ అమ్మ "ఏవి అందం, ఏవి అందం" అంటూ , ఊరుని , ఆవరణని చూపిస్తూ అన్నది. ఇళ్ళు చెట్లు , కూలి బీభత్సంగా వున్నది వాతావరణం, పరిపూర్ణులైన వారికి సర్వం సామాన్యమే. సర్వం సుందరం అయి భాసిల్లుతుంది. అందువలన మన దృష్టిలో వికారాలు, బీభత్సాలు, ఖేద మోదాలు, అన్నీ అమ్మకి సుందరమే. ప్రశాంత అనుభూతులే. యోగి యొక్క పరిపూర్ణ స్థితిని తెలియచేస్తూ "ఎడారి ప్రశాంతంలో అఖండ కర్మణ్యత, అఖండ రణ గణ ధ్వనిలో ఎడారి ప్రశాంతతని అనుభవిస్తాడు" అంటారు వివేకానంద. అదే విధంగా అమ్మ వర్తనం తెలియచేస్తుంది మనకు. మళ్ళీ రేకులు వెయ్యటం జరిగింది. పాకలు కూలిన చోట గాయత్రీ భవనం వచ్చింది. మెడికల్ సెంటర్ ప్రక్కన గదులు కట్టారు.

78 మే నెలలో ఆర్.ఎస్.ఎస్. శిక్షా శిబిరానికి వెళ్ళాను. ఆర్.ఎస్.ఎస్.ప్రచారక్ ఇ.సి. రామమూర్తి గారికి అమ్మ ప్రసాదం పంపటం జరిగింది.ఆర్.ఎస్.ఎస్ క్యాంపులో ఇ.సి. రామ మూర్తిగారికి ఆ ప్రసాదం అందచేయటం జరిగింది. అప్పుడు వారు "అమ్మ ప్రేమ నాపైన అపారంగా వున్నది. నా ప్రారబ్ధకర్మేనన్ను వదలలేదు" అన్నారు. వారి అపారమయిన వినయంతో కూడుకున్న సాత్విక భక్తికి మనస్సులోనే నమస్కరించాను. 30 రోజుల క్యాంపులో 15 రోజులు శాఖకి వెళ్ళి అన్ని కార్యక్రమాలలో పాల్గొన్నాను. తరువాత ప్లూరసీ వచ్చి, వైద్య విభాగ్‌లో మిగిలిన 15 రోజులు వుండి మా నాల్గవ అన్నయ్య ఇంట్లో నెల పదిహేను రోజులు వుండి డాక్టర్ నాగ భూషణం గారి దగ్గర హోమియో వైద్యం తీసుకున్నాను. తరువాత జిల్లెళ్ళ మూడి వచ్చాను. నేను అంతకముందు ఉన్నతీరుకి, తరువాత నా దేహ పరిస్థితి చూసి చాలా మంది ఆశ్చర్యపోయారు. ఒక గ్లాసు నీళ్ళల్లో చిన్న మట్టి గడ్డ వేస్తే ఎట్లా ఉంటయో, ఆ రోజులలో జిల్లెళ్ళమూడిలో నీరు వున్నది. అయినా కాని 4-5 రోజులలో నాలో వచ్చిన మార్పు చూసి గరుడాద్రి సుబ్రమణ్యం "నువ్వు వచ్చిన రోజుకి , ఇప్పటికి సహస్రం తేడా వుంది." అన్నాడు. "డ్యూ టు మదర్స్ యఫెక్ట్ యు ఆర్ హైలీ రికవర్డ్" అని జేమ్స్ అన్నాడు. కొంత కోలుకున్న తరువాత అమ్మ చెంత దర్శనాలు ఇప్పించటం, సుబ్బారావు పని మీద తిరుగుతూ వుండటం, ఆర్.ఎస్.ఎస్ పని మీద ఊర్లకి వెళ్ళటం జరుగుతూ వుండేది. విశ్వ హిందూ పరిషత్ జనరల్ సెక్రటరీ శివశంకర్ ఆప్టేజిని జిల్లెళ్ళమూడి తీసుకుని రావాలని తీవ్ర ప్రయత్నం చేశాము. వారు 70-71లో అమ్మని దర్శించారు. మాననీయ

సోదరులు కేశవశర్మ గారి ద్వారా ఆప్టేజీకి ఉత్తరాలు వ్రాయించాను. ఆప్టేజీ వస్తానని డేట్ కూడా ఇచ్చారు. కాని రాలేదు. అదే రోజు వారి అమ్మ గారు అమరులైనందువలన రాలేదని కేశవ శర్మ గారికి ఉత్తరం వ్రాశారు. ఈ విధంగా ఎన్నో ప్రయత్నాలు రక రకాలుగా చేశాను. భావం - తపన మిగిలిందే కాని భౌతికంగా ఫలితం లేకుండా పోయింది.

ఒకరోజు బాటనీ రీసెర్చి స్కాలర్ ఒకాయన అమ్మ దర్శనానికి వచ్చారు. అప్పుడు అమ్మ ఆయనని "చెట్టు ముందా, ఇత్తుముందా" అంటారు కదా? మీ సైన్స్ ఏమి చెబుతుంది, నువ్వు దాని వాడవి కనుక అడుగుతున్నాను" అన్నది. ఆయన "ఇది చాలా జటిలమైన ప్రశ్న అమ్మాౕ? " అన్నారు. "అమ్మ జటిలమైన ప్రశ్న" అని వెంటనే "నాకు ప్రత్యక్షమే ప్రమాణం, చెట్టే ముందు" అన్నారు. అమ్మ ఈ మాట చెప్పిన తరువాత బాటనీ లెక్చరర్ " ఈ మధ్య ఏక కణజీవి, బహు కణ జీవి, అని సైన్స్‌లో చెబుతున్నారు. ఏక కణజీవి ఒక్కసారిగా అట్లా అవుతుందేమో తెలీదు. ఇంకా మా రీసెర్చి లో తేల లేదని" అన్నారు. జన్మల విషయం వస్తే " నా అనుభవంలో లేవని" అన్నారు అమ్మ. ఆయనకి హస్త సాముద్రికం తెలుసునంటే "అమ్మ చేయి చూపించింది. చేయి చూసి "75 సంవత్సరాలకి శరీరం చాలిస్తారు అంటూ, ఏమో శాస్త్రం ప్రకారం చెప్పాను. మీరు దాన్ని మార్చుకుంటే మార్చుకుంటారేమో తెలీదని" అన్నారు. పరిణామ వాదంలో అమ్మ విప్లవాత్మక ప్రకటన చేశారు. తరువాత ఈనాడు పత్రికలో "జ్ఞాననేత్రం" అనెడి శీర్షిక క్రింద వచ్చిన విషయం చూస్తే అమ్మ చెప్పిన విషయం ఏ విధంగా సరియైనదో తెలిసింది. 1991 జూన్ 5, బుధవారం నాటి పత్రికలో వచ్చినది. దానిలో ఒక వాక్యం పొందుపరుస్తున్నాను. చైనా దక్షిణ భాగంలో సముద్రపు అడుగున లభించిన కొన్ని జీవుల అవశేషాలను గురించి ఈ విధంగా వున్నది" "అవశేషాలను విశ్లేషించాక ప్రాణుల పరిణామం కొన్ని దశలలో పరిణామ పరంగా ఆలోచిస్తే ఊహకందని విధంగాను, అకస్మాత్తుగాను వేగంగాను జరిగిందని అనిపిస్తుంది. ఇంకా వివరణ కోరుకుండే వారు "తాత్త్వికతేజః పుంజాలు" అనెడి గ్రంథములో చదువు కొనవలసినది. ఈ విధంగా విజ్ఞాన శాస్త్రజ్ఞులతో జరిగెడి చర్చలో ఎంతో నిగూఢమయిన విషయాలు వుండేవి. అమ్మకి జ్ఞానం సహజం కదా?. ఒకసారి గిద్దలూరు నుండి వచ్చిన తాగుబోతు, వ్యభిచారి అయిన డాక్టర్ అమ్మ చెంతకు వచ్చి "మీ అమ్మలన్నా, బాబాలన్నా నాకు విశ్వాసం లేదు" అని నిరసనగా మాట్లాడాడు. అమ్మ "నన్ను నమ్మనందుకు నాకేమి కోపం లేదు నాన్నా! నీకు నేను అమ్మని అయినా, కాకపోయినా, నువ్వు నాకు బిడ్డవే" అన్నది. "రా!

ఇటురా! కాలు విరిగి ఉన్నది. సరిగ్గా లేవు. మజ్జిగ త్రాగుతావా? రా!'' అన్నారు అమ్మ. క్రొద్ది క్షణాల్లో ఆ వ్యక్తి ముందుకు జరుగుతూ వచ్చి అమ్మ పాదాల చెంత వ్రాలిపోయాడు. ఏ ప్రతి ఘటన లేకుండ లొంగ తీసుకుండే అవ్యక్త దివ్యాకర్షణ అమ్మది. తరువాత క్షమించండి అని చెంపలు వేసుకుని, బొట్టు పెట్టించుకుని వెళ్ళాడు. ప్రసాదం కూడా తీసుకున్నాడు. ఆ విధంగా ఏ ప్రబోధం, ప్రతి ఘటన లేకుండగ ఆయనలో పరివర్తన రావటమే అమ్మ యొక్క నిక్కమయిన ఆధ్యాత్మికత. తరువాత కొంత కాలానికి ఆయన కాలు బాగుపడి కోలుకుని జిల్లెళ్ళమూడి వచ్చాడు. ఆయన వచ్చినది చలికాలంలో, క్రింద పబ్లికేషన్ దగ్గర రాత్రి రెండు గంటలకి నుల్చున్నాడు. నేను మధ్య అంతస్తు పోర్టికో నుండి ఆ సమయంలో చూశాను. కాని గుర్తు పట్టలేదు. మరునాడు అమ్మ దగ్గర కూర్చుంటే అమ్మ చెప్పారు. ''ఒరేయ్ గిద్దలూరు డాక్టర్ వచ్చాడురా! నువ్వు చూశావు'' అన్నది. ఆ సమయంలో అమ్మ పై గదిలో నిద్రపోతున్నది. నేను కూడా ఆయనని గుర్తుపట్టలేదు. అటువంటప్పుడు అమ్మ ఏ విధంగా చెప్పింది. నిత్య జాగృతం అమ్మ. అమ్మ భౌతికమయిన ఉనికికి, ఆత్మైక్య స్థితికి సంబంధం లేదు.

ఒకరోజు రాత్రి 8 గం.లకి అమ్మ, భాస్కరరావు అన్నయ్య, నేను. వాత్సల్యాలయం ముందు వున్న అరు బయట తిరుగుతూ వున్నాము. ఇంతలో క్రొత్త యాత్రికులు ఏడెనిమిది మంది వచ్చారు. అమ్మ స్నానం చేసి రావాలి. కాని అనుకోకుండ క్రొత్త వాళ్ళు రావటం వలన ఏమి చెయ్యాలో అర్థం కాలేదు. అమ్మ గబ,గబ ముందుకు 5,6 అడుగులు వేశారు. ఒక్కరెప్పపాటు కాలం లైట్లు పోయినయ్. ఆ చీకటిలో అమ్మ లోపలికి వెళ్ళింది. స్నానం చేసికాని క్రొత్త వారికి దర్శనం ఇవ్వరు అమ్మ. లైట్లు క్షణకాలం పొగొట్టి లోపలికి వెళ్ళి స్నానం చేసి వచ్చి క్రొత్త వారికి దర్శన మిచ్చారు అమ్మ. వాళ్ళు వెళ్ళిన తరువాత నేను అన్నాను ''క్షణ కాలంలో లైట్లు ఏవిటి అట్లా పోయినయ్?'' భాస్కర్ అన్నయ్య నవ్వారు. అప్పుడు అమ్మ అన్నది నా వైపు చూస్తూ ''ఏవిటో కూర్చుని చేస్తూ ఉంటాడు'' అని. తనకి ఇటువంటివి సర్వ సామాన్యం. ఛలోక్తిగా ఆ లీల నేను చేసినట్లు అన్నది. ''ప్రాణశక్తి ముందు విద్యుత్ శక్తి చాలా చిన్నది'' అని అమ్మ అంటారు. వీటికంతా మూలమయిన అమ్మకి ఇదంతా అత్యల్పం కదా! ప్రకృతి శాసనాలు ''సర్వశాసనోల్లంఘాయ నమః'' అయిన అమ్మకి వర్తించవు. అమ్మకి 80-81లో లంగ్ ఆప్సిల్ వచ్చింది. అప్పుడు సీరియస్ అయింది. వాత్సల్యాలయంలో ఎ.సి రూమ్‌లో ఆ సందర్భంలో డాక్టర్ ఇనజకుమారికి ఒక దృశ్యం కనపడింది. ఎ.సి.రూమ్‌కి తూర్పుగా వున్న కిటికీ నుండి చూస్తే చాకలి చెరువు కనపడుతుంది. అక్కడ ఒక తాటి చెట్టు

వున్నది. అమ్మ సీరియస్ అయిన సందర్భంలో మబ్బులు కమ్ముకుని వచ్చి విపరీతంగా గాలి వచ్చి చెట్లు ఊగి పోయినయ్. అమ్మ దగ్గర వున్న ఇనజకుమారికి చాకలి చెరువు ప్రక్కన వున్న తాటిచెట్టు క్రిందకి మీదకి పడుకుని లేపటం కనపడింది. అమ్మకి ఉపశమనం కలుగగానే క్రొద్దిగా చినుకులు పడి గాలి ఆగింది. ఆ తరువాత తాటి చెట్టు మామూలుగా నిలపడింది. ఈ విధంగా అమ్మ యొక్క స్వీయ స్పందనే సృష్టి స్పందన అయింది. తరువాత అమ్మ హైదరాబాదు వెళ్ళారు. అక్కడ చికిత్స జరిగింది. అమ్మకి తగ్గింది. తరువాత జిల్లెళ్ళమూడి వచ్చారు. అప్పుడు అమ్మ అన్నమాటని గరుడాద్రి సుబ్రమణ్యం ఈ విధంగా చెప్పాడు. "నా ఆత్మనే కాదు శరీరాన్ని కూడా అగ్ని దహింపచేయలేదు. గాలి ఆర్పి వేయలేదు, శస్త్రం ఛేదించ లేదు" అని. అమ్మ హైదరాబాదు వెళ్ళక ముందు ఇక్కడ ఇ.సి. బాడిలో మార్పు వచ్చింది. దినకర్ ఆర్గనైజింగ్ సెక్రటరీ, కామేశ్వరరావు గారు రెసిడెన్షియల్ సెక్రటరీ, రామకృష్ణ ప్రెసిడెంట్, టి.కేశవశర్మ, ఏ.యస్.ఆర్ ఆంజనేయులు గారు, రావినూతల రామచంద్రరావుగారు, బ్రహ్మాండం రవి, ఇట్లా కొంత మంది మెంబర్లుగా కొంత మార్పు వచ్చింది. నేను ఆర్.ఎస్.ఎస్. విస్తారక్‌గా కొంత కాలం పనిచేశాను. అప్పుడు గుంటూరులో తీవ్రంగా రుగ్మత వచ్చి జిల్లెళ్ళమూడి తీసుకుని వచ్చారు. ఇక్కడ 20రోజులు వుండి కోలుకున్న తరువాత హైదరాబాదు పంపిందిఅమ్మ. హైదరాబాదులో హోమియో మందు తీసుకుంటూ మా నాల్గవ అన్నయ్య ఇంట్లో వున్నాను, 1982 మార్చి నుండి డిసెంబర్ వరకు అప్పుడే అక్కడ అమ్మ పూజలు బాగా జరిగేవి. డిసెంబర్ నెలలో మూడు రోజుల సెమినార్ జరిగింది. హైదరాబాదు చిక్కడ పల్లి త్యాగరాయ గాన సభలో రాష్ట్ర వ్యాప్తంగా వున్న ఉపన్యాసకులు అమ్మ బిడ్డలు దానిలో పాల్గొన్నారు. సోదరుడు పరబ్రహ్మమూర్తి దానికి మౌళికమయిన సారధ్యం వహించాడు. మార్టూరు కాంతారావుగారు ఎక్కువగా ధన సహాయం చేశారు. అనేక మంది సోదరీ సోదరుల సహాయ సహకారాలతో వైభవంగా మూడు రోజులు సెమినార్ పూర్తి అయింది. అందరికి టిఫిన్, కాఫీలు, భోజనాలు ఏర్పాట్లు జరిగి, జిల్లెళ్ళమూడిని గుర్తు చేసినది ఆ ఉత్సవం. తరువాత 1983 జనవరి ఫస్ట్‌కి జిల్లెళ్ళమూడి చేరాను. అమ్మకి 60 సంవత్సరాలు నిండిన సందర్భంలో వజ్రోత్సవాలు వైభవంగా ఏర్పాటు చేశారు. ఆ సందర్భంలో నేను, గరుడాద్రి సుబ్రమణ్యం, గరుడాద్రి శేషయ్య గారు, రాయల సీమ వెళ్ళాము. అక్కడ అమ్మ సాహిత్యం ఇవ్వటం, అమ్మని గురించి చెబటం, వజ్రోత్సవాల గురించి నిధి వసూళ్ళు చేయటం జరిగింది. తరువాత వజ్రోత్సవాలకి జిల్లెళ్ళమూడి చేరాము.

1983 ఏప్రియల్ 6న వజ్రోత్సవాలు జరిగినవి. ఆర్.ఎస్.ఎస్. స్వయం సేవకులు కూడా ఆ సందర్భంలో సేవ చేశారు. 83 మే 5 తరువాత నాకు షుగర్ వ్యాధి బయట పడింది. వజ్రోత్సవాలలో 60 వేల మంది అమ్మ ప్రసాదం తీసుకున్నారు. షుగర్ వ్యాధితో పాటు ప్లూరసీ తిరగేసింది. అందుకని నర్సరావు పేటలో ఆయుర్వేదం మందు తీసుకోవటానికి వెళ్ళాను. అక్కడ మందు తింటూ వుండాలంటే ఎక్కడ వుండాలనేది నాకు ఊహ లేదు. ఆర్.ఎస్.ఎస్. కి సంబంధించిన సుబ్రమణ్యం గారనెడి వ్యక్తి ఇంటికి వెళ్ళాను. అక్కడ సంచీ ఒకటి పెట్టానే కాని అక్కడ వుండాలనేది ఉద్దేశ్యం లేదు. నర్సరావు పేట ఊర్లో ఒక సెంటర్‌లో వెళ్తున్నాను. అప్పుడు స్టేట్ బ్యాంకు ఆఫ్ ఇండియాలో జిల్లెళ్ళమూడిలో పనిచేసిన సుబ్రమణ్యం గారనెడి వ్యక్తి వెనకాల నుండి దత్తు గారూ...అని రెండుసార్లు పిలిచి, మూడవసారి కూడా పిలిచి నేను వెనక్కి తిరగకపోతే నేనుకాదని వెనక్కి వెళ్దామనుకుంటూ పిలిచారు. మూడవసారి పిలుపుకి వెనక్కి తిరిగాను. వారి దగ్గరికి వెళ్ళి నర్సరావు పేట ఎందుకు వచ్చింది చెప్పాను. వెంటనే వారికి నేను తరువాత వాళ్ళఇంటికి వస్తానన్నా వినకుండా రిక్షా చేసి ఆర్.ఎస్.ఎస్. కార్యకర్త ఇంటికి వచ్చి సంచీ తీసుకొనమని, వారి ఇంటికి తీసుకుని వెళ్ళారు. ఇది ఏ మాత్రం ఊహించని సంఘటన. వారు నర్సరావు పేటలో వున్నారని కూడా నాకు తెలీదు. అక్కడ వారుగా నన్ను పిలవటం, నన్ను వారు ఇంటికి తీసుకుని వెళ్ళటం మొదలైన సంఘటనలు అమ్మ ఏ విధంగా కల్పించేది వ్యక్తమయిన ఘట్టం ఇది. అక్కడ మూడునెలలు వుండి 83 నవంబర్‌లో జిల్లెళ్ళమూడి చేరాను. సుబ్రమణ్యంగారు అనుపమానమైన వ్యక్తిత్వం కలిగిన మహానుభావుడు. వారిని ఆ విధంగా కలుస్తానని, వారి ఇంట్లో అంత కాలం వుంటానని ఏ మాత్రం ఊహించని అఘటన ఘటనా సంఘటన ఇది. తరువాత 83 నవంబర్‌లో జిల్లెళ్ళమూడి చేరాను. 80 డిసెంబర్‌లో అమ్మ అన్నయ్య గారైన మన్నవ రాఘవరావు గారు జిల్లెళ్ళమూడి లో అమరులై అమ్మలో లీనం అయ్యారు. 81 ఫిబ్రవరి 17వ తారీఖున అమ్మ భర్తగారైన బ్రహ్మాండం నాగేశ్వరరావుగారు అమరులైనారు. నాన్నగార్ని ఆలయంలో అమ్మ ప్రతిష్టించింది. అప్పుడే అనసూయేశ్వరాలయం అని పేరు పెట్టారు అమ్మ. 83-84 మధ్యలో కొంత కాలం గుంటూరు, నర్సరావు పేట వెళ్ళి నర్సరావు పేటలో మందు తీసుకున్న డాక్టర్ నరసింహారావు గారి దగ్గర మందు తింటూ వున్నాను. కాని షుగర్ తోపాటు ప్లూ రసీ తీవ్రమయింది. 84 మే 5 నుండి అమ్మ తీవ్రంగా వత్తిడి చేయటం వలన ఆయుర్వేదం, హోమియో మందు మానివేసి ఇంగ్లీషు మందు

మొదలు పెట్టాను. 84-85 మధ్యలో రామ నామం సప్తసప్తాహాలు, గాయత్రీ యాగం, ఊర్లో వారికి వస్త్రాలు పెట్టుకోవటం, మొదలైన కార్యక్రమాలతో ఆవరణం హోరెత్తి పోయింది. నామ వ్యాఖ్యానముతో రామ లీలలు, భక్త మార్కండేయ, అమ్మ లీలలు (అమ్మ జీవిత ఘట్టాలు) మొదలైనవి ప్రదర్శించారు. ఈ కార్యక్రమాలలో వందలాది మంది పాల్గొన్నారు. అమ్మ అందరి ఇండ్లకి వెళ్ళింది. విద్యార్థుల, విద్యార్థినీ గదులకి కూడా అమ్మ వెళ్ళారు. అమ్మ బ్రహ్మాండం రవి ఇంటి మీద కట్టిన గదిలో ఆ సమయంలో వున్నారు. 85 అమ్మ పుట్టిన రోజుకు ముందు శ్రీరామ నవమికి అమ్మని మేనాలో తీసుకు వస్తుంటే మేనా విరిగింది. ఇదంతా అమ్మ రవి వాండ్ల ఇంటి మీద వున్నప్పుడు జరిగింది. తరువాత అమ్మ పుట్టిన రోజు, అమ్మ కళ్యాణ దినోత్సవాలు పూర్తి అయినది. అమ్మ వజ్రోత్సవాలకి 7వ మైలు వద్ద ఆర్చి కట్టడం జరిగింది. ఆ ఆర్చి 85లో ఏప్రియల్ నుండి పడిపోతుందేమో అన్నట్లు ఊగిపోవటం మొదలు పెట్టింది. చాలా మంది చూసి వచ్చారు. నేను, మతుకుమల్లి రాము కూడా చూసి వచ్చాము. 84 నవంబర్లో అమ్మ గుడి గాలి గోపురం పూర్తి అవ్వటం, మొదలైనవి చూసి అమ్మ మహాసిద్ధికి ఏర్పాట్లేమోనని చాలా మందికి ఖంగారు మొదలైనది. గుడి మీద కలశ స్థాపనకి అమ్మ వెళ్ళలేదు. లక్ష్మణ యతీంద్రుల వారిచే ఆ కార్యక్రమం జరిగింది. అమ్మ వాత్సల్యాలయం నుండి ఆ కార్యక్రమాన్ని చూశారు. రామ నామ సప్త సప్తాహాలు, గాయత్రీ యాగం పూర్తి అయిన తరువాత రుద్రయాగం జరిగింది. ఆ సందర్భంలో ఒక కుక్కకి అమ్మ బొట్టు పెట్టి పూల మాల వేసి పూలు చల్లింది. తరువాత అది ఆవరణం వదిలి వెళ్ళింది. మళ్ళీ కనపడలేదు. నాన్న గార్ని ఆలయంలో ప్రతిష్ఠించిన తరువాత అమ్మ తాను మహాసిద్ధి పొందిన తరువాత తన దివ్య దేహాన్ని కూడా అక్కడ ప్రతిష్ఠించమని చెప్పి ఆలయానికి అనసూయేశ్వరాలయం అని పేరు పెట్టారు. సప్త సప్తాహాలు మొదలైన కార్యక్రమాలన్నీ అమ్మ ఏ రోజు కారోజు పెండ్లి లాగ జరిపించారు. టిఫెన్స్, కాఫీలు, లడ్లు మొదలైనవి సమృద్ధిగా తన బిడ్డలకి పెట్టుకున్నారు అమ్మ. అమ్మ రవి వాండ్ల ఇంటిపై వున్నప్పుడు కొండమూది రామకృష్ణతో ఈ విధంగా అన్నారు. "ఇవ్వన్నీ ఇట్లాగే జరిపించండి. బట్టలు పెట్టడం, భోజనాలు పెట్టటం, మొదలైనవి. ఇక నుండి నేను కాదు తల్లిని. ఈ సంస్థే మీకు తల్లి" ఈ విధంగా తను ఒక వ్యక్తి కాక ఉజ్జ్వల తత్త్వాదర్శమని' తెలియ చేశారు. "రూపం పరిమితం, శక్తి అనంతం అని ఏనాడో చెప్పారు. తరువాత అమ్మ వాత్సల్యాలయం వచ్చారు. అమ్మకి విశ్వ కోటిలోని బాధలన్నీ బిడ్డలైనట్లు, బాధల్ని

పంపించెయ్యమ్మా! అంటే, "అవి కూడా మీ లాగ వదిలి వెళ్ళలేమంటున్నాయ్" అనే వారు. అదే విధంగా విశ్వంలోని బాధలన్నీ విశ్వంబరధరి అయిన అమ్మ దేహంపై తాండవం చేసినయ్యా అన్నట్లు అమ్మ దేహం దూదిని ఏకినట్లు అయినది. దేవగణ, సమాజ సంరక్షణ కోసం దధీచి యోగాగ్నితో దేహాన్ని దహించి ఇచ్చారని చెబుతారు. సకల విశ్వ శ్రేయస్సు కొసం మాతృ వాత్సల్య ప్రపూర్ణమయిన త్యాగాగ్నితో అణువణువు కణకణము జ్వలింప చేసి దహింప చేసినది అమ్మ. 85 జూన్ 2 వ తేదీ నుండి 12 వరకు ఆ విధంగా అమ్మ భౌతికంగా వున్నారు. జూన్ 12 రాత్రి 10-30 గం.కి మహాసిద్ధి పొందారు. జూన్ 13 జనకోటికి దర్శనం జరిగింది. జూన్ 14 న ఆలయ ప్రవేశం చేయటానికి వాత్సల్యాలయం నుండి అమ్మ దివ్య దేహం బయలుదేరపోతున్నది. అప్పుడు గదికి ఇవతలగా వున్న నేను మనస్సులో అమ్మతో వుండాలని తీవ్రంగా అనుకున్నాను. అమ్మకి స్నానం చేయించి, అలంకరించి బయటకు తీసుకుని రావాలని అనుకుంటున్నప్పుడు నేను ఒక వైపు వుండి, మన్నవ బుచ్చిరాజుని మరొకవైపు పట్టుకొనమని, ఇంకొక వైపు రామకృష్ణ మరి కొందరు పట్టుకుని బయటికి తీసుకుని వచ్చి మంచం మీద పడుకోపెట్టాము. నన్ను రామకృష్ణ "అటు వెళ్ళి కూర్చొనమని" అన్నాడు. ఇటు ప్రక్కగా కూర్చున్న నాకు అమ్మతో వుండాలని తీవ్రమయిన కోరికగా వున్నది. అమ్మ మంచం చుట్టూ గుమ్మడి కాయలు, కొబ్బరి కాయలు కొట్టి మంచాన్ని ఎత్తుకుని క్రిందకి తీసుకుని రావాలని అమ్మ మంచం ఎత్తుకుంటున్నారు. అప్పుడు నేను ఒకవైపు పట్టుకుని క్రిందకి వచ్చాను. అమ్మ మంచం టైరు బండి మీద ఎక్కించి ఊరేగింపుగా తీసుకుని వస్తున్నారు. బండి మీద రామకృష్ణ ఎక్కి వున్నాడు. బండి వెనకాల నడుస్తున్న నాకు అమ్మ దగ్గర కూర్చోవాలని తీవ్రంగా వున్నది. కాని రామకృష్ణ ప్రక్కనే నడుస్తున్న బూదరాజు శ్యామ్‌ని "ఒరేయ్ శ్యామ్ బండి ఎక్కరా!" అన్నాడు. శ్యామ్ బండి ఎక్కాడు. నాకు తీవ్రమయిన కోరిక, వేదన ఎక్కువయింది. కొంత దూరం అమ్మ బండి వెళ్ళిన తరువాత అమ్మపైఎండ పడుతుంటే గొడుగు పట్టవలసి వచ్చింది. అప్పుడు బండి వెనకాల నాతో నడుస్తున్న దినకర్, వల్లూరి మోహన్ ఇద్దరూ "దత్తు (...నువ్వు ఎక్కి పట్టుకో" అన్నారు. వెంటనే ఎక్కి పట్టుకున్నాను. కొంత దూరం రాగానే గొడుగు అమ్మని చూడటానికి అడ్డుగా వుండటం వలన తీసివేయమన్నారు. గొడుగు తీసివేసి అమ్మతోనే ఆలయానికి బండి మీద వచ్చాను. హైమాలయం ముందు అమ్మ దివ్య దేహాన్ని కూర్చొపెట్టి, పాలాభిషేకం చేశారు. అమ్మ వెనకాల శిరస్సు పట్టుకుని నిల్చున్నాను. అమ్మ గర్భ గుడిలో భూ గృహంలో

ప్రవేశించటం చూడలేనేమో అనిపించింది. పాలాభిషేకం అయిన తరువాత మంచం పట్టుకుని గర్భ గుడిలోకి వస్తున్నప్పుడు గుడి ద్వారం దగ్గర జనం నెట్టడంతో లోపలికి వెళ్ళలేక పోయాను. కాని ఏదో విధంగా అమ్మ గర్భ గుడిలోకి వెళ్ళే దాకా చూశాను. ఈ విధంగా నా మనస్సులోని కోరికను అమ్మ తీర్చింది. వ్యక్తిగా వున్నప్పుడు తీర్చేది. అదే విధంగా తీర్చింది. బండి మీద కూర్చునటానికి గొడుగు అనేది నెపంగా కల్పించింది అమ్మ. కాని దాని అవసరం లేకుండానే అమ్మ ఆలయానికి వచ్చి భూ గృహం లోకి అమ్మ వెళ్ళటం జరిగింది. భూ గృహంలో పసుపు , కుంకుమ, కర్పూరం, పూలు, విభూతి మొదలైన ద్రవ్యములు పోస్తూ అమ్మ శిరస్సు నిండి పోయెడి సందర్భంలో అక్కడ వున్న మద్దినేని పూర్ణచంద్ర రావు ఇదే కదా అమ్మ భౌతిక దేహాన్ని చివరగా ముట్టుకునేది అనుకుని అమ్మ శిరస్సు మీద చేయి పెడితే షాక్ కొట్టి చేయి ఇవతలకి విసిరింది. అదే సమయంలో ఒక్క క్షణం కరెంటు పోయింది. ఈ లోగా విభూది, పసుపు, కుంకుమలతో అమ్మ శిరస్సు కూడా నిండి పోయింది. ఈ విధంగా అమ్మ దివ్యదేహం ఆలయ ప్రవేశం జరిగింది. 5 రోజులు గడిచిన తరువాత భాస్కరరావు (యార్లగడ్డ) గారికి అమ్మ సమాధిపైన పూలల్లో కదులుతున్నట్లు కనపడింది.గిరులు, తరులు కూడా వాత్సల్యాన్ని అనుభవించినవి అమ్మ చెంత. మాటలకి, ఊహలకి అందని దివ్య మాతృ వాత్సల్యాన్ని అనుభవించిన మా అందరికి అమ్మ వ్యక్తిగా కనుమరుగవటం తీరని వేదన అయింది. 1969 నుండి 1985 జూన్ 12 వరకు అమ్మ నివసించి, మహాసిద్ధి పొందిన నిలయానికి వాత్సల్యాలయం అని పేరు పెట్టారు. మాతృశ్రీ ఓరియంటల్ కాలేజీలో చదివిన వణుకూరి రాధాకృష్ణమూర్తి (స్వామి) అనెడి విద్యార్థి జిల్లెళ్ళమూడిలో ఆర్.ఎస్.ఎస్ శాఖకి వస్తూ వుండేవాడు. నాతో బాగా సంబంధ బాంధవ్యాలు కలిగి నేనంటే గౌరవాభిమానాలు కలిగి ఉండే వాడు. అతను అమ్మ మహాసిద్ధిపొందిన తరువాత తను ఉద్యోగం చేస్తున్న ఏర్పేడు వ్యాసాశ్రమం నుండి ఒక ఉత్తరం వ్రాశాడు. దానిలో అమ్మ మహాసిద్ధి పొంది నందుకు ఆవేదనతో వ్రాశాడు. దానికి సమాధానంగా నేను ఒక జవాబు వ్రాసాను. అదే నా మొదటి వ్యాసం అయింది. ఆ వ్యాసం సోదరుడు పరబ్రహ్మమూర్తి నడుపుతున్న "వ్యవస్థ" అనెడి పత్రికలో వచ్చింది. అమ్మ మహాసిద్ధి పొందిన 5వ రోజు కాసు రాధాకృష్ణారెడ్డిని తెనాలి తీసుకుని వెళ్ళి, తిరిగి జిల్లెళ్ళమూడి వచ్చి వాత్సల్యాలయంలో కూర్చున్నాను. ఏదైనా ఊరు వెళ్ళి వచ్చి అమ్మ చెంత కూర్చుంటే మానసికంగా ఎటువంటి అనుభూతి అవుతుందో అటువంటి అనుభూతే ఇప్పుడూ అయింది.

వ్యక్తిగా లేకపోయినా వ్యక్తిగా ఉన్నప్పుడు జరిగినట్లు జరిగింది. వణుకూరి రాధాకృష్ణ మూర్తికి నేను జాబు వ్రాయటం, మళ్ళీ అతను ఏవో సందేహాలు వెతలిబుచ్చుతూ జాబులు వ్రాయటం . ఈ విధంగా అతనికి వ్రాసిన సమాధానాలు 3,4 వ్యాసాలు అయినవి. ఆ రోజులలో కొండమూడి రామమూర్తి గారు విశ్వ జననీ పరిషత్ స్థానిక కార్యదర్శిగా ఉండేవారు. వారు నా దగ్గరికి వచ్చి "నువ్వు వాత్సల్యాలయం చూసుకుంటూ ఉండు. ఈ వ్రాసుకునే వ్యాసాలు అక్కడే వ్రాసుకుంటూ అమ్మని గురించి వచ్చిన వారికి చెబుతూ ఉండమని" చెప్పారు. తరువాత నేను వాత్సల్యాలయం చూడటం మొదలు పెట్టాను. చాగంటి వెంకట్రావుగారు, యార్లగడ్డ భాస్కరరావు గారు, కూడా వాత్సల్యాలయం చూసే వారు. పూలతో అమ్మ సూక్తులు, "అంఆ" అని "శ్రీమాతా" అని ఇట్లా అనేకమయిన అలంకారాలు చేసే వాణ్ణి. అమ్మ భౌతికంగా వేదన పడిన ఆ గదిలో కూర్చోగలనా? వ్రాయగలనా? అనుకున్న నాకు అది వదల లేని పరిస్థితి ఏర్పడి ఎన్నో వ్యాసాలు వ్రాస్తూ పోయాను. చివరికి నాలుగు శీర్షికలతో కూడిన నాలుగు గ్రంధాలు 800 పేజీల దాకా వ్రాయటం జరిగింది. అమ్మ గదిలో గడ్డ సాంబ్రానీ వాసన అప్పుడప్పుడు వచ్చేది. ఏ పొగ వేయకపోయినా అట్లా వచ్చేది. ఆ రోజులలో తెల్లవారు ఝామున అమ్మ స్నానాల గదిలో అమ్మ పీటకి నమస్కారం చేసుకునే వాణ్ణి. ఒక రోజు ప్యూర్ కాఫీ వాసన వచ్చింది. అమ్మ వ్యక్తిగా ఉన్నప్పుడు త్రాగుతుంటే ఎట్లా వచ్చేదో అట్లా వచ్చింది. నేననుకున్నాను "నువ్వు ప్యూర్ కాఫీ త్రాగుతూ నాకు వాసన చూపిస్తున్నావా?" అని. ఒక రోజు నా పాకలో పడుకుని నిద్ర పోతున్నాను. అప్పుడు కలలో ఒక చెరువు ఒడ్డున నిలుచుని, తామర పువ్వును చూస్తున్నాను. తరువాత మెలుకువ వస్తున్న దశని గుర్తించటం జరిగింది. అది ఆ తామర పుష్పం సూక్ష్మ దశ పొంది నిదుర లేచేటప్పటికి అదృశ్యమయింది. రమణ మహర్షి ఈ విధంగా అంటారు "నిదుర నుండి మెలుకువలోకి వస్తున్నప్పుడు ఒకానొక చిత్ చైతన్యం వుంటుంది. దానిని పట్టుకోవలె" అంటారు. ఆ రోజు నాకు అయిన అనుభవం గమనిస్తే పూర్ణజ్ఞానిని కాకపోయినా మహర్షి చెప్పిన చిత్ చైతన్యపు స్పందన యొక్క ఎరుక అనుభవం లోకి ఆ విధంగా వచ్చిందేమోనని అనిపించింది. నేను చదివే పుస్తకాలలోని విషయాలు కొన్ని ముందుగానే కల రూపంలో వస్తే, మరునాడు నేను చదివే పుస్తకంలో ఆ విషయం కొంత వుండేది. కొన్ని నాకు వచ్చే భావాలకి సంబంధించిన సంఘటనలు జరిగేవి. 85 ఆగస్టులో వాత్సల్యాలయం ముందు పడుకున్నాను. రాత్రి 11-30 లేక 12 గంటలు అవుతూ వున్న

సమయంలో అమ్మ మహాసిద్ధి పొందిన ఎ.సి. రూమ్‌లో నుండి స్పష్టంగా దగ్గువినపడింది. తలుపులే దగ్గినవా? అన్నట్లు, ఆ గది వెనకాల ఎవ్వరూ లేరు. పోర్టికోలో పడుకున్న సోదరుడు టెక్షీని "నువ్వు దగ్గావా?" అని అడిగాను. "నేను దగ్గలేదు " అన్నాడు టెక్షీ. వెంటనే తలుపులు తీసి లోపలికి వస్తే అమ్మ వ్యక్తిగా కనపడుతుందేమోనని. కాని లోపలికి వస్తే అమ్మ మంచం. ఫొటో, తప్ప ఏమి లేదు. అప్పుడు అమ్మ ఫొటో వంక చూస్తూ ఏమిటమ్మా? దగ్గావు. కాని కనపడలేదని, అన్నాను. వెంటనే అమ్మ వస్తువులు ఉన్న గదిలో నుండి ఆడ మనిషి నవ్వు వినపడింది. మళ్ళీ అక్కడికి వెళ్ళాలని అనుకుని "మహాదాకాశాన్ని చేతితో పట్టుకోగలమా? అనుకుని "అమ్మా! రాముని వెంట లక్ష్మణుడు పడితే, భరతుడు రాముడ్నే తన దగ్గర వుంచుకున్నాడని అన్నావు. నేను లక్ష్మణుడి లాగ పడలేను. భరతుడి లాగ దగ్గర వుంచుకోలేను. తల్లే సరండర్ అవుతుందని అన్నావు కదా? నువ్వే నా దగ్గరికి రా!' ' అని మళ్ళీ తలుపులు తాళాలు వేసి, వెళ్ళి పడుకున్నాను. "నేను సర్వం అయ్యానని శబ్దానికి అన్యంగా రూపం, రూపానికి అన్యంగా శబ్దం లేదని" అమ్మ వివరించారు. పైన నాకు అమ్మ ఇచ్చిన అనుభవం గమనిస్తే వ్యక్తావ్యక్త స్వరూపిణి అయిన అమ్మ ఉనికిని తెలియ చేసిందని అనిపించింది.

ఆ రోజులలో హైదరాబాద్ సోదరుడు భద్రయ్య వచ్చారు. ఆయన మాటలలో "అన్నయ్యా! పూర్వం అమ్మ పాద తీర్థం తీసుకుని వెళ్ళే వాళ్ళం కదా! ఇప్పుడు అమ్మ పాదుకలకి తాకించిన తీర్థం ఇస్తే అదే పాద తీర్థంగా వాడుకుంటాం కదా!" అన్నారు. అప్పుడు "మనం మహిమలని గురించి ఆలోచించకూడదు కదా? అమ్మ కావాలనుకుంటే అది జరగవచ్చు. అది వేరే విషయం"అన్నాను. అప్పుడు భద్రయ్య గారు "మిరకిల్స్ (మహిమ) గురించి ఆలోచించటం కాదు. నిల్వ వుంటే వుంటయ్. లేకపోతే లేదు. తాకించి (పాదుకలకి) చూస్తే సరి" అన్నారు. అన్నారే కాని వారు ఆ విధంగా తీసుకుని వెళ్ళలేదు. తరువాత నాకు కూడా ఆ విధంగా చేయాలని అనిపించింది. 85వ సంవత్సరం శ్రావణ పూర్ణిమ నాడు రెండు సీసాలు తీసుకుని ఒక చెంబులో నీళ్ళు తీసుకుని అమ్మ పాదుకలకి తాకించి సీసాలో పోస్తూ "గంగేచ, యమునేచైవ గోదావరి సరస్వతి నర్మదా సింధుశ్చ కావేరి మాతృదేవి పాదామృతం సన్నిధిం కురు అనుకుంటూ పోసి అమ్మ పాదం సూక్ష్మంగా దానిలో ఉంచినట్లు భావించి పోశాను. రోజూ నేను తీసుకుంటున్నాను. అట్లా 15, 20 రోజులు తీసుకున్న తరువాత అమ్మ పాదాలకి తాకిస్తే వున్నట్లు , ఇప్పుడు కూడా తీర్థం వుంటున్నయ్" అని అమ్మ రెండవ

కుమారుడు రవితో చెప్పాను. అప్పుడు రవి కూడా తీర్థం తీసుకున్నాడు. రెండు సీసాలలో పెద్ద సీసాలోని తీర్థం రవికి వేస్తే తియ్యగా వున్నయ్. నాకు మామూలుగా వున్నయ్ మరొక చిన్న సీసాలోని తీర్థం రవికి వేస్తే "ఘుమ ఘుమ వాసనలు వస్తున్నయ్. పుట్టమన్ను రోజులు గుర్తుకు వస్తున్నయ్" అన్నాడు. నేను సీసా దగ్గరికి తీసుకుంటూ ఉండగానే నాకు కూడా సువాసన వున్న సాంబ్రాణీ వాసనలు వచ్చినయ్. వేసుకుంటే సువాసన వున్న సాంబ్రాణీ వాసనలు వచ్చినయ్. ఈ విధంగా ఒకే సమయంలో ఒక సీసా లోనివి రవికి తియ్యగా వుంటే నాకు మామూలుగా వున్నయ్. రెండవ సీసా లోనివి నాకు కూడా సువాసనలు వచ్చినవి. తాను ఇవ్వ తలుచుకున్న అనుభూతులు ఎవరికి ఎట్లా ఇవ్వాలో అమ్మ ఇస్తుంది. తరువాత కొమరవోలు గోపాలరావు గారు ఆ తీర్థం తీసుకుని కర్పూరపు వాసనలు వచ్చినవి అన్నారు. ఈ విధంగా అమ్మ పాదుకలే పాదాలై ఎంతో మంది అమ్మ పాదతీర్థం తీసుకుని వెళ్ళేవారు.

ముఖ్యంగా అమ్మ మహాసిద్ధి పొందిన తరువాత గ్రంథాల పఠనము, రచన అనేది తపస్సుగా అమ్మ నా చేత చేయించింది. 1987 మే 5 వ తారీఖున అనసూయేశ్వరాలయంలో అమ్మ విగ్రహ ప్రతిష్ఠ జరిగింది. జూన్ నెలలో పరిషత్, కాలేజి విడిపోయినవి. తరువాత కాలేజి బిల్డింగ్ ఏర్పడింది. 1993 అమ్మ జన్మదినోత్సవం మన్నవలో అద్భుతంగా జరిపారు. మన్నవలో జరిగిన పుట్టిన రోజు ఉత్సవం జరపటంలో కూడా బాగా పాల్గొన్నాడు సోదరుడు పరబ్రహ్మమూర్తి. అమ్మ జన్మ స్థలంలో శంఖుస్థాపన, అనసూయావ్రతాలు, ఊరబంతి, రాత్రి పూట ఉపన్యాసాలు, హరి కథ, మొదలైన కార్యక్రమాలు వైభవంగా జరిపారు.

తరువాత నాకు పైల్స్ వచ్చి హైదరాబాదులో పంజగుట్ట దగ్గర విష్ణు నర్సింగ్ హోం లో ఆపరేషన్ జరిగింది. నాకు ఆపరేషన్ జరిగిన రోజున నేను ఆపరేషన్ జరుగుతుంది అనేది భావంతో వెళ్ళలేదు. కాని డాక్టర్ గారు "అదేమిటి మీరు ఈ రోజు ఆపరేషన్ చేయించుకుంటారు అనుకుంటే? మీకేమైనా తిథులు, వారాలూ ఉన్నయ్యా? మిమ్మల్ని నేను ఇప్పుడు డబ్బు ఇవ్వమన లేదు కదా? అని నేను ఆపరేషన్ చేయించుకోకపోతే వారికి ఏదో అవుతుందా? అన్నట్లు అన్నారు. నేను డబ్బు తీసుకుని రాలేదంటే, ఇప్పుడు డబ్బు అడగ లేదు కదా? అన్నాడు డాక్టర్ గారు. నాతో ఎవ్వరూ రాలేదంటే నర్సులు "అన్నీ మేము చూస్తామన్నారు" మా నాల్గవ అన్నయ్య ఇంటి నుండి ఊరికే చూపించుకుని వస్తానని వెళ్ళాను నేను. కాని ఏ మాత్రం ఊహించని సంఘటన

అసుట చేత, చేతిలో డబ్బు లేకపోయినా, ఎవ్వరూ ప్రక్కన లేకపోయినా ఆ రోజు ఆపరేషన్ జరిగింది. సాయంత్రం వరకు చూసి మా అన్నయ్య నర్సింగ్ హోమ్‌కి ఫోన్ చేసి నాకు ఆపరేషన్ అయిందని తెలిసి వచ్చి నన్ను తీసుకుని వెళ్ళాడు. హైదరాబాద్ సేవా సమితి తరపున నాకు ధన సహాయం అందినది. రాధాకృష్ణారెడ్డి ఆపరేషన్ తరువాత నాకు మందులకని 600 రూ. ఇచ్చాడు. ఇదంతా అమ్మ కలిపించిన అఘటన ఘటనా సంఘటన. ఆ రోజులలో ఏ రోజు ఎక్కడ ఉంటానో తెలీదు. ఆ విధంగా రోజులు వెళ్ళి పోయినయ్. 93 నవంబర్‌లో నేను రాధాకృష్ణారెడ్డి నెల్లూరు వెళ్ళి అక్కడ నుండి హైదరాబాద్‌లో తంగిరాల శాస్త్రి గారింట్లో అమ్మ కూతురు హైమ జయంతికి వెళ్ళి, అక్కడి నుండి మళ్ళీ జిల్లెళ్ళమూడి వెళ్ళాను. కాని జిల్లెళ్ళమూడి లో స్థిరంగా లేను. తరువాత కాకినాడలో చాగంటి వెంకటరావు గారు నన్ను రమ్మంటే కాకినాడ వెళ్ళాను. కాకినాడలో గాత్రం కోటేశ్వరరావు గారింట్లో రాధాకృష్ణారెడ్డి వుండి వెంకటరావు గారికి ఫోన్ చేశాడు. ఇది కూడా ఏ మాత్రం ఊహించని సంఘటన నేను కోటేశ్వరరావు గారి ఇంటికి వెళ్ళి రాధాకృష్ణా రెడ్డిని కలిస్తే రాధాకృష్ణారెడ్డి "నేను ఢిల్లీ వెళ్ళి గాయక కళాకారులకి, అంగవికలాంగులకి పెన్షన్ కోసం ప్రయత్నం చేయ తలచాను. దానికి నువ్వు తోడుగా వుంటే హైదరాబాద్ వెళ్ళి, ఢిల్లీ వెళ్దాము. నీవు కూడా రచయితగా పెన్షన్ కోసం ప్రయత్నం చేయవచ్చు" అన్నాడు. కాకినాడ నుండి హైదరాబాద్ వచ్చి, హైదరాబాద్‌లో జి.కె. రావు గారి ఇంటికి వెళ్ళి, అక్కడి నుండి అనేక మందిని కలిసి ధన సేకరణ చేసాము. జి.కె. రావు గారు ఢిల్లీలో ఆర్.వి. కృష్ణమూర్తిగారికి ఒక ఉత్తరం వ్రాసి ఇస్తే, అది తీసుకుని ఢిల్లీ వెళ్ళాము. ఢిల్లీలో సత్యనారాయణ గారనెడి వ్యక్తిని మేము కలవాలి. కాని వారి అడ్రస్, ఫోన్ నెంబర్ మా దగ్గర లేదు. మేము సరాసరి ఆంధ్రా గెస్టుహౌస్‌కి వెళ్ళాము. అక్కడ కోటేశ్వరరావు గారనెడి వ్యక్తి కలిశారు. వారితో రాధాకృష్ణారెడ్డి దరిదాపు గంట మాట్లాడితే మాటలలో సత్యనారాయణ గారి సంగతి తెలిసింది. వారి ఫోన్ నెంబర్‌తో, వారి ఇంటి అడ్రస్ కనుగొని వారి ఇంటికి వెళ్ళాము. ఢిల్లీ మహా నగరానికి ఫోన్, అడ్రస్ లేకుండా మేము వెళ్ళటం, అక్కడ వారి ఆచూకి తెలిసి వారి ఇంటికి వెళ్ళటం అమ్మ కల్పించిన సంఘటన. చాగంటి వెంకటరావు గారి కుమార్తె సోదరి శారద హ్యూమన్ రీసోర్సెస్ డిపార్ట్‌మెంట్ లో అడల్ట్ ఎడ్యుకేషన్ సెక్షన్ అండర్ సెక్రటరీ గా పనిచేస్తున్నది. ఆవిడ అపారంగా సహాయం చేసింది. ఆర్.వి. క్రిష్ణమూర్తి గారు ప్రైమ్ మినిస్టర్ ఛాంబర్‌లో పని చేస్తున్న ఐ.ఎ.ఎస్. ఆఫీసర్. జి.కె. రావ్ గారు ఇచ్చిన లెటర్‌తో వారిని కలిశాము. జులై 22

వ తారీకున రాధాకృష్ణారెడ్డి తన అప్లికేషన్ ఇచ్చాడు. ఆగస్టు 3న మీటింగ్ జరుగుతుంది. దానిలో పెన్షన్ శాంక్షన్ చేయాలి. నేను అప్పటికి ఏమీ ఇవ్వలేదు. తరువాత ముగ్గురు ఆంధ్రా ఎం.పి.ల రికమన్‌డేషన్ లతో మూడు అప్లికేషన్లు ఆఫీసుకు పంపించాను. ఇంకా రెండు రోజులలో మీటింగ్ వుందనగా ఆర్. వి. క్రిష్ణ మూర్తి గారి రికమెన్‌డేషన్ లెటర్ కూడా వెళ్ళింది. ఈ విధంగా నాలుగు అప్లికేషన్స్ లెటర్స్ దానికి సంబంధించిన ఆఫీసర్‌కి వెళ్ళినయ్. ఇదంతా కూడా రాధాకృష్ణారెడ్డి పట్టుదలతో జరిగింది. మాకు ఎప్పటికప్పుడు మార్గదర్శనం చేస్తూ ఆఫీసర్ దాకా అప్లికేషన్లు వెళ్ళేటట్లు చేసి అపారమయిన సహాయం చేసింది సోదరి శారద. ఆర్.వి. క్రిష్ణ మూర్తి గారు స్వయంగా కారు ఇచ్చి , ఆఫీసుకు పంపి తన లెటర్ మా శాఖకి వెళ్ళేటట్లు చేశారు. ఇవ్వన్నీ పూర్తి అయ్యేటప్పటికి ఆగస్టు ఒకటవ తారీఖు అయింది. 3న మీటింగు. నా పని అవుతుందని ఏ కొశానా లేదు. ప్రయత్నం మాత్రం తీవ్రంగా చేశాము. ఆగస్టు 3 సాయంత్రం మీటింగ్ జరిగితే 4న మేము ఫోన్ చేసి కనుగొంటే, నాకు శాంక్షన్ అయింది. రాధాకృష్ణా రెడ్డిది తరువాత మీటింగ్‌లో అవుతుందని తెలిసింది. ఇదొక అనూహ్య మయిన సంఘటన. రాధాకృష్ణారెడ్డికి తోడుగా వెళ్ళానే కాని, ఇట్లా దిగ్విజయంగా నాకు పని అవుతుందని ఊహించని సంఘటన. జి.కె. రావ్ గారు, టి.వి. న్యూస్ ఎడిటర్ ఆకిరి రామకృష్ణా రావు గారు ధన సహాయం చేయటమే కాక రికమెండేషన్ లు కూడా చేయించారు. ఈ విధంగా అనుకోకుండగ, నెల రోజులు ఢిల్లీలో వుండి తరువాత హైదరాబాద్ చేరాము. నాకంటే నన్ను గురించి రాధాకృష్ణారెడ్డి ఎక్కువగా ఆలోచించి పని చేసాడు. అప్పుడు ఒక మాట రాధాకృష్ణారెడ్డి అన్నాడు. "నాకు బ్రహ్మాండమయిన సంతృప్తిగా వుంది. ఒకటి అంధులకు డిప్లమో కోసం ఫైట్ చేసి ఒకప్పుడు సాధించాను. రెండవది కేంద్ర ప్రభుత్వం నుండి నీకు అవార్డ్ రప్పించాను. ఇవి రెండూ నా జీవితంలో అమోఘమయిన విజయాలు. నా జీవితంలో మచ్చు తునకలు" అని ఎనలేని ఆనందంతో అన్నాడు. తరువాత నేను మా నాల్గవ అన్నయ్య ఇంటికి వెళ్ళాను. మధ్య మధ్యలో బాపట్ల - జిల్లెళ్ళమూడి వచ్చినా ఎక్కువగా మా నాల్గవ అన్నయ్య వాళ్ళ ఇంట్లో వున్నాను. నేను పెట్టుకున్న అప్లికేషన్లో అమ్మని గురించి నేను వ్రాసిన పుస్తకాల పేర్లు వివరించి వ్రాసాను. మా అన్నయ్య చెంత వుంటూ అమ్మకి సంబంధించిన ఉత్సవాలు, హైదరాబాద్‌లో ఎక్కడ జరిగినా వెళ్ళి పాల్గొనే వాడిని. 95 మే లో ఢిల్లీలో శాంక్షన్ చేసిన అవార్డు రిలీజ్ అయి వచ్చింది. 95-96 మధ్యలో మతుకుమల్లి రాము వాండ్ల ఇంట్లో బాపట్లలో వుంటూ "సర్వతో

ముఖ చైతన్య అమ్మ" అనెడి గ్రంథం వ్రాయటం జరిగింది. 96 విజయ దశమికి గుంటూరులో సోదరుడు విజయరావు (సమతానంద) జరిపిన నవరాత్రుల కార్యక్రమంలో పాల్గొని మరొక రెండు రోజులు వున్నాను. కాసు రాధాకృష్ణారెడ్డి నవరాత్రుల ముందు బాపట్లలో డాక్టర్ ఇనజ కుమారి హాస్పిటల్‌లో చేరారు. పసికర్లు చాలా తీవ్రంగా వచ్చినవి. అంతకుముందు హెర్నియా ఆపరేషన్ జరిగింది. భగందరం వున్నది. షుగర్, చర్మ వ్యాధి ఇన్ని రకాల రుగ్మతలు వున్న వానికి పసికర్లు అధికంగా వచ్చినవి. గుంటూరు నవరాత్రుల ఉత్సవాలకి వెళ్ళిపోయే ముందు వానిని కలిసాను. అప్పుడు అతడు "నవరాత్రుల ఉత్సవాలు అయిన తరువాత బాపట్ల రా నువ్వు. నాకు బాగా తగ్గిన తరువాత హైదరాబాదు వెళ్ళి ఆకిరి రామకృష్ణా రావు ఇంట్లో వుండి టి.వి.లో ప్రోగ్రామ్స్ ఇచ్చి ఆ తరువాత రాజమండ్రి వెళ్ళి పరబ్రహ్మమూర్తిని కలిసి అక్కడ వారం రోజులు అమ్మ కార్యక్రమం ఏర్పాటు చేస్తాను. ఆ తరువాత నీవు వ్రాసిన పుస్తకాల ప్రింటింగ్‌ని గురించి ఆలోచిద్దాం" అన్నాడు. నేను "నీకు పూర్తిగా తగ్గక ముందే ఎక్కడికి కదల వద్దని" చెప్పి గుంటూరు వెళ్ళాను. నవరాత్రులు అయిన తరువాత గుంటూరులో వున్న నాకు , రాధాకృష్ణారెడ్డి పోయాడని కబురు వచ్చింది. రాధాకృష్ణారెడ్డిని జిల్లెళ్ళమూడి తీసుకుని వచ్చి , కాలనీ ముందుగా వున్న కాన్వెంట్ స్థలం ముందు వున్న చోట ఖననం చేయటం జరిగింది. తరువాత అక్కడ సమాధి కట్టి, సమాధి మీద గణపతి విగ్రహం స్థాపించారు. రాధాకృష్ణారెడ్డి పోయినప్పుడు సోదరుడు విజయరావు "జిల్లెళ్ళమూడికి సంగీతమే పోయింది" అన్నాడు. గుంటూరు నుండి డాక్టర్. అలపర్తి లక్ష్మయ్య గారి భార్య వచ్చి డాక్టర్ ఇనజ కుమారితో ఈ విధంగా అన్నది. "ఆయన వస్తుంటే సాక్షాత్తు రాధాకృష్ణుడే వచ్చినట్లు అనుకునే వారం . మేమొక ఆశ్రమం కట్టాలనుకున్నాము. అక్కడ ఆయనని శాశ్వతంగా ఉంచాలని, అనుకున్నామని" వేదనతో అన్నది. తరువాత నేను నెల్లూరు వెళ్ళి , గూడూరు దగ్గర విద్యానగర్ వెళ్ళాను. అక్కడ చంద్రమ్మక్కయ్యని కలిసి, సంభాషణ చేసి ఆవిడ అనుభవాలు సేకరించాను. ఆవిడ అమ్మ సేవ అపారంగా చేసుకున్న వ్యక్తి. మంచి అనుభవాలు, ఆధ్యాత్మిక చింతన వుండి మంచి మంచి సంభాషణలు చేసేది. అదే సమయంలో అక్కడ ఇంజనీరింగ్ కాలేజిలో పి.డి.గా పని చేస్తున్న చంద్రమోహన్‌ని కలిసాను. అతను జిల్లెళ్ళమూడి లో వుండి, అమ్మ సేవ చేసుకున్న వ్యక్తి. అతనితో కూడా మంచి సంభాషణ జరిగేది. అక్కడి నుండి కాళహస్తి, తిరుపతి, చిత్తూరు వెళ్ళి, గుంటూరు వచ్చి బాపట్ల చేరాను. ఇదంతా 96 నవంబర్ నుండి 97 మార్చి లోగా జరిగింది. 97 పుట్టిన

రోజుకి జిల్లెళ్ళమూడిలో సహస్ర క్షీర ఘటాభిషేకం జరిగింది. నేను ఆ సంవత్సరం మన్నవ వెళ్ళాను. అక్కడ అమ్మ ఆలయం నిర్మాణమయి అక్కడ కూడా పూజలు జరుగుతున్నవి. అందువలన మన్నవ వెళ్ళాను. తరువాత బాపట్లలో బ్రహ్మాండం రవి కలిసి, నేను జిల్లెళ్ళమూడిలో జరిగిన కార్యక్రమానికి రానందుకు ఆశ్చర్యాన్ని వ్యక్తం చేస్తూ "రాధా కృష్ణా రెడ్డి విషయంలో ఈ విధంగా అన్నాడు. "రాధా కృష్ణారెడ్డి పోయి కూడా పని చేస్తున్నాడా? అనిపిస్తున్నది. ఆకిరి రామకృష్ణారావు గారు వచ్చి అక్కడ జరిగిన కార్యక్రమం ఆల్ ఇండియా టి.వి.ప్రోగ్రామ్స్‌లో చూపించారు. ఇండియా మాప్ లో శ్రీలంక మరొక భాగాన్ని తీసి వేస్తే ఎట్లా వుందో, అతను లేక పోతే అట్లా వున్నదని" అన్నాడు. అంటే అంతరాంతరాళలో వాడి మీద అనేక మందికి ఈ విధంగా వుండేది. గుంటూరులో ఆయుర్వేదం డాక్టర్ వి. రాధాకృష్ణమూర్తి గారికి, వారి కుటుంబానికి వాడంటే అపారమయిన భక్తి, గౌరవాలు వున్నయ్. అదే సంవత్సరం నేను వ్రాసిన పుస్తకాలు ప్రింటు చేయటానికి ధన సేకరణ కోసం హైదరాబాద్ వెళ్ళాను. అక్కడ స్కూటర్ కొట్టుకుని పడ్డాను. కుడి చేయి ఫ్రాక్చర్ అయింది. మా పెద్ద వదిన తమ్ముడు డాక్టర్ గోపాల్‌ని కలిసి, కట్టు కట్టించుకుని, అక్కడ నెల రోజుల పైన వుండి మరి కొంత మందిని కలిసాను. "అన్ని పుస్తకాలలోని సారాంశం 50 పేజీలలో ప్రింట్ చేసి ఇస్తే, దాతలు వున్నారు. వారికిఅవి ఇచ్చి ధన సేకరణ చేయవచ్చని" నరసింహ మూర్తి హైదరాబాద్‌లో అన్నాడు. తరువాత గుంటూరు వచ్చి ఆ ప్రయత్నం చేసాను. 98 అమ్మ పుట్టిన రోజుకి మన్నవ వెళ్ళి, తరువాత గుంటూరు వెళ్ళాను. అప్పుడు నా కుడి కాలు మధ్య వేలులో చిన్న సన్నని పెంకు గుచ్చుకుని అది వాచి చీము పట్టి , నానా గొడవ అయింది. అప్పుడు అలపర్తి లక్ష్మయ్య గారి హాస్పిటల్‌లో చేరాను. ఇది కూడా విచిత్రమయిన సంఘటన. అప్పుడు ఢిల్లీ నుండి నాకు రావలసిన డబ్బు రాలేదు. ఏ రోజు ఎక్కడ నుండి నాకు అన్నం వస్తుందో తెలీదు. అటువంటప్పుడు మా 5వ అన్నయ్య కొడుకు వేణు, మరియొక వ్యక్తి భాస్కరరావు వచ్చి నన్ను చూసారు. భాస్కరరావు నాకు చాలా కాలం అపారమయిన సేవ చేసాడు కొంత కాలం. వేలు తీయవలసిన పని లేకుండగ మందులతోనే తగ్గింది. దరిదాపు 40 రోజులు హాస్పిటల్ లో వుండి డిస్‌చార్జి అయ్యాను. వేలకు వేలు ఖర్చు అయ్యే వారి హాస్పిటల్‌లో 400 రూ. మాత్రమే ఇచ్చి వచ్చాను. చేతిలో డబ్బు లేదు. ప్రత్యేకించి నా అనేవారు లేరు. ఎప్పుడు ఎక్కడ నుండి తిండి వస్తుందో తెలీదు. అయినా కాని డా॥ రాధాకృష్ణమూర్తి గారి దగ్గర నుండి కొంత కాలం, శంకర్ అనెడి సోదరుని

ఇంటి నుండి నాకు తిండి వచ్చింది. ఇతను 82 నుండి కొంత కాలం జిల్లెళ్ళమూడి గవర్నమెంట్ హోమియో డిస్పెన్సరీలో పనిచేసి, నేను గుంటూరు హాస్పటల్‌లో వున్నప్పుడు గుంటూరు గవర్నమెంట్ ఆయుర్వేదం హాస్పటల్‌లో పని చేస్తున్నాడు. అతని ద్వారా కొంతకాలం ఆ విధమయిన సహాయం అందినది. తరువాత నాకు తెలిసిన కొన్ని ఊర్లు వెళ్ళి 98 ఆగస్టు దాకా కాలం గడిపాను. ఆ తరువాత బాపట్ల వచ్చి, జిల్లెళ్ళమూడి వచ్చాను. జిల్లెళ్ళమూడిలో 3 రోజులు వున్నాను. అప్పుడు కొండమూది రామకృష్ణ మరణించాడు. కాని అతని కుటంబ సభ్యులు నాతో ఎంతగానో ఐక్యంగా వుండి నన్ను అతని 13 వ రోజు వరకు జిల్లెళ్ళమూడి నుండి కదలనివ్వలేదు. తరువాత చీరాల పాట్లూరి సుబ్బారావు గార్ని కలిసాను. తరువాత 98 నవంబర్‌లో అమ్మ కూతురు హైమ జయంతి ఉత్సవాలప్పుడు జిల్లెళ్ళమూడిలో లలితా కోటి నామార్చనకి వచ్చి 3రొజులు వున్నాను. అప్పుడు డాక్టర్ పాట్లూరి సుబ్బారావు గారు అమ్మలో ఐక్యం అయినట్లు తెలిసి చీరాల వెళ్ళి వారి అంతమ దర్శనం చేసుకున్నాను. 98 డిసెంబర్‌లో ముక్కోటికి జిల్లెళ్ళమూడి వచ్చి సాయంత్రం జీపు ఎక్కపోయే ముందు మా 5వ అన్నయ్య వచ్చి హైదరాబాద్‌లో మా పెద్ద వదిన పోయిందని చెప్పాడు. డిసెంబర్ 31 రాత్రికి హైదరాబాద్ వెళ్ళాను. మా పెద్ద వదిన కర్మ 10,11,12 రోజులు పూర్తి అయిన తరువాత నేను హైదరాబాద్‌లో కొందరిని (జిల్లెళ్ళమూడి సంబంధీకులును) కలిసాను.

1992 జూన్ 1వ తారీఖు నుండి 1999 వరకు జరిగిన చరిత్ర విచిత్రమయినది. ఎక్కడికక్కడ, అమ్మ అదృశ్య హస్తం నడిపింది. ముఖ్యంగా నా పైల్స్ ఆపరేషన్ (93 జూన్‌లో) తరువాత ఢిల్లీ వెళ్ళటం (94 జులైలో) 98లో 40 రోజులు గుంటూరు హాస్పిటల్‌లో నేను వుండటం, ఈ మూడు సంఘటనలు ఆశ్చర్యాన్ని కలుగచేస్తయ్. ఈ మూడు సంఘటనలు ఆ క్షణం దాకా ఊహించనవి. పైసా లేకుండా ఎప్పుడు ఏది ఎట్లా జరుగుతుందో తెలియని అయోమయావస్థలో అమ్మ ఎట్లా దిక్సూచియై సవ్యంగా నడుపుతుందో తెలియచేసిన మహా మహిమాన్విత ఘట్టాలు. జీవిత ఘట్టాలలో అనుభవం ద్వారా పొందే జ్ఞానాంజనము , హృదయ స్ఫూర్తియే అమ్మ మహిమ. దీనినే అమ్మ "అవకాశాన్ని గమనించటమే సాధన" అన్నారు. "సాధన చేయటమనే క్రియ కాక , జరగటమనే దివ్య శక్తి స్పందనని గమనించెడి తపస్సు అమ్మ చేయిస్తుంది"సేవ అయినా

ఆరాటం అయినా అమ్మ ఆరాధనగా చేయటం జరిగింది. వ్యక్తిగా నేను ఎక్కడ వున్నా అమ్మ, జిల్లెళ్ళమూడి నా స్మరణ, ఆరాధన అయింది. ఎప్పుడు ఎప్పుడు జిల్లెళ్ళమూడిలో సానుకూలమయిన వాతావరణం ఏర్పడితే అప్పుడు జిల్లెళ్ళమూడి వచ్చి సేవించుకోవాలని అంతరంగం పరితపిస్తూనే వున్నది. నా ఆదర్శం. తెలియ చేస్తూ సంస్థ-లక్ష్యం, సాధన-లక్ష్యం అనెడి రెండు వ్యాసాలు వ్రాశాను. సంస్థ-లక్ష్యం, సాధన-లక్ష్యం అనెడి విషయాలలో భారతీయ జనసంఘ్ మాజీ అధ్యక్షులు, కఠోరమైన దేశభక్తుడు పండిత దీనదయాళ్ ఉపాధ్యాయ ఈ విధంగా అంటారు. "వ్యక్తి ముఖ్యమా, సంస్థ ముఖ్యమా, అనెడి సంశయం వచ్చినప్పుడు సంస్థ ముఖ్యమని. సంస్థ ముఖ్యమా లక్ష్యం ముఖ్యమా అంటే లక్ష్యం ముఖ్యమని అంటారు. లక్ష్యానికి అనుగుణమయిన సంస్థ యొక్క వ్యవస్థని నిర్మించుకోవటం ఆరాధన అవుతుందని. ఆ వ్యాసాలలో వ్రాశాను. దేశభక్తుడు దేశాన్ని ఏ విధంగా సేవిస్తాడో, అవాంఛనీయమయిన పరిస్థితులు ఏర్పడి నప్పుడు దేశం కోసం ఆరాటపడి పరిస్థితులు మార్చుకొనుట కూడా ఆరాధనగా చేస్తాడని వివరించాను. ఈ విధంగా నా ఆదర్శాన్ని పై విధంగా తెలియచేశాను. తరువాత 1999 ఫిబ్రవరి నెలలో మా నాల్గవ అన్నయ్యకి సీరియస్ అయింది. ఆ కారణం చేత నేను అనుకోకుండ వానికి సహాయార్థం 99 ఫిబ్రవరి నుండి ఆగస్టు వరకు వాని ఇంట్లో వున్నాను. అప్పుడు కూడా హైదరాబాద్‌లో జరిగే అమ్మ పూజలు, ఉత్సవాలలో పాల్గొన్నాను. హైదరాబాద్ సేవా సమితి వారు "అమ్మ కళ్యాణం- జగత్కళ్యాణం' అనెడి కరపత్రం, "అమ్మ -ఆలయం ప్రవేశం" అనెడి చిన్న పుస్తకం ప్రింటు చేసి విడుదల చేశారు. తరువాత ఆగస్టు 15కి అమ్మ అన్నపూర్ణాలయం అనెడి కరపత్రం నేను స్వయంగా ఖర్చు పెట్టి విడుదల చేశాను. అదే విధంగా విజయ దశమికి, "అమ్మ - విజయ దశమి" అనెడి కరపత్రం కూడా నేనే ప్రింట్ చేసి విడుదల చేయటం జరిగింది. ఆగస్టు 15కి పి. శ్రీరామ మూర్తి గారి ఇంట్లోను, విజయ దశమికి వఝూ ప్రసాదు గారి కూతురు శివ కుమారి వాండ్ల ఇంట్లో పై రెండు కరపత్రాలు విడుదల చేయటం జరిగింది.

సేవా సమితి వారు ప్రింట్ చేసినవి రెండింట్లో ఒకటి అమ్మ కళ్యాణం రోజున వి. ధర్మసూరి ఇంటిలోను, రెండవది జూన్ 12న కె.ఎస్. రామారావు గారి ఇంటిలోను విడుదల చేయటం, మాట్లాడటం జరిగింది. ఈ విధంగా ఒకవైపు మా అన్నయ్య సేవ, మరొకవైపు అమ్మసేవ చేసుకొనటం జరిగింది. ఇది కూడా అమ్మ జరిపిన అనూహ్య సంఘటనయే.

99 విజయ దశమి తరువాత లోక్ అదాలత్‌లో పూర్వపు బాడీని రద్దు చేసి రివైవల్ కమిటీ ని ఏర్పరచారు, జెస్టిస్ శంకర్ గారు. ఇది బాపట్లలో జరిగింది. దీని కంతా కృషి చేసిన వారు వల్లూరు పాండురంగారావు గారు. 1999 నవంబర్‌లో ఒకసారి జిల్లెళ్ళమూడి వెళ్ళాను. తరువాత డిసెంబర్‌లో ఒంగోలులో అన్నంరాజు శాయి అనెడి సోదరుని గృహ ప్రవేశానికి వెళ్ళి, అక్కడ నుండి ముక్కోటికి జిల్లెళ్ళమూడి వచ్చాను. తరువాత హైదరాబాదు వెళ్ళి వచ్చి, 2000 సంవత్సరం సంక్రాంతికి జిల్లెళ్ళమూడి వచ్చాను. 2000 సంవత్సరం జనవరి 1 వ తేదీనాడు హైదరాబాద్‌లో కానాజీ గూడా గ్రీన్ ఫీల్డ్స్‌లో కొండమూది రామమూర్తి గారి ఇంట్లో అమ్మ పూజ జరిగితే వెళ్ళాను. ఆ సందర్భంలో అమ్మని గురించి మాట్లాడాను. తరువాత జిల్లెళ్ళమూడి వచ్చిన రివైవల్ కమిటి వారు నన్ను జిల్లెళ్ళమూడికి రమ్మన్నారు. అప్పుడప్పుడు వచ్చానే కాని, స్థిరంగా వుండలేదు. 2000 సంవత్సరం మార్చి 4 వతేదీ శివరాత్రి నాడు జిల్లెళ్ళమూడికి వచ్చాను. అదే రోజున మా 5వ అన్నయ్యకి హార్ట్‌ఎటాక్ వచ్చి బాపట్ల తీసుకుని వచ్చారని తెలిసి, జిల్లెళ్ళమూడి నుండి ఆరాత్రే బాపట్ల వచ్చి మా అన్నయ్యని గుంటూరు జనరల్ హాస్పిటల్‌లో చేర్చాము. మా అన్నయ్యలకి, మా పెద్దన్నయ్య కొడుకు మధుకి ఫోన్ లు చేసాను. అందరి నుండి ధన సహాయం అందినది. వానికి కొంత కుదుట పడిన తరువాత తెనాలిలో మా రెండవ అన్నయ్య ఇంటికి తీసుకుని వెళ్ళాము. వాడు హాస్పిటల్‌లో వుండగా, వాని కొడుకు వేణు, కూతురు జానకి వచ్చారు. తెనాలిలో 2 రోజులు ఉండి వారిద్దరు, హైదరాబాద్‌కి వేణు, నంద్యాల జానకి వెళ్ళారు. తరువాత 10 రోజులకి మళ్ళీ గుంటూరు జనరల్ హాస్పిటల్‌లో చూపించిన తరువాత తెనాలి రమ్మని చెప్పినా, కాదని జిల్లెళ్ళమూడి వెళ్ళాడు మా 5వ అన్నయ్య వెంకటేశ్వర్లు. మళ్ళీ రెండవ రోజున వాడు జిల్లెళ్ళమూడి లో సీరియస్ అయి గుంటూరు జనరల్ హాస్పిటల్‌కి వచ్చాడని తెనాలిలో వున్న నాకు ఫోన్ వస్తే, గుంటూరు వెళ్ళాను. అనుకున్నంత హడావడి లేదు వెళ్ళి చూస్తే. ఆ మరునాడు వాడు నంద్యాల వెళ్ళాడు. నేను తెనాలి వెళ్ళి, హైదరాబాదు వెళ్ళాను. హైదరాబాదులో "ఇంద్ర ధనుస్సు - అమ్మ" అనెడి 50 పేజీల పుస్తకం డి.టి.పి.కి ఇచ్చాను. దాని విషయమై కొంత మంది దగ్గర ధన సేకరణ చేశాను. దాని కొఱకు హైదరాబాదు వెళ్ళి ఫైనల్ డి.టి.పి. తీసుకుని దానిని శివ కుమారి వాండ్ల ఇంట్లో ఇచ్చి, బాపట్ల వచ్చి,

జిల్లెళ్ళమూడి వెళ్ళాను. 2000 సంవత్సరం సంవత్సరాది నాడు అమ్మ గదికి వెళ్ళటం, కూర్చొనటం జరిగింది. తరువాత బాపట్ల వెళ్ళి మళ్ళీ పుట్టిన రోజుకి జిల్లెళ్ళ మూడి వెళ్ళి, ఆ రోజు అమ్మ గదిలో వున్నాను. ఈ విధంగా పుట్టిన రోజు నాడు జిల్లెళ్ళమూడి చేరాను. ఆ రోజుకు ముందుగా మా అన్నయ్య నంద్యాల నుండి జిల్లెళ్ళమూడి చేరాడు. పుట్టినరోజు అయిన తరువాత హైదరాబాదు వెళ్ళి, అక్కడి నుండి జిల్లెళ్ళమూడి మే 5, అమ్మ కళ్యాణం రోజున చేరాను. అదే రోజు మా అన్నయ్య కొడుకు వేణు ఉపనయనం సామూహిక ఉపనయనాలతో జరిగింది. 22-5-2000 సంవత్సరం రాత్రి 10 గంటలకి మా 5వ అన్నయ్యకి మళ్ళీ హార్ట్ఎటాక్ (స్ట్రోక్ వచ్చి, అమ్మలో ఐక్యమయినాడు. తరువాత మా 2వ అన్నయ్య మూడవ అన్నయ్య, 4వ అన్నయ్య, మా 5వ వదిన చెల్లెలు, కూతుర్లు జిల్లెళ్ళమూడివచ్చారు మా 5వ అన్నయ్య కూతురు జానకి మరునాడు వచ్చింది. పోయినప్పుడు వేణు ఇక్కడే వున్నాడు. మా 5వ అన్నయ్య కుమారుడు వేణు కర్మ కలాపం పూర్తి చేశాడు. ఈ విధంగా జిల్లెళ్ళమూడి చేరిన క్రొద్ది రోజులలో ఇటువంటి మార్పు వచ్చింది. మా 5వ వదిన 2000 సంవత్సరం ఆగస్టు 15 ముందు నంద్యాల వెళ్ళింది. నాకు అదే పనిగా ఆవేదన అయింది. మా 5వ అన్నయ్య నయాపైసా ఆర్జన లేకుండా అమ్మలో ఐక్యం అయినాడు. వేణుకి స్థిరమయిన ఉద్యోగం లేదు. అప్పటికి కష్టపడి, ప్రవేట్ గా బి.ఎ. పూర్తి చేసి, ఎ.పి.పి.ఎస్.సి. వారి గ్రూప్ -2 ఎ. కి ఇంటర్వ్యూ కి హైదరాబాదు వచ్చాడు. కాని లక్షలు లంచాలు పుచ్చుకుని ఉద్యోగం ఇస్తున్న ఈ రోజులలో ఆ జాబ్ వానికి రాలేదు. తరువాత హైదరాబాదు రామాంతపూర్ లోని ప్రైవేట్ స్కూల్ అయిన ఆనంద జ్యోతి హైస్కూల్‌లో టీచర్‌గా పనిచేస్తూ ఎం.ఎ. ఫస్ట్ ఇయర్ పూర్తి చేశాడు. 2000 సం॥లో వాళ్ళ నాన్న అమ్మలో ఐక్యమవటంతో కొంత వాని చదువుకి అంతరాయం అయింది. 2000 సం॥, నవంబర్ 7వ తేదీ నాడు మా 4వ అన్నయ్య హైదరాబాదులో అమరుడైనాడు. మా ఇంట్లో అందరితో కలిసిపోయే వాడు, పెళ్ళి సంబంధాలు , జాతకాలు తెలిసి ఎంతగానో చేయగల సమర్థుడు మా 4వ అన్నయ్య. నవంబర్ 8 న బయలుదేరి హైదరాబాదు వెళ్ళి, వానిని కలిసి మా జానకి వివాహానికి ధన సేకరణ ఎట్లా చేయటం, ఇంకా అనేకమయిన విషయాలు చర్చించుదామని అనుకున్నాను. మా రెండవ అన్నయ్యకి, మూడవ అన్నయ్యకి ఉత్తారాలు వ్రాశాను. ఇంతలో ఈ అవాంతరం ఏర్పడింది. హైదరాబాదు వెళ్ళి, మా 4వ అన్నయ్యకు పిల్లలు లేని కారణాన నేను కర్మ చేయాలని వాడు కోరుకున్న కారణాన నేను కర్మ చేసాను. తరువాత మా రెండవ

అన్నయ్య కూతురు పద్మావతి, అల్లుడు బి. దుర్గా ప్రసాద్ గాంధీ గారు. పెద్ద కొడుకు మురళి, మా జానకి వివాహం విషయంలో కట్నానికి ఏదో విధంగా కొంత సహాయం అందచేయటానికి వారు మాట ఇచ్చారు. ఇది కూడా ఆ క్షణం దాకా నేను ఊహించని సంఘటన. తరువాత నంద్యాల వెళ్ళి కట్నం విషయం మాట్లాడాను. నాకు తెలిసిన జిల్లెళ్ళమూడి సోదరులకు ఉత్తరాలు వ్రాయటం, కలిసి అడగటం చేశాను. అందరి సహాయంతో ఫిబ్రవరి 12, 2001 న దాని వివాహం నిశ్చయించి, అన్ని కార్యక్రమాలు పూర్తి చేసుకుని నంద్యాల దగ్గర వున్న మహానంది పుణ్యక్షేత్రంలో కరివేణి బ్రాహ్మణ సత్రం మాట్లాడి, చక్కని ఏర్పాట్లు చేసుకున్నాము. విధి వైపరీత్యం వక్రించి రేపు వివాహం అనగా ఈ రోజు సాయంత్రం పెళ్ళి కొడుకు తండ్రి చనిపోయారు. ఇది మరొక అఘాతం అయింది. 3 నెలలు తరువాత చేసుకుంటామని పెళ్ళి కొడుకుకి సంబంధించిన పెద్దలు, తల్లి చెప్పారు. తరువాత జిల్లెళ్ళమూడి వచ్చాను. ఏప్రియల్ 22 హైదరాబాద్‌లో మా రెండవ అన్నయ్యకి సీరియస్ అయిందని తెలిసి హైదరాబాద్ వెళ్ళాను. మా రెండవ అన్నయ్య విపరీతంగా బాధ పడుతున్నాడు. మే 4న జిల్లెళ్ళమూడి లో జానకి వివాహం చేయమని పెళ్ళి కొడుకు తల్లి అడిగింది. మా అన్నయ్య సీరియస్ కావటం, నేను హైదరాబాదు వెళ్ళటంతో ఎప్పుడు దాని వివాహమా అనెడి మీమాంస నా మనస్సులో పడింది. హైదరాబాదులో మా రెండవ అన్నయ్య "మూడు నెలలు అయిన తరువాత చేయవచ్చు అంటే శుభస్య శ్రీఘ్రం , చెయ్యండి అయితే 4 వైపుల నుండి విచారించి చేయండి" అన్నాడు. తరువాత నేను జిల్లెళ్ళమూడి చేరాను. మా అన్నయ్య కొడుకు వేణు నంద్యాల వెళ్ళి, జిల్లెళ్ళమూడి చేరాడు.జిల్లెళ్ళమూడిలో స్థానిక కార్యదర్శి, సంఘటనా కార్యదర్శితో మాట్లాడితే మే 5న అమ్మ కళ్యాణ దినోత్సవం కనుక 4న అయితే అంతా మీరే చూసుకోవాలి, పెళ్ళికి అయ్యేడి ఖర్చు కూడా మీరే చూసుకోవాలి. తరువాత ఇ.సి. బాడి మీటింగ్‌లో మాట్లాడి, అయిన ఖర్చులో సగం కాని, పూర్తిగా కాని ఇచ్చేటట్లు సభ్యులతో మాట్లాడి చూస్తాము" అని అన్నారు. మే 5 అయితే అభ్యంతరం లేదు. అన్ని కార్యక్రమాలతో ఇక్కడే చేయవచ్చని అన్నారు. నంధ్యాల పెళ్లి వారికి ఫోన్ చేస్తే మే 4 నే చేయాలని అన్నారు. మే 4న ఇక్కడైతే ప్రతిదీ మేమే చూసుకోవాలి అనే సమస్య వచ్చింది. కనుక నంద్యాలలోనే చేసుకుంటే మంచిదని , మహానంది కరివేణి బ్రాహ్మణ సత్రం వీలుంటే మాట్లాడి ఏదో విధంగా జానకి కళ్యాణం చేస్తే మంచిదని ఆలోచించి నేను వేణు నంద్యాల ఫోన్ చేసి, నంద్యాల చేరాము. పెళ్ళి కొడుకు తల్లి వాండ్లు మహానందిలో

కళ్యాణానికి ఒప్పుకొనలేదు. పెండ్లి కొడుకు బంధువులు, నేను, వేణు, మా 5వ వదిన మరుదులు కలిసి వారికి తెలిసిన ఒకరి ఇంట్లో వివాహం చేయాలని నిశ్చయించుకుని హడావడిగా అన్ని ఏర్పాట్లు చేసుకుని మే 4 నాడు జానకి వివాహం పూర్తి చేయటం జరిగింది. తరువాత మే 8న జిల్లెళ్ళమూడి చేరాము. మే 10,11,12 తేదీలలో మా 5వ అన్నయ్య సంవత్సరీకాలు జిల్లెళ్ళమూడిలో పూర్తి అయినవి. తరువాత మే 17 న వేణు, మా 5వ వదిన, మా వదిన చెల్లెలు కూతుర్లు నంద్యాల వెళ్ళారు. అదే రోజు సాయంత్రం 6 గంటలకి మా రెండవ అన్నయ్య హైదరాబాదులో అమరుడైనట్లు ఫోన్ వస్తే హైదరాబాదు వెళ్ళి , 13వ రోజు వరకు వుండి , తరువాత కర్మకి వచ్చిన మా 5వ వదినని, కూతురు జానకిని, చెల్లెలు కూతురు పద్మని తీసుకుని నంద్యాల వచ్చి నంద్యాల నుండి జిల్లెళ్ళమూడి చేరాను. ఈ విధంగా ఎక్కడి కక్కడ అనూహ్యమయిన ఇబ్బందులలో అనేక కార్యక్రమాలు జరిగినవి. నేను జిల్లెళ్ళమూడి చేరినప్పటి నుండి ముగ్గురు అన్నయ్యలు పోవటం, భగవంతునిలో ఐక్యమవటం జరిగింది. మా అన్నయ్య కూతురు జానకి వివాహం జరిగింది. సాధక బాధకాలని తట్టుకొనెడి స్థితిని ఇచ్చి నడిపింది అమ్మ.

## నాకు ఏర్పడిన భావాలు

1. ఆ... మన అక్కయ్యే కదా? అని భావం ఏర్పడిన వాడ్ని. మొదట మనకంటే దైవశక్తులు ఉన్నయ్ అనుకున్నాను. అమ్మ చెంతకు చేరిన తరువాత త్రిమూర్తులు, త్రిమాతలు అమ్మ వాత్సల్యం కోసం పోరాడుతారు అనిపించింది.

2. సహజ సహనం - సహజ ప్రేమ సర్వత్రా నిండినది అమ్మ అనిపించింది. ఎక్కడ శక్తే తానై ఉంటుందో అక్కడ సహనం సహజమవుతుంది. ఎక్కడ జ్ఞానమే తానై ఉంటుందో అక్కడ ప్రేమ సహజమవుతుంది. ఈ విధంగా శక్తి, జ్ఞానం తానై ఉంటుంది అమ్మ.

3. జీవితాన్ని గెంటి వేయటం కాక జీవితం రూపాంతరం చెందటం.

4. జగత్తు తొలగటం కాక అజ్ఞానం తొలగటం.

5. గుణాలని నిరోధించటం కాక గుణాల మూలంగా భగవంతుని ఆరాధించటం.

6. గుణాలు, పదార్థం (జగత్తు) తొలగటం కాక కసాయి వాని చేతిలోని కత్తి, శస్త్ర చికిత్సకుని చేతిలోని కత్తి లాగ మారటం.

7. సోదరీ సోదరుల బంధంలోని విశిష్టతని ఈ విధంగా గ్రహించాను. ద్వంద్వ సంఘర్షణలు కాక ద్వంద్వాతీత బంధం. అంటే పెద్ద-చిన్న, ధనం ఉండటం - లేక పోవటం,

చదువుకోవటం - లేక పోవటం వీనికి అతీత బంధం.ఇది నిత్య జీవితానికి సామ్యతని సామరస్యాన్ని తీసుకుని వస్తుంది. ఆధ్యాత్మిక తత్వాన్ని ప్రతిష్ఠిస్తుంది. అనేకత్వంలో ఏకత్వం అనెడి ఆధ్యాత్మిక సూత్రాన్ని మన నిత్య జీవితాను బంధంతో మిళితం చేసి భౌతికానికి-ఆధ్యాత్మికానికి వారధి వేసింది అమ్మ.

8. "ఈ సృష్టిని మించిన మహిమ లేదని" చెప్పి మహిమల వైపు మానసిక పరుగుని వెనక్కి త్రిప్పింది. రామ తీర్థ ఒక ఉదాహరణ ఇస్తారు. "సూర్యునికి ఎదురుగా వెళ్తే నీడ నీ వెంట పడతుందని, వెన్ను చూపిస్తే నీవు నీడవెంట పడతావని" అంటారు. అంటే దివ్య పథం వైపు మనస్సు నడిస్తే మాయ నీ వెంట పడుతుంది. లేకపోతే నీవు మాయ వెంట పడతావని అర్థం. పైన అమ్మ సూక్తి ఆ విధంగా దివ్య పథం వైపు నడుపుతుంది.

9. విశ్వాసం ముందు విషయాలు వెల వెల పోవాలి. విషయాల ముందు విశ్వాసం వెల వెల పోకూడదు.

10. మనకు వచ్చెడి కష్ట సుఖాలకి, దైవ కృపకి సంబంధం లేదని అవగతం అయింది.

11. "మంచిని మించిన మహిమ లేదు. నీతి నిజాయితీయే దైవం" మొదలైన ప్రబోధాలు "సిద్ధుల కంటె చిత్త శుద్ధి గొప్పదనెడి" బ్రహ్మానంద నాధుని ప్రబోధంలోని విశిష్ఠ తత్వం మన అంతరంగంలో నిండేటట్లు చేస్తుంది. ఇదే సామాజిక సుఖ శాంతులకి, ఆధ్యాత్మిక శిఖరాగ్రానికి వారధి అని గ్రహించాను.

12. ఆధ్యాత్మిక చింతనలో భయ బీజాలను పటా పంచలు చేసింది. విశ్వాసంలో మూఢత్వాన్ని తొలగించింది.

13. జీవిత ఘట్టాలలో అనుభవం ద్వారా పొందిన జ్ఞానము హృదయ స్ఫూర్తియే అమ్మ మహిమ. దీనినే అమ్మ "అవకాశాన్ని గమనించటమే సాధన" అన్నారు. సాధన చేయటమనే క్రియ కాక జరగటమనే దివ్య శక్తి స్పందనని గమనించెడి తపస్సు అమ్మ చేయిస్తుంది.

14. ప్రతి ఒక్కరి స్థితి ఎక్కడికక్కడ అదేనని, ఎవరి స్థితిని చెడగొట్ట కూడదు. తక్కువ అనెడి భావం రాకూడదనెడి నిరహంకార భావాన్ని సుస్థిరం చేసింది. దీని వలన మరొకరి స్థితిని చెడగొట్టటం జరగదు. మనం మనంగా తృప్తిగా ధీరోదాత్తతతో ధ్యేయ పథంలో నిసంశయాత్మకంగా పురోగమించటం జరుగుతుంది.

15. "జీవితం జీవనం భగవంతుడే" అనెడి అమ్మ మాట, చైతన్యవంతమయిన జీవితంలో వచ్చే ఒడుదుడుకులలో నిశ్చంచలమయిన దివ్య భావాన్ని ప్రసాదించింది. ఈ విధంగా దివ్యత్వం భౌతికం కాక భౌతికాన్ని దివ్య మయం చేసి మన అంతరంగాలని, జీవితాలని నడిపింది అమ్మ అని గ్రహించాను.

॥ సమాప్తం ॥

ఓం అం ఆ

# అనుభవజ్ఞానదీపికలు

## డాక్టర్ పొట్లూరి సుబ్బారావుగారు

డాక్టర్ పొట్లూరి సుబ్బారావుగారు ప్రకాశం జిల్లా చీరాల వాస్తవ్యులు. వీరు బహుముఖ ప్రజ్ఞాశాలి. వైద్యం విషయంలో హోమియో, ఆయుర్వేదం, ఆయుర్వేద మందులు తయారు చేయటంలో కూడా గొప్ప సమర్ధత, జ్ఞానం కలిగిన వ్యక్తి. ఆధ్యాత్మికంగా, ధ్యానం, మంత్ర జపం మొదలైనవి తీవ్రంగా చేసిన వ్యక్తి. వారి తండ్రి గొప్ప ఆయుర్వేద వైద్యులు. అదీకాక గొప్ప వ్యాయామం సర్కస్ ఫీట్స్ చేసి ఎందరినో అలా తయారు చేశారు. సుబ్బారావు గారు కూడా కఱ్ఱ, కత్తి సాములు, కుస్తీపట్లు, సర్కస్ ఫీట్స్, యోగాసనాలు ఇంకా ఎన్నో వ్యాయామాలు చేసిన వ్యక్తి. సంకల్పంతో పాముని రప్పించి పాలు త్రాగించి పంపించేవారు. మంత్రం వేసి పాము కాటు విషం పోగొట్టేవారు. బంగారం పని, వడ్రంగం, రేడియో, టేప్‌రికార్డర్, మోటార్ మెకానిజం, సినిమా లేయటం, ఫొటోగ్రఫీ ఈ విధంగా అధునాతన టెక్నాలజీ విద్యలు ఎంతగానో తెలిసిన అఖండ విద్యావంతులు. వారికి వున్న సామర్ధ్యంతో ధనార్జన లక్ష్యంగా పెట్టుకుంటే కోటీశ్వరులయ్యే వారు. కాని ఆ విధంగా ఆర్జించలేదు. అందువలన ఆర్ధికంగా ఉన్నత స్థితిలో లేక పోయినా, అమూల్యమైన అనుభూతులు, ఎన్నో విద్యలు నేర్చిన విశిష్టమయిన వ్యక్తి డాక్టర్ సుబ్బారావుగారు.

ఇటువంటి వ్యక్తి అమ్మ సాన్నిధ్యానికి చేరి, ఎక్కడా తలవంచని వ్యక్తి అమ్మని దైవంగా సర్వస్వంగా విశ్వసించి అంకితమయినారు. వీరు మొదటి సారిగా అమ్మని దర్శించింది 1957వ సంవత్సరం. డాక్టర్‌గారి దగ్గరికి వైద్యానికి నోరి వెంకటేశ్వర్లు గారు వస్తూవుండేవారు. నోరి వెంకటేశ్వర్లు గారికి డాక్టరు గారు ఇంటి వైద్యులు. అమ్మని గురించి వెంకటేశ్వర్లు గారు డాక్టరు గారికి చెప్పారు. అమ్మ బాపట్లలో భావన్నారాయణ స్వామి గుడిప్రక్కన వున్న వీధిలో

అమ్మ తండ్రిగారి ఇంట్లో ఉంటున్న రోజులవి. ఒకరోజు వెంకటేశ్వర్లు గారు అమ్మను చూపించటానికి డాక్టర్ గారిని బాపట్ల జీపులో తీసుకువచ్చారు. వెంకటేశ్వర్లు గారు నాన్నగారిని అమ్మ దర్శనం గురించి అడిగితే రెడ్డి సుబ్బయ్యకి చెపుతాను అన్నారు. రెడ్డి సుబ్బయ్య వీరిని అమ్మ దర్శనానికి తీసి కొని వచ్చినప్పుడు రెండు చేతులు మోచేతి నుండి అరచేతి వరకు కలిపి నిలుచుని వున్నది. వెంకటేశ్వర్లుగారు తాను తెచ్చిన బత్తాయి పళ్ళు అమ్మ అరచేతి నుండి మోచేతి వరకు పెట్టారు. తరువాత సాష్టాంగ నమస్కారం చేసారు. ఆ సమయంలో డాక్టర్‌గారు కోటు జేబులలో రెండు చేతులు పెట్టుకుని నుల్చున్నారు. తానుగా అమ్మకి నమస్కారం చెయ్యకూడదని పట్టుదలగా ఉన్నారు. ఆ సందర్భంలో వారికి బొటనవ్రేలి నుండి చేతి వేళ్ళలో కదలిక వచ్చి రెండు చేతులు బయటకి అప్రయత్నంగా వస్తాయి. తరువాత రెండు చేతులు నమస్కార రూపంగా కలిసి పోయినయి. వెంటనే తన ప్రయత్నం లేకుండానే అమ్మ పాదాల మీద పడతారు. వారి ముఖం అమ్మ పాదాలమీద పడి, రెండు చేతులు పాదాలకు అటూ, ఇటూ పడినవి. ఈ విధంగా వారు సాష్టాంగ నమస్కారం చేయటం జరిగినది. మొదట వారు ఒక స్త్రీకి నేను నమస్కారం చెయ్యటం ఏమిటి అని దూరంగా నిలుచున్నారు. కాని ఇతఃపూర్వం వివరించిన తీరులో వారు అప్రయత్నంగా సాష్టాంగ నమస్కారం చెయ్యటం జరిగింది.

" ప్రయత్నానికి వెనుక ప్రేరణ ఒకటుంది. అది నేనే" అని అమ్మ స్పష్టపరచింది. వారికి మొదటి దర్శనంలోనే మూలమయిన తాత్విక అనుభూతి తెలియకనే కలిగింది.

## అమ్మ బిడ్డలు విడిగా అన్నపూర్ణాలయం ఏర్పరచుకోవటం నాంది.

అమ్మ చెంతకు వచ్చేడి బిడ్డలకి మొదటి రోజులలో అమ్మ తన ఇంట్లో వంట చేసి స్వయంగా పెట్టేది. రాను, రాను వచ్చే పొయ్యే వారి సంఖ్య అనేక ప్రాంతాల నుండి, ఊర్ల నుండి పెరిగింది. దీనితో అమ్మ అత్తయ్య అయిన కనకమ్మ గారికి విసుగు, కోపం వచ్చింది. ఒక రోజు కనకమ్మగారు రెండు గరిటలు కుంపటిలో కాలుస్తున్నది. అది చూసి క్రిష్ణవేణమ్మగారు డాక్టర్ పొట్లూరి సుబ్బారావు గారితో చెప్పినది. డాక్టరుగారు వంట యింటి వద్దకు వెళ్ళి దగ్గినారు. ఆ దగ్గు విని లోపలకు పిలిచింది అమ్మ. కొంత సేపటికి అమ్మ డాక్టరు గారు గుడి పునాదుల దగ్గరకు వచ్చారు. అప్పుడు అమ్మ డాక్టరు గారితో " ఆ గరిటెలు నాకోసమే కాలుస్తున్నది. వీళ్ళందరికి ఈ విధంగా పెడుతుంటే, ఎక్కడి నుండి తెచ్చిపెడతాడు వాడు?

ఇల్లంతా దోచిపెడుతున్నావు. నీపూయరోగం కుదురుస్తాను వుండు అవి కాలుస్తున్నది. నువ్వు వచ్చేటప్పటికి మానేసింది'' అన్నది అమ్మ.

డాక్టరుగారు "మాకోసం నువ్వు ఈ విధంగా బాధపడట మెందుకు అమ్మా? ఏదో విధంగా విడిగా మేము ఏర్పాటు చేసుకుంటాము'' అని చెప్పి చీరాల వెళ్ళారు. ( ఈ విషయం చెపుతున్నప్పుడు డాక్టర్ గారి గొంతు గద్గదమై కంటి వెంట నీరు వచ్చింది.) చీరాలలో వున్న అమ్మ భక్తులను సమావేశపరచి డాక్టరుగారు "జిల్లెళ్ళ మూడికి తరచు మనం, ఇంకా అనేక చోట్ల నుండి జనం వెళ్తూ వున్నాము. మనందరి భోజన వసతికి మనం వారిపై భారం వెయ్యటం కాక మన ఏర్పాట్లు మనమే చేసుకుంటే బావుంటుంది. అందువలన దాని నిర్వహణకి మనం నిధి సేకరించి దాని ద్వారా మనం అక్కడే భోజన వసతి ఏర్పాటు చేసుకుందాం'' అని చెప్పి, వందమంది తలా ఒక 50/– రూపాయలు వేసుకుని వంటకి కావలసిన సామగ్రి కొని జిల్లెళ్ళ మూడి చేరారు. అది 1958వ సంవత్సరం. ఆగస్టు 15వ తేదీన జిల్లెళ్ళమూడి లో అమ్మ అన్న పూర్ణాలయం ప్రారంభించారు. డాక్టరు గారికి పొంగలి ఏ విధంగా పొంగించాలో చెప్పి వారి చేత పొంగలి చేయించింది అమ్మ. ఈ విధంగా అమ్మ సంకల్పంతో, డాక్టరు గారి కృషితో 1958 ఆగష్టు 15వ తేదీన అన్నపూర్ణాలయం ప్రారంభం జరిగింది.

## చారిత్రాత్మకంగా డాక్టరు గారు చేసిన విశిష్టమయిన పనులు:-

హైమాలయం వెంత వున్న బావిని త్రవ్వినది డాక్టరు సుబ్బారావుగారు.

హైమాలయం ప్రాంతంలో ఒకప్పుడు పెద్ద మందిరం వుండేది. అది తాటాకు పాక. అది చీరాల వారి ఆధ్వర్యంలో డాక్టర్ సుబ్బారావు గారు నిర్మించారు.

అమ్మ పుట్టినరోజు మొదటిసారిగా మొదలుపెట్టినది డాక్టర్ సుబ్బారావు గారు.

ఈ విధంగా డాక్టర్ గారు మొదటిసారిగా వచ్చేపొయ్యే వారి కోసం నివసించటానికి మందిరం, భోజనవసతి కోసం అన్నపూర్ణాలయం, నీటి కోసం బావి, జగజ్జనని అయిన అమ్మ అవనీస్థలిపై అవతరించిన శుభదినమయిన పుట్టినరోజు మహోత్సవం మొదలైనవి చారిత్రాత్మకంగా చేశారు.

ఈ పుట్టిన రోజు నాడే 1973లో స్వర్ణోత్సవ సందర్భంగా లక్షమంది ఒకేపంక్తిలో భోజనం చేశారు. ఈ పుట్టినరోజు నాడే 1983లో అమ్మ వజ్రోత్సవ సందర్భంగా 60 వేల మంది అమ్మ

ప్రసాదం స్వీకరించారు. ఇట్టి మహత్తరమయిన ఘట్టాలకి మూలంగా నాంది ప్రస్తావన పలికి మొదటిసారిగా అమ్మ జన్మదినోత్సవం జరిపినది డాక్టర్ పొట్లూరి సుబ్బారావుగారు.

అమ్మ రూపాలను వేలకు వేలుగా ఫొటోలు తీసి అనేక సందర్భాలలో మూవీ కెమెరాలతో సినిమా తీసి ఎన్నో స్లైడ్స్ తీసి, నిరంతరం అమ్మను రూప,ధ్యాన, దర్శనాదులతో అర్చించుకున్న ధన్యజీవి డాక్టర్ గారు.

## రహి అనే సిద్ధపురుషుని గురించి డాక్టర్ గారు ఇచ్చిన వివరణ :-

అమ్మ వల్ల సిద్ధ పురుషులు అయిన వారిలో రహి ఒకరు. ఒక సందర్భంలో అమ్మని చెట్టు క్రింద పడవేసి కత్తి తీసుకుని పొడవబోతారు ఒక వ్యక్తి. ఆసమయంలో చెట్టు మీద నుండి రహి దూకుతాడు. దూకిన వెంటనే ఆవ్యక్తి చేతి నుండి కత్తిని లాక్కుని " ఈ విధంగా చేయవచ్చా? మహాసాధ్విని ఈ విధంగా బాధలు పెడతావా? ఇంత దారుణం చేస్తావా?" అని గద్దిస్తాడు. తదనంతరం అదృశ్యమయి పోతాడు

యార్లగడ్డ రాఘవయ్య గారు రేపల్లె తాలుకా, సింగుపాలెం నివాసి. వారు అంధులు. అమ్మని వారు దర్శించినప్పుడు వారికి సింహ వాహనారూఢ అయిన భవానీ దేవిగా దర్శనమిచ్చారు అమ్మ. ఇటు వంటి అదృష్టానికి నోచుకున్న రాఘవయ్య గారికి కొంత కాలానికి రహి రక్తాక్షరాలతో ఒక ఉత్తరం వ్రాశాడు. దానిలో " ఇక నేను వుండవలసిన అవసరం లేదు. శరీరం చాలిస్తున్నాను. వచ్చిన పని అయిపోయింది" అని వున్నది. (పూర్తిగా ఏమున్నదో సమగ్రంగా తెలియరాలేదు) ఈ విధంగా రాసి పంపుతాడు రహి. మొక్కపాడు అనే వూళ్ళో అమ్మ భర్త సేద్యం చేస్తున్నరోజులు అవి. మొక్కపాడు పొలంలో అమ్మ భర్త వుండగా రహి కత్తి తీసుకుని ఆయన చెంతకు వస్తాడు. అమ్మని పొడుద్దామని అమ్మపైకి ఆవ్యక్తి ఎత్తిన కత్తి అది. రహి దగ్గరికివస్తుంటే అమ్మ భర్త భయపడతారు. రహి ఆయన దగ్గరికి వచ్చి " ఇక నేను శరీరం చాలిస్తున్నాను. నేను వుండవలసిన అవసరం తీరిపోయింది' అని చెప్పి ఆ కత్తితో తాను పొడుచుకుని, గుండె నుండి దేహంలో అన్ని వైపులా కత్తితో త్రిప్పుకుని క్రింద వున్న మట్టి అంతా తన రక్తంతో తడవగా అక్కడే దేహాన్ని చాలించాడు.

రహికి దూరశ్రవణం, దూర దర్శనం, అదృశ్యం, మొదలైన అనేక సిద్ధులు వున్నాయి. అతనికి తన మరణం సంగతి ముందుగానే తెలుసు.

## అమ్మ జిల్లెళ్ళమూడిలోని తన స్థితిని చీరాలలో తెలియచెయ్యటం:-

ఒక సారి డాక్టర్ గారు చీరాలలో అక్కడ వున్న అమ్మ భక్తులతో మాట్లాడు తున్నారు. ఆ సందర్భంలో గోడకి ఆనుకుని బాధపడుతూ దుప్పటి కప్పుకుని పడుకుని వున్న అమ్మ కనపడింది డాక్టర్ గారికి. వాతం, పిత్తం, శ్లేష్మం, వేటి వల్లనయినా వచ్చే ఎటువంటి నొప్పులనయినా పోగొట్టే మందు ఒకటి డాక్టర్ గారు స్వయంగా చేసినది వారి దగ్గర వున్నది. వారికి ఎప్పుడైతే ఇతః పూర్వం వివరించినట్లు కనపడిందో వెంటనే తాను తయారు చేసిన మందు తీసుకుని జిల్లెళ్ళమూడి వచ్చారు. తనకి చీరాలలో ఏవిధంగా కనపడిందో అదే విధంగా అమ్మ ఇక్కడ వున్నది. అమ్మని డాక్టర్ గారు అడిగారు. "నిన్ను కొట్టారా? ఎందుకు ఈ విధంగా వున్నావు"? అని. వెంటనే అమ్మ " అదేమి లేదు నాన్నా". అన్నది. కాని అమ్మని విపరీతంగా కొట్టడం జరిగింది. డాక్టరుగారు తీసుకువచ్చిన మందు అమ్మకి ఇచ్చారు. అమ్మకి ఆనొప్పులు తగ్గినయి. ఇటువంటి బాధా గాధల ఘట్టాలు ఎన్నో. కాని అమ్మ అసలు సంగతి తెలియచేసేది కాదు. అటువంటిది ఈ విధంగా తన స్థితిని చీరాలలో వున్న డాక్టర్ గారికి తెలియచేసింది అమ్మ.

## సర్వంలో శూన్యం, శూన్యంలో సర్వం:-

జిల్లెళ్ళ మూడిలో ఒకసారి డాక్టరుగారు మరికొంత మంది అమ్మ చెంత వున్నారు. అప్పుడు ఆకాశం నుండి తేనె లాంటి తియ్యని ద్రవపదార్థం ధారగా పడింది. అమృత తుల్యమయిన ఆ ద్రవాన్ని డాక్టరుగారితో పాటు అక్కడ వున్న వారు దోసిళ్ళతో పట్టుకుని త్రాగారు.ఆద్రవ పదార్థం కాక దానితో తడిసిన పేడతో అలికినమట్టిని అమ్మ తిన్నది. ఆ సందర్భంలో అమ్మ భర్త అక్కడ లేరు. పొలం వెళ్ళారు. వారు పొలం నుండి వచ్చే సమయానికి అదిపడటం ఆగిపోయింది. ఈ విధంగా శూన్యంలో సర్వం, సర్వంలో శూన్యం (ఆకాశంలో సర్వం, సర్వంలో ఆకాశం) యొక్క ఉనికిని తెలియచేసింది అమ్మ. సర్వమూ తానైన అమ్మ సంకల్ప మాత్రం చేత ఏదైనా చేయగలదని తెలియచేసింది.

" కనపడే పదార్థమంతా ఆకాశానికి ప్రతిరూపం అని , మనకి వచ్చే సంకల్పమంతా ప్రాణ శక్తికి ప్రతిరూపమని" వివేకానంద అంటారు. ఈ సర్వం తానయిన అమ్మకి ఇదంతా అత్యల్పం. అమ్మ కరుణ వల్ల అందరూ ఆ మధుర పదార్థాన్ని ఆ రకంగా సేవించి, ఆనందించే అదృష్టానికి నోచుకున్నారు.

## పంచభూతాలు తానయిన అమ్మ

అమ్మకి ఒకసారి దబ్బనం కాల్చి కంటి దగ్గర పొడిచారు. ఆ దృశ్యం చూసిన రేటూరు మహలక్ష్మమ్మ గారు పరుగెత్తుకుంటూ వెళ్ళి క్రిష్ణవేణి అక్కయ్యతో చెప్పింది. క్రిష్ణవేణి

అక్కయ్య వెళ్ళి చూస్తే అమ్మ కంటి దగ్గర ఏమి కనబడలేదు. తరువాత డాక్టర్ గారు వెళ్తే అమ్మ జరిగిన విషయం వారికి చెప్పి, "అన్నీ పోగొట్టుకున్నాను, ఒక్క మచ్చ మాత్రం ఇక్కడ వుంచాను" అని కంటి దగ్గర అమ్మ చూపించింది.

మరొక ఘట్టం మన్నవ బుచ్చిరాజు అనుభవం . ఇది సరాసరి డాక్టర్ గారి అనుభవం కాదు. కాని పై శీర్షికని తెలియచేసే సంఘటన కాబట్టి పొందుపరచటం జరిగింది. అమ్మ భర్త జిల్లెళ్ళమూడి లో కొంతకాలం పొగాకు బారన్ నడిపారు. చీరాల ఐ.ఎల్.టి.డి.లో మన్నవ బుచ్చిరాజు పనిచేస్తూ వుండేవాడు. అతనికి పొగాకు విషయం తెలుసు కనుక పొగాకు గ్రేడింగ్ చూడటానికి జిల్లెళ్ళమూడి వస్తూ పోతూ వుండేవాడు. ఒకరోజు జిల్లెళ్ళమూడి వచ్చి బారన్ తలుపు తీసి చూశాడు, ఎదురుగా ఉన్న దృశ్యం చూసి ఆశ్చర్యపోయాడు. మనిషి ఎముకలు కూడా నుసిచేసే అగ్నిజ్వాలల వేడిలో అమ్మ ఉన్నది. ఈ దృశ్యం చూసిన రాజుకి షాక్ తిన్నట్టు అయింది. ఇతను చూస్తుండగానే నల్లగా కమిలిన దేహంతో అమ్మ మెల్లగా బయటకు వచ్చింది. కొద్దిసేపటికి అమ్మ శరీరం మామూలు రంగుకి వచ్చింది. పంచభూతాలు తానే అయి పంచభూతాలకి అతీతమయిన అమ్మని అవి ఏం చేస్తాయి.

## డాక్టర్ గారితో అమ్మ తెలియచేసిన విషయాలు :-

సర్వమూ తెలిసిన నేను సర్వాన్ని నిరోధించగలను అని తెలుసుకోలేరు.

బాధే నేనైనప్పుడు నాకు బాధే లేదు. వ్యాధులకు రూపాలున్నై , అవి నాకు కనపడుతూ వుంటాయి.వ్యాధులూ ప్రాణులే. ఈ శరీరం మీద 30,40 రకాలకు తగ్గకుండా వుంటాయి. మీరు నన్ను విడిచి వుండలేనట్టు అవి కూడా నన్ను విడువలేకుండా వున్నయి.

అమ్మ జన్మించక ముందే 34 సంవత్సరముల వయస్సు కల స్థూల రూపంతో అమ్మ తండ్రి అయిన మన్నవ సీతాపతి శర్మ గారికి దర్శనం ఇచ్చింది. " నేను అమ్మను, మీ ఇంట్లో పుడతాను" అని చెప్పినది.

అమ్మ కూతురు హైమ 1968 ఏప్రిల్ 5న పోయినప్పుడు 6వ తేదీన భూగృహంలో పెట్టడం జరిగింది. అప్పుడు హైమకు మళ్ళీ నాడి ఆడటం, వేడి రావటం జరిగింది. అమ్మ ప్రాణప్రతిష్ట జరిపి అందరి సమక్షంలో సమాధి చేసింది. అప్పుడు ఆ సమాధి పై నిలబడి0 "ఈ అమ్మాయి మరల మీకు కనబ2డుతుంది. మీతో మాట్లాడుతుంది. మీతో కలిసి తిరుగుతుంది" అని చెప్పింది.

" సర్వ వ్యాపకమైన శక్తికి ఆసక్తి కలిగినప్పుడు ఎక్కడికక్కడే రూపధారణ చేస్తుంది." అని చెప్పింది అమ్మ.

## అవలీలగా ఆధ్యాత్మిక శక్తులు ఇవ్వటం :-

డాక్టర్ గారు, అచ్యుతుని సుబ్బారావు గారు ఒక పూర్ణిమ నాడు జిల్లెళ్ళమూడి వచ్చారు. ఇద్దరూ స్నానం చేసి వచ్చి జపానికి కూర్చున్నారు. అప్పుడు అమ్మవచ్చి డాక్టరుగారి శిరస్సు మీద చెయ్యిపెట్టి చెవులో ఏదో అన్నారు. ఏమందో వారికి తెలియలేదు. వెంటనే వారికి మనస్సు అంతర్ముఖం అయింది. ఆ సందర్భంలో దేహం మీద చీమలు పాకుతున్నా, ఏమి జరిగినా తెలియని స్థితిలో వున్నారు డాక్టరుగారు. ఇంతకు ముందు తాను ఓరుగంటి నరసింహం గారి దగ్గర ఉపదేశం అయినప్పుడు యోగసాధన చేసి ఎంత ప్రయత్నం చేసినా ఆ స్థితి రాలేదు. వారికి అమ్మ చెంతకు రాక ముందు ఎన్నో సార్లు రామలాలా ప్రభుజీని ధ్యానిస్తే కనబడలేదు. ఇప్పుడు అమ్మ ప్రభావం వల్ల మనస్సు అంతర్ముఖం అయినది. ఆ స్థితిలో వారికి రామ లాలాప్రభుజీ కనపడతారు. ప్రభుజీ పూల మందిరంలో కూర్చుని వున్నారు. వారి శిరస్సు మీద పూలకిరీటం పెట్టి వుంది. అక్కడే ప్రక్కన ఒక కుఱ్ఱవాడు కూర్చుని వుంటాడు. డాక్టరు గారు అతనితో ఇక్కడ కూర్చున్నా వేమిటి రా .....అని చెయ్యి పట్టుకుని అంటే అతను రాడు. తరువాత డాక్టరు గారు మాత్రం వెళ్ళి వారికి నమస్కరిస్తారు. ఈ అనుభవం ధ్యానంలో కలిగింది. వెంటనే మామూలు స్థితికి వచ్చారు.

ప్రక్కనే కూర్చున్న అచ్యుతుని సుబ్బారావుగారికి ఈ విధమయిన అనుభూతి కాలేదు. దివ్యమూర్తి అయిన అమ్మ అనుగ్రహం వలన ఎంతగానో సాధన చేసినా లభ్యంకాని అనుభూతులు, స్థితులు డాక్టర్ గారికి అవలీలగా లభ్యమయినవి. ఈ సాధన పరమలక్ష్యం అయిన అమ్మకి ఇట్టి స్థితులు ఇవ్వటం ఉచ్ఛ్వాస నిశ్వాస్వాలు వాటంతట అదే జరిగినంత తేలికైన విషయం కదా!

## అమెరికాలో ఉన్న వారితో ఇంగ్లీషులో మాట్లాడటం :-

ఒక సారి డాక్టర్‌గారు, రాజు పాలెం రామచంద్రరావుగారు అమ్మ సన్నిధిలో కూర్చున్నారు. అమ్మ సమాధ్యవస్థలో కొంతసేపు ఇంగ్లీషులో మాట్లాడారు. మధ్య, మధ్యలో వినపడిందా? ఆ .....వినపడలేదా"? అంటూ కొంచెం పెద్దగా మాట్లాడేది. అమ్మ మాట్లాడిన విషయాన్ని, రాజుపాలెం రామచంద్రరావుగారు ఒక కాగితం మీద వ్రాసుకున్నారు. అమ్మ మామూలు స్థితికి వచ్చిన తరువాత " ఏమిటమ్మా? ఇప్పుడు ఇంగ్లీషులో మాట్లాడావు?" అని వీరిద్దరూ అడిగారు. అప్పుడు అమ్మ "ఇప్పుడు అమెరికాలో వున్నవారితో మాట్లాడాను. వారు కొన్ని

ప్రశ్నలు వేశారు. వాటికి సమాధానంగా బెర్ట్రండ్ రస్సెల్ కొటేషన్ చెప్పాను. ఫలానా పేజి నుండి ఫలనా పేజి వరకు ఈ విషయం వుందని'' అమ్మ వారిద్దరికి చెప్పారు. తరువాత రామ చంద్రరావుగారు వేటపాలెం వెళ్ళి లైబ్రరీలో బెర్ట్రండ్ రస్సెల్ పుస్తకంలో అమ్మ చెప్పిన పేజీలు చూస్తే, సరిగ్గా అమ్మ చెప్పినదే ఉన్నది. ఎక్కడో కొన్ని వేల మైళ్ళ దూరంలో ఉన్నవారితో ఈ విధంగా ఇంగ్లీషులో మాట్లాడటం జరిగింది. దూరశ్రవణం తనకి ఉండటమే కాదు. దూరంగా వున్నవారికి వినిపింపచేయటం మొదలైనవి వాణీ విద్యాదాయిని అయిన అమ్మకి చాలా చిన్న విషయం. ఈ విధంగా మన పరిధికి అందని వారితో ఎందరితో సంబంధ బాంధవ్యం వున్నదో తెలియని విషయం.

## గర్వభంగం, కనువిప్పు చేయటం:-

జగజ్జననిసాన్నిధ్యంలో ఎక్కువగా వుండటం, ఫొటోలు తీయటం మొదలైన విశిష్టమైన అదృష్టాలు డాక్టర్‌గారికి లభ్యపడినవి. దీనితో ఫొటోలు తీసే అదృష్టం నాకు బాగా లభ్యపడింది అని అహంకారం వీరిలో పెరగటం జరిగింది. ఆ సందర్భంలో అమ్మ దగ్గరికి రాకుండా 3 నెలలు ఉన్నారు డాక్టరు గారు. ఈ మూడు నెలలు మద్రాసు నుండి మరొకరు వచ్చి ఫొటోలు తీశారు. 3నెలల తరువాత చీరాల నుండి జిల్లెళమూడి వెళ్ళే వారికి ఒక ఉత్తరం ఇచ్చి పంపారు డాక్టర్ గారు. ఈ ఉత్తరములో ''బ్రతికి వున్నాడు జీవచ్ఛవము వోలె' అని వ్రాసి పంపారు. అప్పుడు అమ్మ డాక్టర్‌గారిని రమ్మని కబురు చేసింది. తరువాత డాక్టర్ గారు జిల్లెళ్ళమూడి వెళ్ళారు.

ఇందులో తెలుసుకొనవలసిన విషయం ఏమిటంటే సత్కర్మసహితం అహంభావాన్ని కలుగచేస్తుంది. చెడుకర్మ ఇనుప సంకెళ్ళు అయితే సత్కర్మ బంగారు సంకెళ్ళు. దీనిని తెంచుకోవటం తేలిక. సహజంగా మంచితనం కలిగి సత్కర్మ చేస్తుంటే ఎన్నడైనా తిరిగి అహంకారం పెరిగినా తిరిగి త్వరగా వివేకవంతులై అహంకారాన్ని తొలగించుకుని ఉన్నతులవుతారు. అందుకనే భగవంతుడు రాక్షసులను సంహరించాడని, దేవతలను రక్షించాడని చెపుతారు. దేవతలలో అహంకారం పెరిగినప్పుడు వారికి కనువిప్పుకొరకు కొంత శిక్షించాడు. కారణం కొద్దిపాటి శిక్షతో మారేవారు దేవతలు కనుక. సంహారం తప్పనిసరిగా అనివార్యమయిన వారు రాక్షసులు కనుక వారిని సంహరించారు. అవతారమూర్తులు అందుకని ఒకరిని శిక్షించారు, మరొకరిని సంహరించారు. ''శిక్షణే తప్ప

శిక్షలేదు. శిక్షణ కూడా రక్షణే. సర్వం అనుగ్రహమే" అన్నది అమ్మ. ఇతః పూర్వం దేవతల విషయంలో వివరించినట్లు డాక్టర్ గారికి కనువిప్పు అయ్యేటట్లు చేసింది అమ్మ.

**అనుభూతులకు సాక్ష్యం:-**

అమ్మ జిల్లెళ్ళమూడి నుండి డాక్టర్ గారిని పిలిస్తే డాక్టర్‌గారికి వినపడి వచ్చేవారు. చీరాలలో వారికి కనపడటం కూడా జరిగేది. అమ్మ పిలుపు వినపడినప్పుడు జిల్లెళ్ళమూడి వెళితే వారికి చీరాలలో వినపడిన సమయానికే అమ్మ జిల్లెళ్ళమూడి లో పిలిచినట్లు వివరం తెలిసేది. 1962లో అమ్మ చీరాల వెళ్ళారు. అప్పుడు తాను డాక్టరు గారి ఇంటికి వెళ్లటం జరిగింది. డాక్టరు గారితో అమ్మ జిల్లెళ్ళమూడి నుండి పిలిచినప్పుడు ఆయన ఎక్కడ నిలుచున్నది, తను కనపడినప్పుడు తాను వారి ఇంట్లో ఎక్కడ నిలుచున్నది అన్నీ వివరించి చూపించింది. ఈ విధంగా తను ఇచ్చిన అనుభూతులకు తనే సాక్ష్యం చూపించింది. సర్వత్రా తన ఉనికిని ఈ విధంగా వారికి తెలియచేశారు అమ్మ.

**అమ్మ అనంతబంధం, శబరికి దర్శనం :-**

ఈ సంఘటన గురించి వేరొక వ్యాసంలో వ్రాసినప్పటికి డాక్టరు గారు ప్రక్కనే వుండి అనుభవించినది కనుక వారి అనుభవాల సంపుటిలో మళ్ళీ వివరిస్తున్నాను.

62లో అమ్మ చీరాల వెళ్ళారు. అప్పుడు అమ్మ డాక్టర్ గారు మరికొందరితో " ఇక్కడ ఒక శబరి వున్నది. నాకోసం పరితపిస్తున్నది. దాన్ని చూడాలి నాన్నా" అన్నారు. కారంచేడు సీతమ్మగారి జీపులో అమ్మ మరికొందరితో పాటు డాక్టరుగారు కూడా వెళ్ళారు. ఆ జీపును చీరాల సముద్రం దగ్గరవున్న ఓడరేవు పల్లెకారుల గుడిసెల దగ్గర ఒక గుడిసె ముందు ఆపింది అమ్మ. ఆ గుడిసెలో 80 ఏళ్ళ వృద్ధురాలు కుక్కిమంచంలో పడుకుని వున్నది. ఆమెని అమ్మ తట్టి లేపింది. అమ్మని చూడగానే ఆ వృద్ధురాలు ఆనందంతో "ఎంత కాలానికి వచ్చావమ్మా? అన్నది. అమ్మ, "ఊ... వచ్చాలే. కానీ లే" అంటూ ప్రసాదం ఇచ్చింది. డాక్టర్ గారితో "నాన్నా! మా ఇద్దరికీ ఫొటో తీయి" అన్నది. అమ్మ "ఇక్కడ లైటు సరిగ్గాలేదు బయటికి వస్తే ఫొటో బాగా వస్తుంది" అన్నారు డాక్టరుగారు. అమ్మ ముసలమ్మతో "లే - బయటికి వెళ్ళి ఫొటో తీసుకుందాం" అంటే " ఏడు సంవత్సరాల నుండి అన్నీ మంచంలోనే చేస్తున్నాడు నాకొడుకు, నేను లేవలేనమ్మా" అన్నది ముసలమ్మ. వెంటనే అమ్మ " లేస్తావులే లే" అంటూ ఆమె చెయ్యి పట్టుకుని లేవతీసింది. వెంటనే ఆమె లేచి నుంచున్నది. నడచి

బయటికి వచ్చింది. ఆ వృద్ధురాలు బయటికి వచ్చిన తరువాత ఆమెని కూర్చోపెట్టి తను ప్రక్కనే నిల్చుని , ఆమె శిరస్సు మీద చెయ్యి పెట్టి ఫొటో తీయించింది అమ్మ. తరువాత లోపలికి తీసుకుని వెళ్ళి కూర్చోపెట్టింది. అప్పుడు ఆమె " ఇంకా ఎందుకమ్మా? నీలో కలుపుకో" అన్నది. ఆమెకి దర్శనం ఇచ్చి వచ్చిన మరుసటి రోజు శరీరం చాలించింది ఆ ముసలమ్మ. అమ్మలో లీనం అయింది. రామాయణంలో శబరి కూడా శ్రీరాముని కోసం వేచి వుండి, రాముని దర్శనం అయిన తరువాత, మతంగ మహర్షి ఆశ్రమం చూపించి, అగ్నిగుండంలో దూకి దేదీప్యమానమయిన శరీరంతో గగన తలంలోకి వెళ్తుంది. అదే విధంగా ఈ శబరి కూడా అమ్మ కోసం తపించింది. అమ్మ దర్శనం అనంతరం శరీరం చాలించింది. ఆ శబరికి తనకి ఉన్న బంధం ఏమిటో అమ్మ చెప్పలేదు. ఎంతమందికి అద్భుతమైన స్థితి ఇచ్చిందో. మన పరిధికి అందని మహాత్ములు ఎంతమంది వున్నారో, దేశకాలాతీతమైన అమ్మ ఉనికిని, అనుబంధాన్ని మనం గ్రహించలేము. అయినా ఈ ఘట్టం ఆ స్థితిని మనకు తెలియచేస్తుంది. సంఘటన వ్యక్తీకరణ లేనిది మనం గ్రహించలేము కనుక.

## దివ్య దర్శనాలు అలౌకిక స్థితులు :-

అమ్మ చీరాల బేర్ హాస్పిటల్ లో కొంతకాలం వుండటం జరిగింది. అక్కడ ఒక కాంపౌండర్‌కి అమ్మ మెరిసిపోతూ కనపడింది. అదే హాస్పిటల్ లో మిస్ మేయర్ అనే డాక్టర్ ఒకరు ఉన్నారు ఒకసారి అమ్మ గదిలో పడుకుని ఉన్నప్పుడు మేయర్ వచ్చి చూస్తే గదంతా వ్యాపించి ఉన్న కేశాలతో అమ్మ కనపడింది. ఆ దృశ్యం చూసినప్పటి నుండి అమ్మ యొక్క అలౌకికత వారు అనుభవించటం మొదలయినది. మిస్ మేయర్ కూర్చున్న గది నుండే, గదులు, గోడలు అడ్డు వున్నా, లేనట్లు వారికి అమ్మ కనపడేది. ఇట్లా ఎన్నో అనుభూతులు ఇచ్చారు అమ్మ. వారు భారత దేశం వదిలి అమెరికా వెళ్ళిన తరువాత చాలా కాలం వారితో అమ్మ ట్రాన్స్‌లో మాట్లాడేది. ఈ డాక్టర్స్ మనదేశంలో వుండగా ఒకసారి అరుణాచలం వెళుతూ అమ్మని కూడా తీసుకువెళ్ళారు. అక్కడ ఒక హాస్పిటల్ మొదలు పెట్టటానికి వెళ్తూ వారితో కూడా అమ్మని తీసుకువెళ్ళారు. ఆ సందర్భంలో వీరంతా రమణమహర్షి ఆశ్రమం వెళ్ళారు. అమ్మ ఒక ప్రక్కన కూర్చుని ఉంటుంది. అమ్మని చూసి రమణమహర్షి "మాతృశ్రీ" అంటారు. అమ్మకి రమణమహర్షికి మాత్రమే తెలిసిన విషయమిది. మహర్షికి దర్శనం ఇవ్వటం, వారు మాతృశ్రీ అనటం జరిగింది. డాక్టర్ పొట్లూరి సుబ్బారావు గారితో అమ్మ

చెప్పినమాట తాను మహర్షికి దర్శనం ఇచ్చానని. తను దర్శనం ఇచ్చిన చోటనే మాతృ భూతేశ్వరాలయం రమణమహర్షి నిర్మించారని తెలియ చేసింది.

**భవిష్యత్ వివరణ :-**

అమ్మ డాక్టర్ గారు ఒకసారి ఏడవమైలు వరకు నడచి వెళ్ళారు. అప్పుడు అమ్మ " ఇది తిరుపతిని మించిన క్షేత్రం అవుతుంది. ఈ దాపులో విమానాశ్రయం వస్తుంది. ఈ రూపమే మారిపోతుంది. ఇప్పుడు వున్న రూపం ఫొటో తీసిపెట్టుకో". అని చెప్పి జరగబోయేవి అనేకం చెప్పింది. వానిలో దేశవ్యాప్తంగా, ప్రపంచ వ్యాప్తంగా జరిగేవి కొన్ని చెప్పింది. వాటిని ఈ క్రింది విధంగా వివరించింది:.

1. జిల్లెళ్ళమూడిలో చాకలి చెరువు సమీపంలో పంపులు వేస్తే మంచినీళ్ళు పడతాయి.

2. ప్రపంచ క్షామం వస్తుంది. వర్షాలు వుండవు. పంటలు పండవు. భూమిలోని నీరు లోపలికి పీక్కుపోతుంది. కోటి రూపాయలు వున్నా పిడికెడు మెతుకులు దొరకటం కష్టం. కోటానుకోట్ల జనులు నశిస్తారు. తింటానికి తిండి, త్రాగటానికి నీరు దొరకవు. అంతా అమ్మేవారే కానీ కొనేవారుండరు, డబ్బుండి.

ప్రజల దగ్గర డబ్బుండదు గవర్నమెంట్ గుంజేస్తుంది. గవర్నమెంట్ దివాలా తీస్తుంది.

3. నేను ఉన్నన్నాళ్ళు నా బిడ్డలకు అన్నం పెట్టుకోవటం జరుగుతుంది. " ఈ అన్నం ఈ విధంగా పెట్టుకోవటం నా తరువాత ఆగిపోతుంది. సత్రాలు , క్యాంటిన్లు, హోటళ్ళు ఏర్పడుతాయి.

4. నేను మహాసిద్ధి పొందినప్పుడు లారీలతో టెంకాయలు తెచ్చికొడతారు. విసుగు పుట్టేవరకు బాధలు తెచ్చుకుంటారు. విసుగు పుడితే వెంకటేశ్వర స్వామి శిల కాలేదా? ఎంతసేపు?

**మనకి ఇచ్చిన సందేశం :-**

నా తరువాత ఇవ్వన్నీ ఇట్లాగే సాగించండి. జిల్లెళ్ళమూడి అవ్వ ఎక్కడున్నది? అని వెతుక్కుంటూ వస్తారు. లక్షల సంఖ్యలో వస్తారు.

6. సర్వవ్యాపకమైన శక్తికి ఆసక్తి కలిగినప్పుడు ఎక్కడి కక్కడే రూపధారణ చేస్తుంది. 7వ మైలు వరకు పందిళ్ళు వేయించుతాను. నా బిడ్డలకు గంజి అయినా పోసి పెట్టుకుంటాను.

7. నాలుగుదిక్కుల నుండి మఠాధిపతులు వచ్చి ఇచట ఏమీ లేదని, "ఛీ పాడు ముండ" అని తిట్టివెళ్లారు. తరువాత తిరిగి వచ్చి "తల్లీ శారదా నీ విక్కడ వుంటే మాకు వేరే మఠాలు దేనికి? ఇక్కడ ఒక కుటీరం వేసి ఇస్తే నీ పాద సన్నిధిలో పడివుంటాం" అని ఇక్కడే వుంటారు" అని చెప్పింది.

**త్రిమాతలు తానే అని తెలియచెయ్యటం :-**

జిల్లెళ్ళమూడి లో అమ్మ పూరిపాకలో వున్న రోజులలో ఒకసారి డాక్టర్‌గారు అమ్మ సాన్నిధ్యంలో కూర్చున్నారు. అది రాత్రివేళ 10గం॥ సమయం సుమారుగా. అమ్మ సమాధ్యవస్థలో అనేక భాషలలో మాట్లాడటం జరిగింది. "ఇప్పుడొక విశేషం జరగపోతున్నది! రండి" అని అనేక భాషలలో ఎందరో మహానుభావులను పిలిచినట్లు డాక్టరుగారికి వారికి అర్థమయిన భాషలో అమ్మ మాట్లాడినప్పుడు అర్థమయింది, ఇట్లా మాట్లాడిన తరువాత" అమ్మ మామూలు స్థితికి వచ్చారు. అక్కడ వున్న వారిని స్నానం చెయ్యటానికి నీళ్ళు సిద్ధం చెయ్యమని, స్నానం చేసి వచ్చి నిలపడింది. ముప్వల సత్యం అనే సోదరుడు పెట్రోమాక్స్ లైట్ వెలిగించాడు. ఆ రోజులలో కరెంటు, ఈ బిల్డింగులు లేవు. డాక్టర్ గారు కెమెరా సిద్ధం చేసి, ఫొటో తియ్యటానికి నిలబడ్డారు. నిల్చున్న అమ్మ దేహం నుండి కాంతులు విరజిమ్మినయి. ట్యూబులైటు స్విచ్ వేసినప్పుడు ఏ విధంగా వెలుగుతుందో అట్లా అమ్మ దేహమంతా వెలిగింది. తరువాత రకరకాల రూపాలు అమ్మలో వచ్చినవి. మైనం ఏ విధంగా పడితే ఆ విధంగా మారినట్లు అమ్మ దేహం ఎన్నో రూపాలుగా మారింది. పొడుగ్గాను పొట్టిగాను చైనా మొహం, చేతులు సాగి, కోల మొహం, గుండ్రని మొహం, ఇంకా ఎన్నో రూపాలుగా అమ్మ కనపడింది. వారి దగ్గర ఒకటే ఫిలిం వుండటం వల్ల అన్ని రూపాలను తియ్యటం సాధ్యపడలేదు. ఒకటో రెండో రూపాలను తియ్య గలిగారు. "అన్ని రూపాలు నావే. అన్ని నామాలు నావే. ఏ పాదాలకి మ్రొక్కినా ఈ పాదాలకి మ్రొక్కిననట్లే" అని చెప్పింది అమ్మ. శక్తి పార్వతి. జ్ఞానం సరస్వతి, రూపం లక్ష్మి" అని త్రిమాతల తత్వాన్ని గురించి వివరించింది. అమ్మ. ఈ రకరకాల భాషలలో మాట్లాడటం వలన వాణీ, వాద్యా దాయిని అయిన సరస్వతి తాను (జ్ఞానం) అని తెలియచేసింది. కాంతులు విరజిమ్ముతూ సాక్షాత్కరించటం ద్వారా పార్వతి (శక్తి) తాను అని తెలియచేసింది. ఎన్నో రూపాల సాక్షాత్కారం ద్వారా (రూపం) లక్ష్మి తానని తెలియచేసినది. ఈ విధంగా జ్ఞాన తత్వం అయిన సరస్వతి తానని, శక్తి అయిన

పార్వతి తానని, రూపతత్వమయిన లక్ష్మితానని తెలియచేసింది అమ్మ. డాక్టర్‌గారికి ఇచ్చిన ఈ అనుభవాల వల్ల త్రిమాతలు తానే అని తెలియచేసినది అమ్మ.

## దైవం ఏమైనా చేయగలదు :-

డాక్టర్ గారు అమ్మ చెంతకు రాకముందు అనేక సాధనలు చేసిన వ్యక్తి. చీరాల నుండి జిల్లెళ్ళమూడి వచ్చే సోదరులు చాలా మంది రెడ్డిపాలెం కాంతయ్య యోగి గారి దగ్గరకు కూడా వెళ్తూ వుండేవారు. వారిని జిల్లెళ్ళమూడికి తీసుకువెళ్ళటానికి డాక్టర్‌గారు రెడ్డిపాలెం వెళ్ళి ఆహ్వానించారు. ఆ సందర్భంలో కాంతయ్య యోగిగారు వారు ఆరాధించే గాయత్రి విగ్రహం వద్దకు వెళ్ళి "తల్లీ! ఆ తల్లిని చూసి రమ్మని ఆహ్వానిస్తున్నావా"? అని చెప్పి నమస్కరించి డాక్టరు గారితో చీరాల వచ్చారు. చీరాలలో వున్న సోదరులను డాక్టరుగారు ఆరోజు తమ ఇంటికి భోజనానికి పిలిచారు. అందరూ వారి ఇంటికి చేరారు. డాక్టరుగారు పూజ చేసి మహానైవేద్యం ఇచ్చి తదనంతరం తాను ఆరాధించే ఆంజనేయస్వామి విగ్రహం తీసుకు వచ్చి కాంతయ్య యోగిగారికి చూపించి ఇది మా తండ్రి, తాతలు ఆరాధించిన విగ్రహం, నేను కూడా ఆరాధిస్తున్నాను అని చెప్పి వారి చేతికి ఇచ్చారు. యోగి గారు ఈ విగ్రహాన్ని చూసి( తన చేతిలో పెట్టుకుని) "దీనిలో బీజాక్షరం లోపం వున్నది నాయనా! అన్నారు. డాక్టర్‌గారు " అయితే ఏమవుతుంది?" అని అడిగారు. యోగిగారు "నీ వంశం క్షయం అవుతుంది. కుటంబం నాశనం అవుతుంది" అని చెప్పారు. డాక్టరుగారు "దేముడు కరుణామయుడు, దీనజనరక్షకుడు, పతితపావనుడు, అంటారు. అటువంటిది ఒక బీజాక్షరం లోపం వున్నంత మాత్రాన ఆ విధంగా చేస్తాడా? ఇక వీడు దేముడు కాడు. వీడికి నేను పూజ చేయను. దీనిని ఏ దిబ్బలో పారెయ్యమంటారో చెప్పండి. ఒకవేళ మీరు చెప్పినట్టు అయితే భగవంతుడు తను కావాలి అనుకున్నవానికి భౌతికాన్ని క్షయం చేసి మోక్షం ఇస్తాడు అంటారు. అట్లాగైనా మంచిదే. "అయినా వాడికి చూపిస్తున్నాం. మనమే తింటున్నాం. వాడేమైనా తినవచ్చాడా? పెట్టవచ్చాడా? ఎందుకు ఈ పూజ, నివేదన" అన్నారు.

యోగిగారు :-అది కాదు నాయనా ధృఢమైన మనస్సు ఉంటే ఏది ఏమి చెయ్యదు. అని మరొక కొటేషన్ ఇచ్చి చెప్పారు.

డాక్టరుగారు:- మీ శాస్త్రాలు ఎటుకటు చెపుతయి. ఇక నేను దీనిని ఆరాధించను. దీనిని ఏమి చెయ్యమంటారు,అన్నారు.

యోగిగారు :- ఏదైనా దేవాలయంలో ఇవ్వమని చెప్పారు.

ఈ సంభాషణ చీరాలలో డాక్టరుగారి ఇంట్లో జరిగింది. అందరూ వారి ఇంట్లో భోజనం చేసి జిల్లెళ్ళమూడి చేరారు. కాంతయ్యయోగి గారు జిల్లెళ్ళమూడి వచ్చిన తరువాత అమ్మ దర్శనార్థమై నిలుచున్నారు. అమ్మ చెంత వుండే క్రిష్ణవేణి అక్కయ్యను చూసి " ఈమేనా అమ్మ"? అని అడిగారు. అప్పుడు డాక్టరుగారు "అమ్మను ఎవరో గుర్తించలేదు ఈయన. అమ్మ వద్ద పడిపోయారు" అని మనస్సులో అనుకున్నారు" తరువాత అమ్మ వచ్చి దర్శనమిచ్చింది. కాంతయ్య యోగిగారు "అమ్మా గాయత్రి ఇక్కడే ఉన్నావా !" అని ఆర్తిగా అంటూ ఆనందభాష్పాలు రాల్చారు. వారికి పంచముఖ గాయత్రిగా అమ్మ దివ్య దర్శనం ఇచ్చింది.

అమ్మ "ఇక్కడే వున్నానా? అక్కడ లేనా" అని అడిగింది. తన దివ్యత్వం యొక్క అనుభూతిని ఇస్తూనే, సర్వత్రా నిండిన దైవం యొక్క ఉనికిని గుర్తు చేసింది అమ్మ వారికి. తరువాత అమ్మ , కాంతయ్య యోగి గారు ట్రాన్స్‌లోకి వెళ్ళారు. అమ్మ మామూలు స్థితికి వచ్చింది. వారు ఎంతసేపటికి మామూలు స్థితికి రాలేకపోతున్నారు. అప్పుడు అమ్మ వారి భృకుటీ స్థానంలో వేలు పెట్టినొక్కితే మామూలు స్థితికి వచ్చారు. (డాక్టరు గారు చెప్పిన విషయం నాతో) యోగిగారికి షట్ చక్ర స్థానాలు అమ్మ సర్దిందని వివరించారు. అమ్మని గాయత్రిగా దర్శించటం, పైన తెలియచేసినట్లు భృకుటిస్థానం నొక్కి మామూలు స్థితికి తీసుకురావటం, షట్‌చక్రస్థానాలు సర్దబడటం మొదలైన ఆధ్యాత్మిక అనుభూతులు పొందిన భాగ్యశాలి కాంతయ్య యోగిగారు. వారు తిరిగి రెడ్డిపాలెం చేరారు. డాక్టరుగారు తదితరులు, చీరాల సోదరులంతా జిల్లెళ్ళమూడి నుండి చీరాల చేరారు. కాంతయ్య యోగి గారితో డాక్టరు గారు ఒకమాట అన్నారు. "వాడేమైనా తినవచ్చాడా? పెట్టవచ్చాడా? మనం నివేదన పెట్టినా కాని" అని దైవం విషయంలో అన్నారు. దీని విషయంలో అమ్మ వారికి నిరూపణ ఇచ్చింది.

డాక్టరు గారు బాగా వ్యాయామం చేస్తున్న రోజులవి. వారు టిఫిన్ మామూలుగా తినరు. తింటే అన్నం తినపోయే ముందు 25, 30 పూరీలు కానీ లేక ఏ పదార్థం చేస్తే అది సమృద్ధిగా తీసుకునే వారు ఒక రోజు వారి భార్య 25 పూరీలు చేసి బాక్స్‌లో పెట్టి వారు అన్నం తినపోయే ముందు వారికి ఇవ్వటం జరిగింది. డబ్బా మూత తీసి చూస్తే 5 పూరీలే వున్నాయి. వారి భార్య ఇదేమిటి అయిదు పూరీలే వున్నాయి. అని వారి పిల్లల్ని " మీరు తిన్నారా? మీరు తిన్నారా?' అని అడిగితే ఎవరూ " మేము తినలేదు" అని జవాబు చెప్పారు. " నాన్నగారికని చేస్తే మీరు

తింటారా?" అని వాళ్ళని కొట్టారు. "పోనీలే తింటే తిన్నారులే, వాళ్ళ కోసమేగా మనం కష్టపడుతున్నది, సంపాదిస్తున్నది." అన్నారు డాక్టరుగారు. తరువాత ఆ 5 పూరీలు తినిభోజనం ముగించి జిల్లెళ్ళమూడి వచ్చారు డాక్టరు గారు అమ్మ చెంత కూర్చున్నారు. అప్పుడు అమ్మ తన ప్రక్కన వున్న వారితో "చాతకాకపోతేసరి తిన్న వాళ్ళని పట్టుకోవాలి కానీ పిల్లల్ని కొట్టటం ఎందుకు? వాళ్ళేం చేసారు?" అని అన్నది. చీరాలలో జరిగిన సంఘటనని గురించి అన్నది అమ్మ. వెంటనే డాక్టరుగారు " అదేమిటమ్మా అట్లా అంటావు. పిల్లలే తినివుంటారు" అన్నారు. "కాదు నేను తిన్నది. చేతనయితే నన్ను పట్టుకోండి" అన్నారు అమ్మ. దానికి డాక్టరు గారు "అదేం లేదు. నీమీద మాకున్న నమ్మకంతో అట్లా అంటున్నావు. పిల్లలే తిన్నారు. అయినా చాటుగా తినవలసిన ఖర్మ నీకేం పట్టింది? నన్ను అడిగితే నేను పెట్టనా?" అన్నారు.

అమ్మ :-" సరే వెళ్ళు. చేతనవుతే ఈ సారి వచ్చి తింటాను, అప్పుడు పట్టుకో అన్నది. తరువాత డాక్టరుగారు చీరాల వచ్చారు. ఈసారి కావాలని 25 పూరీలు చేయించుకుని బాక్స్‌లో పెట్టుకుని, ఒక అలమారలో పెట్టి తాళం వేసి అక్కడే కూర్చుని రోగులను చూసి, మధ్యాహ్నం అయిన తరువాత విస్తరి వేయించుకుని తను వేసిన తాళం తనే తీసి టిఫిన్ బాక్స్ తెరిచి చూస్తే ఈ సారి 5 కూడా లేవు అన్నీ ఖాళీ అయినయి. ఒక్కటి కూడా లేదు. అప్పుడు అమ్మ అన్నమాట అర్థమయింది. "చేతనయితే పట్టుకో" అని. తరువాత తను కాంతయ్య యోగి గారితో అన్నమాట "వాడికి చూపిస్తున్నాం. మనమేతింటున్నాము. వాడేమయినా తింటున్నాడా? పెడుతున్నాడా?" అని కూడా గుర్తుకు వచ్చింది. 'భగవంతుడు చేయదలిస్తే ఏదైనా చేయగలడు' అని వారికి కనువిప్పు అయింది. దివ్యమూర్తి అయిన అమ్మ సంఘటన ద్వారా అనుభవం ఇచ్చి, సమాధానం చెప్పకనే చెప్పి సందేహం తీర్చింది. దైవం ఏమైనా చేయగలడు అని అనుభవంతో తెలిపింది. తరువాత జిలెళ్ళమూడి వచ్చినప్పుడు అమ్మతో " ఈసారి ఒక్కపూరీ కూడా లేకుండా తిన్నావు ఇట్లా అయితే ఎట్లా?పూర్వం పద్ధతే బావుంది. నీకు చూపిస్తూ వుంటాం. మేము తింటాం. అంతే కానీ ఈ విధంగా అన్నీ ఖాళీ చెయ్యకు" అన్నారు. ఈ విధంగా భగవంతునితో రాజీకి వచ్చారు డాక్టరుగారు. దైవం తలుచుకుంటే ఏమైనా చెయ్యగలడు అని అర్థం చేసుకుని.

**చిక్కని దైవం లీలా విలాసం:-**

డాక్టరుగారు ఊరికి దూరంగా ఇల్లు కట్టుకుని వుంటున్న రోజులవి. దొంగల భయం కొంతకాలం వున్నది అక్కడ. ఆయన మంచి వస్తాదు. కుస్తీలు, కఱ్ఱసాములు చేసెడి వ్యక్తి. అందువల్ల తను రాత్రులు దిండు క్రింద కత్తి పెట్టుకుని పడుకునేవారు. ఎవరైనా దొంగ వస్తే కొట్టచ్చు అనే వుద్దేశ్యంతో. ఒకరోజు అర్ధరాత్రి ఆయన పడుకున్న సమయంలో మంచం చుట్టూ ఘల్, ఘల్ మంటూ గజ్జెల, గాజుల శబ్దంతో ఆడమనిషి తిరుగుతునట్లు వినిపించింది. కాసేపు అయిన తరువాత ఆ వ్యక్తి ఆయన భుజాల మీద చెయ్యి పెట్టి నొక్కటం జరిగింది. అప్పుడు డాక్టరుగారు "ఛా, ఒక ఆడది నన్ను ఈ విధంగా నొక్కిపెట్టడం ఏమిటి?" అనుకుని దిండుక్రింద కత్తి తీసుకుని ఎగిరి వెనక్కి పల్టీకొట్టి కత్తి పట్టుకుని "ఏ-ది ఏది - అది" అని అంటూ అటూ ఇటూ తిరిగారు. అక్కడ పడుకున్న కుటంబ సభ్యులు "ఏమిటి అట్లా గంతులు వేస్తారు? లోపల గడియలు వేసివుంటే ఎవరో రావటమేమిటి?' అన్నారు. మళ్ళీ బయట ఇంటి చుట్టూ ఆడమనిషి తిరుగుతున్నట్లు శబ్దం అయింది. తలుపు తీసి బయటికి వెళ్తే ఎవరూ కనపడలేదు. ఇదంతా అమ్మ చేసిన లీలా విలాసం అని అప్పుడు గ్రహించారు. తరువాత జిల్లెళ్ళమూడి వచ్చినప్పుడు "ఏదో పెద్ద వస్తాదులు అంటారు. కత్తులు పెట్టుకుని పడుకుంటారు. ఒక ఆడమనిషి వస్తే పట్టుకోవటం చాతకాలా" అని అన్నది అమ్మ. అప్పుడు డాక్టరుగారు చిక్కనిదైవం లీలా విలాసాన్ని తలచుకుని ఆనందించారు.

## భవిష్యత్ లో తన (డాక్టర్ గారి) రాకని ముందుగానే చెప్పటం:-

డాక్టరుగారు అమ్మని దర్శించటానికి కంటే ఆరు నెలల ముందే శికాకొల్లి వెంకటేశ్వర్లు అనెడి పర్చూరు వాస్తవ్యలకు డాక్టరుగారి గురించి తెలియచేసింది. "ఇంకొక 6 నెలలకి ఒక డాక్టరు వస్తాడు, ఫొటోలు తీస్తాడు" అని చెప్పింది. శికాకొల్లి వెంకటేశ్వర్లు గారు డాక్టరు గారి దగ్గర చాలా కాలం నుండి వస్తూండేవారు. మందు తీసుకునే వారు. శికాకొల్లి వెంకటేశ్వర్లు గారు ఇంకా కొంత మంది చేరి ఫొటోగ్రఫి గురించి మాట్లాడుకునే వారు. వివేకానంద, రామకృష్ణ పరమహంస, రమణమహర్షి మొదలైన వారు చెప్పినవి, ఇంకా అనేకమయిన విషయాలు మాట్లాడుకునే వారు, కానీ శికాకొల్లి వెంకటేశ్వర్లుగారు డాక్టరుగారితో జిల్లెళ్ళమూడిలో అమ్మ వున్నదని ఎప్పుడూ అనలేదు. నోరి వెంకటేశ్వర్లు గారు వారి తమ్ముడు ఇద్దరూ తాలింఖానాలో మెంబర్లు. వీరు, డాక్టరుగారు ఓరుగంటి నరశింహ యోగి గారి దగ్గర యోగా క్లాసెస్‌కి వెళ్ళి యోగ విద్యని అభ్యసించేవారు. తరువాత ఓరుగంటి నరశింహ

యోగిగారు లభ్యపడలేదు. డాక్టరు గారికి ఒక "గురువు దొరికితే బావుండును. వారు కూడా సద్గురువు అయితే మంచిది అని వుండేది. గురువు చెప్పాలి వినాలి. ఆచరణలో పెట్టాలి. ఆ గురువులో సత్‌వుంటే అదే దోవలో పడేస్తుంది". అని అనుకుంటూ వుండేవారు.

ఇట్లా వీరు అనుకుంటూ వుంటే, నోరి వెంకటేశ్వర్లు గారు డాక్టరుగారితో " బాపట్ల దగ్గర జిల్లెళ్ళమూడి కరణంగారి భార్య ఒకామె వున్నారు. ఆమె యోగాభ్యాసపరురాలని వారూ వీరూ అనుకుంటూవున్నారు. ఆమె భర్త నా క్లాస్‌మెట్. ఆమెని చూడటానికి వెళ్తే బావుంటుంది" అన్నారు. డాక్టరుగారు " ఆడవాళ్ళు , నేనెందుకులెండి, పైగా నేను ఆడవాళ్ళకు నమస్కారం పెట్టను" అన్నారు. తరువాత ఒక రోజు నోరి వెంకటేశ్వర్లు గారు జీపు తీసుకువచ్చి డాక్టరుగారి డిస్పెన్సరీ ముందు పెట్టారు. "వెళ్దాం రండి" అని పిలిచారు. దానికి డాక్టరుగారు " నేను తెమ్మంటే తెచ్చావా? పైగా ఇంతకు ముందు ఆమె పేరు కూడా విన్లేదు. అయినా నేను నమస్కారం పెట్టనని చెప్పాను కదా!" అన్నారు. నోరి వెంకటేశ్వర్లుగారు "పేరు వినకపోయినా నేను తీసుకుని వెళ్తాను "రమ్మన్నారు. డాక్టరుగారు "ధ్యానంలో వుండగా మూడు తడవలు జిల్లెళ్ళమూడి వెళ్ళాలని అనిపించింది. ఈ విషయం వెంకటేశ్వర్లు గారితో చెపితే "అయితే వెళ్దాము. వారు బాపట్లలో భావనారాయణ స్వామి గుడి ప్రక్కన సందులో వారి తండ్రి గారి ఇంటిలో వున్నారు" అని చెప్పి జీపులో బాపట్ల తీసుకు వచ్చారు. తరువాత డాక్టరు గారికి అమ్మ ఇచ్చిన అనుభవం ఇంతకు పూర్వమే వారి ప్రథమ దర్శన సందర్భంలో చెప్పాను.

దీనిలోని ముఖ్య విషయం "నాకు అంతా వర్తమానమే" అంటుంది అమ్మ. అలాగే డాక్టరుగార్లు జిల్లెళ్ళమూడి రావటానికి 6 నెలల ముందే వెంకటేశ్వర్లుగారితో చెప్పటం, వారు తరువాత రావటం జరిగింది. మొదటి సారి దర్శించినప్పుడు కొన్ని వివరాలు:-

అమ్మని డాక్టరుగారు ఈ విధంగా అడిగారు " మీకు ఎంతకాలం నుండి ఈ స్థితి?"

**అమ్మ :-** " పుట్టినప్పటి నుండి ఏముందో ఇప్పుడూ అదే".

యోగవిద్య గురించి గంటన్నర మాట్లాడి నారు. ( ఆ వివరాలు వారి అనారోగ్య కారణంగా, వారికి గుర్తు లేవు. ఇవి చెప్పిన సమయంలో) తరవాత నోరి వెంకటేశ్వర్లు గారు డాక్టరుగార్ని నాన్నగారికి పరిచయం చేసారు. వీరు ప్రత్యేకించి పక్షవాతానికి, మూర్ఛలకి మందు బాగా ఇస్తారు అని చెప్పారు. అప్పుడు నాన్నగారు "మీ అమ్మగార్ని చూడమను ఆమెకి మూర్ఛలు

వస్తూ వుంటయి". అన్నారు. డాక్టరుగారు చీరాల వస్తే తెల్లవారు ఝామున చూస్తాను అన్నారు. తరువాత చీరాల వెంకట్రావు అనెడి వ్యక్తి డాక్టరుగారితో " దేనికండి, తెల్లవారు ఝామున మీరే వచ్చి అమ్మని చూడవచ్చు. ఆమె అలసి పోతుంది" అన్నారు.

**డాక్టరుగారు** :- "ఆమె వస్తే చీరాలలో మా ఇల్లు పావనం అవుతుంది. అందుకని రమ్మన్నాను. నేను ఎటూ వస్తాను" అన్నారు. ఈ సందర్భంలో డాక్టరుగారు, నోరి వెంటేశ్వర్లుగారు చీరాల వెంకట్రావుగారు శ్రీహర్ష రావుగారు. జిడ్డుప్రసాదుగారు, మొదలైన వారు అంతా కలసి వెళ్ళారు. మరునాడు డాక్టరు గారు తెల్లవారు ఝామున 4 గంటలకి పూజ ముగించుకుని చీరాల నుండి బాపట్ల వచ్చారు. అప్పుడు ఎలమంద పాడుతున్నాడు.

డాక్టరుగారు అమ్మ చెయ్యి చూశారు. వెంటనే ఈ విధంగా అన్నారు. 'మీకు మూర్ఛలు ఏమిటి? ఏ సమాధి స్థితో నాకు సమాధి అంటే ఏమిటో తెలియదు రామకృష్ణ పరమహంస పుస్తకాలు చదివాను. దానిలో వుంది. భావసమాధి అని అంటారు. మీకు మూర్ఛలు కాదు' అన్నారు.

**అమ్మ** :- "వైద్యుడివి కదా నీకు తెలియాలి" అన్నది.

**డాక్టరుగారు** :- "నా వైద్యం ఎంత?నేను ఎంత? తెలిస్తే తెలిసింది చెపుతాను. మీరు మూత్రం ఇస్తే పరీక్ష చేస్తాను" అన్నారు.

**అమ్మ** :- "నువ్వు అడిగావు కాబట్టి ఇస్తాను. నేను ఏమితింటాను కనుక, ఏమి త్రాగుతాను కనుక?" అన్నది.

తరువాత అమ్మ చిన్న జామాయిల్ సీసాలో మూత్రం ఇచ్చింది. "ఇవ్వాళ పగలు పరీక్ష చేసి సాయంత్రానికి చెపుతాను" అన్నారు. డాక్టరుగారు చీరాల వచ్చి సీసా వంక చూస్తే అనేక అభిప్రాయాలు కలుగుతున్నవి. అమ్మ మూత్రం నిప్పుల మీద పెట్టి కాల్చటం ఏమిటి అనిపించింది. ఆమెకు మూర్ఛలు అని ఆరోపించటం కూడా పొరపాటే అనిపించింది. అజ్ఞానం పోవాలంటే ఆ మూత్రం తాగాలి అనిపించింది. ఆమె కలుగచేస్తున్నదా? అని అనుకుని వెంటనే ఈ విధంగా అనుకున్నారు. "ఇతరుల చేత త్రాగిస్తే నీకు దోషం కలుగుతుంది. నీ కంటే శక్తి హీనులు కనుక త్రాగిస్తావా"? అనుకున్నారు.

మళ్ళీ సాయంత్రం బాపట్ల వచ్చారు.

**అమ్మ** :- మూత్ర పరీక్ష చేశావా? అన్నది.

డాక్టరుగారు :- మొట్ట మొదట 'చెయ్యలేదు' అని, మళ్ళీ తరువాత "చేశాను మూత్రంలో నాకేమీ తేలలేదు. అయినా మీకు సమాధి స్థితి అయివుంటుంది". అన్నారు. తరువాత డాక్టరుగారు శెలవు తీసుకున్నారు.

అమ్మ :- "నువ్వు ఎవరి ఇళ్ళలో భోజనం చెయ్యవు. అయినా ఇది మా పుట్టిల్లు. మా పిన్నిగారి ఇల్లు చేయవచ్చు" అన్నది.

డాక్టరుగారు :- జిల్లెళ్ళమూడి వస్తాలే అమ్మా అని వెళ్ళారు.

బాపట్లలో భోజనం చెయ్యలేదు. తరువాత జిల్లెళ్ళమూడి వెళ్ళి భోజనం చేశారు. తరువాత ఎవరికి ఏది ఇచ్చినా అమ్మ ఫొటో, పుస్తకం జీవిత చరిత్ర ఇస్తుండేవారు.

అమ్మ అత్తగారు యోగవాశిష్టం చదివేవారు. అది చదవమని డాక్టరుగారికి అమ్మ చెప్పారు. అది ఆధారంగా తీసుకుని డాక్టరుగారిని అమ్మ అత్తగారు ప్రశ్నలు వేస్తూ వుండేది. అందు వల్ల అమ్మ "బామ్మకి నీతో సంభాషణ సాఫీగా సాగుతుంది", అని అనేది. బామ్మకి మొదట్లో అమ్మ మీద దైవభావం లేదు. తరువాత దైవమని గ్రహించి పూజలు చేశారు. ఈ విషయం డాక్టరు గారితో అమ్మ ముందే చెప్పింది. "వారు పూజలు చేస్తారు. డాక్టరుగారితో అమ్మ "నువ్వు నా అమ్మవి " అన్నది ఒకసారి, డాక్టరుగారు గతంలోనా? ఇకముందా? అని అడిగారు కానీ అమ్మ "నువ్వు నాఅమ్మవి" అన్నదే కానీ సమాధానం చెప్పలేదు. వివరించలేదు అమ్మ. డాక్టరుగారికి ఒక అలవాటు వుండేది. వేరుశనగకాయలు జేబులో పోసుకుని తింటూ వుండేవారు. ఒకసారి వేరుశనగకాలయలు తింటూ బాపట్లలో నిల్చున్నారు. తరువాత అట్లాగే తింటూ జిల్లెళ్ళమూడి చేరారు. జేబులో వేరుశనగకాయలు అయిపోయినయి. తీరా అయిపోయిన తరువాత అమ్మ గుర్తుకు వచ్చి "అరెరే --- అమ్మకి ఇవ్వటానికి ఏమిలేవే, అన్నీ అయిపోయినవే" అనుకున్నారు. తరువాత అమ్మ దగ్గరికి వెళ్ళారు. అమ్మ "వేరుశనగకాయలు పెట్టవా?" అని అడిగింది. అప్పుడు డాక్టరుగారు "అన్నీ అయిపోయిన తరువాత గుర్తుకు వచ్చావమ్మా! ఇప్పుడు నువ్వు అడుగుతున్నావు --- ఈసారి వచ్చినప్పుడు తెస్తా" అన్నారు. అప్పుడు అమ్మ వారి జేబులో చెయ్యిపెట్టి వేరుశనగకాయలు తీసింది. పైగా అవి మూడుకనుపుల కాయలు. డాక్టరుగారు అంతకు ముందు కొన్నవి చిన్నకాయలు. వెంటనే డాక్టరుగారు అమ్మని "నాకు పెట్టవా!" అని అడిగారు. అప్పుడు అమ్మ గుప్పెడు పైగా కాయలు తీసి డాక్టరుగారికే కాక అక్కడ వున్న అందరికీ పెట్టింది. అప్పుడు డాక్టరుగారు అమ్మతో " ఈ భర్తని, ఈ అత్తని నువ్వు కావాలని వేసుకున్నావు. ఇవ్వాళ నాకు ఏదైనా

అడగాలన్నా, ఏమి చెయ్యాలన్నా అన్నీ నువ్వే. సంఘం, భార్య పిల్లలు, సంసారం , బాధలు అన్నీ నువ్వు ఏర్పాటు చేసుకున్నవే. వారు ఎంతగానో పుణ్యం చేసుకున్నారు. నీ సంకల్పం వల్లనే వారు అంతా చేస్తున్నారు'' అన్నారు. అమ్మ అప్పుడు ''ఒక బుట్టలో నేరెడు పళ్ళు పోసి చూస్తే ఎట్లా వుంటుందో అట్లా నాకు ఈ గోళాలు అన్నీ కనపడుతాయి. నీమాటలు, నీరూపం అన్నీ కనపడతాయి, వినపడతాయి''. అన్నది. అప్పుడు డాక్టరుగారు మళ్ళీ ''కనఫ్యూజ్ కావా?''అని అడిగారు.

**అమ్మ :-** ప్రతి అణువు నేనే అయినప్పుడు, అటువంటప్పుడు కన్‌ఫ్యూజన్ ఏముంది ? ఏదీ ప్రత్యేకత కాదు. విశేషం ఏమి లేదు''. అన్నది.

ఒకసారి బామ్మగారు మాట్లాడుతూ వున్నప్పుడు అమ్మ దేహం కట్టెలాగ అయి సమాధ్యవస్థ అనుభవించి తరువాత మామూలు స్థితిలోకి వచ్చింది. అప్పుడు బామ్మ (అమ్మ అత్తగారు) ఈ విధంగా అడిగింది. ''నీవు మాతో మాట్లాడుతూనే నీలుక్కుపోయినావు. అప్పుడు నీవు ఏమి దర్శించావు?'' అని అడిగారు. అమ్మ '' ఒక జలాశయం. పెద్దనది వున్నది దానిలో ఒకామె తపస్సు చేస్తున్నది. అది కనపడింది'' అన్నది.

అమ్మ ఒకసారి డాక్టరుగారితో '' ఇంతకు ముందు జన్మలెత్తాను. మహానందిలో మామిడి చెట్టుక్రింద తపస్సు చేశాను'' అని చెప్పింది. నాన్నగారు (అమ్మ భర్త) అక్కడికి వెళ్ళి చూసి వచ్చారు.

మరొక సారి డాక్టరుగారు, శ్రీపాద గోపాల కృష్ణమూర్తిగారు రాజమండ్రి వెళ్ళి మాట్లాడాల్సి వచ్చింది.

**డాక్టరుగారితో శ్రీపాద** :- '' నాకు జన్మలు లేవని చెప్పింది అమ్మ'' అన్నారు.

**అప్పుడు డాక్టరుగారు:-** '' నాకు జన్మలు వున్నవని చెప్పింది'' అన్నారు.

తరువాత శ్రీపాదవారు జిల్లెళ్ళమూడి వెళ్ళినప్పుడు అమ్మని జన్మల విషయం అడిగితే ''వాడు ఇస్తే వుంటయి. లేకపోతే లేదు'' అని అమ్మ సమాధానం చెప్పింది.

పురుషప్రయత్నం సంగతి అడిగితే ''దైవమయిన పురుషుడే చేసేవాడు, చేయించేవాడు''. అన్నారు అమ్మ.

''గొప్ప గొప్ప వాళ్ళు చాలా మంది చెప్పినదానికి నీది ప్రత్యేకతగా కనపడుతున్నది''. అన్నారు శ్రీపాద. ''అది నీ అభిప్రాయం'' అన్నది అమ్మ.

లేదు'' అన్నది.

ఏదీ నీచేతిలో లేదు:-

" జన్మలు కావాలని ఇచ్చాను. ఆ నాటకం జరుగుతుంది. ఒకే తడవ నిర్ణయింపబడింది. అది ఆగేదికాదు" అన్నది.

ఒకసారి డాక్టరుగారితో అమ్మ " నేను అనుకుంటేనే నీవు ఏది చేసినా, ఏమి చెప్పాలన్నా నీ చేతిలో ఏమి లేదు" అన్నది. అప్పుడు డాక్టరుగారు," కాదు. ఇప్పుడు నాన్న గారితో మాట్లాడి వస్తా చూడ" మని వెళ్ళారు. డాక్టరు గారు వెళ్ళేటప్పటికి నాన్నగారిదగ్గరికి ఎవరో వచ్చిపొలం కొలవటానికి రమ్మన్నారు. ఆయన బయలుదేరపోతున్నారు. అప్పుడు డాక్టరుగారు నాన్నగారితో "మీతో మాట్లాడాలి" అంటే " పొలం వెళ్ళి వచ్చిన తరువాత మీతో మాట్లాడతాను" అన్నారు. "మీరు రావాలి నేను చెప్పాలి. పొలం తరువాత వెళ్ళకూడదా?" అని డాక్టరుగారంటే "కాదు వెళ్ళాలి" అని నాన్నగారు అన్నారు. వారు పొలం వెళ్ళారు. తరువాత డాక్టరుగారు అమ్మ చెంతకు వెళ్ళారు. అప్పుడు అమ్మ:- " ఏం నాయనా మాట్లాడావా?" అన్నది. డాక్టరుగారు "నాన్నగారు సాయంత్రం వస్తానన్నారు. అమ్మ "ఇప్పుడు ఆయనతో మాట్లాడి వస్తానని చెప్పావు. చెప్పిరాలేదేమిటి? అని అడిగింది. నీ చేతిలో ఏమీ లేదు చూశావా? అన్నట్లు.

ఒకసారి డాక్టరుగారు రైలులో శ్రీపాదవారు, మరికొందరు వున్నారు. డాక్టరుగారు "నేను చెబుతాను, మీరు వినాలి" అన్నారు. అదే సమయంలో శ్రీపాదవారు అవతలకి వెళ్ళవలసి వచ్చింది. వారు తిరిగి వచ్చేటప్పటికి చెప్పటం పూర్తి అయింది. వారికి ఏమీ చెప్పలేదు.

అమ్మ అనేది "ఎవరు వినాలో వారు వింటారు. ఎవరికి చెప్పాలో వారికి చెబుతావు" అని ఇది అనుక్షణం డాక్టరుగారి అనుభవం లోకి వచ్చేది.

అమ్మ ఒకసారి డాక్టరుగారితో "ఇంతకు ముందు జన్మలెత్తాను మహానందిలో మామిడి చెట్టుక్రింద తపస్సు చేశాను" అని చెప్పింది. అక్కడికి నాన్నగారు వెళ్ళి చూసి వచ్చారు.

మరొకసారి డాక్టరుగారు, శ్రీపాదవారు రాజమండ్రిలో మాట్లాడాల్సి వచ్చింది. డాక్టరుగారితో శ్రీపాద"నాకు జన్మలు లేవని చెప్పింది "అమ్మ" అన్నారు. డాక్టరుగారు " నాకు జన్మలు వున్నవని చెప్పింది." అన్నారు. తరువాత శ్రీపాదవారు జిల్లెళ్ళమూడి వెళ్ళినప్పుడు అమ్మని అడగగా "జన్మలు వాడు ఇస్తే వుంటయి లేకపోతే లేదు" అని అమ్మ సమాధానం చెప్పింది. పురుషప్రయత్నం సంగతి అడిగితే "దైవమయిన పురుషుడే చేసేవాడు, చేయించే వాడు" అన్నారు అమ్మ. "గొప్ప , గొప్ప వాళ్ళు చాలామంది చెప్పినదానికి నీది ప్రత్యేకంగా

కనపడుతున్నది'' అన్నారు శ్రీపాద. అది నీ అభిప్రాయం'' అన్నది.

## తెలిసినా ఆపలేదు:-

జరిగేది చెబితే నిరోధిస్తానని అమ్మతో అన్నారు డాక్టరుగారు. అప్పుడు అమ్మ ''అంతా చెబటం కాదు. విని, కనపడినా చెయ్యలేవు'' అన్నారు. ఈ సంభాషణ జరిగిన తరువాత వారు చీరాల వచ్చారు. వారికుమారునికి సీరియస్ అయినది. కొద్ది ఆపరేషన్ ఏదో చెయ్యవలసి వచ్చినది. వెంటనే వారు తగిన సామగ్రి, కత్తి తీసుకుని ఆపరేషన్ చెయ్యటానికి సిద్ధమయినారు. ఆ పిల్లవాని వంక చూస్తూండగానే వారికి ఒక దృశ్యం కనపడింది. ఆ పిల్లవాడు పోయినట్లు, తను ఒక వైపు నడుస్తున్నట్లు కనపడింది. అప్పుడు 4గురు వ్యక్తులు అతనిని మోసినట్లు, కుండ ఒకరు పట్టినట్లు, తను మాత్రం ప్రక్కగా నడుస్తున్నట్లు కనపడింది. చేతిలోని కత్తిని వెంటనే ఒదిలి పెడుతూ ''పోయ్యాడు'' అన్నారు డాక్టరుగారు. అదేమిటి అన్నట్లు చూశారు వారి కుటంబ సభ్యులు, వారికి తనకి కనపడిన దృశ్యం సంగతి చెప్పారు. కొంతసేపటికి వారి పిల్లాడు పొయినాడు. తరువాత ఆ పిల్లవాడిని వారికి కనపడిన విధంగా ఎవరెవరు ఎటువైపు మోస్తున్నట్లు కనపడ్డారో అదే విధంగా మోశారు. డాక్టరుగారు ఎంత ప్రయత్నించినా అంతకు ముందు కనపడిన దానికి విరుద్ధంగా చెయ్యలేకపోయినారు. అంతా అమ్మ ఏవిధంగా అన్నదో అదే విధంగా జరిగింది. కృష్ణభగవానుడు జరిగేదంతా అర్జునుడికి చూపించాడు. మళ్ళీ అంతా అదే విధంగా జరిగింది. భీష్మద్రోణులు పోవటం దగ్గర నుండి అన్నీ అట్లాగే జరిగినయి. అదే విధంగా ''తెలిసి. కనపడినా ఆపలేవు'' అన్న అమ్మమాటలు డాక్టరుగారికి అనుభవం లోకి వచ్చినయి. అదవిందయోగి ఈ విధంగా చెబుతారు. ''మృత్యు వంటే భయపడే నీవు ఒట్టి పిచ్చివాడివి. మృత్యువనే భయంకరమైన ముసుగు వేసుకుని నవజీవనమే నీ దగ్గరికి వస్తున్నది''. ''కర్త తానయితే కార్యకారణాలు తెలుస్తాయి'' అంటుంది అమ్మ. అంటే మూలమయిన ఆత్మజ్ఞానం కాక ఇటువంటివి ఎన్ని తెలిసినా, ఎన్ని రకాల సిద్ధులు కలిగినా ప్రయోజనం లేదు. ఆధ్యాత్మికతకి ఇవి పట్టుకొమ్మలు కావు. ఏది జరిగినా జరగక పోయినా వీనిలోని అంతర్లీనమయిన దివ్యత్వంలో లయమవటానికి ఇటువంటి కోరికలు ఎంతగా రాలిపోతే అంత ఉత్తమం అని తెలియచేస్తుంది ఆధ్యాత్మికవేదం. ఇట్టి అంతరంగిక స్థితికి కావలసిన మరమ్మత్తులు చేసి వదులుతుంది అమ్మ. అప్పుడు మనమే తెలియకుండా అమృతత్వానికి చేరువై కట్టకడకు అమృతత్వమే అవుతాము.

### జరిగేదంతా చెప్పటం :-

ఒకసారి డాక్టరుగారు అమ్మసాన్నిధ్యంలో కూర్చున్నారు. అప్పుడు అమ్మ "ఇప్పుడు మన్నవ నుండి 10 మంది బయలుదేరి వస్తున్నారు. వారు ఫలానా వూర్లోకి వచ్చారు. (ఊరు పేరు కూడా చెప్పింది. డాక్టరుగారికి గుర్తులేక చెప్పలేదు) ఇంకా గంటన్నరకి ఇక్కడికి వస్తారు. ఒకరు అటు కూర్చుంటారు ఈ విధంగా ఎవరెవరు ఎటు కూర్చుంటారో చెప్పి, ముందు తనకి కాక డాక్టరుగారికి నమస్కారం చేస్తారని జరిగేదంతా వివరంగా తెలియచేసింది. తరువాత అదే విధంగా గంటన్నరకి మన్నవ నుండి అమ్మ ఎట్లాగైతే చెప్పిందో అట్లాగే అదే మార్గం నుండి వారు రావటం, అంతా అమ్మ చెప్పినట్టే జరిగింది. వారు కూర్చోవటం దగ్గర నుండి డాక్టరుగారికి నమస్కారం చెయ్యటం వరకు అంతా సినిమా రీలులా జరిగింది. ఒకసారి బామ్మగారు మాట్లాడుతూ వున్నప్పుడు అమ్మ దేహం కట్టెలాగ అయి బిగుసుకు పోయింది. సమాధ్యవస్థ అనుభవించి తరువాత మామూలు స్థితికి వచ్చింది. అప్పుడు బామ్మ (అమ్మ అత్తగారు) ఈ విధంగా అడిగారు "నీవు మాతో మాట్లాడుతూనే నిలుక్కుపోయావు అప్పుడు నీవు ఏమి దర్శించావు? అని అమ్మ" ఒక జలాశయం, పెద్ద నది వున్నది దానిలో ఒకామె తపస్సు చేస్తున్నది. అది కనపడింది" అని చెప్పింది. తరువాత డాక్టరుగారు వెళ్తే అమ్మ ఈ సంగతి అంతా డాక్టరుగారితో చెప్పి "బామ్మ నిన్ను అడుగుతుంది. "ఈ విషయం నాకేమి తెలియదని చెప్పు నాకేమి చెప్పలేదని చెప్పు"మన్నది. తరువాత బామ్మ అదే విధంగా అడగటం డాక్టరుగారు నాకేమి తెలియదని చెప్పటం జరిగింది.

ఒకసారి డాక్టరుగారికి జిల్లెళ్ళమూడిలో వున్నప్పుడు వారికి నిద్రలో ఒక కల వచ్చింది. ఆ కలలో లారీలో వెళ్తూ రాళ్ళగుట్ట మీద పడి మొహం మీద దెబ్బలు తగిలినయి. నిద్రలేచి ముఖం చూసుకుంటే ముఖం మీద దెబ్బలు వున్నయి. అమ్మని " ఇదేమిటి ఇట్లా జరిగింది అని అడిగితే అమ్మ సమాధానం చెప్పలేదు. తరువాత చీరాలలో ఒకరి దగ్గర ఈ విషయం ప్రస్తావించినప్పుడు ఆయన "మహాత్ముల సాన్నిధ్యంలోకి వెళ్తే వారి కృప వలన మనం అనుభవించ వలసినది కలల రూపంలో అనుభవం ఇచ్చి కర్మానుభవాన్ని తగ్గిస్తా"రని చెప్పారుట. వారి కర్మానుభవాన్ని ఆ విధంగా తగ్గించింది అమ్మ. డాక్టరు గారితో సంభాషణ చేస్తున్న హైదరాబాదు వాస్తవ్యులువ శ్రీ సుబ్రహ్మణ్యం గారు ఈ విధంగా చెప్పారు. మండూకోపనిషత్ యోగవాసిష్ఠంలో ఈ విధంగా వున్నది. "నిజానికి బాధితుడు, సాధకుడు లేడు" ఆ ఆత్మ తప్ప రెండవది లేదు. ఇది అధికారి కాని వాడికి చెపితే వాడు పతితుడు

చెప్తాడు. ఈ విషయం చెప్పి సుబ్రహ్మణ్యం గారు తను జిల్లెళ్ళమూడి అమ్మ దర్శనార్థం వచ్చిన ప్రారంభంలో ఆ రోజులలో జరిగిన ఒక సంఘటన వివరించారు. వారు అమ్మ దర్శనార్థమై వారి ఊరి నుండి బయలు దేరినప్పుడు వారి చెల్లెలు తన కూతురి వివాహవిషయమై ఆదుర్దాపడుతూ దీని విషయమై అమ్మని అడగమని చెప్పినది. సుబ్రహ్మణ్యం గారు జిల్లెళ్ళమూడి వచ్చారు. అక్కడ ఒక ఇంజనీరింగ్ స్టూడెంట్ వచ్చి వున్నాడు. అతను వీరితో "అమ్మ వెళ్ళమంటే వెళ్ళాలి" అని అన్నాడు. అమ్మతో సుబ్రహ్మణ్యంగారు "ఆధ్యాత్మిక చింతనకు అన్వేషణ చేయవలసి వస్తున్నది. నా డ్యూటీ నేను చేసుకోవటంలో అటెంక్షన్ అటూ, ఇటూ, చెయ్యవలసి వస్తున్నది. హిందూ శాస్త్రాలు చదువుతున్నాను. హిందువుగా ఏమి చెయ్యాలి?" అని అడిగారు. అప్పుడు అమ్మ, "డ్యూటీ ఏమిటి? హిందువులకేనా? శాస్త్రంజోలికి వెళ్ళకు, సందేహం ఎక్కడి నుండి వస్తున్నదో జవాబు అదే చూసుకుంటుంది?" అన్నది.

ఒకసారి డాక్టరుగారితో అమ్మ దేవుని విషయంలో " నీకు చిక్కితే వాడు దేముడు ఎట్లా అవుతాడు?" అన్నది.

"రెప్పపాటులో వాడనుకుంటే మీలో మీకే సమాధానం వస్తుంది" అని కూడా చెప్పింది.

అట్లాగే డాక్టరుగారి విషయంలో కూడా జరిగింది. అదే చెపుతూ డాక్టరుగారు "200 ప్రశ్నలకి జవాబులు చెప్పింది. అమ్మ నాకు ఏదో కారణం తో నేను అనుకున్నది చెప్పేది. మా నాన్నగారు నీకు ఈ జన్మలో దైవ సాన్నిధ్యం లభిస్తుంది అని చెప్పారు. అమ్మ దర్శనానికి ముందే వారు ఆ విధంగా చెప్పారు. తరువాత అమ్మని దర్శించినప్పుడు అమ్మ "మీ నాన్న నిన్ను కుర్చీ పక్కన కూర్చోని పెట్టుకుని నీకు ఏమని చెప్పారు" అని ఎప్పుడో మా నాన్న చెప్పిన విషయం అడిగింది" అన్నారు. అమ్మ ఒకసారి " గురుభస్మం చెయ్యటం వచ్చునా? కొన్ని మూలికల విషయం చెప్పాలి" అన్నది. డాక్టరుగారు " గురు బస్మం వద్దు ఏమి వద్దు ఆధ్యాత్మికంగా వెనుకబడి వున్నాను. దానికోసం నీ చెంతకు వచ్చాను" అన్నారు. అమ్మ "గురుభస్మం మూలికలు చెప్పాల్సిందే నా టైమ్ దగ్గరికి వచ్చింది." అన్నది.

అమ్మ మహాసిద్ధి పొందిన తరువాత వారి ఇంట్లో అమ్మ పీఠం ఏర్పరిచిన సంగతి అక్కడ ధ్యానం , పూజ, సంకీర్తన జరిగేదని చెప్పారు. పూర్ణానంద స్వామీజీ వారి ఇంటికి వచ్చిన సంగతి వివరించారు. వారి తండ్రిగారు వారితో "నలుగురు సిద్ధులు నీకు వైద్యం చెపుతారని" తెలిపారుట.

డాక్టరుగారు అమ్మ దగ్గరకి రాకముందు యోగసాధన, మంత్ర జపం చాలా చేసేవారు. వారికి కొన్ని మంత్రాలు సిద్ధి కూడా అయినవి. ఒక సమయంలో కాంతయ్య యోగిగారికి గుండెలో నొప్పివచ్చి బాధపడుతున్నప్పుడు డాక్టరుగారు ఒక గంధం చెక్క సాన తీసుకుని చెక్కని సానమీద అరగతీస్తూ " ఇప్పుడు కాస్త క్రిందకి దిగింది దిగిందా " అనగా స్వామి వారికి అట్లాగే క్రిందకి దిగింది చెప్పి, అట్లా అంటూ అంటూ ఆ ప్రయోగంతో వారి నొప్పిని పూర్తిగా పోగొట్టారు.

వారికి గరుడమంత్రం కూడా వుండేది. ఆ మంత్ర ప్రభావం వలన డాక్టరుగారికి పాములు స్వాధీనం అయ్యేవి. " ఆగు " అని ఆజ్ఞాపిస్తే ఆగిపోయేవి. పాము కరచినవారికి మంత్రం వేస్తే విషం దిగిపోయేది. వారి ఇంట్లో ఒకప్పుడు పాములు వుండేవి. అవి వారిని ఏమి చేసేవి కావు. జిల్లెళ్ళ మూడి వచ్చిన తరువాత ఆ సాధనలు ఆపివేశారు. ఒకసారి అమ్మ కల్యాణ దినమయిన మే5 నాడు రోడ్డు మీద చిన్న పాము పిల్ల పోతున్నది. అటు.
వెళ్తున్న చిన్నపిల్లలు భయపడి అటూ ఇటూ పరిగెత్తేరు అది చూసి డాక్టరు గారు "ఆగు అన్నారు. కానీ, పాము పిల్ల ఆగలేదు. ఆశ్చర్యం వేసింది డాక్టరు గారికి. వెంటనే ఒక గుడ్డ దానిమీద వేశారు. అయినా అది ఆగకుండా గుడ్డనుండి దూరి బయటికి వచ్చింది.

కొంత కాలం వాయువును కుంభించి కొద్దిగా భూమిపైకి తేలే వారు. వారి దేహం నుండి సువాసనలు కూడా వచ్చేవి.

ఇలా వుండగా ఒకమారు డాక్టరుగారు జిల్లెళ్ళమూడిలో వుండగా చీరాలలోని వారి కుమారుడ్ని పాము కరచిపోయినాడని కబురు వచ్చింది. వారు అమ్మతో చెప్పి బయలు దేరపోతుండగా అమ్మ ప్రసాదం తీర్థం, ఇచ్చింది. అవి తీసుకుని ఆయన చీరాల చేరి.పోయిన పిల్లవానికి బొట్టుపెట్టి అమ్మ ఇచ్చిన తీర్థం నోట్లోపోశారు. ఆ పిల్లవాడు లేచి కూర్చున్నాడు. ఇటు వంటి విషయాలలో డాక్టరుగారి ఉద్దేశ్యం "మన దగ్గర వున్నవి (సిద్ధులులాంటివి) లాగేసు పరిపూర్ణంగా తరింపచేస్తారు దివ్యమూర్తులు. మరొక విధంగా చెప్పాలంటే సిద్ధులను, విద్యలను తొలగించి ముక్తిని సిద్ధింప చేస్తారు" అన్నారు. ఈ విధంగా వారికి కావలసిన ఆధ్యాత్మిక సుగతికి కావలసిన అంతఃకరణని ప్రసాదించింది అమ్మ.

అమ్మ చిన్నతనంలో అమ్మ అనుగ్రహం వల్ల మహా మనిషి అయిన శ్యామలాదేవిని ఒక పర్యాయం డాక్టరుగారు చూడటం జరిగింది. ఆమె అమ్మ దయ వల్ల గొప్ప ఆధ్యాత్మిక స్థితికి వెళ్ళటం జరిగింది. ఇది చరిత్రలో వుంది. అటువంటి గొప్ప వ్యక్తిని చూసిన అనుభవం

డాక్టరుగారికి ఈ విధంగా జరిగింది. ఒకసారి జిల్లెళ్ళమూడి పది, పన్నెండు మంది లంబాడీ వాళ్ళు వచ్చారు. వారిని, వారితో కలిపి అమ్మని ఫొటో తీశారు డాక్టరుగారు. వారు వెళ్ళిన తరువాత అందులోని శ్యామలాదేవిని అమ్మ డాక్టరుగారికి తెలియచెప్పింది. మహా యోగిని శ్యామలాదేవి దర్శనం ఆ విధంగా డాక్టరుగారికి కలిగింది. అమ్మ చరిత్రలో ఇద్దరు మహా వ్యక్తులు ఒకరు రహి, మరొకరు శ్యామలాదేవి. వీరిని చూసే అదృష్టం అమ్మ వారికి ప్రసాదించింది.

## తాను పదార్థం తీసుకుని మరొకరికి అందించటం:-

**ఒకసారి** ఎక్కిరాల భరద్వాజ తన పుట్టినరోజు నాడు పాయసం చేయించుకుని అమ్మకి నివేదన ఇచ్చారు. అప్పుడు అమ్మ "ఇదిగో ఈ కాస్త తీసుకో శ్యామలా! ఊ - ఈ కాస్త... ఈ కాస్తేగా తీసుకో అరే తీసుకోమంటుంటే తీసుకో" అంటూ అంతా త్రాగేసింది. ఇదంతా కళ్ళు మూసుకుని చేసింది.మొత్తం త్రాగిన తరువాత ఖాళీ గ్లాసుని చూపిస్తూ భరద్వాజతో "అరే నీకు కాస్త కూడా లేకుండా అంతా నేనే తాగాను నాన్నా" అన్నది. అప్పుడు భరద్వాజ "త్రాగితే తాగావు అసలు ఇదేమిటి? శ్యామల ఎవరు? తాగు తాగు అంటూ తాగావేమిటి" అని జరిగిన సంఘటన గురించి వివరం అడిగారు. అమ్మ "శ్యామల అనెడి వ్యక్తి నన్నే నమ్ముకుని అడవిలో కూర్చుని తపస్సు చేస్తున్నది. మూడురోజులనుండి ఏమి తినలేదు. ఈ రోజు ఈ కాస్త పాయసం ఇస్తే తీసుకోనని మారాం చేస్తున్నది. దాని చేత బలవంతాన తాగించాల్సి వచ్చింది. అందుకని ఇదంతా దానికి ఇచ్చాను" అని తెలిపింది.

ఈ అనుభవమే డాక్టరుగారికి ఈ విధంగా జరిగింది. చీరాలలో డాక్టరుగారికి జబ్బు చేసింది. ఒకరోజు సాయంత్రం వారికి మజ్జిగ కావలసి వచ్చింది. ఇంట్లో లేవు. ఆయన విసుక్కుంటూ " ఇక్కడ ఎటూ లేవు నాకు. నువ్వన్నా అక్కడ త్రాగు, ఇక్కడ నాకు తగ్గుతుందేమో ఈ బాధ" అని అనుకున్నారు. కొద్దిసేపటికి వారికి బాగా ఉపశయనం కలిగి నిద్రపట్టింది. అదే సమయంలో అమ్మ జిల్లెళ్ళ మూడిలో మజ్జిగ తీసుకున్నది.

ఈ విధంగా అమ్మ తాను తీసుకుని ఎక్కడి వారికో అందచెయ్యటం ఎన్నోసందర్భాలలో జరిగింది.

## మంచంలో వున్న డాక్టరుగారిని లేపటం:-

డాక్టరుగారు ఒకమారు హోమియో పుస్తకాలు చదివి తన మీద తానే ప్రయోగంగా ఒక

మందు వేసుకున్నారు. దానితో వారు కదలలేని పరిస్థితిలో మంచం ఎక్కారు. పొట్ట లోతుకు పోయి మనిషి అస్తిపంజరంలా అయ్యారు. మంచంలో వున్న వారి కాలిని కదిలించాల్సి వచ్చినా వారి పిల్లలు కదిలించాల్సి వచ్చేది. కాస్త కాలి మీద వున్న పంచె గుడ్డని కదిలించినా వారికి మంట పుట్టేది. ఇటు వంటి స్థితిలో వున్న డాక్టరుగారిని చూడటానికి అమ్మ వెళ్ళింది. రాత్రపూట వెళ్ళింది అమ్మ. డాక్టరుగారి దగ్గర కూర్చుని" ఛస్తానని భయపడ్డావా?" అని అడిగింది. "లోకానికి ఏదైనా ఒక మేలు చెయ్యాలి అనుకున్నాను. ఏదైనా ఒక మందు కనిపెట్టడమో మరొకటో ఏదైనా మేలు చెయ్యాలి అనుకున్నాను." అన్నారు డాక్టరుగారు. తరువాత వారి కాలి గిలక దగ్గర తన చేత్తో గట్టిగా నొక్కింది అమ్మ. వెంటనే వారికి భరించలేని నొప్పి, మంట పుట్టింది "అమ్మా." అని పెద్దకేక పెట్టారు. తరువాత వారికి తీర్థం ప్రసాదం ఇచ్చి వచ్చింది అమ్మ. కొద్ది రోజులలో కోలుకున్నారు డాక్టరుగారు.

**ఏది శక్తి ఎవరు అమ్మ అనుగ్రమానికి పాత్రులు :-**

అమ్మ వాడరేవు సముద్రానికి వెళ్ళినప్పుడు సముద్రంలో చీర, పూలు వదిలింది. డాక్టరుగారు "అదేమిటమ్మా అంత ఖరీదుగల చీర అట్లా వదిలావు" అంటే అమ్మ సముద్రంలో మునులు తపస్సు చేస్తున్నారు. వారికి పంపించాను"అంది.

అమ్మ అదే వాడరేవులో వున్న రోజులలో జరిగిన సంఘటన మరొకటి. అమ్మ కారు సముద్ర తీరానికి దగ్గరగా ఇసుకలో కూరుకుపోయింది. ఆ రోజులలో బలిష్టులైన డాక్టరుగారు, జిడ్డుప్రసాదు, యోగయ్య, సింగుపాలెం తాతయ్య ఇంకా కొంత మంది ఆ కారుని లేపి కదిలించాలని ఎంత ప్రయత్నించినా కదలలేదు. కారు తలుపు తీస్తే సముద్రపు అలలు కారులోపలికి వస్తున్నయి. కారు బాడీ నేలకు అంటేటట్టుగా కూరుకుపోయింది. అప్పుడు అమ్మ మీవల్లకాదు జాలర్లని పిలవమంది. జాలర్లు అంతా పడవలు వేసుకుని వెళ్ళారు. ఎవరూ దొరకలేదు. వీరంతా తిరగ్గా తిరగ్గా ఆరేళ్ళ పిల్లవాడు గోచీ పెట్టుకుని వెళ్తూ కనపడ్డాడు. ఆ పసిపిల్లాడిని తీసుకు వచ్చారు. ఆ పిల్లవాడు చెయ్యి వేసి నెడితే (వీరంతా కలిపి నెట్టినప్పటికీ) నే ఆ కారు కదిలింది. విశ్వజనని అయిన అమ్మ కరుణిస్తే గడ్డిపోచ అయినా మహాశక్తివంతం అవుతుంది. రుక్మిణీదేవి తులసీదళానికి కృష్ణుడు తూగాడు. కుచేలుని పూజించి అటుకులు తిన్నాడు ఆ భగవంతుడు. అదే విధంగా గోచీపెట్టుకున్న ఆ పసి పిల్లవాడు చెయ్యివేస్తే బ్రహ్మాండ భాండోదరి అయిన అమ్మకారు కదిలింది. మన

బలాలు, మన సంపదలు, మన మేధస్సులు, అధికారాలు అమ్మ ముందు అత్యల్పాలు. చెత్త పరక కూడా మహాశక్తి అవుతుంది ఆ ఆదిశక్తి తలుచుకుంటే.

**జీవ జంతువులకు సిద్ధులు ఇవ్వటం:-**

అమ్మ అంటూ వుండేది " స్థితులు పొందటం కాదు. ఇవ్వటమే. ఏర్పడి వున్నయి" జీవజంతువులు అన్నింటికీ మరొక మాట అంటూ వుండేది. " ఏమిట్రా? మానవుడు ఉత్తమజీవి అంటారు రేపటికి దాచుకోవటం వీరికి చాతనవుతుంది. గొడ్లకి చాతకాదు. అంతే తేడా!"

ఒక మారు డాక్టరుగారు అమ్మ చెంత కూర్చుని "తనకు జ్ఞానం కావాలని , ఈ సారి జన్మలోనైనా జ్ఞానిని చెయ్య"మని అడిగారు. "వాడివ్వతలిస్తే ఎవరికైనా ఇస్తాడు" అన్నది అమ్మ. అదేమిటి అమ్మా మానవులు యోగులు, జ్ఞానులు అయ్యారు. మానవులకే స్థితులు పొందటం సాధ్యం . ఎవరికైనా ఎట్లా ఇవ్వగలడు. అని అడిగారు. ఆ సమయంలో ఒక కుక్క అక్కడ కూర్చుని వుంది. అమ్మ ఆ కుక్కని చూపిస్తూ " ఆకుక్కని చూడు" అన్నది. డాక్టరుగారు దాని వంక చూసారు. మరుక్షణంలో అది శాంభవీ ముద్ర వేసింది. డాక్టరుగారు యోగాభ్యాసం చేసిన వ్యక్తి. ముద్రలు వేయటం అవి సిద్ధించటం గురించి శాస్త్రరీత్యా అధ్యయనం చేసిన వ్యక్తి. వెంటనే దాని వెన్నెముక తట్టి చూశారు. వెన్నెముక, తోక, గట్టిగా నిటారుగా వున్నయి. భృకుటి మీద దృష్టి నిలిపి శ్వాస ఆపి అంతర్ముఖమైనది. వారికి ఏనాడు రాని శాంభవీముద్ర ఒక కుక్కకి వచ్చింది. అది తాను స్వయంగా అమ్మ సాన్నిధ్యంలో దర్శించారు. వారికి ఆనందం కలిగి వెంటనే అమ్మతో అన్నారు. "ఇంతకాలం మనుష్యులకే అనుకున్నా ఇప్పుడు ఎవరికైనా ఇవ్వగలవని అర్థమయింది. నువ్వు నన్ను జ్ఞానిని చేస్తే చాలు కుక్క, పిల్లి, లేడి, నక్క, నీయిష్టం ఏ లిస్టులోనైనా వేసుకో కానీ నన్ను జ్ఞానిని చెయ్యి" అన్నారు.

మరొక సారి కర్మని బదిలీ చెయ్యటం విషయంలో డాక్టరు గారికి ఇంకొక అనుభవం ఇచ్చింది అమ్మ.

డాక్టరుగారికి బాగా దగ్గు వచ్చి బాధ పడుతున్నారు అమ్మ చెంత కూర్చుని. అప్పుడు అక్కడ ఒక కుక్క కూడా వున్నది. డాక్టరుగారితో " దానిని చూడు నాన్నా" అన్నది అమ్మ. అప్పటి దాకా హాయిగా కూర్చున్న కుక్క దగ్గటం మొదలు పెట్టింది. "ఇదేమిటమ్మా" అంటే " నీ దగ్గు దానికి ఇచ్చాను" అన్నది. వెంటనే డాక్టరుగారు "దానికెందుకు లేని పోని బాధ

నా దగ్గ నాకిచ్చేసెయి'' అన్నారు. మరుక్షణంలో అది దగ్గటం ఆగిపోయి డాక్టరుగారు దగ్గటం తిరిగి మొదలెట్టారు. ఈ విధంగా అన్నింటి మీద సర్వాధికారిణి, సర్వ సమర్ధ అని చూపించింది అమ్మ.

ఒకమారు డాక్టరుగారు జిల్లెళ్ళమూడిలో వున్నారు. చీరాలలో వారి ఇంటిలో ఆరోజు రాత్రి వారి ఇంటి మీద దొంగలుపడి, పుట్టి బట్టు దోచుకుపోయ్యారు. జిల్లెళ్ళమూడికి కబురుచేశారు. డాక్టరుగారు నిరామయంగా నిష్కళంగా చిరునవ్వు నవ్వుతూ "పని ఇచ్చేవాడు వాడే, పుచ్చుకునేవాడు వాడే '' అన్నారు. ఖంగారుగా పరుగెత్తుకుని చీరాల వెళ్ళలేదు. ఈ విధంగా ఎన్నోమార్లు వెండి, బంగారం, నుండి అన్నీ దోచుకుని వెళ్ళారు. ఎప్పుడు ఏకోశాన తొణకని గంభీరమూర్తియై నిలిచారు. డాక్టరుగారు.

అమ్మ అనేదట '' నా బిడ్డ తన పిల్లల విషయంలో ఎక్కడికి వెళ్ళడు. వాళ్ళే వస్తారు'' అని డాక్టరుగారి పిల్లల విషయంలో అట్లాఅనేదట. అదే విధంగా నలుగురి ఆడపిల్లల వివాహాలు జరిగిపోయినయి. అమ్మే "నువ్వు నాకు తల్లివి" అని డాక్టరుగారికి మరొక కూతురు అయింది. అందుకని డాక్టరుగారు ఎవరైనా "మీకెంతమంది పిల్లలు?" అని అడిగితే ఆయనకి కలిగిన ఎనిమిది మంది పిల్లలతోపాటు అమ్మని కూడా కలిపి తొమ్మిది మంది అని చెప్పేవారు. జగన్మాతకే తల్లి అనిపించుకున్న డాక్టరుగారు ధన్యజీవులు. శుభకరి, కల్యాణకారిణి అయిన అమ్మ అనుక్షణం ఆయన వెన్నంటి నడిపింది.

## అమ్మ వెన్నంటి తీసుకుని వెళ్ళటం :-

1994 విజయదశిమి ఉత్సవం హైదరాబాద్‌లోని సోదరీ! సోదరులు జరుపుకున్నారు. ఆ సందర్భంగా డాక్టరుగారికి ఆహ్వానం వచ్చింది. అప్పుడు వారు 57 నుండి తాను తీసిన వేలకు వేల ఫొటోలు, నెగెటివ్స్ స్లైడ్సు సినిమా ఫిలింస్ సర్వం హైదరాబాద్ సేవాసమితి వారికి ఇవ్వదలచి అన్నీ తీసుకుని హైదరాబాద్ వెళ్ళారు. స్టేషన్‌దాటి బయటికి వచ్చారు. అక్కడ ఒక వ్యక్తి నుంచుని వుంటె ఆయనతో డాక్టరుగారు తాను వెళ్ళదలచిన పేట పేరు చెప్పి "అక్కడికి ఏ బస్సు వెళుతుంది?" అని అడిగారు. ఆ వ్యక్తి "ఏమో నాకు తెలియదు" విసురుగా అని వెళ్ళిపోయాడు. ఎట్లా వెళ్ళాలో తెలియని అసహాయస్థితిలో డాక్టరుగారు కూర్చున్నారు. వెంటనే అమ్మ ఎదురుగా కనపడింది. ఎదురుగా వున్న అమ్మ ఒక ప్రక్కకి చూస్తూ చేతి వ్రేలిని,తలని పిలుస్తున్నట్లు కదలిస్తూ, పిలిచింది. (సంజ్ఞచేస్తూ) ఈ విధంగా అమ్మ కనబడి అదృశ్యం అయింది. వెంటనే ఒక మనిషి గబాగబా వచ్చి డాక్టరుగారిని

పట్టుకుని, వారి సామాను కూడా తీసుకుని ఒక బస్సులో ఎక్కించి కూర్చోపెట్టాడు. "నువ్వు వెళ్ళవలసిన బస్సు ఇదే" అని చెప్పి బస్సు దిగి వెళ్ళిపోయాడు. అపరిచిత వ్యక్తి అమ్మ సంజ్ఞ చేయగా వచ్చిన వ్యక్తి అతను. తన దగ్గర వున్న అమ్మకి సంబంధించిన సర్వ సామగ్రిని హైదరాబాద్ సేవాసమితి వారికి ఇవ్వాలనే ప్రేరణను ఇచ్చి, హైదరాబాద్‌లో తనకి కనపడి అక్కడ వున్న వారి కూతురి ఇంటికి చేర్చిందిఅమ్మ . తెచ్చిన సామగ్రి అంతా సేవాసమితి వారికి అందించారు. ఆ ఉత్సవంలో తన అనుభవాన్ని అనుభూతిని తెలియచేశారు.

ఒకసారి డాక్టరు గారు ఫొటోలు తీస్తుండగా అమ్మ కృష్ణవేషధారియై వచ్చింది. "ఫొటో తియ్యరా" అంటే డాక్టరుగారు "కృష్ణుడు ఇంత పొట్టిగా వుంటాడా" అన్నారు. "ఎంత ఉంటాడు చెప్పు" అన్నారు అమ్మ. "ఇంత అని" తన ఊహకి తగిన ఎత్తు చెప్పారు. డాక్టరుగారు, అమ్మ వెంటనే అంత ఎత్తు పెరిగింది. డాక్టరుగారు చూస్తుండగానే రకరకాల ముద్రలు కూడా వచ్చినయి. వెంటనే డాక్టరుగారు అవి అన్ని ఫొటోలు తీసారు.

ఇదే అమ్మ ఇచ్చే అనుభవ జ్ఞానమనెడి దివ్య ప్రసాదం. భూత భవిష్యత్ వర్తమానజ్ఞాన మనెడి పిపాస నశించటమే దివ్య వైరాగ్యం. సాధారణంగా జీవన కడలిలోని పరిస్థితులు మానవుడ్ని ఆడిస్తయి. కానీ డాక్టర్‌గారు అమ్మ అనుగ్రహానికి పాత్రులై జీవన కడలిలోని పిరిస్థితులతో ఆడు కున్నారు. "జనన మరణాలనే కృంగు పొంగులు లేకపోవటమే అమృతత్వం" అని అమ్మ సూక్తి. ఈ తత్వసారాన్నే అమ్మమనకు ఇచ్చే అనుభవాల ద్వారా ప్రభోధించి మనలో నింపుతుంది. అమ్మ మాటల సారాన్ని , పరిపూర్ణంగా మనస్సు నిండా అమ్మనే నింపుకొని తన జీవనము జీవితమూ సర్వమూ అమ్మకే అర్పణ చేసిన డాక్టరుగారు చివరకు నవంబర్ 11, 1998 న ఉదయం గం. 7.30 ని.లకు అమ్మలో ఐక్యమయినారు. ఆయనను సర్వమూ తనే అయి జీవన పథాన్ని నడిపించి సేదతీర్చి తరింపచేసింది అమ్మ. అమ్మను రూప, ధ్యానాదులతో కొలిచి ఎన్నో అనుభూతులు పొంది అమ్మ కృపకు పాత్రులైన డాక్టర్ పొట్లూరి సుబ్బారావుగారు ధన్యజీవులు.

## కాసు రాధాకృష్ణ రెడ్డి

గుంటూరు జిల్లా అమరావతి మండలంలో తురగావారి పాలెం అనెడి గ్రామం ఉన్నది. ఆ గ్రామనివాసి కాసు పిచ్చిరెడ్డి కుమారుడు కాసు రాధాకృష్ణరెడ్డి. ఇతని తమ్ముడు కాసు వెంకటేశ్వరరెడ్డి . వీరిద్దరూ విజయనగరం సంగీత కళాశాలలో 1952 నుండి 1962 వరకు

పదిసంవత్సరాలు సంగీతం నేర్చుకున్నారు. వీరి గురువుగారు డొక్కా శ్రీరామమూర్తిగారు "అమృతవర్షిణి" రాగాలాపన చేసి వర్షం కురిపించారని రాధాకృష్ణరెడ్డి చెప్పారు. అటువంటి మహానుభావుడు డొక్కా శ్రీరామమూర్తిగారు రాధాకృష్ణరెడ్డిని "నాదోపాసక" అని సంభోదిస్తూ ఉత్తరాలు రాసేవారు. రాధాకృష్ణరెడ్డి - వెంకటేశ్వరరెడ్డి ఇద్దరూ పుట్టంధులు. సంగీత విద్యాభ్యాసం పూర్తి అయిన తరువాత స్వగ్రామం వచ్చి అప్పటి నుండి దైవాన్వేషణ చెయ్యాలని బయలుదేరి సత్యశాయి బాబా నివాసమైన పుట్టపర్తి చేరారు. వీరు ఒక విధమైన పరీక్ష సాటివారికి పెట్టేవారు. అదేమిటి అంటే ఓంకారనాదం బొడ్డు నుండి తీస్తూ గుద్దితే అవతలి వారు తట్టుకోవాలి. అట్లాగైతేనే వారు ప్రణవ స్వరూపులు, లేక పోతే కాదు. ఈ విధమయిన బండ పరీక్ష పెడుతూ సత్యశాయిబాబాని సంగీత రాగాలు తీస్తూ, ఓంకారనాదం చేస్తూ వారి తొడ మీద అరిచేతులతో చరుస్తూ ఒకరోజు కీర్తనలు పాడారు. వారు ఒకసారి భరించి రెండవసారి మాత్రం వీళ్ళని దగ్గరికి రానివ్వలేదు. అయితే వారికి కావలసిన ఏర్పాట్లు అన్నీ చూశారు. సత్యశాయి బాబాగారు టిఫెన్, కాఫీ, భోజనం మొదలైన వసతులన్నీ సమకూర్చారు. అక్కడ కొన్ని నెలలు వున్నారు. కానీ వారికి ఏ విధమైన సమాధానం, సంతృప్తి కలుగలేదు. వేదాంతం లక్ష్మీపతిగారు అనెడి ఒక భక్తుడు అమ్మ దగ్గరికి, పుట్టపర్తి రెండు చోట్లకి వెళుతూ వుండేవారు. ఆయన పుట్టపర్తి వెళ్ళినప్పుడు రాధని, వెంకటేశ్వర రెడ్డిని ఇద్దరినీ కలుసుకుని మాటల సందర్భంలో "ఆంధ్రదేశంలో, గుంటూరు జిల్లా బాపట్ల తాలుకా జిల్లెళ్ళమూడి గ్రామకరణంగారి భార్యగా సాక్షాత్తు స్వయంభూ పరమాత్మ ఆవిర్భవించివున్నా" దని చెప్పారు. అప్పుడు వీరిద్దరూ "ఈ మగాడే తట్టుకోలేకపొయ్యాడు. కరణంగారి భార్య ఏమిటి? స్వయంభూ పరమాత్మ ఏమిటి? ఒక పట్టు పట్టా"లని బయలుదేరారు. ప్రయాణమై సత్యశాయి బాబాగారికి "వెళ్తున్నామని" చెప్పారు. అప్పుడు బాబాగారు "మీకు కళ్ళు కావాలా? ఏమి కావాలి నాయనా"అని అడిగారు. తమ్ముడైన వెంకటేశ్వరరెడ్డి "కళ్ళు ఇవ్వండి" అన్నాడు. బాబాగారు "ఇస్తాను కానీ మళ్ళీ జన్మలో ఇంతకాలం అంటే ఇప్పటి నుండి ఎంతకాలం మీరు జీవిస్తారో అంతకాలం కళ్ళు వుండవని" జన్మ కర్మ సిద్ధాంతం చెప్పారు. ఆ తరువాత "అయితే నాకు వద్దు" అన్నాడు వెంకటేశ్వర రెడ్డి. రాధాకృష్ణరెడ్డిని కూడా అదే విధంగా అడిగారు బాబాగారు. అప్పుడు రాధ ఈ విధంగా అడిగాడు. "గంధర్వులు గానం చేస్తే పనులు అవుతయి. సిద్ధులు సంకల్పిస్తే పనులు అవుతయి. ఋషులు తీర్థప్రసాదాలు ఇస్తే పనులు అవుతాయి.

చారిణులు తిరిగితే పనులు అవుతయి. దేవతలు ప్రార్ధనలు చేస్తే పనులు చేసిపెడతారు. హోటల్‌లో సర్వర్ వున్న పదార్ధాలు అన్ని లిష్టు అంతా చెప్పి నీకేమి కావాలని అడుగుతాడు. ఇన్ని రకాలలో నువ్వు ఏరకం"అని అడిగాడు. అప్పుడు బాబాగారు "అసలు నన్ను గురించి నీ ఉద్దేశ్యము ఏమిటి" అని తిరిగి ప్రశ్న వేశారు. దానికి రాధ "రామా! అంటే రాముడు. కృష్ణా! అంటే కృష్ణుడు దిగి వచ్చినట్లు వుంటుంది మీగొంతు. స్వరము. మీది గంధర్వ స్వరం. అంత కంటె మిమ్మల్ని గురించి నాకేమీ ఉద్దేశ్యం లేదు." అని సమాధానం చెప్పాడు. " సరే అయితే వెళ్ళి రండని" చెరి ఒక 1000-00 ఇచ్చి ప్రసాదం బట్టలు కూడా ఇచ్చి పంపారు బాబాగారు. 1963 జూన్ నెల మొదటి వారంలో జరిగింది ఈ సంఘటన. అక్కడి నుండి బయలు దేరి జూన్ 12వ తేదీకి బాపట్ల చేరి, అక్కడ రిక్షా చేసుకుని 7వ మైలు చేరారు. అప్పుడు వాన పడి వుండటం వలన రిక్షా దిగి రెండడుగులు వేయగానే. కాలు జారి బొక్కబోర్లా ముందుకు పడ్డారు రాధ. వెంటనే ఆ మట్టి యాలకులు మొదలైన సువాసనద్రవ్యాలు కలిపి చేసిన అరిసెల వాసన వచ్చింది. అసలే మంచి తిండిపుష్టి వున్నదేమో ఆ మట్టిని పెద్ద తిరుపతి లడ్డంత మోతాదులో తీసుకుని తిన్నాడు. రాధ చెపుతూ వుండేవాడు పల్లెటూర్లలో "నాజోలికి వస్తే మట్టి కరిపిస్తానని" అంటుంటారని. ఈ మాట చెపుతూ మొదటిసారి 7వ మైలులో దిగగానే అమ్మ తనను అట్లా చేసిందని అనేవాడు. అక్కడి నుండి జిల్లెళ్ళమూడి చేరారు. అమ్మను కూడా వారి పద్ధతిలో బండ పరీక్షలు పెట్టేవారు అన్నదమ్ములు. వీరి చేత ఆ విధంగా దెబ్బలు తింటూనే అందరికీ దర్శనం, ప్రసాదాలు పెడుతూ వుండేది. వారు అమ్మను పెట్టే బాధలు చూసి కొంత మంది వారిని వెళ్ళగొట్టాలని, బెదిరించాలని ఆలోచిస్తే అమ్మ "వాళ్ళ మీద చెయ్యి పడితే నా మీద పడినట్టే వారి సంగతి నేను చూసుకుంటాను. వాళ్ళని ఎవరూ ఏమి అనవద్దు" అని ఆపింది. ఒకసారి అడిగినంత పెట్టాలి అనే వారి కోరిక మేరకు అమ్మ ఇద్దరికీ అరిచేతి మందాన, పెద్దసైజు గారెలు చెరొక 500 పెట్టటం జరిగింది. అవి కాక చెరొక బక్కెట్ పాయసం త్రాగి మళ్ళీ మధ్యాహ్నం వారి లెక్కలో మామూలుగా భోజనం చేశారు. వందమందికి అమ్మ దర్శనం ఇస్తున్నప్పుడు ఆ సమయంలో వెంకటేశ్వరరెడ్డి "ఒసెయ్, అమ్మా కాఫీ తెప్పించవే" అని విసురుగా అనేవాడు. అమ్మ తన సహజ ప్రశాంత వదనం తో కాఫీ తెప్పించి ఇచ్చేది. ఈ విధంగా 40 రోజులు వున్నారు. వారి పరిధికి ఈ మొదటిసారి పర్యటనలో ఏమి కనపడలేదు. కానీ గ్రహిస్తే చాలా వున్నది. తరువాత ఇద్దరూ వారి వూరికి వెళ్ళారు. కొంతకాలం గడిచిన

తరువాత రాధాకృష్ణ రెడ్డి ఒక్కడే మళ్ళీ జిల్లెళ్ళమూడి వచ్చాడు.

రెండవసారి మళ్ళీ అదే పద్ధతిలో పరీక్ష మొదలు పెట్టాడు. రెండవసారి అమ్మ వివిధ దేవ, దేవి రూపాలతో దర్శనం ఇచ్చారు. సీతారాములుగా రాధకృష్ణులుగా, శచీపురంధరులుగా, పార్వతీపరమేశ్వరులుగా ఈ విధంగా వివిధ రూపాలతో దర్శనమిచ్చారు. పురుష రూపంతో దర్శనమిచ్చినప్పుడు పురుష స్పర్శ, స్త్రీ రూపంతొ దర్శనమిచ్చినప్పుడు స్త్రీ స్పర్శ కలిగేది రాధాకృష్ణరెడ్డికి. తరువాత అమ్మ పాదాల నుండి రకరకాల వేద స్వరాలు, పంచాక్షరీ గాయిత్రీ, అష్టాక్షరీ, ఈ విధంగా ఎన్నో మంత్రాలు వినపడినవి. అమ్మను కొట్టేటప్పుడు అమ్మ ఒక ప్రణవసముద్రమయితే తన చేయి ఆ అలలకి తాకుతున్నట్లు అనుభూతమయ్యేది. అప్పుడు నేను (దత్తు) అడిగాను "ఒక దేవతారూపమో, దేవుని రూపమో కనపడితేనె నిశ్చేష్టులమై పోతాము కదా? మరి ఇన్ని దేవ, దేవీ రూపాలుగా దర్శన మిచ్చినప్పుడు కూడా నువ్వు ఎట్లా కొట్టావురా?, నువ్వు భస్మాసురుడివో , రావణాసురుడివో అయివుంటా"వని అన్నాను. అప్పుడు రాద " బంగారం ఖని కోసం కొట్టడం మొదలు పెట్టాను, సత్తు, ఇత్తడి వస్తే ఆగుతానా? బంగారం వచ్చేవరకు కొట్టాల్సిందే" అన్నాడు. " దేవ, దేవీ రూపాలు కామరూపం ధరించినవారు కూడా చూపించగలరు. రావణాసురుడు కూడా మాయాసీతని సృష్టించాడు, సాధువు రూపం ధరించాడు. కనుక ఇటు వంటివి చూసి పడిపోకూడదు. ఈ సహనం సహజ సహనం అవునా కాదా? గుణాతీతమవునా కాదా? ప్రణవస్వరూపం అవునాకాదా? అని అన్వేషణ మొదలు పెట్టాను". అన్నాడు.

జిల్లెళ్ళమూడిలో వున్న రోజులలో పడుకోవటానికి, ఎక్కడా నచ్చక అమ్మను అడిగి పెద్ద గుడి గర్భగుడి మాత్రమే కట్టివున్నది. అప్పటికి దానిలో పడుకుంటూవుండే వాడు. అక్కడ కూడా వివిధ వేదమంత్రాలు, ఉపనిషత్తులు వినపడుతూ వుండేవి. నాన్నగారు గుడిలో ప్రతిష్ట అయ్యేవరకు అక్కడే పడుకుంటూ వుండేవాడు. నాన్నగారు అమ్మలో ఐక్యం అవటానికి వారం ముందు అమ్మ రాధని గుడి ఖాళీ చెయ్యమని చెప్పింది. అప్పుడు అర్థంకాక పోయినా తరువాత తెలిసింది ఎందుకు ఖాళీ చెయ్యమన్నదో.

ఒకరోజు (రెండవసారి వచ్చినప్పుడు) ఆ బండచేత్తో 5 గంటలసేపు కీర్తనలు పాడుతూ కొట్టాడు. అంతసేపు నిరామయంగా వున్న అమ్మ "ఏం ....నాన్నా ...చేతులు నొప్పి పుడుతున్నయా" అని అడిగి నూనె తెప్పించి రాసింది అతని చేతులకు, దైవత్వం జయించలేనిది మాతృత్వం జయించింది. అమ్మ యొక్క సహజ సహనం. గుణాతీత మయిన భావాతీతమయిన

దివ్యమాతృత్వానికి దాసోహమని అమ్మ పాదాల చెంత వాలిపోయా. భూమి కూడా కంపిస్తుంది. పర్వతం కూడా బద్ధలై లావా కారుతుంది. ఈ కోమలమయిన స్త్రీ మూర్తి ఏమిటి? ఈ విధంగా కదలని చెదరని మాతృవాత్సల్యం ఇట్లా కురిపిస్తున్నదని అమ్మ అఖండశక్తికి . పవిత్రవాత్సల్యానికి అంజలి ఘటించి, జీవితాన్ని అంకితం చేసుకున్నాడు.

ఇక్కడ నిరామయంగా అమ్మ ఉన్నది అంటే అది శక్తి విహీనత కాదు. దివ్య వాత్సల్యం.

ఆ తరువాత సప్తసప్తాహాలు ఒక్కడే అమ్మ నామం "జయహోమాతా, శ్రీ అనసూయ, రాజరాజేశ్వరి, శ్రీ పరాత్పరి" అనెడి నామంతో చేశాడు. ఆ రోజులలో పంపులు లేవు. అమ్మ స్నానానికీ, అన్నపూర్ణాలయానికి అన్నింటికి అవసరమైన నీళ్ళుచెరువు లేక డ్రైన్ దగ్గర నుండి పీపాలతో ఎద్దుల బండి మీద పెట్టుకుని తీసుకువచ్చేవాళ్ళు. ఒక రోజు ఆ నీళ్ళు తీసుకురావటానికి వస్తానని రాధ, వద్దని దత్తు (మన్నవ) తీవ్రంగా అరుచుకున్నారు. తరువాత బండి మన్నవ దత్తు తోలుతుంటే రాధ సాగరంగారి భుజం మీద చెయ్యి వేసి పీపా నీళ్ళు తీసుకురావటానికి వచ్చాడు. అప్పుడు బండితోలే మన్నవ దత్తు, ఎద్దు, ఎద్దు వేసే పేడ, ఎదురుగుండా ప్రకృతి మొత్తం అమ్మలాగ కనపడింది రాధకి. "గుణప్రకోపంలో కూడా ఈ విధమైన దివ్యదర్శనం అయింది." సప్తసప్తాహాల అనంతరం కొన్ని రోజులకి కళ్ళు వున్నవారికి కనపడినట్లు కొన్ని నెలల పాటు రాధకి కూడా కనపడింది. ఈ ప్రపంచం, మనుష్యులు సర్వం కనపడినవి. అప్పుడు అనుకున్నాడట "కళ్ళు లేని వాళ్ళు వికలాంగులు, వాళ్ళు నిగ్రహంతో వుండటం ప్రధానం, గొప్పకాదు. అన్నీ ఉన్న వాళ్ళు, నిగ్రహంతో వుండటం విశేషం గొప్ప"

శంకరుల వారు దున్నపోతు చేత వేదం పలికించారని వింటూ వుంటాము. "ఆ దివ్య శక్తి కావాలనుకుంటే "మూకం కరోతి వాచాలం" అని మూగవాడు మాట్లాడగలడు, కుంటివాడు పర్వతాలు అధిరోహించగలడని ఆర్యోక్తి. మూగవారైన మనుష్యులే కాదు పశుపక్ష్యాదుల చేత కూడా పాడించగలదని వివరింపబోయే రాధ యొక్క అనుభవం తెలియచేస్తున్నది.

79 - 80 వ సంవత్సరములలో జరిగిన సంఘటన. రాధ ఒక రోజు రాత్రి అఖండ నామం దగ్గర నామం చేస్తున్నాడు. ఆ రోజులలో రాధ తమ్ముడు వెంకటేశ్వర రెడ్డి కూడా వుండేవాడు. కానీ ఆరోజు వెంకటేశ్వరరెడ్డి నామానికి రాలేదు. రాధ ఒక్కడే నామం చేస్తున్నాడు. అప్పుడు కుక్క ఒకటి వచ్చి రాధ తొడ మీద మూతి పెట్టి పడుకుని మనుష్య గొంతుతో నామం చేయటం మొదలు పెట్టింది. భైరవి రాగంతో నామం చేస్తున్నాను కనుక ఇది (కుక్క) ఇట్లా

చేస్తున్నదేమో అని అనుకొని అమృత వర్షిణిలో ఆ తరువాత అనేక రాగాలతో మారుస్తూ నామం చేశాడు రాధ. ఆ కుక్క కూడా అన్ని రకాల రాగాలు మారుస్తూ నామం చేసింది. ఆ సమయంలో అమ్మ కోమరవోలు గోపాలరావు గారిని " రాధతో పాటు నామం చేస్తున్నది ఎవరో చూసిరమ్మ"ని పంపింది. కానీ గోపాలరావు గారు ఆ అర్ధరాత్రి పూట గుడి దాకా రావటానికి బద్ధకించి వెంకటేశ్వర రెడ్డి అయివుంటాడులే అని వూరుకున్నారు. తెల్లవారు ఝామున 4 గం॥ దాకా కుక్క రాధతో పాటు నామం చేసి వెళ్ళింది. విన్నవాళ్ళు కొందరు కూడా వెంకటేశ్వరరెడ్డి అనే అనుకున్నారుట. ఈ విధంగా కుక్క చేత నామం చేయించి తను తలుచుకుంటే ఏదయినా సాధ్యమేనని చూపించింది, రాధకి అమ్మ . గొప్ప సంగీత విద్వాంసుడైన రాధకి ఏమాత్రం తీసిపోకుండా నామం చేసింది కుక్క సహితం.

రాధకి కళ్ళు కనపడటం కొంతకాలం జరిగిన తరువాత అమ్మ రాధని అడిగింది" ఏం - నాన్నా రాధా నీకు కళ్ళు కావాలా" అని. రాధ "ధృతరాష్ట్రునికి కృష్ణుడు కొన్ని క్షణాలు మాత్రమే కళ్ళు ఇచ్చాడు. నాకు నువ్వు కొన్ని నెలలు ఇచ్చావు. ఇంకా అవసరం లేదు" అని చెప్పిన తరువాత మళ్ళీ తిరిగి అంధత్వం వచ్చింది. ఈ విధంగా అమ్మ సాక్షాత్తు పరమాత్మ అని నమ్మిన రాధకి రెండు అనుభవాల ద్వారా తను సర్వ సమర్థని అని చూపించింది అమ్మ. అమ్మ 1985 జూన్ 12వ తారీఖున మహాసిద్ధి పొందినది. 1990 అక్టోబర్, నవంబర్ నెలల్లో రాధ షిరిడీ వెళ్ళాడు. సిద్ధపురుషుడు, మహా మహితాత్ముడు అయిన శాయిబాబా ఆశ్రమంలో కొద్ది రోజులు వున్నాడు. అక్కడ వున్నప్పుడు కలలో రాధకి వల్లూరి మోహనరావు అనెడి సోదరునికి అమ్మ భోగిపండ్లు పోస్తున్నట్లు కనపడింది. రామోహన రావుగారు హైదరాబాద్‌లో మౌలాలీలో నివసిస్తూంటారు. తనకు ఆ విధంగా కలవచ్చిన తరువాత మోహనరావుగారిని చూడాలని పించింది. తన రూమ్‌కి తాళం వేసి అక్కడ వున్న ఇన్‌చార్జికి తాళం చెవి ఇవ్వటానికి వెళ్ళి "హైదరాబాద్ వెళ్తున్నానని" చెప్పటం జరిగింది. అప్పుడు అతను " బాబా పర్మిషన్ లేనిది వెళ్ళలేవు" అన్నారు. వెంటనే రాధ "ఆయనెవరు పర్మిషన్ ఇవ్వటానికి నేనే బాబాకి పర్మిషన్ ఇస్తాను" అని తన మామూలు ధోరణిలో చెప్పి తాళం చెవి ఇచ్చి బాబా తపస్సు చేసిన వేపచెట్టు క్రింద సిమెంట్ సోఫా మీద కూర్చున్నాడు. ఆ సమయంలో రాధ శిరస్సు మీద మూడు వేపాకులు పడటం జరిగింది. అప్పుడుఅక్కడికి వచ్చిన మార్వాడీ రాధతో " ఆ మూడాకులు ఇస్తావా? 150/- రూ. ఇస్తానన్నాడు. వెంటనే రాధ ఆ మూడాకులు ఇచ్చాడు. మార్వాడి 150రూ. ఇచ్చాడు. అక్కడి వారికి అట్లా ఆకులు పడితే ఎంతో

అదృష్టంగా భావిస్తారుట. ఈలోగా తాను కొన్ని కీర్తనలు పాడాడు. ఇంతలో కొందరు ఆంధ్రులు అక్కడికి వచ్చి తలా ఒక 10-20రూ. ఇచ్చారు. ఆ విధంగా రాధకి 600 రూ. ఏర్పడినవి. రూమ్ నుండి బయటికి వచ్చేటప్పుడు రాధ దగ్గర 20 రూ. కూడా లేవు అనుకోని విధంగా అమ్మ ఈ రకంగా ఏర్పాటు చేసింది. అక్కడ హుండీలో ఒక 100 రూ. వేసి అక్కడి నుండి బయలుదేరి హైదరాబాద్ చేరాడు. హైదరాబాద్‌లో మోహన్‌రావు గారిని చూడటానికి వెళ్తే, ఆయన క్షేమంగా వున్నారు. ఆ సమయంలో అమ్మ కుమారుడు సుబ్బారావు హైదరాబాద్‌లో హాస్పటల్‌లో వున్నారు. ఆ సందర్భంలో అమెరికా సోదరుడు వెస్టర్‌లాండ్ భారత దేశం వచ్చి జిల్లెళ్ళమూడి లో అమ్మని దర్శించుకుని హైదరాబాద్ చేరి వున్నాడు. ఇతను అమ్మ వ్యక్తిగా వున్నంతకాలం జిల్లెళ్ళమూడి రాలేదు. కానీ 25 సంవత్సరాల నుండి అమెరికాలో వుండే అమ్మని దర్శిస్తూ ఇక్కడ అమ్మ ఎట్లా వున్నదో అట్లాగే అక్కడ అమెరికాలో అమ్మని దర్శిస్తూ ఉత్తరాలు రాస్తూ వుండేవాడు. జిల్లెళ్ళమూడిలో జరిగే కార్యక్రమాలకి నిధులు కూడా పంపుతూ వుండేవాడు. ఆ విధంగా ఎంతగానో అమ్మకృపకు పాత్రుడైన వాడు భక్తుడు. ఇతను హైదరాబాద్‌లో సుబ్బారావు పరిస్థితి చూసి సుబ్బారావు ఆరోగ్యం కోసం అమ్మ రెండవ కుమారుడు రవి ఇంట్లో ప్రార్థనలు చేశాడు. ఈ విషయం తెలుసుకుని రాధ కూడా రవి ఇంట్లో కార్యక్రమానికి చేరాడు. అక్కడ వెస్టర్‌లాండ్‌ని కలుసుకున్నాడు. తను కూడా నామం చేశాడు. వెస్టర్‌లాండ్‌ని కలవటంకోసం అమ్మ ఈ విధంగా చేసిందని చివరికి అనుకున్నాడు. షిరిడీ వెళ్ళిన రాధ ఈ విధంగా అమ్మ సంకల్పంతో హైదరాబాద్ చేరాడు.

హైదరాబాదు నుండి శ్రీశైలం వెళ్ళాలని సంకల్పం కలిగింది రాధకి. హైదరాబాద్‌లో రామచంద్రారెడ్డి అనెడి సోదరుని తీసుకుని ఎండోమెంట్ ఆఫీస్‌లో కమీషనర్‌ని కలుసుకోవాలని వెళ్తుండగా ఒక రూమ్ నుండి "ఏమండోయ్ తాతగారు" అని పిలుపు వినపడినది. ఆ రూమ్ నుండి ఒక ప్యూన్ వచ్చి వీరిద్దరినీ లోపలికి తీసుకుని వెళ్ళాడు. లోపల వున్న ఒక స్త్రీ వీరిద్ధరినీ కూర్చొనమని పలకరించి "నేను బాగా చిన్నప్పుడు మిమ్మల్ని చూశాను. నాకు మీరే అక్షరాభ్యాసం చేశారు. ఆ ప్రభావం వల్లనే ఇన్ని డిగ్రీలు పూర్తి చేశాను. ఇక్కడ అసిస్టెంట్ కమీషనర్‌గా పనిచేస్తున్నాను. మీరు ఏ పని మీద వచ్చారు?" అని అడిగింది. రాధ తను వచ్చిన పని చెప్పి కమీషనర్‌ని కలవాలని చెప్పాడు. ఆవిడ "మీకు కావలసినది పనా?కమీషనరా?" అని అడిగింది. "మాకు కావలసింది పనే" అన్నాడు రాధ,

మీరిక్కడే కూర్చోండి. మీ పనులన్నీ నేను చేసి పెడతా"నని రాధకి సంబంధించిన వివరాలు అన్నీ తీసుకుని శ్రీశైలం దేవస్థానం వారికి రాధకి కావలసిన ఏర్పాట్లు అన్నీ చూడమని కమీషనర్ నుండి ఆర్డర్ తీసుకుని రాధకి ఇప్పించటం జరిగింది. తరువాత రామచంద్రారెడ్డి సహాయంతో శ్రీశైలం చేరాడు రాధ.

శ్రీశైలంలో ఎండోమెంట్ ఆఫీసుకి వెళ్ళి కమీషనర్ ఆర్డర్ చూపించగా వాళ్ళు రాధకి కావలసిన వసతి భోజన సౌకర్యాలు ఏర్పాటు చేసి ఆఫీస్ ప్రక్కనే ఒక రూమ్ ఉండటానికి ఇచ్చారు. అక్కడ కొన్ని రోజులు వున్నాడు రాధ. తన దగ్గర వున్న డబ్బు అయిపోవచ్చింది. ఏమి చెయ్యాలో తోచక రూమ్ నుండి బయటికి వచ్చి నుంచున్నాడు. అప్పుడు ఒక వ్యక్తి పొట్టిగా వుండి, నెత్తి మీద వీపు మొదలు ఒళ్ళంతా జుట్టు వున్న ఒకతను రాధ దగ్గరికి వచ్చి "ఏం! ప్రభువులు ఇక్కడ వున్నారు? మీ జేబేది"? అని అడిగి జేబు చూపిస్తే జేబులో డబ్బు వేశాడు. "నీవు చాలా అదృష్టవంతుడివి సాక్షాత్ భగవంతుడి దగ్గర వున్నావు" అన్నాడు. అంటే అప్పుడు రాధ 'భగవంతుడు గిగవంతుడు నాకు తెలియదు. జిల్లెళ్ళమూడి అమ్మ దగ్గర వున్నాను" అన్నాడు. అప్పుడు ఆ వ్యక్తి "ఛా . .మీ అమ్మ పంది పాలు తాగింది" అన్నాడు. (అమ్మ చిన్నతనంలో చిదంబర రావు గారి దొడ్లో ఒక పంది దగ్గర పాలు తాగింది. అది మహోదధి తరంగాలలో వున్నది) అప్పుడు రాధ "ఛా . . .మీ అయ్య పందయ్ పుట్టాడు. పందిని కొట్టాడు, పంది మాంసము తిన్నాడు." అన్నాడు. అప్పుడు ఆ వ్యక్తి " ఓయబ్బో నీకు జ్ఞాన నేత్రముందయ్యోయ్" అన్నాడు. " అవ్వన్నీ నాకు తెలియదు కానీ నన్ను పాస్‌కి తీసుకు వెళ్ళు" అని అడిగాడు రాధ. " నిన్నా నేనా పాస్ కి తీసుకు వెళ్ళటమా ఛా తీసుకుని వెళ్ళను' అంటూనే మాయ మయ్యాడు ఆ వ్యక్తి. ఈ దృశ్యం చూస్తున్న గుడి సిబ్బందిలో ఒకడు పరిగెత్తుకు వచ్చి రాధతో "ఎవరు అయన అట్లా మాయమయ్యా డేమిటి?" అన్నాడు. "ఆ - వాడు మీలాంటి సేవకుడే" అన్నాడు రాధ . "ఆ మేము సేవకులమా" అని ఆ వ్యక్తి గద్దించినట్లు అడిగాడు. " అది కాదయ్యా మీరు ఇక్కడికి వచ్చిన వారికి సేవ చేస్తున్నారు కదా! అందుకని అట్లా అన్నాను" అన్నాడు. "అతనేమి అడిగాడు మిమ్మల్ని?" అనగా జరిగిన సంభాషణ అంతా చెప్పాడు రాధ. అప్పుడు అతను "మీరు గొప్ప జ్ఞానుల్లా వున్నారు. ఇక్కడ మీరు వుపన్యాసం ఇవ్వాలి" అన్నాడు. "నేను ప్రస్తుతం విశ్వశాంతి కోసం జపం చేస్తున్నాను. అది అయిన తరువాత చూద్దాం" అని అప్పటికి తప్పించుకుని ఆ తరువాత అక్కడి నుండి బయలు దేరి జిల్లెళ్ళమూడి వచ్చాడు. రాధని "ఎప్పుడూ అన్ని వూర్లు తిరుగుతూ వుంటావు.

నీకు కళ్ళు లేవు కదా! ఎట్లా తిరుగుతావు" అని అడిగితే, "నా జీతగాడు తీసుకుని వెళ్తాడు" అంటూ, "నాకు అనుక్షణం అమ్మ వెన్నంటి వుంటుంది. ఆ ధైర్యమే కానీ నా గొప్పతనం కాదు. ఆమె లేకపోతే నేను మాత్రం ఎట్లా తిరుగుతాను" అనేవాడు. దానికి సాక్ష్యం ఈ రెండు సంఘటనలు. ఇక్కడ శ్రీశైలంలో రాధతో మాట్లాడి డబ్బు ఇచ్చిన వ్యక్తి అమ్మ అని రాధ నమ్మకం. ఎందుకంటే అమ్మ పందిపాలు తాగిన సంగతి అదీ అమ్మ పసితనంలో జరిగినది ఎవరో సంబంధం లేని వ్యక్తికి తెలియదు. అతను ఆ సంగతి చెప్పటమే దానికి సాక్ష్యం అంటాడు. పైగా అడగకుండా, చెప్పకుండా డబ్బు ఇవ్వటము. అన్ని అమ్మదయ, అండ ఎంతగా వున్నవో తెలియచేస్తున్నాయి. భక్తుడయిన వాడికి భగవంతుడు సేవకుడు అవుతాడు అంటారు కదా! అట్లాగే పరీక్ష చేసి దేముడని నిగ్గతేల్చుకుని పరిపూర్ణ శరణాగతి పొందిన రాధని అమ్మ అనుక్షణం కనిపెట్టుకుని వుంది.

సహజ సహనమే పరిపూర్ణ ఆధ్యాత్మికతకి పరాకాష్ట. అట్టి దివ్యత్వాన్ని అనుభవించి అమ్మ నామ సంకీర్తనతో నిండి నిబిడీకృతమై ఎక్కడా తలవంచని వాడు అమ్మకి దాసోహం అన్నాడు. ఎటువంటి వ్యక్తికైనా దేహపరిణామం తప్పదు. అదే విధంగా రాధకి కూడా షుగర్ వ్యాధి, చర్మవ్యాధి వచ్చింది. హైడ్రోసిల్స్ ఆపరేషన్ అయింది. ఈ ఆపరేషన్‌కి రాధని స్ట్రెచర్ మీద పడుకోపెట్టి తీసుకుని వెళ్తున్నారు. అప్పుడు రాధకి అమ్మ తన ప్రక్కనే నడిచినట్లు అనుభూతి కలిగింది. అదే సమయంలో రాధకి ఆపరేషన్ చేసిన డాక్టర్ అలపర్తి లక్ష్మయ్యగారికి కృష్ణుడు నడుస్తున్నట్లు కనపడటం జరిగింది. వీరు గుంటూరులో గొప్ప పేరు వున్న డాక్టరు గొప్ప కృష్ణ భక్తులు. వీరి సతీమణి కూడా మంచి సంస్కారము కలిగిన మీరాబాయి లాగా కృష్ణభక్తురాలు. రాధ దగ్గర డబ్బు తీసుకోకుండా ఉచితంగా ఆపరేషన్ చేశారు లక్ష్మయ్యగారు. పేషెంట్‌గా వెళ్ళిన రాధ వారికి గురువుగా అయ్యాడు. వారి ఇంటికి వెళితే రాధకి నమస్కారము చేసేవారు భార్యాభర్తలు. ఆ తరువాత రాధకి భగంధరం బాధ ఎక్కువయింది. 1996 ఆగస్టు, సెప్టెంబర్ నెలల్లో పసికర్లువచ్చినయి. గుంటూరులో ఆయుర్వేద డాక్టర్ రాధాకృష్ణమూర్తిగారి ఇంట్లో ట్రీట్‌మెంట్ జరిగింది. ఆయన కదలవద్దని చెప్పినా హైదరాబాద్ వెళ్ళి అక్కడి నుండి తను చదువుకున్న విజయనగరం సంగీత కాలేజికి వెళ్ళి గణపతి నవరాత్రులలో 3.30గం. పాటు కచేరీ చేశాడు. అప్పుడు భగంధరం పగిలింది. తరువాత విజయ నగరం నుండి వరంగల్‌లో సోదరుడు కామరాజు ఇంట్లో వున్నాడు. అప్పుడు పసికర్లు 28 శాతంకి వెళ్ళింది. 3, లేక 4 వుండవలసినది అంతగా పెరిగింది. అక్కడ

మందులతో కొంత తగ్గింది. అమ్మ రెండవ కుమారుడు రవి పుట్టినరోజుకి హాజరు అయి అతని ప్రోద్బలంతో బాపట్ల చేరి డాక్టర్ ఇనజకుమారి హాస్పటల్‌లో చికిత్స పొందాడు. పసికర్లు 4కి తగ్గింది. కానీ నవరాత్రుల్లో విపరీతంగా వానలు పడుతున్నప్పుడు కూడా పాస్‌కి కూడా వెళ్ళేవాడు కాడని విన్నాను.

1996 అక్టోబర్ 23వ తేదీ సాయంత్రం అదే హాస్పటల్‌లో తుదిశ్వాస వదలి శాశ్వతంగా అమ్మలో లీనం అయినాడు. అమరుడైనాడు.

అలపర్తి లక్ష్మయ్యగారి భార్య డా॥ ఇనజకుమారితో "ఆయన వస్తే సాక్షాత్తు రాధాకృష్ణుడే వచ్చినట్లు వుండేది మాకు " అని చెప్పి విలపించిందట. తరువాత రాధ భౌతికదేహాన్ని జిల్లెళ్ళమూడిలో కాలనీ ముందు కాన్వెంట్ స్థలంలో ముందు వైపు ఖననం చేసి జ్ఞాపకచిహ్నంగా ఒక కట్టడం కట్టి గణపతి విగ్రహం స్థాపించటం జరిగింది.

గొప్ప సంగీత విద్వాంసుడైనా తన సంగీతాన్ని సంపాదనకి, పేరు ప్రఖ్యాతులకి కాకుండా అమ్మ నామానికి అంకితం చేసి ఎన్నో అద్భుతమైన అనుభవాలు పొంది అమ్మ అపార వాత్సల్యం చూరగొని తలవంచి అడుక్కునే పద్ధతి కాకుండా దబాయించి భగవంతుడిని సహితం విలక్షణమైన రీతినీతులులలో అమ్మని సేవించి అమ్మలో ఐక్యమయిన ధన్యజీవి రాధాకృష్ణరెడ్డి.

పరిపూర్ణ అవతారమూర్తి అయిన అమ్మ సాన్నిధ్యానికి వచ్చి ఎక్కడా తలవంచని ఇటువంటి వారు ఎందరో దాసోహమై అంకితమయినారు. అట్టి అమ్మకి నమస్సుమాంజలులు ఘటిస్తూ, ఇటు వంటి భక్తుల సంస్మరణతో మన అంతరంగాలు జ్ఞానాంజనమవ్వాలని అమ్మని వేడుకుని అంకితమవుదాం.

## పూండ్ల మాణిక్యమ్మగారు

జిల్లెళ్ళమూడికి రెండున్నర మైళ్ళ దూరములో పూండ్ల అనెడి గ్రామము వున్నది. ఆగ్రామ నివాసి నోరిమాణిక్యమ్మగారు. వారి ఇంటి పేరు నోరి అయినప్పటికి ఆవిడ వూరు పూండ్ల అగుట వల్ల అందరూ పూండ్ల మాణిక్యమ్మగారు అనే అంటారు. మాణిక్యమ్మగారికి చిన్నతనంలోనే వివాహం అయి చాలా కొద్దిరోజులలోనే భర్త పోవటం వలన చిన్నతనం నుండి సంసారజీవితం తెలియకుండ గడచిపోయింది. చిన్నతనం నుండి భక్తిమార్గంలో దైవచింతనతో జీవన యాత్ర సాగిస్తూవున్నది. పూండ్లకి మరొక రెండు మైళ్ళ దూరంలో మజ్జి పూడి అనే గ్రామం వున్నది. ఆ వూరి పొలిమేరలో పొన్నూరు, బాపట్ల హైరోడ్డు ప్రక్కన

రామలింగేశ్వర ఆలయం వున్నది. ఆ ఆలయ తిరునాళ్ళు ప్రతి సంవత్సరం జరుపుతారు. ఆ సందర్భంలో చుట్టు ప్రక్కల గ్రామాలలో ఆలయానికి సంబంధించిన నిర్వాహకులు చందాలు వసూలు చేస్తూ పూండ్ల వచ్చి మాణిక్యమ్మగారి దగ్గర కూడా వసూలుకు వచ్చి మాటల సందర్భంలో వారిలో ఒకరు అమ్మని గురించి చెప్పారు. "ఈ ప్రక్కనే వున్న జిల్లెళ్ళమూడిలో అత్తా, కోడలు వున్నారు. కోడలు ఆ ఊరి కరణంగారి భార్య, ఆమె గొప్ప పతివ్రత. పళ్ళెం పులగం ఎంతోమందికి పెట్టగలదు. అలౌకికశక్తి సంపన్నురాలు. ఆమెను దర్శించమని" చెప్పి వెళ్ళారు.

ఈ విధంగా 1950 ప్రాంతంలో అమ్మను గురించి విన్నారు. మాణిక్యమ్మగారు వారు చెప్పి వెళ్ళిన కొద్ది సమయంలోనే ఆకాశంలో సినిమాల్లో ఆకాశంలో సగం వరకు దేవతారూపం కనపడినట్లు అమ్మ రూపం కనపడింది. అమ్మ గురించి చెప్పటం వెంటనే ఇతః పూర్వం చెప్పి నట్లు దర్శనం ఇవ్వటంతో అమ్మను దర్శించవలెనని ఆకాంక్ష ఎక్కువయి మరుసటిరోజున అమ్మని దర్శించటానికి జిల్లెళ్ళమూడి వెళ్ళారు మాణిక్యమ్మగారు.

ఆమె మొదటిసారి దర్శనమప్పుడు అమ్మ నివాసం ఈ విధంగా వున్నది. చిన్న పర్ణశాల. ఒక కుంపటి, 4 గిన్నెలు, 4 గ్లాసులు, ఇంత కంటే మాణిక్యమ్మగారికి భౌతికంగా అక్కడ ఏమీకనపడలేదు. అటువంటి నిలయంలో మొదటిసారిగా అమ్మని దర్శించారు. మాణిక్యమ్మగారు. అప్పుడు అమ్మ మొదటిసారి పలకరింపులోనే "ఏ....వే....ఏముందని వచ్చావే ఇక్కడికి " అన్నారు. పుట్టినప్పటి నుండి తెలిసిన వ్యక్తిని పలకరించినట్లు పలకరించారు అమ్మ. మాణిక్యమ్మగారికి కూడా ఇదేమిటి ఇట్లాపలుకరిస్తున్నది. అని అనిపించలేదుట. వెంటనే మాణిక్యమ్మగారు "ఇదే వైకుంఠమనుకుంటున్నాను. నువ్వే సాక్షాత్ ఆదిలక్ష్మివని అనుకుంటున్నాను" అన్నారుట. అప్పుడు అమ్మ " ఓసి - చాలా మాటలు నేర్చావే" అన్నారు.

మాణిక్యమ్మగారు చెప్పినదేమిటంటే అమ్మ దగ్గరికి వచ్చిన తరువాతే ఆవిడ వంటావార్పు నేర్చుకున్నదని అన్నారు. అమ్మ ఆవిడితో "నీకేమి తెలియదు. నీ మోహం. రా... వంట నేర్పుతా" అంటూ వంట చెయ్యటం నేర్పిందట. అమ్మ అంటుంది. "నేనే మిమ్మల్ని కన్నాను. మీ తల్లితండ్రులకు పెంపుడు ఇచ్చాను" అని. అందువలన కొత్త పాతలు, అడ్డు గోడలు, దూరం, దగ్గరలు అమ్మకి లేవు. ఆ విధంగా అమ్మ దర్శనం మొదటిసారి మాణిక్యమ్మగారికి జరిగింది. మరొక ముఖ్యమయిన విషయం సర్వ సాధారణమయిన

భౌతిక వాతావరణంలో అసాధారణమయిన అలౌకిక హృదయానుభూతిని అనుభవించారు మాణిక్యమ్మగారు. అలౌకికమూర్తుల సాన్నిధ్యంలో పొందెడి అనుభూతి సాధారణ మానసిక, భౌతిక పరిధికి అతీతంగా వుంటుంది. ఈ విధంగా అమ్మని దర్శించి ఎనలేని మాతృవాత్సల్యాన్ని, దివ్యానుభూతిని అనుభవించి తిరిగి వెళ్ళారు.

అది మొదలు వీడని అమ్మ చింతనతో ఆవిడ మనస్సులో సహజ ఉపాసన జరిగేది. జిల్లెళ్ళమూడిలో అమ్మ "ఒసేయ్... మాణిక్యమ్మరా" అని పిలిస్తే ఈమెకి వినిపించేదట వెంటనే అది అర్ధరాత్రికానీ, మిట్ట మధ్యాహ్నం కానీ వానే, బురదకానీ, ఎండ కానీ, వెన్నెలకానీ, ఏకాలమయినా ఎటువంటి పరిస్థితిలోనైనా అమ్మ పిలుపు వినగానే, కూరలు ఉప్పు, పప్పు, చింతపండు, మిరపకాయలు ఏ బుట్టలోనో మరొక దానిలోనో పెట్టుకుని జిల్లెళ్ళమూడి వచ్చేవారు. మాణిక్యమ్మగారు. జిల్లెళ్ళమూడిలో అమ్మ సేవ చేసుకుని తిరిగి వచ్చేవారు. పూండ్ల గ్రామస్తులు జిల్లెళ్ళమూడి గ్రామస్తులు అందరూ ఆమెని "ఎందుకమ్మా వస్తావు? ఏముంది అక్కడ పిచ్చా, చాదస్తమా? " అని నిరుత్సాహ పరుస్తూ అవహేళనగా అనేవాళ్ళు. అయినా లెక్క చెయ్యకుండా అమ్మ చెంతకు వచ్చేవారు మాణిక్యమ్మగారు. అట్లా అనే వాళ్ళతో కూడా "అమ్మ సాక్షాత్ ఆదిలక్ష్మి అనీ, ఆ నిలయం వైకుంఠమని" చెప్పేవారు. జనం విస్తృతంగా రాని రోజులలో తన ఊరిజనం, జిల్లెళ్ళమూడి జనం సహితం అమ్మ దగ్గర ఏముంది? అని నిరుత్సాహం పరుస్తున్న రోజులలో ఆమె ఒక్కరే అచంచల విశ్వాసంతో అమ్మని సేవించుకున్న మహాభక్తురాలు మాణిక్యమ్మగారు.

ఒకసారి నాగులచవితికి జిల్లెళ్ళమూడి వెళ్ళారు. అప్పుడు అమ్మతో "పుట్ట, నాగేంద్రుడిని చూపిస్తే పాలు పోసుకుంటానని' చెప్పారు. అమ్మ సరే అని ఉదయం 7గం॥ అయినా రాలేదు. మాణిక్యమ్మగారు "ఇంకా ఎప్పుడు వస్తావు. ఎప్పుడు పాలు పోసుకోవాలి నాగేంద్రుడికి' అని విసుగ్గా అన్నారు. తరువాత అమ్మ స్నానం చేసి దర్శనానికి వచ్చి కూర్చుని "ఇందాకట్నుంచి పాలు పోసుకుంటాను అంటున్నది. రమ్మనుదాన్ని" అన్నారు. అప్పుడు ఆమె " పుట్ట చూపిస్తానన్నావు నాగేంద్రుకి పాలు పోసుకోవటానికి" అంటూ అమ్మ దగ్గరకు రాగానే అమ్మ పాద పీఠము మీద నాగేంద్రుడు పడగ విప్పి కనపడటం జరిగింది. అమ్మ "పాలు పోసుకుంటానన్నావుగా" రా పోసుకో, ఇడుగో నాగేంద్రుడు" అన్నది. నిజంగానే నాగేంద్రుడు కనపడితే ఆమెకి భయం పుట్టి ఖంగారుగా "అమ్మో! నాగుపాము" అని బయటికి పరిగెత్తింది. అప్పుడు అమ్మ నాగేంద్రుడికి పాలు పోసుకుంటానన్నావుగా? ఊ పాము లేదు

ఏమీ లేదులే దా" అన్నది. రెండవసారి మాణిక్యమ్మగారు లోపలికి వచ్చినప్పుడు పాము కనపడలేదు. అప్పుడు ఆమె అమ్మ పాదాల మీద పడి "నువ్వే నాగేంద్రుడు, నువ్వే సర్వమమ్మా .... ఇంకా వేరే పుట్ట నాగేంద్రుడు ఎందుకమ్మా" అని అమ్మ నోట్లో పాలు పోసుకుని పూజించుకున్నది. ఈ విధంగా సర్వదేవతా స్వరూపం అమ్మేనని, సర్వం అమ్మేనని అంకితమయి అమ్మని సేవించుకున్నారు.

ఒకసారి మాణిక్యమ్మగారి అక్క కొడుకు, కూతురు చిన్నపిల్లల్ని తీసుకుని అమ్మ దర్శనానికి వచ్చారు. సాయంత్రంచీకటి పడిన తరువాత ఆమె అమ్మ దగ్గర శెలవు తీసుకుని బయలు దేరుతామని అమ్మకి చెప్పారు. "ఈ రోజు వుండి రేపు ఉదయం వెళ్ళమని" చెప్పారు అమ్మ. కానీ ఆమె "పిల్లల్ని రేపు మా అక్కయ్యగారి ఇంటికి పంపించాలి" అని బయలుదేరారు. అర్థరాత్రి, అపరాత్రి రావటానికి అలవాటుపడిన ఆమెకి "ఇప్పుడు వెళ్ళవచ్చులే ఏమౌతుంది," అనిపించి ఇద్దరు పిల్లల్ని వెంటబెట్టుకుని పూండ్ల బయలుదేరారు. జిల్లెళ్ళమూడి వూరి చివరలో రెండు పంటకాలువలు వున్నయి. చీకట్లో అక్కడి దాకా వెళ్ళిన తరువాత అక్కడ ఒక వ్యక్తి తాగి వుండి కఱ్ఱ ఒకటి చేత పుచ్చుకొని తీవ్రమయిన స్వరంతో "ఆ ...వచ్చావా? రా! నీ తలకాయ పగలుకొడతా...రా" అంటూ కఱ్ఱ ఎత్తి ఈవిడ మీదకి వచ్చాడు. ఆవిడ అక్క కూతురు, కొడుకు భయపడుతూ ఆమె కాళ్ళు చుట్టుకొని నుంచున్నారు. మాణిక్యమ్మగారు అతనితో "ఏమిటి నాయనా! నీకేంకావాలి? ఎందుకు నన్ను కొట్టటానికి వస్తున్నావు? ఇదిగో ఈ సంచీ సంచీలో రెండు గుడ్డలు వున్నయి కావాలంటే తీసుకో" అని అన్నారు. ఆ వ్యక్తి దగ్గరికి వచ్చిన తరువాత ఆ చీకట్లో ఈమెని గుర్తుపట్టి "మాణిక్యమ్మగారు మీరా?" అని ఎత్తిన కఱ్ఱ కాస్త దించాడు. అతనిని గుర్తించి "ఓరి సుబ్బయ్య నువ్వా! అన్నారు మాణిక్యమ్మగారు అతను వెంట నే నేనే అమ్మగారు అంటూ పూండ్ల వూరు బయట దాకా వచ్చి దిగపెట్టి వెళ్ళాడు. ఈ విధంగా ప్రమాదం తప్పటం జరిగింది. అంతేకాకుండా తాగి ఉన్మత్తుడైన ఆ వ్యక్తి వారిని గుర్తించి తోడు వచ్చి సహాయం చేశాడు. ఏ మాత్రం ఆ చీకటిలో గుర్తించక పోయినా ఆమె తలపగిలి ఘోరమైన ప్రమాదం జరిగివుండేది. మనం చేసెడి క్రియలన్నీ మనకు వచ్చే ప్రేరణ మీద దాని యొక్క విచక్షణ మీద ఆధారపడి వుంటయ్. ఆ అంధకారంలో ఆమె ఎవరో గుర్తించేటట్లుగా అతని భావతరంగాలనే మార్చి రక్షించింది అమ్మ. మరునాడు మాణిక్యమ్మగారు జిల్లెళ్ళమూడి వచ్చారు. ఈమెను చూడగానే అమ్మ "ఆ వచ్చావా? రా నీ తలకాయ పగలకొడతా రా " అంటూ కఱ్ఱ పట్టుకొని ఎత్తి

కొట్టపోతున్నట్లుగా రెండు చేతులూ ఎత్తి క్రితం రోజున సుబ్బయ్య ఏ విధంగా చేశాడో అదే విధంగా అన్నారు అమ్మ. సర్వజ్ఞ అయిన అమ్మకి తెలియందేముంది.? "వెళ్ళద్దని చెపితే విన్నావా?" అని అన్నారు అమ్మ. అమ్మ సర్వజ్ఞత్వానికి, రక్షణకి అంజలి ఘటిస్తూ "ఏం చేసేదమ్మా పరోక్షంగా నువ్విచ్చిన సూచన అర్థంకాలా, అజ్ఞానంతో వెళ్ళాను. " అని నమస్కరించారు మాణిక్యమ్మగారు. క్షణాలలో భావాన్ని సంఘటనని మార్చేశక్తి సర్వరక్షాస్వరూపిణి అమ్మ అని ఈ సంఘటన ద్వారా తెలుస్తుంది.

మరొకసారి అమ్మ పర్ణశాలలో మాణిక్యమ్మగారు ఉదయం కాఫీ పెడుతున్నారు. ప్రక్కనే అమ్మ పెద్దకొడుకు సుబ్బారావు ఉన్నాడు. ఎదురుగా వున్న బారెన్ దగ్గర అమ్మ సమాధ్యవస్థలో కూర్చున్నారు. ఆ సమయంలో మాణిక్యమ్మగారికి, అమ్మకి మధ్య పంచరంగుల వెలుతురు ఆవరించింది. అప్పుడు మాణిక్యమ్మగారు "ఏరా సుబ్బారావు ....ఏమున్నది మా అమ్మ దగ్గర అంటావే? రా, చూడు" అన్నారు. "పిలుమీనాన్నని పిలు" అంటే సుబ్బారావు భయంతో ఆవిడ కాళ్ళు పట్టుకుని నుంచున్నాడు. ఇంతలో ( అమ్మ భర్త) నాన్నగారు వచ్చారు. అంతా ఖంగారు పడ్డారు ఏమవుతుందో అని మాణిక్యమ్మ గారికి కొబ్బరి కాయలు కొట్టాలి అని మనస్సులో అనిపించి మూడు కొబ్బరి కాయలు తెప్పించి అమ్మకి , ఆవరించి వున్న తేజస్సుకి కలిపి వారున్న చోటు నుండే కొబ్బరి కాయలు కొట్టి, హారతి ఇచ్చి నమస్కరించారు. వెంటనే ఆ వెలుతురు పోయి అమ్మ మామూలు స్థితికి వచ్చి లేచి వచ్చారు.

అమ్మ నివసించే పర్ణశాలలో ఒక పుట్ట వుండేది. అమ్మ ఆ పుట్ట మన్నుని అందరికీ ప్రసాదంగా ఇచ్చేవారు. అది చాలా సువాసగా వుండేది. ఒకరోజు అమ్మ మాణిక్యమ్మ గారిని పుట్టమన్ను కొద్దిగా తీసుకుని రమ్మంటే, మొత్తం పుట్టని పెకలించి పళ్ళెంలో పెట్టి తీసుకుని వచ్చారు. ఆమె నువ్వుతూ "మొత్తం పుట్టని తెచ్చానమ్మా" అంటే, అమ్మ "మొత్తం తెచ్చావా?" అంటూ ఆమె వంక చూసి చూడక ముందే మాణిక్యమ్మగారు క్రింద పడిపోయి నోటివెంట నురుగులు వస్తూ కొట్టుకున్నారు. అప్పుడు అమ్మ మాణిక్యమ్మగారిని చేత్తో నిమిరారు. క్షణాలలో ఆవిడ మళ్ళీ మామూలు స్థితికి వచ్చారు. అప్పుడు అమ్మ "దాని అవసరం తీరిందిలే అందుకే ఇట్లా జరిగిందేమొ" అన్నారు. ఈ విధంగా పుట్ట యొక్క చరిత్ర మాణిక్యమ్మగారితో పరిసమాప్తి అయింది.

మాణిక్యమ్మగారి ఇంట్లో ఒకసారి సంకీర్తన జరిగింది. సంకీర్తన ఆగిన తరువాత కూడా ఒకే చోటనుండి ఆ ఇంట్లో ప్రక్కగా శబ్దం వినపడింది. కొందరు ఖంగారు పడ్డారు. జిల్లెళ్ళ

మూడి వచ్చి అమ్మతో చెప్పారు. తరువాత ఆ శబ్దం ఆగిపోయింది. ఎవరైనా యాత్రికులు పూండ్ల మీద నుండి జిల్లెళ్ళమూడి వస్తుంటే వారికి కూరలు, బియ్యం, పప్పు, ఈ విధంగా అనేకమయిన వస్తువులు ఇచ్చిపంపుతూ వుండేవారు. మాణిక్యమ్మగారు "అది నా పుట్టిల్లు" అని అమ్మ అంటూ వుండేది. బిడ్డని అత్తవారింటికి పంపి ఎవరైనా వెళ్తుంటే ఇది ఇవ్వండి అది ఇవ్వండి అని ఇచ్చిపంపినట్లు మాణిక్యమ్మగారు పంపుతూ వుండే వారు. భక్తి భావంతో అమ్మ చెంతకు చేరి సేవించుకుని భక్తురాలై చివరికి తల్లియై అమ్మని మాతృ వాత్సల్యంతో సేవించుకున్నారు. కృష్ణుని పెంచిన యశోదలా "అది నా పుట్టిల్లు" అని అమ్మే ప్రకటించిందంటే అమ్మ ఆమెకి ఎంతటి అనుగ్రహాన్ని ప్రసాదించిందో వేరే చెప్ప నవసరం లేదు. ఇట్టి అదృష్టానికి నోచుకుని, సేవించిన విశిష్ట వ్యక్తి నోరి మాణిక్యమ్మగారు.

## యార్లగడ్డ రాఘవయ్యగారు

యార్లగడ్డ రాఘవయ్యగారు గుంటూరు జిల్లా రేపల్లె తాలుకా సింగుపాలెం నివాసి. వీరు గుంటూరు ప్రక్కనే వున్న చేబ్రోలు వెళ్ళి అక్కడ అమృతానంద సరస్వతీ స్వాముల వారి ఆజ్ఞానుసారం వారి సోదరుడు అయిన భాస్కరుని ప్రేరణతో జిల్లెళ్ళమూడి వెళ్ళి అమ్మను దర్శించవలెనని సంకల్పము కలిగి జిల్లెళ్ళమూడికి మూడు మైళ్ళ దూరంలో వున్న అప్పాపురం గ్రామం చేరుకున్నారు. ఆ ఊరి నుండి మూడు మైళ్ళు నడవగలగుదునా అని వారికి అనుమానము కలిగినది. వారు ఒడ్డు, పొడుగు వున్న స్థూలకాయులు, అంధులు. అయినప్పటికి అమ్మ కృప వుంటే నడువలేనా అని భావించి అమ్మ దయ వలన మూడు మైళ్ళు నడచి జిల్లెళ్ళమూడి చేరినారు. అమ్మ చూపిన అపార వాత్సల్యానికి పులకితులైనారు.

ఎప్పుడు అమ్మ పాదపద్మముల సన్నిధికి చేరి కన్నుల కద్దుకుంటానా? అనెడి తీవ్ర ఆకాంక్షతో అమ్మ సన్నిధికి చేరారు వారు. కన్నతల్లిని మించిన ఆదరణ ప్రేమతో అమ్మ వారికి కాఫీ ఇచ్చి "వేడి నీళ్ళు పోసుకో నాన్నా ఒళ్ళు నెప్పులు పోతాయి" అని వారిని సేద తీర్చారు అమ్మ. జిల్లెళ్ళమూడి గ్రామం అమ్మ పుట్టిన వంశము అయిన మన్నవ, జన్మస్థలం మన్నవ మరియు మెట్టిన వంశమయిన బ్రహ్మాండం వంశము. అమ్మ భర్త, బిడ్డలు అమ్మను సేవించుకునే వారు, అక్కడ నివసించెడి కుక్క, పిల్లి దగ్గర నుండి అన్నియు ఏమి పుణ్యము చేసుకున్నవో అని పరవశము చెంది అమ్మను కీర్తిస్తూ పద్యాలు రాశారు వారు.

అది వికారి నామ సంవత్సరము, కార్తీక పౌర్ణమి నాటి రాత్రి తొమ్మిది గంటలకి మంగళవారము నాడు ఎంతో వేడుకగా అక్కడ వున్న వారు అమ్మకి కుంకుమార్చన

చేసుకుంటున్నారు. రాఘవయ్యగారు కూడా పూజ చేసుకుంటున్నారు. ఒక్కసారిగా వారి హృదయం ఉప్పొంగిపోయింది. వారికి అమ్మ సాక్షాత్ మహేశ్వరిగా దర్శనం ఇచ్చింది వారికి. అమ్మ ఇచ్చిన దర్శనాన్ని వివరిస్తూ వారు పులకితగాత్రులయ్యారు.

అమ్మ శిరమున దేదీప్యమానముగా తేజరిల్లెడి రత్న ఖచిత బంగారు కిరీటము ధరించినది. అమ్మ నాసికమున ఎంతో సొంపుగా వున్న ముంగెర, సమ్మోహన మూర్తియైన పున్నమి చంద్రుని బోలిన ముఖము, దుర్జనులు హడలిపోవునట్లు ఖడ్గాది ఆయుధములు అష్ట బాహువుల యందు ధరించి , పసుపు అంచు కలిగిన పగడాల రంగు కల చీర, మెరసిపోయెడి నల్లని రవిక మేలిమి బంగారు రంగు దేహముతో నాలుగు దిక్కులా ధగధగాయమానమైన కాంతి పుంజములతో భూమ్యాకాశాలు నిండిపోవగా మరొక వైపు కరుణరసం ఒలికెడి కన్నులతో ఠీవిగా కొలువుదీరిన ఖంఠీరముతో అద్వితీయమైన దివ్యదర్శనము విశ్వమయి, విశ్వకారిణి, విశ్వరూపిణి అయిన అమ్మ ఇచ్చినది రాఘవయ్యగారికి. వారు ఇటువంటి దివ్యదర్శనము మునుపెన్నడును ఎక్కడా చూడ లేదు. ఇట్టి మహోజ్వల దర్శనముతో వారి పూర్వ భవంబులన్నీ పండిరాలిపోయినవని వారు పరవశముతో చెప్పినారు. కన్నులు లేని తనకు తన కృపావీక్షణముతో కన్నుల పండుగ చేసినది అమ్మ అని నీరాజనములు సమర్పించారు రాఘవయ్యగారు. తను దర్శించిన ఆ దివ్య రూపాన్ని పూర్తిగా మాటలతో చెప్పలేకపోయినా వీలయినంతలో చూచిన దాన్ని కొద్దిగా వివరించితినని వారి హృదయాను భూతిని చెప్పారు.

మంచి, చెడులను పాటించని కామపిశాచి ఇతడు అని ఆగ్రహింపక ప్రేమ కురిపించి పరమేశ్వరి రూపం చూపినదని చాటి చెప్పారు. ఎల్లప్పుడు ఈ విధముగా దర్శనమివ్వాలని, సర్వశంకలు మాన్పి, భక్త జనుల తోడ సఖ్యమివ్వాలని, నిరంతరము అమ్మ వైపు బుద్ధి మరల్చి అమ్మ పదభక్తిని కోరిన మహనీయమైన వ్యక్తి వీరు. నీ దయ కాక మోక్షమయినను కూడ వద్దని కోరిన భక్తికి పరాకాష్ట అయిన భావసంజనిత నీరాంజనాలు సమర్పించారు. అమ్మని దర్శించటం అంటే కేవలం అక్కడ వున్న అమ్మని దర్శించటం కాదని, నిఖిలంబు అమ్మగా దర్శించటమే అమ్మని దర్శించటమని తెలియచేశారు. అమ్మ ప్రభోదములోని ఆదర్శమును ఈ విధముగా తెలియచేశారు. నిష్కామకర్మ ఏ విధంగా చెయ్యాలో చెపుతూ ఎవరికి అయితే చేస్తున్నామో వారికి నీవల్ల జరుగుతున్నట్లు కూడా తెలియకుండా చెయ్యాలని అమ్మ ప్రభోధంలోని మహోన్నత తత్వసారాన్ని, కీర్తికాంక్షలవలేశం లేని అహంకార రహితమైన

నిష్కామకర్మ యోగం యొక్క దైవీయ సంపత్తి సామాజికంగా ఏ విధంగా ప్రతిష్ఠింపబడాలో తెలియచేశారు.

వ్రతములు, పండుగలు వేదాంత, ఆరోగ్యశాస్త్ర విధులు కలిపి చెప్పారు బుధులు. అవి వానిలోని మర్మాలు చక్కగా వివరించి చెప్పినది అమ్మ అని తెలియచేశారు. మన సంప్రదాయంలోని ఆదర్శాన్ని తెలియచేసింది అమ్మ.

పళ్ళెడు పులగం ఎంతోమందికి అమ్మ పెట్టిన మహిమను తలచుకుని ఆనందించారు. ఒకసారి అందరూ నదికి స్నానానికి వెళ్ళినప్పుడు అక్కడ ఆడవాళ్ళందరూ వదలిన దీపములన్నీ ఒకటిగా కలవటం చూసి వారందరూ ఆశ్చర్యపడి మహిమాన్వితము అయిన అమ్మ ప్రభావము ఎంతదో కదా అని అనుకున్నారట. అనేకత్వంలోని ఏకత్వము యొక్క సమన్వయ సామర్థ్యాన్ని ఈ చర్య ద్వారా తెలియచేసినది అమ్మ. ఒకసారి దొన్నెలో దీపం వెలుగుతుండగా దోసెడు నీరు పోసినదట అమ్మ. అప్పుడు ఆ దీపం భాస్కరుడే ఆశ్చర్యపోతున్నడా అన్నట్లు వెలిగిందట.

ఒకసారి రాఘవయ్యగారు, భాస్కరరావుగారు అమ్మ దగ్గర సెలవు తీసుకుని వారి ఇంటికి బయలుదేరినారు. ఒక బస్సువస్తే ఆ బస్సులో కండక్టరు చోటు లేదు దిగండని గదిమినాడు. అంతా అమ్మదయ అని ఇద్దరు బయలుదేరినారు. ఇంతలో వెనుక ఒక కారు వచ్చింది. అందులో వారిని ఎక్కించుకున్నారు. కొంతదూరం వచ్చిన తరువాత నడిబాటలో అంతకు ముందు వీరిని ఎక్కించుకోకుండా వచ్చిన బస్సు చెడిపోయి ఆగివుండటం కనబడింది. రాత్రి పదిగంటలకి కానీ ఆ బస్సులో వారు ఇంటికి చేర లేకపోయే వారు కానీ బస్సు ఎక్కక పోవడం వల్ల చీకటి పడకముందే ఇంటికి చేరినారు. తల్లికి ఎప్పుడు అవిటి వాని మీదే ఎక్కువ ప్రేమకదా అని రాఘవయ్యగారు మురిసిపోయారు.

సింగుపాలెంలో ఒకరోజు చంద్రమ్మ అక్కయ్య , సత్యవతి అక్కయ్య రాఘవయ్య గారితో మాట్లాడుతున్నారు. అప్పుడు రాఘవయ్యగారు వీరిద్ధరితో "ఇప్పుడు మన్నవ భూషి అన్నయ్య అమ్మకి నల్లద్దాల జోడు ఇచ్చాడు. అమ్మ పెట్టుకున్నది అని చెప్పారు. తరువాత జిల్లెళ్ళమూడి వచ్చినప్పుడు విచారిస్తే సింగుపాలెం లో రాఘవయ్యగారు చెప్పిన సమయానికే జిల్లెళ్ళమూడిలో మన్నవ భూషిగారు అమ్మకి నల్లద్దాల జోడు ఇవ్వటం జరిగిందని తెలిసింది. జిల్లెళ్ళమూడిలో జరిగిన సంఘటన సింగుపాలెంలో రాఘవయ్యగారికి తెలిసింది, కనపడింది. అమ్మ కృపతో ఎవరైనా ఎంతటి మహోన్నత స్థితియైన పొందగలరు. కార్యాన్ని సాధించగలరు అని ఈ

సంఘటన తెలియచేస్తున్నది.

రాఘవయ్యగారికి రహి, అమ్మ మాటలు వినపడేవి. అవి వ్రాసుకున్నారు కానీ అవి పోయినవి. రహి అనే సిద్ధపురుషుడు మహాసిద్ధి పొందపొయ్యే ముందు రక్తాక్షరాలతో ఉత్తరం రాఘవయ్యగారికి రాశారు. అది ప్రస్తుతం దొరకలేదు. ఎన్నో సందర్భాలలో అమ్మ పెట్టుకున్న ఆభరణాల గురించి వివరించే వారు.

ఇట్టి అనుభూతులతో అపారమైన అమ్మ వాత్సల్య అమృతమును తనివితీర త్రాగి ధన్యజీవి అయినారు. అంతేకాక సిద్ధపురుషుడైన రహితో మాట్లాడగలగడం , ఆయన స్వయంగా ఉత్తరం రాయటం మొదలైన అదృష్టాలన్నీ కూడా పొందగలిగిన గొప్ప భక్తులు రాఘవయ్యగారు. 1983 అమ్మ వజ్రోత్సవం ముందు శరీరం చాలించి అమ్మలో ఐక్యమైనారు. వీరు అమ్మ దగ్గరికి రాక ముందు రాముని కృష్ణుని ఆరాధించేవారు కానీ అమ్మ భవానీ దేవిగా దర్శన మిచ్చింది. అందుకే వారు "చిట్టెమ్మ వయ్యావు కిష్టమ్మా" అని పాడుతుండేవారు. స్త్రీపురుష నామరూపాలకి అతీతమైంది దివ్యపథం. అట్టి దివ్యపథమే అమ్మ.

## హరిదాసుగారు - క్రిష్ణవేణక్కయ్య

హరిదాసుగారు క్రిష్ణవేణక్కయ్య పుసులూరు నివాసులు. తరువాత కాకుమాను నివాసులైనారు. మాస్టర్ సి.వి.వి. ధ్యాన, సాధన చేసుకుంటూ వుండేవారు హరిదాసుగారు. ధ్యానంలో వుండగా మాస్టర్ సి.వి.వి. "ఆగ్నేయ మూలగా అమ్మ వున్నది. అక్కడికి వెళ్ళి ఆమె చెప్పినట్లు చెయ్యాలి" అని చెప్పారు. రోడ్డు, తాటి చెట్టు కనపడింది. కుంభకోణం పోతాను అనుకున్నారు. బ్రహ్మాండం కుటుంబరావుగారు చెప్పగా అమ్మని గురించి విన్నారు. కొమ్మూరులో గంగరాజు చిదంబరరావుగారితో వీరికి అనుబంధం వుండేది. ఆయన కబురు పెడితే సంక్రాంతి సందర్భంగా వెళ్ళి వారి ఇంట్లో ఉండే వారు. 1955 లో కాకుమానులో వుండగా కొమ్మూరు నివాసి అయిన లోకనాథం గారు కబురు చేస్తే క్రిష్ణవేణక్కయ్య అమ్మని చూడటానికి మొదటి సారిగా వెళ్ళారు. కాకుమానులో అందరూ "ఆమెకు ఎప్పుడూ రోగం' ఏముంది ఆమె దగ్గర, ఎందుకు వెళ్ళటం?" అనేవారు.

కొమ్మూరులో మొదటిసారి అమ్మని దర్శించినప్పుడు అమ్మ,అక్కయ్య ఏమి చెప్పకుండానే "ఆయనకి (హరిదాసుగారికి) ఆరోగ్యం బావుందా? అని అడిగింది. హరిదాసుగారు క్రిష్ణవేణి అక్కయ్య తో వెళ్ళలేదు. హరిదాసుగారికి కాళ్ళు మంటలు, కాళ్ళు వాయటం వుండి వాటితో చాలా బాధ పడుతుండేవారు. అమ్మ అడగగానే అమ్మ యొక్క సర్వజ్ఞత్వానికి అక్కయ్య

ఆశ్చర్య పోయినారు. క్రిష్ణవేణి అక్కయ్య అమ్మ దగ్గరికి వెళ్ళినప్పుడు కొబ్బరికాయ మొదలైనవి ఏమి తీసుకుని వెళ్ళలేదు. కొనటానికి అప్పటికి కొట్టు కూడా తెరవలేదు. అందువలన పంచదార పొట్లం కట్టి తీసుకుని వెళ్ళింది. అది అమ్మకి ఇవ్వగానే అందులో తన వేలు తిప్పుతూ "ఇది ఆయనకి ఇవ్వు" అన్నది అమ్మ. ఆ పంచదార తీసుకునివెళ్ళి హరిదాసు గారికి ఇచ్చింది అక్కయ్య. ఎప్పుడైతే పంచదార తీసుకుని తిన్నారో అప్పటి నుండి హరిదాసుగారికి ఎంతో కాలంగా వున్న ఆ కాళ్ళు మంటల వ్యాధి నయమయింది. ఆయాసం కూడా వుండేది. అది కూడా తగ్గింది. ఆ తరువాత హరిదాసుగారు కూడా అమ్మ దర్శనం చేసుకున్నారు.

ఎరుపు చీరతో శుక్రవారం, తెల్లచీరతో మంగళవారం పూజలు చేసుకున్నారు. అప్పుడు అమ్మ మట్టి నలిచి ఇస్తే ఎంత కాలమయినా సువాసన వచ్చేది. ఆ రోజులలో అక్కయ్యకి కాకుమానులో వుండగా మేలుకున్నా, పడుకున్నా అమ్మ కనపడేది. రాత్రి పూట తలుపుతట్టేది. విమానం మీద వెళ్తూ కనపడేది. అక్కడ తనకి ధ్యానంలో కనపడినవి అన్నీ అమ్మదగ్గర జరిగేవి. అక్కయ్య మేలుకుని వుండగానే కాకుమానులో వున్నప్పుడు హృదయంలో తులసిచెట్టు కనపడింది. దానితో ఖంగారుగా, భయంగా అమ్మతో చెప్పాలని వస్తే అక్కయ్య చెప్పకముందే "ఎందుకమ్మా అక్కడ కనపడితే ఇక్కడికి వచ్చావు?" అన్నది అమ్మ. ఆ తరువాత తనకి ఖంగారు పోయింది. అమ్మదగ్గర ఒళ్ళు తెలియకుండా పోయి అనేక దృశ్యాలు కనపడేవి.

ఆ రోజులలో పూండ్ల మాణిక్యమ్మగారు వంట చేసి వెళ్తూ వుండేవారు. కాకుమాను నుండి జిల్లెళ్ళమూడి అక్కయ్య నడచి వస్తూ వుంటే రేటూరు దాటిన తరువాత తన చెవిలో అనేక విషయాలు మాట్లాడింది అమ్మ కనపడకుండానే, అక్కయ్యకి అంతకు ముందు ధ్యానంలో కనపడినవి, వినిపించినవి, అనుభవించిన అన్ని విషయాలు అడిగేవారు అమ్మ.

పెద్దగుడి (అనసూయేశ్వరాలయం) శంఖుస్థాపన ఆదివారం అమావాస్యనాడు .......లో జరిగింది. ఆరోజు ఉదయం శంఖుస్థాపన సమయంలో రెడ్డి సుబ్బయ్య, హరిదాసుగారు, సీతాచలంగారు, నాన్నగారు తదితరులు వున్నారు. అదే సమయంలో చిదంబరరావు తాతగారు ఏమి తెలియకుండానే పూలు, ఆకులు తీసుకుని వచ్చారు. ఆ రోజు శంఖుస్థాపన తరువాత హరిదాసుగారితో మాట్లాడుతూ అమ్మ "మీరు ఇంటికి వెళ్ళేటప్పటికి ఏదో విశేషం జరుగుతుందిలే" అన్నది.

శంకుస్థాపన జరిగిన రోజున క్రిష్ణవేణక్కయ్య కాకు మానులోనే వున్నది. వాళ్ళ ఆడపడుచు కూడా వున్నారు. ఆమె కడగా వున్నందున ఆమెకి అన్నం పెట్టి మధ్యాహ్నం అయినా హరిదాసుగారు రాలేదని ఎదురు చూస్తున్నది అక్కయ్య. ఆ సమయంలో 5 సం॥ పిల్లవాడు, తలకాయ ముదురుగా వున్నది అతనికి. వీరి ఇంటి ముందు నిలబడి "అమ్మా.." అని పిలిచి ఒడి చూపిస్తూ చేత్తో సంజ్ఞ చేస్తూ 'ఊ....ఊ.....' అన్నాడు. అక్కయ్యకి ఆ పిల్లవాడిని ఎత్తుకుందామనిపించింది. లోపలకు రమ్మని పిలిచింది. ఒక అడుగు వేసి లోపలికి వచ్చాడు ఆ పిల్లవాడు. "ఎత్తుకుంటాను రా" అని పిలిచి చేయి చాచి రమ్మంటే రానని సంజ్ఞ చేస్తూ ఊహు, ఊహు అన్నాడు. అప్పుడు అక్కయ్య అన్నం తీసుకువచ్చి ఒడిలో వేయగానే పరిగెత్తుకుంటూ పోయాడు ఆ పిల్లాడు. పంచలో కూర్చున్న వాళ్ళ ఆడపడుచుకు ఎదురుగా సరాసరి పోయినట్లు కనపడింది. అక్కయ్యకి కుడి వైపు తిరిగి పరుగెత్తినట్లు కనపడింది. వీరిద్దరికి పరస్పర విరుద్ధమైన ఈ విచిత్ర అనుభవం కలిగిన మరుక్షణంలో హరిదాసుగారి బావగారు (ఆడపడుచు భర్త) వచ్చారు. వీరిద్దరూ జరిగిన విషయం చెప్పి వెంటనే సైకిల్ ఇచ్చి చూసి రమ్మని పంపారు. ఆయన కాకుమాను అంతా ఎంత తిరిగినా ఆ పిల్లవాడు కనపడలేదు. ఇక్కడ వీరికి అనుభవం కలిగిన సమయంలోనే అమ్మ హరిదాసుగారితో "మీరు ఇంటికి వెళ్ళేటప్పటికి ఏదో విశేషం జరుగుతుందిలే" అనటం జరిగింది. ఈ సంఘటన జరగటానికి చాలా కాలం పూర్వం అక్కయ్య ధ్యానం చేస్తూ వుండగా మాస్టర్ సి.వి.వి. "నీకు ఒక పిల్లవాడు కనపడతాడు (పట్టుకుంటే) నీకు చిక్కితే నీవాడవుతాడు లేకపోతే లేదు" అని చెప్పటం జరిగింది.

ఈ విషయం చెపుదామని వీళ్ళు జిల్లెళ్ళమూడి వస్తే వీళ్ళు చెప్పకముందే "నీలం రంగు మీద తెల్లగళ్ళ చొక్కా వేసుకుని మొలలో రుద్రాక్ష గజ్జె ఒకటి వున్నది. ఆ పిల్లవాడు కదా వచ్చింది?". అని అడిగింది అమ్మ "జాగ్రత్, స్వప్న, సుషుప్తీనాం సాక్షిభూత్యై నమః" మెలకువకి, కలకి, గాఢ సుషుప్తికి ఈ మూడు అవస్థలకి సాక్షిగా ఆ దివ్యశక్తి వుంటుందని ఈ మంత్ర భావం. ఈ మూడు కానీ స్థితి ధ్యానస్థితి. ఈ అన్ని సందర్భాలలో జరిగిన సంఘటనలు అమ్మ అడిగేది. అక్కయ్యకి అనుభవంలోకి వచ్చేవి. ఈ విధంగా సర్వసాక్షియై ఎన్నో అనుభూతులు ఇచ్చినది అమ్మ. ఇంతకు పూర్వం చెప్పిన మంత్ర భావం, ప్రతిరూపం, ఆ తత్వం తానయినది, అమ్మ అని అక్కయ్య అనుభూతులు తెలియచేస్తున్నాయి.

1955లో మొదటిసారిగా దర్శించిన వీరు 1958 నుండి జిల్లెళ్ళమూడి నివాసులైనారు.

అమ్మకి పూజలు చేస్తే సమాధిలోకి వెళ్తుందనే భయంతో వద్దనే వారు నాన్నగారు. ఆ రోజులలో, అప్పట్లో హైమాలయం ప్రాంగణంలో పెద్ద మందిరం వుండేది. దానికి ఎదురుగా కొద్దిదూరంలో అమ్మ మంచం మీద పడుకున్నది. ఒకరోజు రాత్రి నిద్రపోతున్న అమ్మకి మంచం ప్రక్కనే క్రిష్ణవేణక్కయ్య కూర్చున్నది. అదే సమయంలో మరొక అమ్మ మందిరం వైపు నుండి రావటం కనపడింది అక్కయ్యకు. సమాధ్యవస్థలో రకరకాల భాషలలో మాట్లాడేది అమ్మ. అవి అక్కయ్య చాలా సార్లు విన్నారు. ఒకసారి అట్లామాట్లాడుతూ "ఊరొట్టెలు చేసుకున్నారా? పచ్చడి లేదా"? అని అక్కయ్యతో ఉసిరికాయ పచ్చడి తెమ్మని చెప్పింది అమ్మ. అక్కయ్య చూస్తూ వుండగానే అమ్మ చేతిలోని పచ్చడి మాయం అయింది. ఒకొక్కసారి మెంతిమజ్జిగ, అన్నం కలిపి రావిచెట్టుమీద, బారన్ గొట్టం మీద పెడితే మాయం అయ్యేవి. "సాధనలో ఒకస్థాయికి వచ్చిన వారికి ఆహారం పంపవలసిన అవసరం లేదు. తననే నమ్ముకుని అహారం అవసరం అయిన వారికి పంపుతుం" దని రాజుపాలెం రామచంద్రరావు గారు అంటూ వుండేవారు. దీనిలోని ధర్మసూక్ష్మం ఏదైనప్పటికి "తద్దూరే, తదంతికే" అన్నట్లు ఎంతదూరమో అంత దగ్గర సర్వమూ తానైన అమ్మకి దూరం , దగ్గర్లు లేవు. పరిమితమైన భౌతిక దృష్టి కలమనకి అట్లా కనపడుతుంది. అందుకనే ఉసిరి పచ్చడి పంపిన తరువాత అమ్మ "నన్ను నమ్ముకున్న లంబాడీతండా ఒకటి వున్నది పచ్చడి వాళ్ళకే పంపాను" అని చెప్పింది అక్కయ్యతో. ఎక్కడో వున్న వాళ్ళ అవసరం కనిపెట్టి అట్లా తీర్చింది అమ్మ. తను సర్వజ్ఞకదా!.

ఒకరోజు అమ్మ తన నోట్లోని వక్కపలుకు తీసి అక్కయ్య నోట్లో పెట్టింది. ఆ కమ్మని వాసన 4,5 రోజుల వరకు అట్లాగే వుంది అక్కయ్యకు. అమ్మకి చిన్నతనం నుండీ శిరస్సు మెత్తగా వుండటం, రక్తం చెమ్మరావటం, అది సువాసనగా వుండటం జరిగేది. 4,5 సంవత్సరముల పిల్లగా వున్నప్పుడే శిరోభిన్నమై, భృకుటీ స్థానం నుండి కూడా చిమ్ముబుడ్డిలా రక్తం చిమ్మింది. ఇట్లా అనేక సార్లు జరిగింది. అదే విధంగా చీరాలలో మాణిక్యమ్మగారి ఇంట్లో కూడా ఒకసారి జరిగింది అని అక్కయ్య చెప్పారు.

అమ్మ మంచం మీద దిండు క్రింద వున్న ఒక పొట్లం తీసి ఒక సోదరుడు అక్కయ్య చూస్తుండగానే అవతలకి విసిరివేశాడు. అది బుస్సుమని పొంగింది. "ఎందుకు అట్లా పారేశావు" అని అమ్మకోప్పడినట్లు అడిగింది. అవి అమ్మకి ఇవ్వాలని పెట్టారు ఒకరు. ఇటువంటి కాలకూట విషాలు ఎన్నోసార్లు అమ్మకి పెట్టటం అమ్మతీసుకోవటం జరిగింది.

గరళకంఠుడైన పరమశివునికే తల్లియైన విశ్వజనని అమ్మని ఇవి ఏమి చేస్తాయి?. పైగా పారేస్తే "ఎందుకు పారేశావు" అని అడిగింది. అదేదో ఇష్టమైన తీపి పదార్థం లాగా.

ఒకసారి అమ్మకి కంటిచుట్టూ దబ్బనంతో పొడవటం జరిగింది. మహలక్ష్మమ్మగారు చూసి అక్కయ్యతో చెపితే అక్కయ్య వెళ్ళి చూసారు. ఆమెకిఏమి కనపడలేదు. చీరాల డాక్టరుగారు వచ్చి అడిగితే 'అన్నీ పొగొట్టుకున్నాను. ఒక్కటి మిగుల్చుకున్నాను. " అని ఒక మచ్చని చూపింది అమ్మ. అమ్మ ఇంటికి దగ్గరగా ఒక మిషన్ సాయెబువుండేవాడు. అతను ఎప్పుడూ అమ్మని తిడుతూ వుండేవాడు. అతనికి ఏ పూట అయినా అన్నం లేక తినటానికి ఇబ్బంది పడుతూ వుంటే అన్నమూ, పదార్థాలు పెట్టి క్రిష్ణవేణక్కయ్యకు ఇచ్చి "వాడికి పెట్టిర"మ్మని పంపేది. అక్కయ్య అమ్మతో "అదేమిటమ్మా వాడు ఎప్పుడూ నిన్ను తిట్టిపోస్తూ వుంటాడు కదా? వాడికెందుకు"? అంటే "వాడూ నా బిడ్డే తెలియని బిడ్డ" అని అనేవారు అమ్మ. "సజ్జనులు పూజించారని పొంగి పోరు, దుర్జనులు దూషించారని కోపగింపక సమాహిత చిత్తులై వుంటారు. ఆత్మదృష్టులు, మహాత్ములని ఆర్యోక్తి వున్నది " "సాధుబిః పూజ్యమానే ఽస్మిన్పీడ్యమానే ఽపిదుర్జనైః సమభావో భవిదస్య సజీవన్ముక్తా ఇష్యతే' ' ఈ విధంగా అమ్మ మహోన్నత ఆధ్యాత్మిక పరాకాష్టకి ప్రతిరూపమని ఇతః పూర్వం సంఘటనలు తెలియచేస్తయి. ఒకరోజు అమ్మ "అబ్బా కాళ్ళ మీద దుప్పటి కూడా లేకుండ పడుకున్నారు నాన్నగారు" అన్నది. ఆ సమయంలో మొక్కపాడులో నాన్నగారు (అమ్మభర్త) దుప్పటి లేకుండానే పడుకున్నారు. " ఆ మూల పురుషునికి అనంత చక్షువులు, అనంత బాహువులు అనంత పాదాలు కలవాడని" ఆర్యోక్తి . అట్టి అమ్మకి సర్వం ప్రత్యక్షమే.

చీరాలలో పేరహాస్పటల్‌లో కాంపౌండర్‌కి పడుకున్న అమ్మ ధగధగ మెరుస్తూ కనపడిందని చెప్పారు అక్కయ్య. రహి మొక్కపాడులో మహాసిద్ధి పొందిన సంగతి కూడా అక్కయ్యకు తెలుసు అని చెప్పారు.

హరిదాసుగారు ఆయుర్వేదం మందులు కొంతవరకు తయారు చెయ్యటం నేర్చుకున్నారు. అమ్మకి రవికలు మొదలైనవి హరిదాసుగారు కుడుతూ వుండేవారు. ఎవర్ని దేనికి ఎన్నుకున్నదో వారిని దానికి ఉపయోగించుకోవటం అమ్మకి తెలిసినంతగా ఎవరికి తెలియదు. పైగా వారు చేస్తేనే ఆ పని అమ్మకి తృప్తి. నాకు తెలిసినంత వరకు చాలాసార్లు చూశాను. రవికలు ఎవరన్నా కుట్టినా అమ్మ సరిగ్గా సరిపోలేదని అసంతృప్తిగా చెపుతూ, హరిదాసుగారితోనే కుట్టించుకునేది అమ్మ. హరిదాసుగారు జిల్లెళ్ళమూడి వచ్చిన తరువాత కూడా సంక్రాంతి

నెలల్లో అక్షయపాత్ర శిరస్సున పెట్టుకుని ఎన్నో ఊర్లు తిరిగి బియ్యం పోగు చేసుకుని వచ్చి సంస్థకి సమర్పించేవారు. ఊర్లోను చుట్టు ప్రక్కల గ్రామాలలోనూ మజ్జిగ, పాలు సేకరించి, కొనే పని లేకుండ సంస్థకి సమకూర్చేవారు. ఆ రోజులలో 8 మైళ్ళు 15 మైళ్ళు ఉన్న కాకుమాను, నందిపాడు, కొమ్మూరు నడచివెళ్ళి పని చేసుకుని వచ్చేవారు. ఆవరణలో వ్యవసాయం పని, స్టోర్స్, మొదలైన పనులు చూస్తూ వుండేవారు. ఆయన్ని ఎప్పుడు ఏది అడిగినా తత్వం, తత్వం అనేవారు కానీ వివరించి చెప్పేవారు కాదు. మనిషి, భోళా మనిషి. ఖస్, బుస్ మంటూ అప్పుడప్పుడు అరిచినా మనస్సులో ఏముండేది కాదు. అమ్మ సాక్షాత్ దైవమని, భూదేవి అని పరిపూర్ణ విశ్వాసం కలవారు ఆయన. చివరి సమయంలో ఒక ఊపిరి తిత్తు లేకుండ వున్నారు. మంచంలో కొంతకాలం వుండి, 1994 ఆగష్టులో అమ్మలో శాశ్వతంగా లీనం అయ్యారు. క్రిష్ణవేణక్కయ్య ప్రస్తుతం పక్షవాతంతో మంచంలో వున్నది.

అమ్మ సాన్నిధ్యంలో ఎన్నో అనుభూతులు పొంది అపారంగా సేవించుకున్న ధన్యజీవులు హరిదాసుగారు, క్రిష్ణవేణక్కయ్య, "జీవితము జీవనమూ దేముడు ఇచ్చినవే" అన్ని అమ్మ వాక్యం. అదే విధంగా తమ జీవితాన్ని అమ్మకి అంకితం చేసి శారీరకంగా, మానసికంగా ఒడిదుడుకులు జీవితంలో అనుభవించి శాశ్వత ఆనంద ధామానికి చేరుకుంటారు. అమ్మ చేరదీసిన అదృష్టవంతులు హరిదాసుగారి దంపతులు.

రేపల్లెలో డాక్టర్ కమల దగ్గర ఒల్లుతెలీకుండా పోయింది క్రిష్ణవేణక్కయ్యకి. కమల అక్కయ్యని పరీక్షచేసింది. అది రుగ్మతవల్ల జరిగిందికాదని తెలుసుకుని అక్కయ్య మామూలు స్థితికి వచ్చిన తరువాత" ఎక్కడికి వెళ్ళావు?" అని అడిగింది. "అమ్మకి పూజ చేస్తుంటే వెళ్ళాను" అన్నారు క్రిష్ణవేణక్కయ్య.

బార్నిలో రొట్టెపెట్టి పోయి తిని రమ్మని అక్కయ్యకు చెప్పినది. అమ్మ. ఈ విషయం ట్రాన్స్‌లో కొమ్మూరు డాక్టర్‌గారికి చెప్పారు అమ్మ. ఆ విషయం కొమ్మూరు డాక్టర్ గారు జిల్లెళ్ళమూడి వచ్చి అడిగారు. అప్పుడు అమ్మ అక్కయ్యతో" నువ్వు చెప్పావా? " అంటే నాకేం తెలుసమ్మా" అన్నది.

## చంద్రమ్మ అక్కయ్య

గుంటూరు జిల్లా రేపల్లె తాలూకాలో సింగుపాలెం అనే గ్రామం వున్నది. ఆ గ్రామ నివాసి, చంద్రమ్మక్కయ్య. చంద్రమ్మ అక్కయ్య భర్త కొల్లి చిన్న వెంకటరత్నం. ఆయనను అందరూ

తాతయ్య అన్నయ్య అంటారు. చంద్రమ్మక్కయ్యకి మొదటి నుండి దైవభక్తి వున్నది. సింగుపాలెం దగ్గరలో వున్న మూరతోట అనే గ్రామానికి " అమృతానంద" స్వామీజీ వస్తూ వుండేవారు. చంద్రమ్మక్కయ్య మరి కొంచరు మూరతోట వెళ్ళి స్వామీజీ చేసెడి సంత్సంగంలో పాల్గొని వస్తుండే వారు. అమృతానంద స్వామీజీ సింగుపాలెం వారితో జిల్లెళ్ళమూడి అమ్మని గురించి తెలియచేసారు.

తరువాత వీరందరూ జిల్లెళ్ళమూడి వెళ్ళి అమ్మని దర్శించుకున్నారు. ఎవరికి వారే తమ తల్లి చెంతకు చేరినట్లు ఎనలేని ప్రశాంతతని, అపారమైన వాత్సల్యాన్ని అమ్మ చెంత అనుభవించారు. సింగుపాలెం వెళ్ళిన తరువాత సింగుపాలెం నివాసి అయిన యార్లగడ్డ భాస్కరరావుగారి ఇంట్లో అమ్మ పూజలు భజనలు ప్రతిశుక్రవారం జరుపుకుంటూ వుండే వారు.

శుక్రవారం పూజకి తెల్లవారు ఝామున లేచి స్నానాలు చేసి భాస్కరరావుగారి ఇంట్లో భజనలు , పూజ మొదలు పెట్టేవారు. తెల్లవారితే శుక్రవారం అనగా సింగుపాలెంలో అక్కయ్య నిద్రపోతూవుంటే అమ్మ తలుపులు తట్టి "చంద్రమ్మా" అని పిలిచేవారు. తలుపులు తీసి చూస్తే కనిపించేది కాదు. ఈ విధంగా నిద్ర లేచిన తరువాత కాలకృత్యాలు పూర్తి చేసుకుని భాస్కరరావుగారి ఇంట్లో పూజ, భజన చేసుకుని వచ్చేవారు అక్కయ్య. అజ్ఞానం అనే నిద్ర నుండి మేలుకొలిపే నిత్యజాగ్రత్ మూర్తి అమ్మ అక్కయ్యకి ఈ రకమైన అనుభవాల్ని ఇచ్చారు.

1958 లో మొదటి సారిగా అమ్మని దర్శించుకున్నారు అక్కయ్య. అమ్మ వారికి స్వయంగా వడ్డించింది. "ఏదైనా ఉపదేశం చేస్తారా" అని అక్కయ్య అడిగితే, కాగితం మీద రాసి ఇచ్చారు అమ్మ. మళ్ళీ సంవత్సరానికి రమ్మన్నారు. కార్తీక పూర్ణిమకి డ్రైన్ కాలవకి, వీరందర్నీ తీసుకుని వెళ్ళి ఉపదేశం చేసారు అమ్మ.

ఒకసారి అక్కయ్య అమ్మ దగ్గర కూర్చొని వుండగా కొందరు జిల్లెళ్ళమూడి నుండి కారులో వెళ్తున్నారు. అప్పుడు అమ్మ అక్కయ్య తో "వాళ్ళు కారులో వెళ్తున్నారు నువ్వు కూడా వాళ్ళతో వెళ్ళు" అని పంపింది. అక్కయ్య సింగుపాలెం వెళ్ళేసరికి వారి పెద్దకొడుకు పూరి నుండి వచ్చివున్నాడు. ఈ విధంగా అప్పుడప్పుడు అక్కడ వుందామని వెళ్తే అమ్మ వెంటనే పంపివేసేవారు. తరువాత కానీ అర్థం అయ్యేది కాదు అమ్మ అట్లా ఎందుకు చేసేవారో. ఎవరి చేత ఎప్పుడు ఏమి చేయించాలో సర్వజ్ఞ అయిన అమ్మకే తెలుసు.

అక్కయ్య భర్త అయిన తాతయ్య అన్నయ్య మొదటిసారి జిల్లెళ్ళమూడి వెళ్ళినప్పుడు మూడురోజులు వుండి తిరిగి వచ్చారు. రెండవసారి వెళ్ళినప్పుడు రెండు నెలలు వున్నారు. తాను సింగుపాలెం వెళ్తామని అమ్మకి చెప్పటానికి వెళ్తే తలుపులు వేసి వున్నాయి. అమ్మ దర్శనం ఇవ్వలేదు. తాతయ్యకి విసుగుపుట్టి అమ్మకి చెప్పకుండా బయలుదేరి కొంతదూరం వెళ్ళేసరికి ఆంబోతు ఎద్దు ఎదురుపచ్చి తాతయ్య అన్నయ్య ఎటు వెళ్తే అటు వైపు వచ్చి పోనివ్వకుండా నిలతీసింది. రాళ్ళగుట్ట కూడా ఎక్కిందిట. అప్పుడు ఆయనకి అర్థం అయిందిట. అమ్మకి ఇష్టం లేక ఇట్లా అవుతున్నది. అని వెంటనే వెనక్కి తిరిగి జిల్లెళ్ళమూడి వెళ్ళారు. జిల్లెళ్ళమూడి ప్రక్కనే రెండున్నర మైళ్ళ దూరంలో "పూండ్ల" అనే గ్రామం వున్నది. తాతయ్య అన్నయ్య ఆ ఊరు వెళ్ళి పాలు తీసుకుని వస్తున్నప్పుడు ఒకరోజు దారి తెలియలేదు. ఇంతలో పిల్లి ఒకటి ఎదురు వచ్చి బాట చూపిస్తూ ముందు నడిచింది. దానిని అనుసరించి ఆయన జిల్లెళ్ళమూడి చేరారు. ఈ రెండు సంఘటనలలో ఒకసారి ఒక జంతువు ద్వారా ఆయన వెళ్ళకుండా ఆపింది. ఇంకొక సారి ఇంకొక జంతువు ద్వారా దారి చూపి దరిచేర్చింది. మాతృమూర్తి అయిన అమ్మ చెయ్యదలిస్తే ఎట్లాగైనా చేయగలదని తెలియచేసింది.

మరొకసారి సింగుపాలెం వెళ్తానని అమ్మతో చెపితే అమ్మ వెళ్ళవద్దని అన్నది. అయినా ఆయన వినకుండా బయలు దేరి వెళ్ళారు. రేపల్లెలో దిగి నడచి వెళ్తుంటే చీకటి పడింది. కొంతదూరం వెళ్ళిన తరువాత చీకట్లు కమ్మి వర్షం రావటం మొదలు అయింది. తాతయ్య అన్నయ్యకి దిక్కుతోచక ఖంగారు పుట్టింది. అప్పుడు రెండు చేతులు చాచి ముందు నడుస్తూ గాలి, వర్షం, చీకటి అవరోధాల్ని , ప్రభావాన్ని తొలగిస్తూ సింగుపాలెం దాకా చేర్చింది అమ్మ. ఈ విధంగా మాట వినకుండా వెళ్ళిన బిడ్డని కూడా వాత్సల్యమూర్తి అయిన అమ్మ దరిచేర్చింది.

ఒక సంవత్సరం అట్లతద్ది పండక్కి అమ్మకి , హైమకి (అమ్మకూతురు) కలిసి ఇద్దరు చెరి ఒకవైపు కూర్చునే టట్లు ఉయ్యాల తొట్లు ఏర్పరచి రంగుల రాట్నం లాగా గుండ్రగా త్రిప్పటానికి ఏర్పాటు చేశారు తాతయ్య అన్నయ్య. తరువాత తను పని మీద పొలానికి వెళ్ళారు. ఎంత మంది వున్నా ఎన్ని పూలమాలలు పండ్లు, నివేదనలు తెచ్చినా, అమ్మ తాతయ్య అన్నయ్య పొలం నుండి వచ్చేదాకా దర్శనానికి రాలేదు. తాతయ్య వచ్చిన తరువాత ఆయన చేత పూలమాల వేయించుకుని బయటకు వచ్చారు అమ్మ. ఇక్కడ

గమనించదగిన దేమిటంటే పూలు, పండ్లు, నివేదనలు, ధనం ఆడంబరం కంటే కూడా నిరాడంబరంగా చేసిన శరీర సేవకి, కాయిక కర్మకి అమ్మ ఇచ్చిన ప్రాధాన్యత, మనం కూడా నిత్య జీవితంలో ఎటువంటి తాత్విక జీవితాన్ని గడపాలో చాటి చెప్పేడి సంఘటన ఇది.

తరువాత అమ్మని , హైమని చెరొక తొట్లో కూర్చోపెట్టి గుండ్రంగా త్రిప్పుతూ పాటలు పాడుతూ మండలాకారంగా నృత్యం చేస్తూ కృష్ణుని, బృందావనాన్ని గుర్తు చేసేటట్లుగా పండుగ జరుపుకున్నారు. ఆ సందర్భంలో అమ్మ ఒక బిందెపట్టుకుని నిలుచుంటే తలా ఒక గ్లాసుడు పాలు ఆ బిందెలో పోశారు అందరూ. ఎంత మంది ఎన్ని పాలు పోసినా ఆ బిందె నిండ లేదు. వెల్తిగా వుంది. అప్పుడు అమ్మ అన్నారు "బిందె నిండ లేదు వెల్తివుంది. మళ్ళీ వస్తాను" అని "త్రిగుణాలనే పొయ్యి పెట్టి, చిత్తమనే అగ్నిపెట్టి , శరీరమనే కుండ పెట్టి పాపాలనే పాలు పోసి, అహంకారాన్ని తోడేసి శ్వాస, నిశ్వాసాలతో చిలికితే నేననే బ్రహ్మనయ్యాను. నేను బ్రహ్మ అనెడి వెన్నను కాస్తే "నేను, నేనైన నేను" అయ్యాను" అని వివరించింది.

సింగుపాలెంలో చంద్రమ్మక్కయ్య వున్న రోజులలో అమ్మ కనపడి 5 వాక్యాలు చెప్పింది. కానీ ఇది రాసేటప్పటికి అక్కయ్య మరిచిపోవటం వలన చెప్పలేక పోయింది. ఒకరోజు తెల్లవారు ఝామున కళ్ళు మూసుకుని మేలుకొలుపులు పాడుతూ వుంటే అమ్మ రూపం కాకుండా ఇంకొక రూపం కనపడింది. తరువాత ఆ కనపడింది అమ్మే అని తోచింది. మరొక రోజు తెల్లవారు ఝామున లలితా పారాయణ చేస్తున్నారు అక్కయ్య. అప్పుడు ఇంటిపైన శబ్దం వినపడింది. 'ఏమిటా?' అని బయటికి వచ్చి చూడగా విమానము ఇంటిపైకి వచ్చి ఆగివున్నది. దానిలో ముగ్గురు ముత్తయిదువులు కనిపించారు. మధ్యలో వున్న ముత్తయిదువ పండులాగా కనిపించింది. ఆ దృశ్యం చూసి అక్కయ్య నమస్కారం చేసిన తరువాత అదృశ్యం అయింది.

వీరు సింగుపాలెంలో వున్న రోజులలో తాతయ్య అన్నయ్యకి ఒంట్లో బాగులేదు. ఆయనకి రాత్రిపూట కడుపు వుబ్బినది. అక్కయ్యని సోడా తెమ్మని పంపారు తాతయ్య. ఆవిడ సోడా తెచ్చేటప్పటికి నాగుపాము పెద్దచుట్ట చుట్టుకుని పడగ విప్పి ఆడుచు మంచం క్రింద కనపడిందని, ఆ పాము కరుస్తుందేమొ అని చాలా భయపడినానని అక్కయ్యకి చెప్పారు తాతయ్య అన్నయ్య. ఈ సంఘటన జరిగిన రెండవ రోజున యోగయ్యగారికి ఒక పూలమాల ప్రసాదం ఇచ్చి సింగుపాలెం పంపారు అమ్మ. తాతయ్యని జిల్లెళ్ళమూడి పంపమని, పథ్యం చేయించుతానని యోగయ్యగారి చేత కబురు పంపారు అమ్మ. అమ్మ

సర్వజ్ఞత్వానికి, అపారవాత్సల్యానికి పులకించి అంజలి ఘటించారు చంద్రమ్మక్కయ్య దంపతులు.

ఒకరోజు జిల్లెళ్ళమూడిలో ఆ గ్రామ నివాసి అయిన యతిరాజుల ఇంట్లో తాతయ్య, అన్నయ్య పేక ఆడుతున్నారు. ఆ సందర్భంలో అమ్మ పెద్ద కొడుకు సుబ్బారావుతో "తాతయ్య ఏడీ" అని అడిగి ఎక్కడ వున్నాడో పిలుచుకు రమ్మన్నారు అమ్మ . సుబ్బారావు ఊరంతా వెతికి యతిరాజుల ఇంట్లో పేకాట ఆడుతున్నాడని తెలుసుకుని ఆ విషయం అమ్మతో చెప్పాడు. తాతయ్య అన్నయ్యకి అమ్మ తన గురించి అమ్మ వెతికించటం పేకాట ఆడుతున్నట్లు తెలుసుకోవటం తెలుసుకుని విచారించాడు. ఆ తరువాత ఆ ఆటమానేశాడు. ఈ విధంగా ఆయన దురలవాటు పోగొట్టింది అమ్మ.

అమ్మ సింగుపాలెం వెళ్ళినప్పుడు వేదిక వేశారు. చంద్రమ్మక్కయ్య అక్కయ్య కొడుక్కి బిడ్డలు లేరు. అమ్మ వెళ్ళి వారి ఇంట్లో మంచం మీద పడుకుని కొద్దిసేపటి తరువాత వచ్చింది. తరువాత వారికి ఒక మగపిల్లవాడు కలిగాడు. అమ్మ కరుణవల్ల కలిగాడని జిల్లెళ్ళమూడి వెళ్ళి అమ్మ చేత నామకరణం చేయించారు. "సంపూర్ణ" అని పేరు పెట్టింది అమ్మ. తరువాత అతను బాగా చదువుకుని పెద్దవాడై అమెరికా వెళ్ళి హాయిగా సుఖజీవనం సాగిస్తున్నాడు. అక్కయ్య పెద్దకూతురు పెద్ద కొడుక్కి అమ్మ చేత అక్షరాభ్యాసం చేయించారు. అమ్మ అతనికి పూలమాల వేశారు. అతను ప్రస్తుతం నెల్లూరులో పని చేస్తున్నాడు. నెలకి 3 లక్షలు సంపాదించుకుంటూ సుఖంగా వున్నాడు. శుభకరి అయిన అమ్మ కరుణ వల్ల వారి జీవనం సుఖప్రదం అయింది.

చంద్రమ్మక్కయ్య, తాతయ్య అన్నయ్య సింగుపాలెం నుండి నెల్లూరు జిల్లా గూడూరు తాలూకా విద్యానగర్ లో కాపురం పెట్టారు. కొంత కాలం విద్యానగర్‌లో వున్న తరువాత ఒకరోజు కలలో విమానం కనిపించింది. బయటకు వచ్చి చూస్తే విమానం రెండు ఇండ్ల మధ్యకు వచ్చి వున్నది. అప్పుడు అమ్మలు ఇద్దరు కనపించారు. 10 నిమిషాలు ఆ విధంగా కనిపించింది.ఈ విధమైన దర్శనం కలిగిన తరువాత అనసూయావ్రతం చేస్తే బాగుండు నని అక్కయ్యకి అనిపించింది. ఈ విధమైన సంకల్పం అక్కయ్యకి కలిగిన తరువాత విద్యానగర్‌లో వారి ఇంటి ప్రక్కన వున్న నరశింహారెడ్డిగారి భార్యకి అమ్మ కనిపించింది కలలో. కలలో అమ్మ ప్రక్కన చంద్రమ్మక్కయ్య కూర్చున్నట్లు కనపడింది. వారి కూతురికి కూడా అదే విధంగా కనపడింది అమ్మ. ఈ సంఘటన వల్ల వ్రతం చెయ్యాలనే సంకల్పం అమ్మ

కల్పించిందనే విశ్వాసం ఏర్పడింది అక్కయ్యకి. వ్రతం నరశింహారెడ్డి గారి చేత తన కొడుకు చేయించాలని అభిప్రాయ పడ్డారు అక్కయ్య. వారిని అడిగితే అలాగే చేద్దామన్నారు. వెంకట్రామరెడ్డిగారు మా ఇంట్లో చేద్దామన్నారు. వారి ఇంటి ప్రక్కన వుండే రమాదేవిగారు కూడా గట్టిగా చేయమని చెప్పింది. తరువాత 15 మంది దంపతులతో పూజ వ్రతం జరిగింది. రావూరి ప్రసాదు పూజ చేయించాడు. చంద్రమోహన్ దంపతులు కూడా పాల్గొన్నారు. 50 మందికి భోజనాలు పెట్టుకోవటం జరిగింది. విద్యానగర్‌లో అమ్మని చూసిన వారు ఎవరూ లేరు. అటువంటి చోట ఈ విధంగా జరగటం కేవలం అమ్మ కృప అని అక్కయ్య ఉద్దేశ్యం. మూడవ రోజు కలశం ఎత్తవలెనని ఫొటో తీయపోతే నలిగిన వైర్లు ఫొటోకి అంటుకుని ఫొటోలో కరెంటు వున్నందువలన షాక్ కొట్టి గడగడ వణకుతూ పడిపోతూ వుంటే వ్రతం జరిగిన ఇంటి యజమాని రమాదేవిగారు స్విచ్ ఆపినది. ఈ విధంగా వ్రతం చేయించి తనని కాపాడినది అమ్మ. వ్రతాని కంటే ముందు కనిపించి ప్రేరణ నిచ్చి తన అనంతమైన ఉనికిని తెలియచేసి సర్వరక్షాస్వరూపిణి అయి భాసిల్లినది అమ్మ.

ఒకరోజు తెల్లవారుఝామున 5 గంటలకి మేలుకొలుపు లలితా పారాయణం, మంత్రపుష్పం చేస్తున్నారు అక్కయ్య. అప్పుడు అమ్మ సింగుపాలెం సత్యవతి అక్కయ్య రూపంలో కనపడింది. ఆ సందర్భంలో అక్కయ్య "అమ్మా! అమ్మా ఎన్ని రోజులకు కనపించావు అమ్మా" అని మరీ మరీ పలుకరించినా పలుకలేదు. మళ్ళీ అక్కయ్య కూతురు రమాదేవి రూపంలో చిన్నగా చిరుమందహాసాలతో నిలుచున్నది. ఇదంతా కళ్ళు మూసుకున్నప్పుడు కనపడింది. తరువాత కళ్ళు తెరిచి మామూలు స్థితికి వచ్చారు అక్కయ్య. కొంతసేపటికి వారి పెద్ద అబ్బాయి వచ్చి తనకి వచ్చిన కల వివరించాడు. వారి కఱ్ఱిగిత్త వారిని పొడవటానికి వస్తూ చూస్తూ చూస్తూ నిదానంగా పొడవకుండా ఆగింది. అతను అట్లా తనకలని వివరించి తన మోటార్‌సైకిల్ మీద గోపిందపల్లి వెళ్ళటానికి కొంతదూరం వెళ్ళారు. ఇంతలో ఆయనకి పరిచయం వున్న వ్యక్తి ట్రాక్టర్ నడుపుతూ అటువైపు వచ్చారు. ఎదురుగా వస్తున్న వీరి పెద్ద కొడుకుని పలుకరించారు. ఆయన పలుకరించటం వలన ఇతను బ్రేక్ వేశాడు. అప్పుడు మోటార్ సైకిల్ ముందు చక్రం ట్రాక్టర్ ముందు చక్రానికి తగిలి ఆయన కుడివైపుకి పడిపోయినారు. అదే ఎడమవైపు పడితే ట్రాక్టర్ క్రింద పడి ప్రాణాపాయకరమైన ఘోరప్రమాదానికి గురి కావటం జరిగేది. ఈ విధంగా అమ్మ దయవలన ఆయనకి ప్రమాదం తప్పి రక్షింపబడ్డారు. కలలో ముందు సత్యాలక్కయ్య రూపంతో కనపడి పలకకుండా

పోవటం, తరువాత వారి అమ్మాయి రమాదేవి రూపంతో చిరుమందహాసంతో నవ్వుతూ కనపడటం ఇవి రెండూ ఒకటి ప్రమాదం జరగపోతున్నదని సూచనగాను రెండవది వారి కూతురిగా చిరుమందహాసంతో కనపడటం వలన ప్రమాదం తప్పి హాయిగా వుంటారని సూచనగా అక్కయ్యకి వారి అబ్బాయికి జరిగిన సంఘటన ద్వారా తరువాత అర్థం అయింది.. ముందుగానే ధ్యానంలో, కలలో ఈ విధంగా తెలియచేసి, ఇలలో రక్షించిన దయామయి అమ్మకి చంద్రమ్మ అక్కయ్య అంజలి ఘటించింది.

96వ సంవత్సరం తెల్లవారితే శివరాత్రి అనగా లలితా పారాయణం చేస్తున్నారు అక్కయ్య. కళ్ళు మూసుకుని చేస్తుండగా ఒక పెద్దాయన మెడంతా పాము చుట్టుకొని కనపడ్డారు. ఆయన "అమ్మా బావున్నావా?" అని పలకరించారు. "స్వామి బావున్నాను" అని సమాధానం చెప్పారు అక్కయ్య. తరువాత 5గురు ముత్తయిదువులు కనపించారు. మరొకసారి తెల్లవారితే శుక్రవారం అనగా లలితా పారాయణం చేస్తున్నారు అక్కయ్య. అప్పుడు చిన్నసైకిల్ మీద ఒక అమ్మాయి కూర్చుని లంగా, చొక్కా తొడుక్కుని ముక్కున బేసిరి, రాళ్ళదిద్దులు పెట్టుకుని, మెరుస్తున్న ముఖంతో కనపడింది. ఆ రూపంతో లలితాదేవి దర్శనమిచ్చిందని పరవశించింది అక్కయ్య. అప్పుడు మనస్సులోనే అమ్మతో " అమ్మా నీవు లలితాపారాయణం చేయించుకున్నావు నాచేత. అమ్మా నాకు ఏమి తెలియదు. నీపాదపద్మములకు నా నమస్కారము. అక్కయ్య చేసిన లలితాపారాయణ 15000000. జిల్లెళ్ళమూడిలో అమ్మకి ఎంతో సేవచేసుకుని ఎన్నో అనుభూతులు పొంది అపారమయిన భక్తి శ్రద్ధలతో పదిహేనుకోట్ల లలితాపారాయణతో అంత రంగం నిండిన ధన్యజీవి చంద్రమ్మ అక్కయ్య. నాకేమీ తెలియదు అనే నిరహంకార భావంతో అంతటి పారాయణ చేసిన "విజ్ఞాతమ విజ్ఞానతాం" అనగా తెలుసు అన్నవాడు ఏమీ తెలియని వాడే. ఏమీ తెలియదంటూ అంతటి పారాయణం చేసిన అక్కయ్య నిజంగా తెలిసిన వ్యక్తే.

ఈ పుణ్యమూర్తి తాను ఇంకా వారం రోజులకి శరీరం చాలిస్తుందనగా, ఇంకా వారం రోజులకి ఫలానా టైముకి, పోతానని ముందే చెప్పి అదే విధంగా శరీరం చాలించి అమ్మలో విలీనం కావటం జరిగింది. ఇన్ని విధాలుగా అమ్మ కృపకు పాత్రురాలైన మహా భాగ్యవంతురాలు. అమ్మ చెప్పినట్టు మృత్యువంటే భయం లేక పోవటమే మృత్యుం జయత్వం. అట్లా మృత్యుంజయ అయింది చంద్రమ్మ అక్కయ్య అమ్మ అపారకరుణతో.

## మహాలక్ష్మమ్మగారు

మహాలక్ష్మమ్మగారు నరసరావుపేట నివాసి. ఈమెకి అమ్మ ఉపదేశం చేసారు. అమ్మని సాక్షాత్తు ఆదిపరాశక్తిగా నమ్మిన వారిలో ఈమె ఒకరు. అక్కయ్యను గురించి "ఈమె ఋషియే ఇట్లా పుట్టినది" అని అన్నారు అమ్మ. వారి ఇంట్లో ఏమి వెలిగించకుండానే సువాసనలు వచ్చేవి. ఎవరికి ఇష్టమైన వాసనలు వారికి వచ్చేవి. ఆమె అమ్మ కుంకం పెట్టి మంత్రం వేస్తే అనేకమయిన బాధలు తగ్గేవి. అన్నం మీద మూత పెట్టి వుండగా నైవేద్యం పెట్టకుండానే అయిదువేళ్ళ ముద్రలు పడేవి.

59 ముక్కోటి నాడు వచ్చి అమ్మని దర్శించుకుని తిరిగి వెళ్ళారు. ఈవిడ ఇంటికి వెళ్ళిన తరువాత అమ్మని గురించి ఆలోచనే. ఇట్లా అమ్మ ధ్యాసతో కుంపటి వెలిగిస్తుంటే "ఎప్పుడూ అట్లా కూర్చోపోతే చందాలు వసూలు చెయ్యరాదా? అని వినపడింది. పటం నవ్వుతూ కనపడింది. ఇంతలో రోడ్డు మీద ఎవరో ఆడమనిషి నిలబడింది. రోడ్డు మీద వున్న మనిషి 100 రూపాయలు ఇచ్చి వెళ్ళింది. కలెక్టర్ గారి ఇంటికి వెళ్ళి మాట్లాడుతూ వుంటే ఇంకొక ఆమె 200 రూ ఇవ్వటం జరిగింది. (తను వచ్చిన పని మరచి పోయినప్పటికి) ఎట్లా వసూలు చెయ్యటమా? అనెడి దిగులు నివారణకి అమ్మ ఇట్లా దారి చూపింది.

వీరి ఇంటి రోడ్డు వాకిలిన ఒక అమ్మాయి పది ఏళ్ళ పిల్ల నిలపడి " అన్నం పెడతావా?' అని అడిగింది. ఆ పాప లంగా ఎత్తి ఒడి పట్టింది. ఆ ఒడిలో బియ్యపు గింజలు వున్నవి. ఒక పాత లంగా ఇవ్వవా అని అడిగింది ఆ పావ. పాతది ఇవ్వగానే ఒక్కసారి పట్టుకోగానే తొడుక్కున్నట్లు కనపడింది ఆ పాప. తరువాత ఆ వచ్చినది అమ్మే అని గుర్తించారు మహాలక్ష్మమ్మగారు .

మహాలక్ష్మమ్మగారి పెద్ద అబ్బాయికి అమ్మ మీద నమ్మకము లేదు. అతను ఒకసారి వారి ఇంట్లో కూర్చుని వుండగా 8,9 ఏళ్ళ పిల్ల తలుపు నెట్టుకుని వచ్చింది. అన్నం పెడతావా అని అడిగింది. ఆ అమ్మాయి కాళ్ళకి పట్టీలు వున్నవి. అన్నం పెట్టటానికి వచ్చేటప్పటికి ఆ అమ్మాయి తన చేయి చాచేటప్పటికి వెండి కంటే తెల్లగా మెరిసిపోతూ వున్న గిన్నెలో మూడు ముద్దలు వున్నవి. వీటిలోనే ఆమె కూడా అన్నం పెట్టింది. అన్నం పెట్టిన తరువాత వెళ్తూ తలుపు వేసుకోమని చెప్పి వెళ్ళింది. మరుక్షణంలో వెళ్ళి చూస్తే ఆ అమ్మాయి కనపడలేదు. ఈ అనుభవంతో వారి పెద్ద అబ్బాయికి నమ్మకం కుదిరింది. ఈ అమ్మాయి "పావలా ఇస్తావా' అని అడిగితే ఇవ్వనుపొమ్మన్నారు. తరువాత 100రూ॥ పోయినవి. ఇవ్వనందువలన పోయినవి అని తహసీల్దారుగారు అన్నారు. (మహాలక్ష్మమ్మగారి భర్త). ఈ రూపంలో అమ్మే

వచ్చిందని అనుకున్నారు. ఇట్లా అనేక రూపాలలో కనపడగలదు. మహత్యాలు చూపగలదు. అనుకున్నారు. మహాలక్ష్మమ్మగారు.

వారి ఇంటి దగ్గర ఒకామె ఒంటి మీదకి వచ్చి, అక్కడ వున్న ఇద్దరిని ఆలింగనం చేసుకుని తను ఏ ఊరు వెళ్ళినా , ఎక్కడికి వచ్చినా రమ్మని అడిగి, చివరికి వస్తానని ఒట్టు వేయించుకున్నది. ఆమె వారితో అమ్మ దగ్గరకి వస్తే ఆమెకి అమ్మ తీర్థం వేసారు. తరువాత ఆమెకి ఒంటి మీదకి రావటం ఆగిపోయింది.

మహాలక్ష్మమ్మగారు తరచూ వచ్చే రోజులలో "నిన్ను ఎత్తుకుంటానని" అమ్మని అడిగితే, అమ్మ 'ఎత్తుకోలేవు" అన్నారు. అట్లా అన్నప్పటికీ ఆమె అమ్మని ఎత్తుకున్నారు. అమ్మ మొదట బెండులాగా వున్నది. తరువాత విపరీతంగా బరువెక్కింది. ఆమె మొయ్యలేక "అమ్మా బరువుగా వుందమ్మా" అని మొరపెట్టుకుంది. తరువాత అమ్మ మళ్ళీ తేలిక అయింది.

ఒకొక్కప్పుడు అమ్మ చిన్న విషయం అడిగినా దానికి ఏదో కారణం ఎవరికో తృప్తి కలిగించటం కోసమో అయివుంటుంది. ఒకరోజు అందరూ కూర్చుని వుండగా అమ్మ పిప్పర్‌మెంట్ అడిగింది. ఎవ్వరూ తమ దగ్గర లేదు అన్నారు. చివరికి ఒక అతని దగ్గర వున్నది. అది అతని దగ్గర నుండి తీసుకుంది అమ్మ. నాదగ్గర వున్నది ఇదే కదా ! ఏమి ఇస్తానులే అనుకునే వారి వెంటపడి అడిగి తీసుకుని వారికోరిక తీర్చి సంతృప్తి పరుస్తుంది. అమ్మ. విలువ కంటే ముఖ్యమయినది మనస్సు కదా!

ఒక రోజు అందర్నీ ఆదమరపించి 11 గం॥ల సమయంలో అమ్మ డ్రైన్ కాలవ వైపు వెళ్ళటం జరిగింది. ఈవిడ అమ్మ వెంట వెళ్ళారు. మీరు రావద్దని అమ్మ చెప్పినా వినకుండా వెంట పడ్డారు. అప్పుడు అమ్మ తన కాలి చెప్పు విసిరి "మీరే కాదు, నేను చూడ వలసిన వాళ్ళు చాలా మంది వున్నారు" అని తరువాత అమ్మ ఆగితే అందరూ మళ్ళీ అమ్మని కలిశారు. అందరూ డ్రైన్ కాలువలో దిగగా అమ్మ ఈత కొట్టింది. ఒక సోదరుడు కొట్టుకుని పోతుంటే "వాడు కొట్టుకు పోతున్నాడు తీసుకు రమ్మ"ని చెప్పింది అమ్మ. కొందరు సోదరులు అతనిని తీసుకువచ్చారు.

సూర్య గ్రహణం ఎట్లా పడుతుంది. అని అనుకుంటూ మహాలక్ష్మమ్మగారు ధ్యానంలో కూర్చుంటే ఎట్లా ఏర్పడేది. ఎట్లా విడిపడేది కనపడింది. ఒకమారు అమ్మ ఫొటో చూస్తుండగా అమ్మ వెనకాల చెట్టు, దాని మీద కృష్ణుడు పిల్లనగ్రోవి వాయిస్తూన్న దృశ్యం కనపడింది.

ఆమెకి ఇట్లా ఎన్నో అనుభూతులు పొంది అమ్మ సన్నిధి ఆనందాన్ని పొందిన అదృష్టజీవి, ధన్యజీవి మహాలక్ష్మమ్మగారు.

## గజేంద్రమ్మ

గజేంద్రమ్మక్కయ్య అమ్మ జన్మస్థలం అయిన మన్నవ ప్రక్కనే వున్న "కొత్తపాలెం" నివాసి. ఈవిడ భర్త సంపెంగరావుగారు. ఆయన గజేంద్రమ్మక్కయ్య కంటే ముందే అమ్మని దర్శించారు. ఆయనకి ఆ రోజులలో అమ్మ నివసించే పర్ణశాలలో వున్న పుట్ట ప్రక్కనే చెవిలో ఏదో చెప్పింది. తరువాత కొంత కాలానికి గజేంద్రమ్మ జిల్లెళ్ళమూడి చేరింది.

1957 లో మొదటిసారిగా అమ్మని దర్శించటం జరిగింది. అప్పుడు రెడ్డిపాలెం కాంతయ్య యోగి గారు అమ్మ చెంత వున్నారు. అక్కయ్య వచ్చిన సమయంలో అమ్మవారి (కాంతయ్య యోగి) తొడమీద తలపెట్టిపడుకున్నది. వేయిమంది దాకా చుట్టూ వున్నారు. వీరందరిలో మధ్యలో పడుకుని వున్న అమ్మని గజేంద్రమ్మక్కయ్య చూడగానే అమ్మ కళ్ళలో పార్వతీ పరమేశ్వరులు కనిపించారు.ఇట్టి అనుభూతితో గజేంద్రమ్మ పులకించిపోయి అమ్మ యందు దైవ భావంతో అమ్మ చెంత వుండటం జరిగింది. అమ్మ ఒకసారి కాగితం మీద ఏదో రాసి గజేంద్రమ్మక్కయ్యకు ఇచ్చింది. ఆ కాగితం దీపారాధనలో పడి తగలపడింది. కాలిన కాగితంలో అక్షరాలు కనపడినవి. ఈ విషయం అమ్మతో చెపితే ఏమీ మాట్లాడలేదు.

తరువాత గజేంద్రమ్మక్కయ్యకి అమ్మ ఒక సలహా ఇచ్చింది. అయిదురోజులు ఆమె భర్తని ఇల్లు కదలకుండా వుంచమని చెప్పారు అమ్మ .ఆమె వారి వూరు వెళ్ళి భర్తకి అమ్మ ఇచ్చిన సలహా చెప్పి అదే విధంగా చేసింది. అందువలన ఆయనకి ప్రమాదం తప్పింది. ఒకసారి వారి సొంత వూరి వాళ్ళతో కలిసి వారి వూరు వెళ్తున్నప్పుడు బారుకి కాలవలో అమ్మ తెల్లచీర కట్టుకుని వెళ్తున్నట్టు కనపడింది.

విజయదశమి నవరాత్రుల సందర్భంగా చీరాల సోదరులు మరికొందరు కలిసి అమ్మని మన్నవ తీసుకుని వెళ్ళారు. అప్పుడు మన్నవలో రాజరాజేశ్వరి ఆలయానికి వెళ్ళి అమ్మ గుడి గడపదగ్గర నిలపడగానే విగ్రహం చేతిలోని పువ్వు క్రిందపడింది. తరువాత గుడిలో అమ్మ పూజ చేస్తుంటే అమ్మ చేతి నుండి వెలుగు కొన్ని ఫర్లాంగుల దూరం పడటం , గజేంద్రమ్మతో సహా అక్కడి వారంతా చూశారు. గుడిలో బీజాక్షరాలు అమ్మ చదువుతుంటే ఏ మైకు లేకుండా ప్రక్క ఊరి దాకా వినపడింది.

83లో అమ్మ వజ్రోత్సవం అయిన తరువాత గజేంద్రమ్మక్కయ్య నిజామాబాద్ వెళ్ళి

మూడు నెలలు వున్నది. అక్కడ అమ్మ కనపడి భుజం తట్టి వెంటనే బయలుదేరి రమ్మని చెప్పింది. ఆమె బయలుదేరి జిల్లెళ్ళమూడి వచ్చింది. ఒకసారి అమ్మకి స్నానం చేయించింది అక్కయ్య. నీటి తొట్లో బంగారు వడ్డాణం అమ్మది కనిపించింది. తరువాత. వెంట ఎవరూ చూడలేదు. దాన్ని పట్టించుకోనూ లేదు. అమ్మ ఎవ్వరితోను అనను కూడా లేదు. గజేంద్రమ్మక్కయ్య చూసి వెంటనే తీసుకువెళ్ళి అమ్మకు ఇచ్చింది. ఆ విధంగా గుణానికి పరీక్షపెట్టింది అమ్మ. ఇది చిన్న విషయంగా తోచినా పైకి చేసే పూజలు కంటె గుణాలలో మార్పు రాకపోతే సార్థకం లెదు. అది చాలా విశేషం. ఎవరికంటా పడకుండా చేయటానికి అవకాశం వున్నప్పుడు నిజాయితీగా వుండటం విశేషం.

తానుగా కొట్టు, హోటల్ నడుపుకుంటూ చాలాకాలం నుండి విడిగా తనకి కావలసినది తానే ఆర్జించుకుంటూ జీవనం సాగిస్తున్న వ్యక్తి గజేంద్రమ్మక్కయ్య. అమ్మ పర్ణశాలలో వున్న రోజులలో ఒకరోజు ఒకవ్యక్తి వచ్చి పర్ణశాల పక్కనే ఉన్న రెల్లు మందిరం దగ్గర నిలుచున్నాడు. అమ్మ గదిలో కూర్చుని కిటికీలో నుండి ఆవ్యక్తిని చూస్తున్నది. గజేంద్రమ్మక్కయ్యకి అనుమానం వచ్చింది. ఈ వచ్చిన వ్యక్తి అమ్మ దర్శనం చేసుకోకుండా ఇక్కడ నుంచుంటాడేమిటి? అని. తరువాత అమ్మ పంచలోకి వచ్చి నిలుచున్నది. ఇద్దరూ ఒకరినొకరు చూసుకున్నారు. అతను అమ్మ పంచలోకి వచ్చినా దగ్గరికి వెళ్ళలేదు. ఆ చూపులో మౌనంలో సర్వభాషలు ఇమిడివున్నవి. "ఆలోచనలు ఆగిన పరస్పర అవగాహనకి పనికి వచ్చేది మౌనం" అంటారు. అట్టిది వారి భాష. తరువాత ఆ వ్యక్తి వెళ్ళిపోయాడు. అమ్మ లోపలికి వెళ్ళింది. ఈ సంఘటనతో గజేంద్రమ్మక్కయ్యకు అనుమానం ఎక్కువ అయింది. వచ్చి కూడా అమ్మ దగ్గరికి వెళ్ళక పోవటంతో ఎవరైనా దొంగ ఏమో అని అనుమానంతో అమ్మ పెద్దకొడుకు సుబ్బారావు కి చెప్పి పదిమంది మనుషుల్ని ఊరంతా వెతకమని పంపారు. మరుక్షణంలోనే ఎంతవెదికినా ఆ వచ్చిన వ్యక్తి కనపడలేదు. అట్లా అదృశ్యమయిన వ్యక్తి, అంతకు ముందు కొంతమందికి జరిగిన అనుభవాల మూలంగా రహి అని గజేంద్రమ్మక్కయ్యకు అర్థం అయింది.

ఇట్లా అనేక సందర్భాలలో అనేకమయిన విశేషాలు చూస్తూ అనుభవిస్తూ అమ్మకి అంకితమైన వ్యక్తి గజేంద్రమ్మక్కయ్య. తను దాచుకున్న డబ్బు ఎవరూ తీసే అవకాశం లేకుండానే మాయమైందిట. కృష్ణునిలాగా అమ్మ వెన్నెలహేలగా , లీలామయంగా అల్లరి పెడుతూ ఏడిపిస్తూ వుండేది. పరిపూర్ణ అవతారమూర్తి సన్నిధిలో అన్నీ వుంటయికదా, తనని

నమ్మిన వారిని అన్ని విధాలా నిగ్గుతేల్చి తనవారిగా చేసుకుంటాడు దేవుడు. ఈ విధంగా రకరకాల అనుభూతులతో అమ్మసాన్నిధ్యంలో ఈ నాటికీ వున్న అదృష్టజీవి గజేంద్రమ్మక్కయ్య.

## చీరాలభాస్కర రావుగారు

1950 - 55 సంవత్సరాల మధ్య గుంటూరులో భాస్కరరావుగారు చదువుకుంటూ వుండేవారు. బ్రాడీపేటలో వుండేవారు. అదేపేటలో నివసించే రామరాజు కృష్ణమూర్తి గారు వీరికి స్నేహితులు. కాలేజీలో సహపాటి కూడా భాస్కరరావుగారికి మొదటి నుండి ఆధ్యాత్మిక జిజ్ఞాస ఎక్కువగా వుండేది. 55లో వారి కుంటంబం చీరాల రావటం జరిగింది. అక్కడ కూడా వారు అరవిందయోగి, రామకృష్ణ పరమహంస మొదలైనవారి యోగ గ్రంథాలు చదువుతుండేవారు. వీరు గుంటూరులో వున్నప్పుడు రామరాజు కృష్ణమూర్తి గారు అమ్మని గురించి చెప్పారు. చీరాల వచ్చిన తరువాత భాస్కర్‌రావుగారు, ఆధ్యాత్మికగ్రంథ పఠనము యోగచింతనతో ఎక్కువగా కాలక్షేపం చేసేవారు. అక్కడ (చీరాలలో) వున్న రోజులలో వారికి ఒక అనుభవం కలిగింది. ఒకరోజు రాత్రి వేళ ఆయన నిద్రించటానికి పడుకునప్పుడు కిటికీలో నుండి ఒక స్త్రీ రూపం కనపడేదట. వీరికి భయం కలిగింది. అంతే కాక గోడలో నుండి ఒక స్త్రీరూపం సినిమాలో లాగా పొడుగ్గా సాగుతూ కనపడింది.

అమ్మ భర్తగారి గురువుగారు అయిన మోతడ రాచంద్రరావుగారి దగ్గరికి రామరాజు క్రిష్ణమూర్తిగారు వెళ్తూ వుండేవారు. రామచంద్రరావుగారి ద్వారా రామరాజు కృష్ణమూర్తి గారికి అమ్మను గురించి తెలిసింది. పూర్ణిమనాడు అమ్మకి దివ్యావేశం కలుగుతుందని ఆ రోజు ఉపదేశాలు చేస్తుందని, పూర్ణిమ చాలా ముఖ్యమని , ఇంకా ఎన్నో ఆధ్యాత్మిక శక్తులు వున్నవని, ఈ విధంగా అమ్మని గురించి రామరాజు క్రిష్ణమూర్తిగారు భాస్కరరావు గారికి చెప్పేవారు.

చీరాలలో వుండగా భాస్కరరావుగారికి మూడు , నాలుగు రోజులు బాగా జ్వరం వచ్చి తగ్గిన మరుసటి రోజున కొంచము పథ్యం పుచ్చుకున్నారుట. బాగా నీరసంగా వున్నారుట. ఆ రోజే రామరాజుగారు చీరాల వెళ్ళి అమ్మని చూద్దాం రమ్మని పిలిచినారట. భాస్కరరావుగారి తల్లి వద్దని చెప్పేన్నటికి రామరాజు గట్టిగా పట్టుపట్టి నందువలన భాస్కరరావుగారు 56 అక్టోబర్ 17వతేది నాడు చీరాలనుండి రామరాజుగారితో కలిసి బయలుదేరారు. వీరిద్దరు బస్సులో వస్తూ వుండగా భాస్కరరావు గారికి మామూలు దేహస్మృతి కోల్పోయి ఒకానొక అలౌకిక అనుభూతి అయినది. వారి హృదయమునుండి తామరపుష్పం ఒకటి వికసించి

అది పైకి వెళ్తూ గగన తల శిఖరాగ్రానికి వెళ్ళినట్లు, కానీ హృదయంలో ఆ తామరకాడ వుండి, దీనితో పాటే ఆ పుష్పం కాడపైకి వెళ్తున్నట్లు ఒకానొక అనుభూతి అయినదిట. బాపట్ల బస్టాండు చేరి చాలా సేపు వుండి వారిద్దరూ కూడ పలక్కుని రిక్షా చేసుకుని 7 వమైలు వచ్చి అక్కడి నుండి నడచి జిల్లెళ్ళమూడి చేరారు. ఇదే భాస్కరరావు గారికి మొదటి దర్శనం.

వీరిద్దరూ అమ్మని చూడటానికి అప్పట్లో అమ్మ నివసించే పాక దగ్గరికి వచ్చేటప్పటికి అమ్మ సమాధ్యవస్థలో కూర్చుని వున్నదట. తరువాత మామూలు స్థితికి వచ్చి వీరిద్దరితో వీరు చెప్పకుండానే బాపట్ల బస్టాండులో వారు కూర్చుని మాట్లాడిన సంఘటన తరువాత రిక్షా చేసుకుని రావటం మొదలైన విషయం అంతా పూసగుచ్చినట్లు అమ్మ చెప్పింది. భాస్కరరావుగారికి ఆశ్చర్యం వేసింది. సర్వజ్ఞత్వాన్ని గురించి పూర్వం విన్నది ఇక్కడ అనుభవించారు. "ఇక్కడ కూర్చున్న ఆమెకి ఇవి అన్నీ ఏ విధంగా తెలిసినవి?" అనుకున్నారు. తరువాత అమ్మ భాస్కరరావుగారిని "ఏమి సాధన చేశావు ?అని అడిగింది. వారు ఏమి చెయ్యలేదు. ఆధ్యాత్మిక గ్రంథాలు, మహాత్ముల గ్రంధాలు చదువుతూ వుంటాను" అన్నారు.

**అమ్మ :-**

" పుస్తక జ్ఞానం అనుభవం కాదు" అన్నారు. అమ్మగొంతు , స్వరం మానవ స్వరానికి అతీతంగా  ఒక మధుర స్వరంగా వున్నదట. ఆ స్వర మాధుర్యంలోని మాట తమ హృదయంలోకి దూసుకుని పోతున్నట్లు  అనిపించేదట. వంట ఇంట్లో వంట చేసి తాను క్రింద కూర్చుని వీరికి పీట వేసి వడ్డన చేసింది. కలిపి నోట్లో ముద్దలు పెట్టింది. పొయ్యి దగ్గర కూర్చుని వీరితో గిన్నె, గరిటె, కట్టెలు, పొయ్యి, చూపించి "ఇవే నా సాధన సామగ్రి" అన్నారు అమ్మ. రుక్మిణి అంటే ఋగ్వేదము అన్నారు. వీరిద్దరూ బయట కూర్చుని ఉండగా కాలే కుంపటిని నిప్పులతో సహా చేతితో తీసుకుని బయటికి వచ్చి అక్కడ పెట్టారు అమ్మ. కాల్చిన బంగారం లాగా వుండేది అమ్మ శరీరం అని చెప్పారు భాస్కరరావుగారు.

ఒకసారి ఆయనతో 56 లోనే "నాన్నా! భాస్కరా నాకు శరీరాన్ని వదిలిపెట్టాలని వున్నది' అన్నదిట అమ్మ. ఆయన శరీరాన్ని మార్చాలి కానీ వదలవద్దు" అని అరవిందులు చెప్పారని చెప్పారుట. వీరు జిల్లెళ్ళ మూడిలో వున్న 4వ రోజున రఘువరదాసుగారి శిష్యుడు ఇంకా కొంత మందితో  కలిసి వచ్చారుట. అమ్మ తులసికోట దగ్గర పడుకుని దాసుగారి శిష్యుడిని నామం చెయ్యమని అడిగితే ఆయన తన్మయంగా నామం చెయ్యటం మొదలు పెట్టారుట.

ఆ సమయంలో అక్కడే వున్న నల్లకుక్క జనంలో నుండి వచ్చి అందరి మధ్య రమ్యంగా నాట్యం చేసింది. ఈ కుక్క ఇక్కడకి వచ్చే యాత్రకులను 7వ మైలు నుండి జిల్లెళ్ళమూడికి, జిల్లెళ్ళమూడి నుండి 7వ మైలుకు తీసుకుని వెళ్తూ వుండేది. ఆ రోజున నామం చేసే సోదరుడు "నర్తీ, నర్తీ" అని పిలిపించాడుట. ఒకమారు భాస్కరరావు గారి చెయ్యి అమ్మ పట్టుకుంటే ఇద్దరూ సమాధిలోకి పోయినారుట.

4రోజుల వుండి వెళ్తున్నరోజున అమ్మ వీరితో " కార్తీక పూర్ణిమకు రండి" అని చెప్పింది. కార్తీక పూర్ణిమ నాడు భాస్కరరావుగారు వస్తే అమ్మ వారి నుదుట భృకుటి స్థానంలో బొటనవేలు పెట్టింది. వెంటనే వారు భావసమాధి పొందినారుట. ఆ స్థితిలో అనేక రంగు, రంగుల కాంతులు కనపడినవి. అని చెప్పారు. వీరు, అమ్మ దగ్గర కూర్చుని మహాత్ముల గ్రంథాలు చదివి వినిపిస్తుంటె "నాకు కర్పూర హారతి" ఇస్తున్నావురా" అనేదట.

పూర్ణిమనాడు అందరినీ డ్రైన్ కాలువకి తీసుకుని వెళ్ళారు అమ్మ. అప్పుడు భాస్కరరావు గారు కూడా వెళ్ళారు. చాలా లోతుగా వున్న కాలువలో అమ్మ నీటి మీద తేలటం, తేలుతూ వెళ్ళటం చూసి ఆశ్చర్యపోయారుట. కుంకము పొట్లాములు వున్న పళ్ళెము దగ్గర పెట్టుకుని "నాన్నా! నీకు పటిక బెల్లము ఇస్తున్నానురా" అంటూ ఆ కుంకుం పొట్లాల నుండి ఒక పొట్లం ఇస్తే అందులో పటిక బెల్లం వున్నది. అంతకు ముందు అందులో పటిక బెల్లం లేదు. అన్నీ కుంకమ పొట్లాలే. అయితే అమ్మ తానేదో మహిమ చేస్తున్నానని ఆయనతో అనలేదుట. కానీ వారు నాతో అమ్మ మహిమగా తీసి ఇచ్చినదని చెప్పారు. కార్తీక పౌర్ణమినాడు అందరితో పాటు వీరికి కూడా మంత్రం ఇచ్చారు. అమ్మ తులసికోట ప్రక్కనే కూర్చుని మట్టి నలిచి ఇస్తే అది భూమి మీద ఏ పుష్పానికి కానీ, సుగంధద్రవ్యానికి కానీ లేని ఒక విలక్షణమైన ప్రత్యేక దివ్యసౌరభంతో ఘుమఘుమ లాడుతూ ఎంతకాలమైనా అట్లాగే వుండేదని చెపుతున్న వారి కండ్లలో ఆనందగంగ చమర్చింది.

అమ్మ మాతృప్రేమ, సున్నితమైన లాలనను తెలియచేస్తూ ద్రాక్షపండులోని గింజలను ఒకటి ఒకటిగా తీసి అవతల వేసి ద్రాక్ష పండు గుజ్జును పెట్టేదని చెప్పారు. వంట ఇంటిలో నుండి తొక్కలు లేని అరటి పండ్లు తీసుకుని వచ్చి ఇచ్చేదట. చుట్టు ప్రక్కల ఎక్కడా తొక్కలు వుండేవి కాదుట. ఆ తొక్కలేని పండ్లను ఏవిధంగా సృజించి మాతృప్రేమతో పెట్టేదో తలచుకుంటే ఆనందం వేస్తుందని తెలియజేశారు.

భాస్కరరావుగారు అమ్మ వ్యక్తిగా వున్నంతకాలం జిల్లెళ్ళమూడిలో లేరు. అమ్మ అవ్యక్తం

అయిన తరువాత 1990 నుండి జిల్లెళ్ళమూడిలో వున్నారు. అమ్మ ఎప్పుడు ఎవర్ని ఎక్కడ వుంచుతుందో తెలియని విషయం. 90 వరకు అరవిందయోగికి సంబంధించిన సంస్థలో తిరుగుతూ వుండేవారు. ఎక్కువగా పాండిచ్చేరి మదర్ గురించి అరవింద యోగి గురించి చెప్తూ వుంటారు. ప్రస్తుతం జిల్లెళ్ళమూడిలో వున్నారు. 1956లో వీరికి అమ్మ దర్శనం ఇచ్చి, అనుభూతులు ప్రసాదించింది. అమ్మ కృపా కటాక్షానికి నోచుకున్న భాస్కర రావుగారు ధన్యులు.

## లలితాంబగారు - రాచర్ల కమలక్కయ్య

లలితాంబగారు నరసరావుపేట దగ్గర చీమలమఱ్ఱి గ్రామ నివాసి. రాచర్ల అనంతరామయ్యగారి చెల్లెలు. ఆమె మొదటి నుండి మడి కట్టుకుని పూజలు చేసుకుని స్వయంగా వంట చేసుకుని తింటూ నిష్టా గరిష్టమయిన జీవితాన్ని గడుపుతూ వుండేవారు. ఆవిడ 1959 జూన్ నెలలో పూజ చేసుకుని, పదార్థాలు, అన్నం విస్తరిలో పెట్టుకుని తినపోతూ వున్న సమయంలో ఒక సాధువు వచ్చి "పూజ అయిన తరువాత అన్నం పెడతారా?" అని అడిగారుట. వారి ఆడపడుచు ఇల్లు ప్రక్కనే ఉన్నది. వారింట్లో ఒకరికి నలుగురు వున్నారు. తను ఒంటరిగా వుండటం వలన తాను చేసుకున్నది ఆయనకు సరిపోతుందో లేదో అనేది అనుమానంతో వారి ఆడపడుచు ఇంట్లో అడగమని పంపారు లలితాంబగారు. ఆడపడుచుగారి ఇంట్లో ఆ సాధువు అడిగితే వీలుకాదు, పెట్టం పొమ్మన్నారు. మళ్ళీ సాధువు తిరిగి వచ్చి జరిగిన విషయం చెపితే తాను వండుకున్నది ముందు ఆయనకి పెట్టి తరువాత తాను వండుకుని తిన్నది ఆమె. కాసేపు పడుకుని లేచి ఆయన ఆమెతో "అమ్మా! నీకు భక్తి బాగా వున్నది. నేను ఎన్నో క్షేత్రాలు చూశాను. ఎందర్నో దర్శించాను. కానీ జిల్లెళ్ళమూడి లాంటి క్షేత్రం లేదు. అక్కడ వున్న అమ్మలాంటి దైవం లేదు. నీవు తప్పక వెళ్ళి అమ్మని దర్శించు". అని చెప్పారు. ఆమె అక్కడికి ఎట్లా వెళ్ళాలి. అని అడిగితే "బాపట్ల వెళ్ళి పెదనందిపాడు బస్సు ఎక్కి ఏడవమైలు దగ్గర దిగి మైలున్నర నడిస్తే జిల్లెళ్ళమూడి వస్తుందని" మార్గం చెప్పారు. తరువాత వెళ్ళి వస్తానని చెప్పి తలుపుతీసుకొని వీధిలోకి వెళ్ళారు సాధువు. ఆమె ఇల్లు పొలంలో వున్నది. చుట్టు పక్కల ఇళ్ళు లేవు. బయటకు వచ్చి చూస్తే మైలు వరకు ఎవరు వెళ్తున్నా కనపడుతుంది. అటు వంటిది మరుక్షణంలో తలుపు వేసుకుందామని వచ్చి చూస్తే ఎవరూ వీధిలో కనపడలేదు. చుట్టుప్రక్కల కనుచూపు మేరలో ఎక్కడా ఆయన కనుపించలేదు. ఆయన అదృశ్యమయినారు. ఈ సంఘటన

అనుభవంతో అమ్మను చూడాలనే ఆకాంక్ష ఆమెలో తీవ్రమయింది.

నరసరావు పేటలో నివసించే ఆమె అన్నగారైన రాచర్ల అనంతరామయ్యగారి వద్దకు వెళ్ళి "అన్నయ్యా! జిల్లెళ్ళమూడిలో అమ్మ వున్నదని ఒక సాధువు వచ్చి అయాచితంగా చెప్పిన విషయం, అదృశ్యమవటం మొదలైనవి చెప్పి, నీవు తోడు వస్తావా? అని అడిగారు. ఆయన "పండగలు కదా గుళ్ళో పూజలు వున్నయి. నాకు కుదరదమ్మా" అన్నారు. తరువాత ఆమె అక్కయ్యను, మామయ్యను అడిగితే కుదరదన్నారు, బంధువులెవరూ కుదరదు అన్నందువలన కర్లపాలెం పొలం పనిమీద వచ్చి అక్కడి నుండి జిల్లెళ్ళమూడి వచ్చి అమ్మని దర్శించారు. మొదటి దర్శనంలోనే అమ్మ సాక్షాత్ దైవం అనెడి భావం ఏర్పడింది. అమ్మ దర్శనం అయిన తరువాత కూర్చుంటే ఆమెతో " నీకు ఎవరైనా సాధువు వచ్చి ఇక్కడి విషయం చెప్పాడా"? అని అడిగారు. అమ్మ ఇంతకు పూర్వం వున్న అనుభవంతో ఆమె పొంగులు వారిన ఆనందంతో "అవునమ్మా, నీవే నన్ను నీ దగ్గరకు రప్పించుకున్నావు కదమ్మా" అని ఎనలేని శాంతిని ఆనందాన్ని పొంది తిరిగి వెళ్ళారు.

ఒక వారం రోజులు అయిన తరువాత రెండవ సారి అమ్మని చూడటానికి వచ్చి అమ్మ చెంత వెక్కి వెక్కి ఏడుస్తూ వుంటే "ఏమిటి పిల్లలు పోయినందుకు, భర్తపోయినందుకు ఏడుస్తున్నావా?" అన్నది అమ్మ. లలితాంబగారు "పిల్లలు పోయినందుకు, భర్తపోయినందుకు కాదు, ఏదో తెలియని ఆనందంతో కన్నీరు వచ్చింది" అన్నారు.

కొద్ది రోజులు తరువాత రాచర్ల అనంతరామయ్య గారి కొడుకు లక్ష్మీనారాయణగారి ఇంటికి గుంటూరు వచ్చారు లలితాంబగారు. ముక్కోటి రేపనగా చేరారు గుంటూరు. ఇది మూడవసారి. అమ్మని చూడటానికి అని లలితాంబగారు ఒకరోజు ముందుగా గుంటూరు చేరారు. లక్ష్మీనారాయణ గారితో తన అనుభవాలు చెపుతుంటే ఆయన భార్య కమల కూడా విని నేను కూడా మీతో వస్తాను అన్నది. అన్ని విషయాలు చెప్పి "రేపు ముక్కోటి ద్వార దర్శనం అమ్మ ఇస్తుంది వెళ్దామా" అని అడిగారు. కమలక్కయ్య భర్తతో ఆ విషయం చెపితే "నాకు ఆఫీసు వున్నది కదా! నీవు వెళ్ళి రమ్మని" అన్నారు. మరునాడు ఉదయమే గుంటూరు నుండి నందిపాడు చేరి అక్కడ బస్సు కోసం వేచి వున్నారు. అప్పుడు లలితాంబగారు "రాత్రే వచ్చి నందిపాడులో పడుకుంటే ఈ పాటికి వెళ్ళేవాళ్ళం. ఇప్పుడు చూడు అప్పుడె అయిదు దాటింది. ద్వార దర్శనం అయిపోతుంది కదా!" అని విసుగ్గా బాధగా అన్నారు. అప్పుడు కమలక్కయ్య "నువ్వే కనుక దేముడైతే ద్వారదర్శనం కాదు

కదా. అసలు పందిరి కూడా వెయ్యకూడదు.స్నానం కూడా చెయ్యకూడదు" అని మనస్సులో అనుకున్నది. అప్పుడు వీరితోపాటు కమలక్కయ్య మరిది శ్రీరామమూర్తి కూడా వచ్చాడు. తరువాత బస్సు రావటం వీరు ముగ్గురు 7వ మైలులో దిగటం జరిగింది. ఆ సమయంలో కొందరు పందిరికి కావలసిన బొంగులు బాదులు దించుకుని జిల్లెళ్ళమూడి వెళ్ళటానికి సిద్ధంగా వున్నారు. "అమ్మ ద్వార దర్శనం ఇవ్వాలి. ఇవి రావటం ఆలస్యమయింది" అని వాళ్ళు లలితాంబగారితో చెప్పారు. అందరూ జిల్లెళ్ళమూడి చేరిన తరువాత అప్పుడే అమ్మ సాన్నానికి వెళ్ళిందని అక్కడి వారు చెప్పారు. తాను అనుకున్నట్లు స్నానం కూడా చెయ్యకపోవటం పందిరికూడా వెయ్యకపోవటం రెండూ జరిగి నందుకు ఆశ్చర్యపోయింది కమలక్కయ్య.

కొద్ది సేపటిలో స్నానం చేసి ఇంటి ద్వారం దగ్గర నిలపడింది అమ్మ. సన్నగా మోకాలి దాకా పొడైన జుట్టుతో ఎంతో సుందరంగా, చూడముచ్చటగా వున్నది. ఆ క్షణంలో అక్కయ్యకి "ఈమేనా అమ్మంటే, లలితాంబగారు చెప్పినట్లు ప్రత్యేకంగా ఏమి కనపడలేదే?" అనుకుంటూ అమ్మ వంక చూస్తూ వుండగానే అమ్మ రెప్పపాటులో దూరంగా వున్న వేదిక దగ్గర వున్నదట అక్కయ్యకి ఆశ్చర్యం వేసిందట. ఈ క్షణకాలంలో ఈమె అక్కడికి ఎట్లా వెళ్ళిందని అనుకుంటూ వేదిక ముందు అమ్మ పూజ చూస్తూ కూర్చున్నది.

అమ్మకి కిరీటం పెట్టి పూజ మొదలు అవ్వగానే ఎన్నో రకాల ముద్రలు వచ్చినవి. అప్పుడు అమ్మ ముఖవర్చసు వచ్చిన అనేక ముద్రలు దర్శిస్తున్న అక్కయ్యకి, ఈమె అన్నపూర్ణ, దుర్గ రాముడు. సర్వమును అనెడి భక్తి భావం ఏర్పడి ఆనందంతో అమ్మని తిలకిస్తూ కూర్చున్నది. "ఈమేనా? అమ్మ అంటే అన్న భావం పోయి అపార భక్తి భావం శాంతి, తృప్తి ఏర్పడి రెండు రోజులు వుందామనుకొన్నదట. వేదిక మీదనే పళ్ళు అమ్మకిచ్చి నమస్కరించుకున్నారు.

అప్పుడు అల్యూమినియం తొట్లో క్షీరాభిషేకం చేశారు. తరువాత అమ్మ దగ్గరికి వెళ్తే లలితాంబగారిని అక్కయ్యని రెండు రోజులు వుండి పొండని అన్నది. అప్పుడు అమ్మ "ఇవి పుట్టింటి పసుపు కుంకుమలు తీసుకో" అంటూ రవిక పసుపు కుంకుమ ఇచ్చింది. ఆరోజు శనివారం ఏకాదశి అవటం వలన ఏమి తినదు అక్కయ్య. అమ్మ అక్కయ్య, లలితాంబగారు కూర్చున్న చోటికి వచ్చి ఎవరో తెచ్చిన అరటిపళ్ళు వారికి ఇచ్చింది. అనుకోకుండా, చెప్పకుండానే వారి అవసరం తీర్చిన అమ్మ ప్రేమకి అక్కయ్యకి ఆనందం పొంగింది. అమ్మ పెద్ద మందిరంలో కూర్చుంటే కొద్ది దూరంలో కూర్చున్నారు అక్కయ్య. అక్కడ కూర్చున్న వారిలో ఒకరు "వెంకటేశ్వర స్వామి దగ్గరికి వెళితే కోరికలు తీరుతాయి. ఈమె దగ్గరికి వస్తే

ఏమి తీరుతాయి" అనుకున్నారట. అదే సమయంలో అమ్మ "వెంకటేశ్వర స్వామి దగ్గరికి వెళితే కోరికలు తీరుతాయి. నాదగ్గరికి వస్తే ఏమితీరుతాయి?" అన్నారు. ఈ విధంగా వాళ్ళు మనస్సులో అనుకున్నమాటని అమ్మ వ్యక్తం చేశారు.

ఆరోజు రాత్రి ద్వాదశి పూజ గుంటూరు నుండి వచ్చిన రామకోటి గారు చేసుకోవాలి. బాపట్ల నుండి పూలు రావటం ఆలశ్యం అయింది. అప్పుడు అమ్మ "ఏమిట్రా! ఎప్పుడు పూజ? ఈరోజు ఉపవాసం వున్న వాళ్ళందరికి నీరసం వస్తుంది. ఇప్పటికే 9 దాటింది" అన్నదట. ఇంతలో పూలు వచ్చినవని తెలుసుకున్న రామకోటిగారు అమ్మతో "నీదే ఆలస్యం అమ్మా! నాదేంలేదు" అన్నారట. అమ్మ దానికి "నాది ఆలస్యం అంటావా? అదేం కాదు పూలకి వెళ్ళిన వాడు పడ్డాడు. పూలురావటం ఆలస్యం అయింది" అన్నారు అమ్మ. నిజంగా జరిగింది అదే కనుక ఆశ్చర్యంగా ఆనందంతో నవ్వారు. తరువాత రాత్రి 11 గంటలకి పూజ జరిగింది. అప్పుడు అమ్మ నుండి దేదీప్యమానమైన కాంతి రావటం దర్శించి పులకితురాలైంది అక్కయ్య. మరునాడు అమ్మ నాన్నగారు, కనకమ్మ బామ్మగారు (అమ్మ అత్తగారు) ముగ్గురూ వడ్డన చేశారు నాన్నగారు దద్దోజనం, అమ్మ పప్పు పులుసు కలిపిన అన్నం, బామ్మ మరొకటి తీసుకుని వడ్డన ప్రారంభించారు. 400 మంది బారులు తీరి కూర్చున్నారు. కమలక్కయ్య ప్రక్కన కూర్చున్న లలితాంబగారు మనలోక స్పృహకోల్పోయి అమ్మపెట్టిన ముద్దలు తినకుండా అమ్మ చీర చెంగు పట్టుకుని అమ్మతో నామం చేస్తూ తిరిగింది. ఇంతలో చేసిన పదార్థం అయిపోయి వంటశాల నుండి వచ్చిన వ్యక్తి అమ్మతో విషయం వివరించారు. వెంటనే అతని చేతిలో వున్న పెద్ద పళ్ళెం స్వయంగా తాను తీసుకున్నది. దానిలో అంతకు ముందు పదార్థాలు కలిపిన అన్నం కొద్దిగా వున్నది కనుక ఆ పళ్ళెమును వంటశాలకి తీసుకుని వెళ్ళి మళ్ళీ తనే స్వయంగా ఆ పళ్ళెంతో బయటికి వచ్చింది. తక్కిన వారందరికి వడ్డిస్తుండగా ఊరిజనమంతా తండోప తండాలుగా ప్రసాదం కోసం వచ్చారు. అదే పళ్ళెంలోని అన్నమును వారందరికీ పెట్టినా ఇంకా మిగిలినది. ఈ దృశ్యం చూసిన అక్కయ్య, అక్షయమయిన అన్నపు పళ్ళెం పట్టుకున్న అమ్మ సాక్షాత్ అన్నపూర్ణాదేవి అనుకుని మనస్సులో నమస్సుమాంజలులు సమర్పించుకున్నారు. ఇంతలోపు స్పృహలోలేని లలితాంబగారి దగ్గరికి వచ్చిన అమ్మ ఆమె నోట్లో సోడా నీళ్ళు పోసింది. అప్పుడు ఆమె పెద్దకేక పెట్టింది. తరువాత మన లోకంలోకి వచ్చిన ఆమె అవ్యక్తమయిన ఆనందానుభూతితో ఆనందభాష్పాలు రాల్చింది.తరువాత అక్కయ్య, లలితాంబగారు, శ్రీరామమూర్తి అమ్మ

ఫొటో ఒకటి తీసుకుని, సెలవు తీసుకుని వెళ్ళారు.

గుంటూరు వెళ్ళిన అక్కయ్యకి అనుక్షణం అమ్మ గురించి ఆలోచనే ఎప్పుడెప్పుడు వెళ్ళి అమ్మని చూద్దామా అని ఆతురత ఎక్కువయింది. అమ్మని గురించి లక్ష్మీనారాయణ గారికి చెప్పి మళ్ళీ జిల్లెళ్ళమూడి వెళ్దామని అడిగింది. తను తీసుకువచ్చిన అమ్మ ఫొటో గోడకి తగిలించింది. లక్ష్మీనారాయణ గారికి అమ్మ ఫొటోలో వారి అమ్మ కనపడింది. ఈ అనుభూతితో వారికి ఆనందభాష్పాలు వచ్చినవి. ఒక వారానికి ఇద్దరూ కలిసి అమ్మని దర్శించటానికి వచ్చారు. అక్కయ్యకి ఇది రెండవసారి దర్శనం. ఆమె భర్తకి మొదటిసారి దర్శనం. అక్కయ్య "గుర్తు ఉన్నానా అమ్మా" అని అడిగితే "అదేమిటి ఎందుకు గుర్తు లేవు, ఏ బిడ్డకి ఆ బిడ్డే అంటూ క్రిందటిసారి ఇచ్చిన రవిక గుడ్డ కుట్టించుకున్నావా?" అన్నారు. "కుట్టించుకోలేదు. కుట్టించుకోవాలి" అన్నారు అక్కయ్య. ఇంతకు పూర్వం తాను వచ్చింది. ఒకసారి మాత్రమే. అన్ని వందల మందిలో తాను గుర్తు వుండటము రవిక దగ్గరున్నండి అడగటము ఆశ్చర్యం వేసింది. ఆ సందర్భంలో లక్ష్మీనారాయణగారు దూరంగా కూర్చున్నారు. అప్పుడు అమ్మ ఆయన దగ్గరకి వెళ్ళి " ఎందుకు నాన్నా! దూరంగా కూర్చున్నావు మీ అమ్మనే కదా" అని తలనిమురుతూ అన్నారు. అమ్మకి కొంత దూరంలో వున్న అక్కయ్యకి మనస్సులో ఒక అనుమానం వచ్చింది. "మంత్రం అంటే ఏమిటి? మంత్రంవల్ల లాభం ఏమిటి? మనస్సు ఏ విధంగా నిలపడుతుంది?" ఈ విధంగా తాను అనుకుంటూ వుండగానే అమ్మ చెంతవున్న మరొక వ్యక్తి అమ్మని ఇదే ప్రశ్న వేశాడు.

అమ్మ :- మంత్రమంటే కొన్ని అక్షరాలు కలిపితే మంత్రం మవుతుంది. దానిని విశ్వాసంతో పదే పదే మననం చేస్తే మనస్సు నిలుస్తుంది" అని సమాధానం చెప్పారు అమ్మ.

తను అనుకున్నదానికి ఈ విధంగా ఇంకొకరి ద్వారా అడిగించి సమాధానం చెప్పింది అమ్మ అనుకుంది అక్కయ్య. ఏ ఒక్కరికో సమాధానం చెపుతూ దాని ద్వారా అనేక మందికి సమాధానం ఇస్తుంది అనుకుంది అక్కయ్య. మరొకసారి గుంటూరు నుండి వస్తే ఇంట్లో జరిగినదంతా అమ్మ చెప్పటం జరిగింది.

ఒకరోజు ఉదయం లేచినప్పటినుండి తను ఇంట్లో పనిచేసుకుంటుంటే అదేపనిగా తనలో నుండి ఎవరోచెపుతున్నట్లు "ఇంట్లో పాము వుంది మంచం మీద కూర్చో" అని ఒకటే పనిగా అంతరంగంలో అనిపించటం మొదలుపెట్టింది. తనకి ఎక్కడా పాము కనపడలేదు.

అయినా మంచం మీద కూర్చున్నారు అక్కయ్య. ఆరోజు జిడ్డు ప్రసాదుగారు, నందిపాడు వీరస్వామి, మరొక వ్యక్తి వారింటికి వచ్చారు. వారిని భోజనానికి రమ్మన్నది అక్కయ్య. వారు లక్ష్మీనారాయణగారి ఆఫీసుకు వెళ్ళారు. బొగ్గులు కొద్దిగా వున్నందువలన మరొక ముగ్గురుకి వంట చెయ్యాలి కనుక లక్ష్మీనారాయణగారు ఆఫీసు ప్యూన్‌ని బొగ్గులు తీసుకుని రమ్మని ఇంటికి పంపారు. బొగ్గులు కొద్దిగా వున్నందు వలన బొగ్గుల పెట్టె బాగు చేయమని అతనికి చెప్పింది.

అతను బొగ్గుల పెట్టె తీసేటప్పటికి పెట్టె క్రింద ఒకమూల గోధుమ వర్ణం నలుపు. కలిసిన త్రాచుపాము చుట్ట చుట్టుకొని వున్నది. వెంటనే అతను " అమ్మగారు ఇక్కడ ఒక పాము వున్నదని" అరిచాడు. అదే సమయంలో వారి ఇంటి ముందు నుండి లక్ష్మీనారాయణగారి ఆఫీసులో పనిచేసే మరొక వ్యక్తి వెళ్తున్నాడు. అతను పాములను భయం లేకుండా చంపగలడు. ప్యూన్ వెంటనే అతనిని పిలిచాడు. కమలక్కయ్యకి అమ్మే అట్లా వచ్చిందేమోనని అనుకుంటూ చంపవద్దని చెప్పబోతుండగా ఆఫీసు నుండి వచ్చిన వ్యక్తి దానిని చంపాడు. అయ్యో దానిని చంపాడే అని బాధ పడ్డారు అక్కయ్య. ఈ చంపిన వ్యక్తి ఆఫీసుకు వెళ్ళి లక్ష్మీనారాయణగారికి చెప్పితే ఆయన జిడ్డు ప్రసాదు గారికి వీరాస్వామి గారికి చెప్పారు. అమ్మ భర్తపేరు నాగేశ్వర గారు కావటం వల్ల జిడ్డు ప్రసాదుగారు " నాన్నగారు వచ్చారటగా' అని అడిగారు. చంపవద్దని చెప్పేలొగా ఈ విధంగా జరిగిందని చెప్పారు అక్కయ్య. తరువాత వారు జిల్లెళ్ళమూడి వచ్చి గుంటూరులో జరిగినదంతా చెప్పారు. మరొకవారానికి అక్కయ్య వాళ్ళు జిల్లెళ్ళమూడి వస్తే అమ్మ అక్కయ్యతో 'చంపవద్దని అన్నావుటగా' అని అడిగారు. అక్కయ్య అవునమ్మా అన్నాను. అమ్మ 'అది దుష్ట జంతువు కదా చంపితే మాన్లే' అన్నారు. ఈ విధంగా జరగపోయే ప్రమాదాన్ని అంతరంగలో ప్రబోధించి ప్రేరణతో రక్షించారు అమ్మ.

ఒకరోజు రాత్రి 1-30 గంటలకి " కమలా కమలా" అని అమ్మగొంతు వినపడింది. బయటకి వచ్చి చూస్తే ఎవరూ కనపడలేదు. వెంటనే భర్తతో వచ్చి చెప్పింది. మరునాడు ఇద్దరూ జిల్లెళ్ళమూడి వెళ్ళారు. కొంత కాలమయిన తరువాత ఆమె పెద్ద కుమార్తె భగవతిని కడుపుతో వుండగా నర్సరావు పేట నుండి చీరాల వచ్చి అక్కడి నుండి జిల్లెళ్ళ మూడి వద్ధామని బయలుదేరి మనసులో ఈ విధంగా అనుకుంది. "పిల్లల్ని ఇచ్చి నన్ను దూరం చేద్ధామని చూస్తున్నది. ఏమైనా సరే అమ్మకి ఏమి తీసుకువెళ్ళకూడదు. అమ్మతో పోట్లాడాలి'

అని మరొక జత బట్టలు కూడా తీసుకోకుండా కట్టుబట్టలతో బయలు దేరినది.

బాపట్ల బస్టాండులో సపోటా, అరటి, జామపండ్లు పూలుకొని జిల్లెళ్ళమూడి చేరి అమ్మకి ఇచ్చి "నన్ను దూరం చెయ్యాలని చూస్తున్నావా?" అంటూ పోట్లాడే ధోరణిలో అమ్మని అడిగింది. తెచ్చిన పండ్లన్నీ ముక్కలు కోసి బంతిలో అందరికి వేయమని చెప్పారు అమ్మ 4 రోజులు వుండమన్నారు అక్కయ్యని. అక్కయ్య తమ్ముడు వస్తూ అమ్మకు చీర, రవిక తీసుకు వచ్చారు. అవి అమ్మకి ఇచ్చారు. తాను తీసుకుని రాకపోయినా చీరరవిక వాళ్ళ తమ్ముడు, అమ్మకు తీసుకురావటం, తను పళ్ళు పూలు తీసుకురావటం అమ్మతో పోట్లాడి వద్దామని వెళ్ళి 4 రోజులు వుండటం, ఇవ్వన్నీ అక్కయ్యకి ఆశ్చర్యం వేసింది. కోపతాపాలు, పట్టుదలల మధ్య కూడా అమ్మనే సేవిస్తూ, అమ్మ చుట్టూ తిరగటం జరిగింది. గుణరహితంగా కాదు. గుణప్రకోపాల మధ్య కూడా దేవుని సేవించటం ఇది. ఎటువంటి స్థితిలో కూడా వీడని అమ్మ యొక్క విశిష్ట లక్షణం ఇక్కడ దర్శిస్తాం.

"నామాయతో యంత్రాలు నడిపేవాడు యంత్రాలు నడిపినట్లు అందర్నీ నేనే వారి హృదయాలలో వుండి ఆడిస్తున్నాను" అని కృష్ణ భగవానుడు చెప్పినట్లు అమ్మ నీ దేమి లేదు .నేను ఆడించు బొమ్మలాగ నీవు ఆడాలి అని అక్కయ్యని ఆడించింది. అంతే కాకుండ వాళ్ళ అమ్మ వాళ్ళు పెట్టిన చీర కట్టుకుని దానిని చూపిస్తూ "మీ అమ్మ వాళ్ళు పెట్టిన చీర, పసుపు, కుంకుమ బావుందే" అని అన్నది. అక్కయ్య ఏమి చెప్పకుండానే నర్సరావుపేటలో జరిగిన సంగతి అమ్మ అడిగారు. వచ్చి నాలుగు రోజులు అయింది. కనుక గుంటూరు నుండి దింటకుర్తి సుబ్బారావు అన్నయ్య అయినా వస్తే తన భర్తకి కబురు పంపవచ్చు అని తాను మనసులో అనుకుంటూ వుండగానే సుబ్బారావుగారు గుంటూరు నుండి వచ్చారు. ఆయన అమ్మని దర్శించిన అనంతరం అమ్మ ఆయనతో అన్నయ్యకి (అక్కయ్య భర్తకి) కబురు పంపినది. ఆయన గుంటూరు చేరటమే రాత్రిబాగా ఆలస్యం అగుటవలన లక్ష్మీన్నారాయణగారికి విషయం చెప్పలేదు. అదేరోజు రాత్రి 1గం॥ గుంటూరులో లక్ష్మీన్నారాయణగారికి "ఒరేయ్ రేపురారా" అని అమ్మ గొంతువినపడింది. వెంటనే రాత్రి 1గం. గుంటూరు నుండి సైకిల్ వేసుకుని జనవరి నెల అగుట చేత మంచులో తడిసి ముద్ద అయి అమ్మ నామం చేసుకుంటూ నందిపాడు చేరి వీరాస్వామి గారి ఇంట్లో సైకిల్ పెట్టుకుని ఫస్టబస్‌కి బయలుదేరి తెల్లవారేటప్పటికి జిల్లెళ్ళమూడి చేరారు. ఈయన ఇంటిదాకా చేరకముందే అమ్మ అక్కయ్యతో "వాడు వచ్చాడే" అన్నారు. తరువాత కాసేపట్లో

లక్ష్మీనారాయణ గారు వచ్చారు. కబురు ఎట్లా అందింది. ఇంత తొందరగా ఎట్లా వచ్చారని విస్మయం వెలిబుచ్చితే జరిగినదంతా చెప్పారు ఆయన.

లక్ష్మీనారాయణగారు గుంటూరు వెళ్ళి రాత్రి అన్నం తిందామని పెరుగువుందేమో చూస్తే పెరుగంతా పెల్లి దొర్లించింది. అన్నం తినకుండా పడుకుందా మనుకుంటూ వుండగా రాత్రి 10.30ని॥ పెరుగూ, పెరుగూ అంటూ ఒకామె అమ్ముతూ వెళ్తున్నది. ఆమెను పిలిస్తే ఖచ్చితంగా పాలడబ్బాడు పెరుగు వుంచే పోయించుకుని భోజనం చేసి పడుకున్నారు. మరునాడు జిల్లెళ్ళమూడి వచ్చి అమ్మ దగ్గర కూర్చుంటే అమ్మ "పెరుగు లేకపోతే ఏదోఒకటి వేసుకుని తినవచ్చు కదా? అంత మాత్రం చేత పడుకోవాలా" అన్నారు. ఆయన నవ్వుతూ "సరే పెరుగు పోసి వెళ్ళినది అమ్మేనని" జరిగినది చెప్పారు.

ఇంకొకసారి అడవుల దీవి సుశీల అక్కయ్య పటిక బెల్లం వస్త్రకాగితం పట్టి జిల్లెళ్ళమూడి పంపించారు. సుశీల అక్కయ్య కుమారుడు మధు, అమ్మ కూతురు హైమ ఆ పొడితో పూజ చేసుకుంటుంటే ప్రక్కనే వున్న అక్కయ్య మనసులో "నేను కూడా చేసుకుంటే బావుండును' అనుకున్నారు. అమ్మ అక్కయ్య వంక చూస్తూ "అనుకున్నావుగా చేసుకున్నట్లే" అన్నారు. వీరు పాత గుంటూరులో వుండగా ఒకరోజు వేణుగోపాల స్వామి రథం వారి ఇంటి ముందు నుండి పోతున్నది. అక్కయ్య భర్తతో రెండు కొబ్బరి కాయలు వున్నవి కదా? ఒకటి స్వామికి కొడతా అన్నారు." ఆరెండు కొబ్బరికాయలు అమ్మకి తెచ్చాను. అమ్మకే కొట్టాలి" అన్నారు. అక్కయ్య " అన్ని రూపాలు అందరు దేముళ్ళు అమ్మ బిడ్డలేగా ? అని ప్రశ్నించారు. "సరే నీ ఇష్టం" అన్నారు ఆయన. ఈ సంఘటన జరిగిన తరువాత వీరిద్దరూ జిల్లెళ్ళమూడి వచ్చి అమ్మముందు కూర్చున్నారు. అమ్మ "రథం వెళ్తున్నది. భార్య ఈ విధంగా అన్నది భర్త ఈ విధంగా అన్నాడు ఒకరి ఇంట్లో అంటూ వారిద్దరి మధ్య జరిగిన సంభాషణ సంఘటన పూసగుచ్చినట్టు అమ్మ వివరించారు. సర్వవ్యాపిని, సర్వజ్ఞ అయిన అమ్మకి తెలియనిదేమి లేదని ఆనందించారు వారిరువురు.

భగవతిని కడుపుతో వున్నప్పుడు మనసులో ఈ విధంగా అనుకున్నారు. అక్కయ్య "నారదుడు ప్రహ్లాదునికి ఉపదేశం చేసినట్లు అమ్మ ఉపదేశిస్తే బావుండును" అని. ఈ విధంగా అనుకుంటూ వుండగానే వెనక గదిలో వున్న అమ్మ అక్కడికి వచ్చి తన రెండు కాళ్ళు అక్కయ్య పొట్ట మీద 10 నిమిషాలు వుంచి తీస్తూ "ఊ ఉపదేశం అయింది" అన్నారు అమ్మ. ఒకసారి అమ్మచేతికి పాయసం ఇస్తుంటే, అమ్మ కొద్దిగా పుచ్చుకొని, ఆ గ్లాసు చేతిలో

పట్టుకుని " నాన్నాతీసుకోరా! మూడు రోజుల నుండి ఏమి లేదాయె తీసుకో! ఈ కొంచెం" అన్నారు. ముప్పాతిక వరకు వున్న పాయసం సగానికి తగ్గింది. తక్కిన పాయసం వారికి ఇచ్చింది. అప్పుడు కమలక్కయ్య 'మొదట ఏమిటమ్మా అట్లా అన్నావు? అని అడిగారు. అమ్మ ఆ వ్యక్తి పేరు , ఎక్కడ వున్నాడో చెప్ప కుండా "వాడు నన్నే నమ్ముకుని తపస్సు చేస్తున్నాడు. ఏమి తీసుకోకుండా తపస్సు చేస్తుంటే వాడికిచ్చాను. మీకెందుకు మీరు తీసుకోండి" అన్నారు.

ఒకసారి అధరాపురపు శేషగిరిరావుగారు అమ్మ దగ్గర కూర్చుంటే అమ్మ " నేను నా ఫొటో ముందే కూర్చుని బాధ పడుతున్నాను. ఎప్పుడు జిల్లెళ్ళమూడి వెళ్తానా అనుకుంటూ కన్నీరు కారుస్తూ రాత్రంతా కూర్చున్నాను." అన్నారు అమ్మ. ఆ క్రితం రాత్రి పొన్నూరులో శేషగిరి రావుగారు ఆ విధంగా బాధపడ్డారు. అందరి అంతఃకరణల ద్వారా చేయించేది తనేనని సర్వులలో వున్నది తనేనని ఈ విధంగా ప్రకటించారు అమ్మ. అందుకనే "నేను నా ఫొటో ముందు" అని వివరించారు. " నారాయణ పరోధ్యాతా ధ్యానం నారాయణ స్థితః" ధ్యానం చేసేవాడు ధ్యానం, నారాయణుడు, లక్ష్యం, సాధకుడు, సాధన మూడూ ఆ దివ్యతత్త్వమే. పూర్ణ జ్ఞానాన్ని తెలియచేస్తూ "వారు తమ ముందు తామే తపస్సో, ధ్యానమో చేస్తూన్నట్లు వుంటుంది అంటారు రమణమహర్షి. శేషగిరి రావు గారితో అమ్మ అట్లా అంటుండగా కమలక్కయ్య విన్నారు అక్కడ వుండి.

1962 లో అమ్మ చీరాల వెళ్ళినప్పుడు కమలక్కయ్య వాళ్ళ ఊరు అదే అవటం చేత, అక్కయ్యతో పాటు వారి ఇంట్లో వారు కలిసి అమ్మని వారి ఇంటికి రమ్మని అడిగారు. "సరే" అన్నారు అమ్మ. మరుసటి రోజు ఉదయం అమ్మ వస్తుందని ప్రత్యేకమయిన మంచం, పక్కదుప్పటి అన్నీ ఏర్పాటు చేసి తమ ఇంటి ముందు కమలక్కయ్య, వారి అక్కయ్య ఇద్దరూ కూర్చుని మాట్లాడుకుంటున్నారు. ఇంతలో ఒకామె వారి పంచలోకి వచ్చి "కాఫీ త్రాగటానికి అర్ధనా తగ్గింది ఇస్తారా? అన్నది. వీళ్ళు ఇంట్లోకి వెళ్ళి పావలా తీసుకుని వచ్చి ఆమె చేతిలో పెట్టారు. ఆమె "జిల్లెళ్ళ మూడి అమ్మ వచ్చిందా? అని అడిగితే వీరిద్దరూ "రాలేదని" చెప్పారు. ఆమె "సరే! రాత్రికి వస్తాలే" అంటూ వెళ్ళింది. ఆమె రావటం, వెళ్ళటం జరిగిన సంభాషణ తలచుకుని ఆశ్చర్యంతో ఎవరీమె అనుకుంటూ మరుక్షణంలో బయటికి వెళ్ళి చూస్తే ఎవ్వరింటికి వెళ్ళక ఆమె అదృశ్యం అయింది. అదే రోజు సాయంత్రం ఊరేగింపు జరుగుతుంది అమ్మకి. ఒకరు ఇంట్లో వుండాలి కనుక వాళ్ళ అక్కయ్యని ఇంట్లో వుంచి

కమలక్కయ్య పసుపు - కుంకుమ పళ్ళెములు పట్టుకుని ఊరేగింపుకు వెళ్ళారు. సాయంత్రం చీకటి పడుతూ వుండగా వారి అక్కయ్యగారు ఒక్కరే వున్నారు. అమ్మకోసం ఏర్పరిచిన మంచం నుండి నీడ ఒకటి లేచింది. ఆమె ఒక్కరే ఉండటము వలన భయపడినది. ఇంతలో ఆ నీడ. కిటికీ నుండి బయటికి వెళ్ళినది. వారి అక్కయ్య కిటికీ నుండి బయటికి చూస్తే వారి దొడ్లో వున్న జామచెట్టు క్రింద రెండు కోరలతో త్రిశూలం పట్టుకున్న ఒక స్త్రీ నిలపడి త్రిశూలంతో జామకాయలు కొడుతూ వాటిని తింటూ కనపడింది. తదనంతరం ఆ స్త్రీ రూపం అదృశ్యమయింది. తరువాత చూస్తే జామ చెట్టుకి పండ్లు లేవు. తీరా చూస్తే అమ్మ ఊరేగింపు అయి వెళ్ళింది. వారి ఇంటికి వెళ్ళ లేదు, కమలక్కయ్య వాళ్ళ అమ్మ ఇంటికి వస్తే అంతకు ముందు జరిగిన అనభవం వారితో చెప్పింది. వాళ్ళ అక్కయ్య ఆరోజు ఉదయం ఒక వ్యక్తి వచ్చి అర్ధణా అడగటం, సాయంత్రం వస్తానని చెప్పి వెళ్ళటం, సాయంత్రం ఆమెకి కలిగిన అనుభవం తలచుకుని ఉదయం వచ్చినది అమ్మ అని,వస్తాను అని చెప్పినందుకు దృష్టాంతముగా వారి అక్కయ్యకి జరిగిన అనుభవం రెండూ తలచుకుని అమ్మే రెండుసార్లు వచ్చిందని ఆనందించారు. మా ఇంటికి రమ్మని ఆహ్వానిస్తే మనదృష్టిలో అమ్మ భౌతికంగా ఈ రూపంతో వెళ్ళలేదు. కానీ మరొక రూపంతో వెళ్ళినట్టు వారి అనుభవం తెలియచేస్తున్నది. తను ఇచ్చిన మాట నెరవేర్చినట్టు కనపడలేదు. ఒక దృష్టిలో మరొకరకంగా వారి అనుభవం ఎట్లా వచ్చిందో తెలియజేస్తున్నది. స్థూలమయిన దృష్టికి ఒకరకంగా కనపడుతూ మరొకరకంగా అనుభవం ఇచ్చింది. లోకోత్తరులైన మహాత్ముల చేష్టలు మహా మహా విజ్ఞాన వంతులకే తెలియదని అందుకే ఆర్యులు ఘోషించారు.

ముక్కోటి ఏకాదశి నాడు ఏకాహం చేసుకుని గుంటూరు వెళ్ళారు. పొయ్యి మీద బియ్యం పెట్టి సాయంత్రం 6 గం॥ లకి పడుకుని నిద్రపోయింది కమలక్కయ్య. రాత్రి 9 గం. అన్నయ్య, మామగారు ఇద్దరూ వచ్చి తలుపు తడితే లేచి తలుపు తీసింది. లోపలికి వెళ్ళి అన్నం చూస్తే చక్కగా ఉడికింది. కట్టెలు పక్కకి తీసిపెట్టి వున్నవి. అమ్మ నామంతో అలసి పడుకుని వున్న అక్కయ్యకి నిత్య జాగృత మూర్తి అయిన అమ్మ గుంటూరులో వండిన అన్నం దించి బిడ్డకి సహాయం చేసింది.

మరొక సంఘటన ఆరోజులలో గుంటూరులో వీరయ్యగారి కూతురికి అమ్మ వంటి మీద వచ్చేదని అక్కయ్య చెప్పారు. అక్కడ ఒకాయన కాలు మీద గడ్డలేస్తే ఆపరేషన్ చెయ్యాలని చెప్పారు. ఆయన వీరయ్యగారి కూతురు దగ్గరకి వచ్చారు. ఆమె ఆయన కాలు

మీద గడ్డకు కుంకుమ రాసి ప్రసాదం ఇచ్చారు. అది మరునాటికి తగ్గింది. వారు జిల్లెళ్ళమూడి వస్తూ నడుస్తూ వున్నప్పుడు ఈ విషయం అక్కయ్యకి చెప్పారు స్వయంగా.

మరొక ముక్కోటి ద్వార దర్శనం అప్పుడు అమ్మ దర్శనానికి వచ్చే ముందు "అమ్మ స్త్రీ కదా? అమ్మ విష్ణువు గా రావటం ఏమిటి?" అనెడి అనుమానం వచ్చింది అక్కయ్యకి. తనకి రాముడంటే ఇష్టం, భక్తి. అమ్మ వేదిక మీద వచ్చి కూర్చున్న తరువాత అమ్మ ముఖం శ్రీరాముని వలె పురుషరూపంతో అక్కయ్యకి దర్శనం ఇచ్చారు. ఈ అనుభవంతో అక్కయ్యకి అనుమానం తీరింది. అమ్మ చాలా పూర్వమే తాత్వికంగా ఒక వివరణ ఇచ్చింది. " అనసూయలో రామునిలో వున్న శక్తి ఒకటే. అనసూయ అంటే ఆడకాదు. రాముడంటే మగకాదు. రాగద్వేషాలు లేనిది అనసూయ. విరామం లేని వాడు రాముడు" అన్నారు. తాత్వికంగా వివరించిన దానినే భౌతికంగా రూపంగా కూడా దర్శనం ఇచ్చి సంశయం తీర్చింది అక్కయ్యకి.

కొండమ్మ అక్కయ్య అనే ఆమె గుంటూరు నివాసి, అనాది నుండి అమ్మ చెంతకు వస్తున్నారు. ఆమె అమ్మ మహాసిద్ధి పొందిన తరువాత ఆవిడ చివరి రోజులలో జిల్లెళ్ళమూడిలో వున్నది. కొండమ్మ పోయే ముందు రోజున అక్కయ్య గుంటూరులో వాళ్ళ ఇంట్లో కూర్చుని వాళ్ళ అబ్బాయి ఎం.బి.ఎ. సీట్ గురించి ఆలోచిస్తూ ఈ విధంగా అనుకుంది. "అమ్మ వుంటే అమ్మతో చెప్పుకునే దాన్ని. వీడి సీట్ సంగతి మొదలైనవి ఒక రకమైన తృప్తిగా వుండేది. ఇప్పుడు ఆ తృప్తి లేదు కదా? అనుకున్నది" అంతే కాక మరుసటిరోజు 15-5-88 జిల్లెళ్ళమూడి వస్తూ అమ్మకి చీర తీసుకుని వద్దామని అనుకుంటూ వారి కూతురు భగవతితో ఈ విధంగా అన్నది. "ఈ సారి తీసుకుని వెళ్ళే చీర అమ్మ పాదాలకి తాకించి కొండమ్మకి ఇద్దామని వుంది" అన్నదిట. ఇంతలో డాబా మీద పంచనుండి క్రిందకి చూస్తే క్రిందగేటు అవతల నుంచుని ఒకామె వున్నది. అక్కయ్య, భగవతి ఆమెకు ఏమన్నా ఇద్దామని అనుకుని ఒక రూపాయి కొబ్బరిచిప్ప తీసుకుని క్రిందకి వచ్చి ఆమెకి ఎదురు ... ళ్ళారు. ఆమె ఒక పెద్ద బొట్టు నుదుటన పెట్టుకుని కాశీతాడు పూసలదండ మెడలో ధరించి ఆకర్షణీయంగా వున్నది. ఆమె అక్కయ్యతో "నీ కొడుకులలో ఒకడు వ్యాపారం చేస్తున్నాడు. రెండవ వాడు చదువుతున్నాడు గుడి, శిఖరం కట్టించారు. ఇంకాకొన్ని కట్టిస్తారు. రథం చేయిస్తారు అని అన్నది. అక్కయ్యకి తన కొడుకు సంగతి చెప్పుకోవటానికి అమ్మ లేదే అనుకున్నందుకు ఆ వ్యక్తి తన కొడుకుల సంగతి వారు చేసినవి దైవకార్యాల సంగతి కూడా చెప్పటం జరిగింది.

తరువాత చీర ఏదైనా ఇవ్వమని అడిగింది. "ఏమీ లేదని " ఆమెతో అని వారి ఇంటి వెనుక వారితో ఆమె సంగతి చెపితే వాళ్ళు "ఇటువంటి వారిని నమ్మవద్దని మోసగాళ్ళు వుంటారని, ఏమీ ఇవ్వవద్దని చెప్పారు" అయినా అక్కయ్య పైకి వెళ్ళి అమ్మకి నివేదించినవి ఆమెకి ఇస్తే ఒడిపడుతూ "ఆహా నా ప్రసాదం" అంటూ ఒడిలోకి ఎగురవేసుకుంటూ తీసుకున్నది. కండ్లకి అద్దుకోవటం మొదలైనవి ఏమీ చెయ్యలేదు. అప్పుడు ఇంటి వెనుక వాళ్ళు అన్న మాటలకి సమాధానంగా (వీరు ఏమి చెప్పకుండానే) అందరూ అటువంటి వారు వుంటారా? మంచివారు కూడా వుంటారు" అని భగవతితో అన్నది. అంటూనే " ఆ చీర తీసుకురా! నాకు పెట్టిందేగా ఆ చీర, ఆ కొండమ్మే నేను అనుకో. నాకియ్యి" అన్నది. ఎప్పుడైతే ఆమె ఈ మాట అన్నదో ఆశ్చర్యంతో తన స్థితే తనకు తెలియనట్లుగా గబ గబా పైకి వెళ్ళి ఆ చీర తీసుకుని వచ్చి ఆమెకు ఇచ్చింది అక్కయ్య. "ఇది కాశీలో కట్టుకుంటాను" అన్నది ఈ వచ్చిన వ్యక్తి, వెంటనే గేటు తీసుకుని వెళ్ళింది. వెంటనే బయటికి వెళ్ళి చూస్తే చుట్టు ప్రక్కలా ఎవరి ఇంట్లోకి వెళ్ళకుండా కొద్దిగా నడచి కనపడలేదు. కొండమ్మని తనలో కలుపుకుంది అమ్మ. 15-5-88న కొండమ్మ శరీరం చాలించి అమ్మలో ఐక్యమయింది. వీళ్ళు ఆ చీర తీసుకుని వెళ్ళినా కొండమ్మకి ఇవ్వగలిగే వాళ్ళు కాదు. తన కొడుకుల సంగతి చెప్పకోవటానికి అమ్మలేదనే అసంతృప్తిని తీర్చి సంతృప్తిని ఇచ్చింది. కొండమ్మని తనలో కలుపుకున్నానని దృష్టాంతంగా మరొక రూపంలో కమలక్కయ్యకి కనపడి చెప్పి అదృశ్యమయింది. మరునాడు కొండమ్మ పోయిందని సంగతి విన్నారు జిల్లెళ్ళమూడిలో. "నా ఒడి విడిచి ఎవ్వరూ లేరు. మీరందరూ నాలో పుట్టి నాలో పెరిగి తిరిగినాలో నే చేరుతారు" అన్నారు అమ్మ. ఈ విధంగా కొండమ్మని తరింపచేసి అక్కయ్యకి సంతృప్తిని, ఆనందాన్ని ప్రసాదించినది అమ్మ. అవ్యక్తంగా ఎప్పుడూ మనతో వుండే అమ్మ అప్పుడప్పుడు వ్యక్తమయి ఇటువంటి అనుభూతులు ఇస్తారు.

అకుంఠిత విశ్వాసంతో అపారమయిన అమ్మ చింతనతో జీవితం ధన్యమయిన వ్యక్తి కమలక్కయ్య. శుభకరి, కల్యాణ కారిణి అయిన అమ్మ కృపకి పాత్రమయింది వీరి కుటుంబం.

## అన్నం రాజు రామకృష్ణారావుగారు

అన్నంరాజు రామకృష్ణారావుగారు తెనాలిలో పుట్టి పెరిగారు. వారు బాగా ఆటలు ఆడతారు. రైల్వే కాంట్రాక్టరుగా పనిచేశారు. కారేపల్లిలో కొంతకాలం వున్నారు. జిల్ల్యెమూడిలో వారి చెల్లెలు సరోజిని అక్కయ్య వుండేవారు. ఆమె భర్త కొమరవోలు గోపాలరావు గారు బాపట్ల నివాసి. అగ్రికల్చరల్ డిపార్టుమెంట్‌లో పనిచేసే వారు. వాలెంటరీ రిటేర్‌మెంట్ తీసుకుని 68 నుండి అమ్మ చెంత వుండి సేవ చేసుకున్నారు. గోపాలరావుగారి తండ్రి ముక్తేశ్వరరావుగారు కూడా అమ్మని సేవించుకుని జిల్లెళ్ళమూడ్డిలో శరీరం చాలించారు. ఈ విధంగా వారి కుటంబం అంతా అమ్మని సేవించుకుని ధన్యులైనారు. గోపాలరావుగారు, సరోజిని అక్కయ్య తిరుపతిలో శరీరం చాలించి అమ్మలో లీనం అయినారు.

సరోజిని అక్కయ్య అన్నగారు రామకృష్ణారావుగారు. వీరి తల్లిగారు చనిపోయిన తరువాత జిల్లెళ్ళమూడికి దగ్గరగా వున్న నండూరులో సాయి బాబా గుడి విషయం చూడటానికి వచ్చారు రామ క్రిష్ణారావుగారు. జిల్లెళ్ళమూడిలోని వారి చెల్లెల్ని చూడటానికి అటునుండి వెళుతూవచ్చారు. ఆ సందర్భంలో అమ్మని దర్శించుకున్నారు. మరునాడు వారి తల్లిగారి మాసికం అగుట వలన వారిని అమ్మ చెంతే మాసికం పెట్టుకోమని చెప్పారు అమ్మ. అమ్మ చూస్తే నీరసంగా జబ్బులతో బాధపడుతూ కనపడింది ఆరోజు . పెద్దగా ఇష్టం లేకున్నా సరేనన్నారు. క్రిందకి వచ్చిన తరువాత హైమాలయం లోకి వెళ్ళి కూర్చుని "ఈమె చూస్తే నీరసంగా జబ్బులతో బాధపడుతున్నది.. ఇక్కడ వీళ్ళు చింతకాయపచ్చడి, చారు పెడతారు మాసికానికి, మా ఊర్లో అయితే దిట్టంగా తినగలిగే ముగ్గురు బ్రాహ్మణులకి గారె, బూరె, కూరలు, పప్పు, పచ్చడ్లు, నేతితో సమృద్ధిగా భోజనం పెట్టుకునేవాడిని. అదీకాక ఆ రామకృష్ణ గారు పాదాలు కూడా ముట్టుకోవద్దు అంటూ తాకను కూడా తాకనివ్వరు. పూజకి పూలు వుండవు ఏమి వుండవు ఇక్కడ" అనుకుంటూ కూర్చున్నారు.

మరునాడు అమ్మ దర్శనానికి వచ్చారు. ఆశ్చర్యం క్రిందటిరోజున మనస్సులో అనుకున్నవాటికి అన్నింటికి మాటలు లేకుండానే సమాధానము వచ్చినది. వారికి క్రితం రోజున అమ్మకి ఈ రోజున చూసిన అమ్మకి సంబంధం లేదు. దేదీప్యమానంగా సాక్షాత్ రాజరాజేశ్వరి అని అనిపించింది. నీరసంగా జబ్బుతో వుంటుంది అనుకున్నందుకు భిన్నంగా వుంది. కావలసినన్ని పూల మాలలు, పూలు వచ్చినవి. పూజకి పూలు వుండవు అనుకున్నందుకు భిన్నంగా. పళ్ళెం నిండుగా 20 రకాల పదార్ధాలతో ఇంట్లో కూడా చేసుకోలేనన్ని పదార్థాలు,

సమృద్ధిగా నెయ్యి పెద్ద పళ్ళెం నిండా అన్నంతో నివేదన వచ్చింది. అమ్మ ఈయన ను " రా నాన్నా!" అని దగ్గరికి పిలిచి ఆయన ఒడిలో తన పాదాలు పెట్టింది. పాదాలు ముట్టుకోకు అంటారు అనుకున్నందుకు ఇది విరుద్ధం. ఆయనకి సంతృప్తినిస్తూ ఆయనకి పాదాలు ఇచ్చారు అమ్మ. పాదాలకి చేతులకి మెడకి గంధం రాయించుకుంది. అన్ని పదార్థాలు పళ్ళెంలో కలిపి ముగ్గురు దిట్టంగా తినే వారి కంటే మించిన అన్నం తిన్నది. అమ్మ సమృద్ధిగా ముగ్గురికి పెట్టుకునే వాడ్ని అనుకున్నందుకు సంతృప్తిగా అమ్మ తిన్నది. తరువాత అందరికి సమృద్ధిగా ప్రసాదం పెట్టారు అమ్మ ఈ విధంగా ఏమాట లేకుండా ఎవరితోను తనుగా ఏమీ చెప్పకుండానే సంఘటనల ద్వారా ఆశ్చర్యంగా సమాధానాలు వచ్చినవి వారి అంతరంగానికి. తరువాత వారు కారేపల్లి వెళ్ళారు.

కారేపల్లిలో వారు కట్టించిన వైష్ణవాలయం ముందు కూర్చుని " సర్వధర్మాలు పరిత్యజించి నన్నే శరణు వేడితే నీ యోగక్షేమాలు నేనే చూస్తానని" అన్నావు. అన్నీ వదిలేసి కూర్చుంటా నా భాధ్యతలన్నీ నీ మీద వదిలేసి నాకు పెడతావా? ఊరికే ఇట్లా పూజ చేసి అట్లా పళ్ళెం పట్టిన పూజారికి కావలసినంత కానుకలు, డబ్బు ఇస్తున్నావు. ఇంతగా నీ గుడి కట్టించిన నాకు ఏమి ఇస్తావు? ఏమి చెయ్యావేమిటి? అని ఆ గర్భగుడి ముందే దేవుని చూస్తూ అనుకున్నారు. ఆయనకి సమాధానం రాలేదు. తరువాత ఇంటికి వచ్చారు. వారి ఇంట్లో కూర్చునప్పుడు ఆశ్చర్యం ఆనందం కలిగేటట్లు అమ్మ వారి ఇంట్లోనే దర్శనమిచ్చారు. ఆయన వెంటనే లేచి "అమ్మ వచ్చింది. కుర్చీ వేయండి" అంటూ కుర్చీ వేసి అమ్మని కూర్చోపెట్టి పాదాలు కడిగి నీళ్ళు శిరస్సుపై చల్లుకున్నారు. తరువాత అమ్మ కనపడలేదు. ఇంతా జరుగుతున్నా ఇంట్లో వారికి ఏమీ కనపడలేదు. వారికి అమ్మ కనపడింది. అందరికి ఆనందం ఆశ్చర్యం వేసింది. క్రొద్ది రోజులలో జిల్లెళ్ళమూడి నుండి వారి చెల్లెలు భర్త అయిన గోపాలరావు గారి నుండి వారికి టెలిగ్రాం వచ్చింది. "అమ్మ మిమ్ములను అర్జంటుగా ఒకసారి రమ్మన్నది" అని.

రామక్రిష్ణారావుగారు అమ్మ దర్శనం చేసుకోక ముందు ఒకసారి శ్రీశైలం వెళ్ళి క్రొద్దిరోజులు వున్నారు. అక్కడ సత్రంలో రూము తీసుకున్నారు. ఒకరోజు మొదటి అంతస్తు నుండి క్రిందికి చూసినప్పుడు క్రింద ఇద్దరు వ్యక్తులు అందులో ఒకరు కాషాయం కట్టుకున్న జటలు వున్న స్వామీజీ, ఆయనతో ఇంకొకరు వున్నారు. వారిలో కాషాయం కట్టుకుని వున్న ఆయన జటలు శిరస్సు మీద ముడి వేసుకుని చూస్తేనే ఈయన ఎవరో మహానుభావుడు

అనిపించేటంత వర్చస్సుతో, తేజస్సుతో ఆకర్షణీయంగా వున్నారు. రెండవ ఆయన తెల్లని వస్త్రాలు కట్టుకుని ముండనం చేయించుకుని వున్నారు. వారిని చూసి రామక్రిష్ణారావు గారికి ఎనలేని పూజ్య భావం, గౌరవం కలిగి వెంటనే క్రిందకి వెళ్ళి నమస్కరించి "మీకేమి అభ్యంతరం లేకపోతే నా రూమ్‌లో వుండ వచ్చు. మీరు ఇబ్బంది పడనక్కర లేదు" అన్నారు. "మాకేమి అభ్యంతరం లేదు" అని ఇద్దరూ వారి రూమ్‌కి వచ్చారు. వారిలో కాషాయం కట్టుకుని జటలు కలిగిన వారు "పూర్ణానంద స్వామీజి".

వారు ధ్యాన నిష్టులై కూర్చుంటే ఆ వర్చస్సు చూస్తుంటే సాక్షాత్ శివునిలాగ అనిపించేదట రామక్రిష్ణారావు గారికి. "ఈ రోజు టిఫిన్ వుంది" అంటే "సరే" లేకపోతే "లేదు" అంటే "సరే' ఈ విధంగా ఒకటి కావాలని కాని వద్దనికాని అనెడి విశిష్టతత్త్వం వారిలో కనపడింది. ఆ సత్రం మేనేజరు ఈయనతో "ఎందుకు ఇటువంటి స్వాములని చేర్చుకుంటావు వీరిని నమ్మవద్దు. నీ రూమ్‌లో చేరి నీ సూట్ కేస్ ఎత్తుకు వెళ్తారు" అన్నాడు. "నాకు అట్లా అనిపించటం లేదు. ఆయన మహానుభావుడనిపిస్తున్నది" అన్నారు వీరు. తరువాత 2,3 రోజులకి స్వామీజీ రామక్రిష్ణారావుగారిని " మీకు మంత్రం ఉపదేశం చేస్తాను" అన్నారు. దానికి వారు "అసలు మంత్రమంటే ఏమిటి ఇది చేసినందుకు ప్రయోజనం ఏముంటుంది. నాకు నమ్మకం లేదు" అన్నారు. అప్పుడు స్వామిజీ "ఏదైనా మననంతో మంత్రమవుతుంది. బాహ్యమైన వాటితో పని లేకుండా నీలో నీకే ఎనలేని శాంతి, స్థిరత్వం ఆనందం కలుగుతుంది. ప్రయోజనం అంటే, ఈ మంత్రం అక్షర లక్షలు పూర్తి చేసేటప్పటికి నువ్వు భగవంతుడిని చూస్తావు మాట్లాడతావు, ఆడతావు, అన్నంతింటావు కలిసి " అని చెప్పారు. అప్పటికి ఆయన "మీరు 'నాకు మంత్రం ఉపదేశిస్తే దానికి చాలా నిష్టలు కావాలని అంటారు. నేనా సిగరెట్లు తాగుతాను ఇంకా అనేక అలవాట్లు వున్నయి. ఎట్లా చెయ్యటం' అన్నారు. స్వామిజీ :- "నీ గురువుగా నీ పాపం, మంచి, చెడు సర్వం నేను భరిస్తాను. నువ్వు నిశ్చింతగా మంత్రజపం చెయ్యి" అని ఉపదేశం చేశారు.

స్వామీజీ చెప్పిన వాటిలో తాను దేవుడిని చూడటం మాట్లాడటం, ఆడటం అనేది మరీ ఆశ్చర్యం వేసింది. ఎందుకంటే నేను సరైన వాడిని కాను నాకు దేవుడు కనపడటం ఏమిటి అనుకున్నారు. తరువాత ఆయన స్వామీజి దగ్గర శెలవుతీసుకుని వారిని వుండదలచినన్నాళ్ళు రూమ్‌లో వుండనివ్వమని మేనేజరుకి చెప్పి వారి దగ్గర నుండి వారి వివరాలు ఏమి అడగకుండానే తాను కారేపల్లి వెళ్ళారు. అక్కడికి వెళ్ళిన తరువాత మంత్రం

జపం చెయ్యటం మొదలు పెట్టారు. మొదలు పెట్టిన తరువాత ఎంతసేపయినా చెయ్యాలని అనిపించేదిట.

ఆ తరువాత వారు జిల్లెళ్ళమూడి రావటం అమ్మని చూడటం మళ్ళీ అమ్మ వారికి కారేపల్లిలో దర్శనం ఇవ్వటం జరిగింది. ఆయన జపం అక్షర లక్షలు అయ్యేటప్పటికి అమ్మ వద్ద నుండి వెంటనే రమ్మని టెలిగ్రాం వచ్చింది. జిల్లెళ్ళమూడి వచ్చి అమ్మ దర్శనానికి వచ్చేటప్పటికి అమ్మ ఆరు బయట వెన్నెలలో కూర్చుని వున్నది. తరువాత వసుంధరక్కయ్య చేత అన్నం తెప్పించి తనే కలిపి ముద్దలు పెట్టింది. భోజనం అయిన తరువాత "నువ్వు ఇక్కడకి రాకూడదు నాన్నా హాయిగా ఇక్కడే వుండచ్చు అంటే "ఎట్లాగమ్మా ఆడపిల్ల పెళ్ళి పిల్లల చదువులు చాలా బాధ్యతలు వున్నయ్యి" అన్నారు రామక్రిష్ణారావుగారు. "నీకెందుకు నాన్నా అవన్నీ నేను చూసుకుంటాను. ఇక్కడ వుండు" అన్నది అమ్మ, వారు సమాధానం చెప్ప లేదు. తరువాత వరండాలో వారితో కలిసి క్యారం బోర్డు ఆడింది. చెయ్యి పట్టుకుని నడిచింది. పడుకుని వారి ఒడిలో కాళ్ళు పెట్టింది. అప్పుడు వారికి గుర్తు వచ్చింది. శ్రీశైలంలో స్వామీజీ చెప్పిన సంగతి "నీవు దేవుడిని చూస్తావు, మాట్లాడతావు ఆడతావు, అన్నం తింటావు' అన్నీ అమ్మ దగ్గర అనుభవంలోకి వచ్చినయి. అదీకాక తాను కారేపల్లిలో గుడిలో అనుకున్న మాట "నా భాద్యతలు అన్నీ నువ్వు చూస్తావా" అన్నదానికి కూడా అమ్మ సమాధానం చెప్పింది. అని వారికి అర్థమయి అమ్మే దేవుడు అని అనుకుంటూ వుండగా అమ్మ స్వయంగా తానే "ఆయనే కదా

కాషాయ వస్త్రాలు కట్టుకుని జటా ఝూటాలు ధరించి వుంటారు. ఆయనేనా నీకు ఉపదేశం చేస్తింది?" అని అడిగింది. తానుగా ఏమి చెప్పకుండానే అమ్మ అడగటం ఆశ్చర్యం వేసింది. వారికి. అప్పుడు మళ్ళీ అమ్మ "నేనే త్రిభువనేశ్వరిని, ప్రతి అణువుని నేనే అయి వున్నాను. నీ సర్వ భాద్యతలు నాకు వదిలెయి నిశ్చింతగా వుండు. నీయోగక్షేమాలు నేను చూసుకుంటాను. హైమాలయంలో జపం చేసుకో లేకపోతే నీవు కాంట్రాక్టర్‌వి కనుక 7వ మైలు నుండి రోడ్డు వెయ్యి. అదీ నా ఆరాధనే" అన్నారు. వారికి ఈ విధంగా స్వామీజీ చెప్పినమాట నిజమయి తన అదృష్టం పండిందని ఆనందించారు. సాక్షాత్ జగదీశ్వరి దర్శనం అయిందని పులకించారు. "అన్ని రూపాలు నావే, అన్ని నామాలు నావే, నేను సర్వత్రా నిండి వున్నాను" అని అమ్మ వాక్యం. ఎక్కడో కారేపల్లిలో విష్ణాలయంలో తాను అనుకున్న దానికి ఇక్కడ తానుగా అనకుండానే అభయం ప్రసాదించింది అమ్మ. తనకు ఇష్టమైన పని చేసుకోవటానికి కర్తవ్యం

కూడా చూపింది అమ్మ. ఈ విధంగా దివ్యత్వం, మాతృత్వం , పితృబాధ్యత, గురుత్వం, మార్గదర్శకత్వం సర్వం అయి దరిచేర్చటం జరిగింది. తరువాత వారు అమ్మ వద్ద వుండి పోయారు.

అమ్మ పుట్టిన రోజు వచ్చింది. జిల్లెళ్ళమూడి వచ్చి వెళ్తూ బాపట్ల నుండి గుంటూరు వెళ్ళే ముందు అమ్మ పుట్టిన రోజు సందర్భంగా అమ్మని గురించి, అమ్మ వాక్యాలు కలిపి ప్రింట్ చేయించిన పేపర్స్ తీసుకుని గుంటూరు వెళ్ళారు. అక్కడి నుండి శ్రీశైలం వెళ్ళారు. అక్కడ పూర్వం తాను వున్న సత్రానికి వెళ్తే పూర్వం స్వామీజీని విమర్శించిన మేనేజరు ఈయన అడగకుండానే "మీ రూమ్‌లో వున్న స్వామీజీ చాలా గొప్పవారు, మహానీయుడు. ఆయన ఇక్కడికి దగ్గరలో వున్న హటకేశ్వరంలో పంచాగ్నుల మధ్య తపస్సు చేస్తున్నారు. నేను ఆయన శిష్యుడిని అయ్యాను. మీరు కూడా వెళ్ళి ఆయన్ని దర్శించుకోండి" అన్నారు. ఆయన గురించిన వివరాలు ఏమి తెలియవు. ఆయన్ని మళ్ళీ కలవగలనో లేదో అనుకుంటున్న రామక్రిష్ణారావుగారికి ఈ వార్త వినటం, పైగా ఇదివరకు విమర్శించిన వ్యక్తే ఇప్పుడు శిష్యుడై తనకి చెప్పటంతో ఎంతో ఆనందం కలిగి వెంటనే స్వామీజీని దర్శించటానికి వెళ్ళారు.

అక్కడ స్వామీజీని దర్శించి ఆయనతో మాట్లాడుతూ అమ్మని గురించి చెప్పి తను తీసుకువెళ్ళిన పేపర్ చూపించారు. ఆ పేపర్‌లో "సర్వకాల సర్వావస్థలయందు సమానస్థితే సమాధి స్థితి" అని వున్న అమ్మ సూక్తి చదివి పరవశులై "సర్టెన్లీ షి యీజ్ నన్ అదర్ దాన్ భువనేశ్వరి, వుయీ మస్ట్ సీ హర్ " అన్నారు. స్వామీజీ" ఈమె భువనేశ్వరి తప్పకుండా ఈమెను మనం చూడాలి" అన్నారు. తరువాత రామక్రిష్ణారావుగారితో కలిసి జిల్లెళ్ళమూడి వచ్చారు. మూడవ అంతస్తులో అమ్మని దర్శించారు. చాలా సేపు అమ్మ స్వామీజీ ఏమి మాట్లాడుకోలేదు. రామక్రిష్ణారావుగారు స్వామీజీతో "మీరు అమ్మతో మాట్లాడవచ్చు. ఏమి అభ్యంతరంలేదు" అన్నారు. స్వామీజీ "అవసరం లేదు. మేము భావాలు మార్చుకుంటాం' అన్నారు. రెండు గంటలకు పైగా ఆ విధంగా మౌనంగా కూర్చుని క్రిందకి దిగి వచ్చారు. క్రిందకి వచ్చిన స్వామీజీని రామక్రిష్ణారావుగారు "అమ్మని గురించి ఏమని పించింది" అని అడిగారు.

స్వామీజీ :- "సంపూర్ణత్వం అంటే అమ్మ దగ్గరే వున్నది. అమ్మ అంటే సంపూర్ణత్వం" అన్నారు.

"అమ్మ అంటే సంపూర్ణత్వం, అమ్మ అంటే అవతారం కాదు" అని అమ్మ ఏనాడో చాటి

చెప్పినది. అట్టి అనుభూతిని స్వామీజీ పొందారు. అమ్మ సమక్షంలో. తరువాత స్వామీజీ కొద్ది రోజులు జిల్లెళ్ళమూడిలో వున్నారు. ఒకరోజు అమ్మ స్నానాలగదిలో స్వామీజీ, రామక్రిష్ణారావుగారు ఇరువురూ అమ్మవద్ద కూర్చున్నారు. అమ్మ స్వామీజీకి నోటిలో అన్నం పెట్టడం జరిగింది.

వారికి అమ్మ ఎట్టి మహత్తర అనుభూతి ఇచ్చిందో. " ది మదర్ లెస్ శివ ఎట్ లాస్ట్ ఫౌండ్ హిజ్ మదర్" (.......) అని అమ్మ పాదాలపై వాలారు. ఆయన తన గురించి "శివోహం" అనేవారు. అటువంటిది స్వామీజీ " ఆ శివుడే చివరికి తన తల్లిని కనుగొన్నాడు (దర్శించాడు)" అన్నారు. తనకి మార్గదర్శనం చేసిన గురువు, మంత్రోపదేశం చేసిన స్వామీజీనే ఈ విధంగా అనటంతో రామక్రిష్ణారావుగారికి ఎనలేని సంతోషాన్ని, ఆనందాన్ని కలిగించింది, సంతృప్తి కలిగింది.

తరువాత రామక్రిష్ణ రావుగారు జిల్లెళ్ళమూడిలో కొంతకాలం వుండి, అక్కడ నుండి బాపట్లలో లారీలు కొని త్రిప్పుతూ వుండేవారు. ఆయన బాపట్లలో ఒకరూమ్ తీసుకుని అప్పుడప్పుడు అక్కడ వుండేవారు. ఒకసారి పనివత్తిడిలో బాగా అలసిపోయి హోటల్‌కి వెళ్ళి భోజనం చేసే ఓపిక కూడా లేక అమ్మ "ఎక్కడ వున్నా నాధ్యాస నీ మీదే " అన్న మాట, తలచుకొని చూద్దాం ఎట్లా అన్నం పెడుతుందో అని తలుపు వేసుకుని పడుకున్నారు. వారి లారీ ఒకటి పెదనందిపాడు వైపు లోడ్‌తో వెళ్ళింది. ఆ డ్రైవర్ వెనక్కి బాపట్ల వస్తూ "చూద్దాం అయ్యగారు ఇక్కడ వుంటారేమో" అని జిల్లెళ్ళమూడి వెళ్ళాడు. అమ్మ అతను రాగానే పైకి పిలిపించి వేడి, వేడి చపాతీలు, కూరా చేయించి ఇచ్చి, "నేను పంపానని చెప్పకుండా రామకృష్ణారావుగారికి ఇవ్వమని " చెప్పి పంపింది. అతను బాపట్ల చేరి రూమ్‌కి వెళ్ళి ఆయనని లేపి "ఏమిటి అయ్యగారు అన్నం తిన్నారా లేదా? నేను వెళుతూ చెప్పి పోదామని వచ్చాను" అని "నా దగ్గర చపాతీలు కూరా వున్నయ్యి మీరు తినండి నేను హోటల్‌లో తింటాను" అని బలవంతంగా ఆయనకి పెట్టాడు.

ఆయన తినటం అయిన తరువాత తను జిల్లెళ్ళమూడి వెళ్ళిన సంగతి, అమ్మ చపాతీలు పంపి, తను పంపానని చెప్పవద్దన్న సంగతి చెప్పాడు. అది విన్న రామకృష్ణారావు గారికి ఆనందం ఆశ్చర్యం కలిగినయి. తను ఎట్లా పెడుతుందో చూద్దాం అని గదిలో తలుపులేసుకుని పడుకుంటే ఎక్కడో డ్రైవర్‌కి ప్రేరణ కలిగించి అతని ద్వారా తనకి భోజనం పంపటం తలుచుకుని అమ్మ సర్వసమర్థతకు, పిల్లలమీది తన వాత్సల్యానికి

పులకించిపోయారు.

వారికి ముగ్గురు మగపిల్లలు, ఒక ఆడపిల్ల. అందరికి వివాహాలు అయినవి. అందరూ సంపాదించుకుంటూ హాయిగా వున్నారు. 1985 జూన్ 12న అమ్మ అవ్యక్తం అయింది. జూన్ 14న ఆలయ ప్రవేశం చేసింది. పెద్దగుడిలో భూగృహంలో అమ్మ దివ్యదేహాన్ని ప్రతిష్టించి పైన విగ్రహాన్ని 1987 మే 5 న అమ్మ విగ్రహం ప్రతిష్ట చేశారు. అంతవరకు రామక్రిష్ణారావుగారు బాపట్లలో వుండేవారు. తరువాత కొడుకుల వద్ద వుంటూ అప్పుడప్పుడు సున్నిపెంటలో స్వామీజీ ఆశ్రమంలో గడుపుతూ జిల్లెళ్ళమూడి వస్తూ పోతూ వున్నారు. అమ్మ అభయం ఇచ్చినట్లు వారి జీవిత నౌకని తన అదృశ్య హస్తంతో నడుపుతూ వున్నది. "జీవితమూ, జీవనమూ భగవంతుడు ఇచ్చినవే" అన్న అమ్మ మాట ప్రకారము తన జీవితాన్ని, జీవనాన్ని భగవంతుడైన అమ్మకి అర్పించిన ధన్యజీవి రామక్రిష్ణారావుగారు.

## రాచర్ల శ్రీరామ మూర్తి - లలిత.

రాచర్ల శ్రీరామ మూర్తి భార్య లలిత పెళ్ళయిన క్రొత్తలో జిల్లెళ్ళమూడి లో ఉండటం జరిగింది. 1966-67 సంవత్సరంలో అక్కడ వుండి అమ్మ సేవ చేసుకుని ఎన్నో అనుభవాలు ఈ నాటికి పొందుతున్న ధన్యజీవులైన దంపతులు శ్రీరామమూర్తి - లలిత.

శ్రీరామ మూర్తి 1959 ముక్కోటినాడు ఆయన మేనత్త లలితాంబగారు, వదినగారైన రాచర్ల కమలగార్లతో మొదటిసారిగా అమ్మని దర్శించారు. అమ్మతో లలితాంబగారు శ్రీరామమూర్తి ని చూపిస్తూ "వీడికి సరిగ్గా చదువు అబ్బలేదు. వీడిని గురించే దిగులు అమ్మా" అన్నారు. అప్పుడు అమ్మ "ఇంతలావు అమ్మని నేనుండగా నీకు దిగులెందుకు" అని శ్రీరామమూర్తిని దగ్గరికి తీసుకున్నారు. తరువాత ఒకసారి అమ్మకి పాలాభిషేకం జరుగుతున్నది, ఆ సందర్భంలో శ్రీరామమూర్తి మనసులో "అభిషేకం శివునికి కదా చేసేది. ఈ మనిషికి చేస్తున్నారేమిటి?" అని అనుకున్నారు. మరుక్షణంలో అమ్మ శివలింగాకారంగా అతనికి దర్శనం ఇచ్చింది. అంతే ఆ క్షణం నుండి అమ్మయే సర్వదేవదేవీ స్వరూపంగా అతనికి స్ఫురించి అమ్మ మీద పరిపూర్ణ విశ్వాసం దైవమని నమ్మకం ఏర్పడింది. 1962లో అమ్మ చీరాల వెళ్ళి అక్కడ ఓడరేవులో కొంతకాలం వున్నారు. అప్పటి నుండి శ్రీరామమూర్తి అమ్మ సేవ చేసుకుంటూ జిల్లెళ్ళమూడిలో వున్నారు. అతనికి వివాహం అయిన తరువాత భార్యా భర్తలు ఇరువురూ అమ్మ చెంత కొంత కాలం వుండి సేవ చేసుకున్నారు.

అమ్మ కూతురు హైమకి లలితకి ఆరోజులలో స్నేహ బంధం బాగా ఏర్పడింది. హైమ

ఎక్కడికి వెళ్ళినా తోడుగా వుండటం ఎక్కువగా మాట్లాడటం ఈ విధంగా అనుబంధం ఏర్పడింది. తరువాత 1968లో హైమకి ఒంట్లో బావుండక జిల్లెళ్ళమూడిలో అమ్మ చెంత వున్నప్పుడు లలిత వారి పుట్టింటికి వెళ్ళటం జరిగింది. ఆ సమయంలో అమ్మ లలితకి రమ్మని జాబు వ్రాయించారు. లలిత జిల్లెళ్ళమూడి రావటం జరిగింది. అప్పుడు అమ్మ "నీకు హైమంటే ఇష్టంకదా! చూడు " అని లలిత తో అన్నారు. తరువాత కొద్దిరోజులలో హైమ సిద్ధి పొంది అమ్మలో ఐక్యమయింది. 1968 ఏప్రియల్ 5 న సిద్ధి పొందితే 6వతేది సాయంత్రం భూగృహంలో హైమ భౌతికదేహాన్ని ప్రతిష్ఠించారు అమ్మ. "ఇది తపోభూమి అవుతుందని తపోభూమికి శంఖువుగా హైమని ప్రతిష్ఠించానని, హైమ అమరం" అని చాటి చెప్పారు అమ్మ. అప్పుడు భద్రాద్రి తాతయ్య అక్కడ పూజ, అభిషేకం చేసేవారు. తిరుమల అక్కయ్య కూడా అర్చించుకునే వారు. ఆ సందర్భంలో లలిత కూడా ప్రక్కనే వుండి పూజ చేసుకునేది. అప్పుడు అమ్మ లలితతో "40 రోజులు ప్రదక్షిణాలు చేసుకో" అని చెప్పారు. హైమాలయం కట్టక ముందు ప్రారంభంలో హైమ సమాధి చుట్టూబద్దలతో కట్టి పైన ఒక పాక వేశారు. ఆ రోజులలో ఒకసారి హైమ సమాధిపై బాలాత్రిపురసుందరి రూపంతో హైమ కనపడింది లలితకి. తరువాత ఆలయం కట్టడం పూర్తి అయిన తరువాత అమ్మ ఆదేశానుసారం ప్రదక్షిణాలు మొదలుపెట్టింది. ప్రదక్షిణాలు చేసేటప్పుడు చేతిలో ఖర్జూరపు కాయలు పెట్టుకొని చెయ్యమని అమ్మ సలహా ఇచ్చారు. పసుపు కొమ్ములు మిరియాలు పెట్టుకుంటే వేడి చేస్తుందని అమ్మ ఆ విధంగా సలహా ఇచ్చారుట. ప్రదక్షిణాలు చివరి రోజున ప్రదక్షిణాలు చేస్తుండగా 5 ఖర్జూరపు కాయలు కనపడలేదు. ఇదేమిటి 5 ఖర్జూరాలు ఏమైనయి అని అనుకుంటూ వుండగా వెనకాల నుండి 5 అరటి పండ్లున్న హస్తాన్ని హైమక్క లలితచేతిలో పడేసింది. అందులో ఒక పండు క్రింద పడింది. హైమ వెంటనే అదృశ్యమయింది. వెంటనే హైమ ప్రసాదమైన అరటిపండ్లు నాలుగింటిని లలిత తినేసింది.

ఈ సంఘటన జరగటానికి ముందు మరొకటి జరిగింది. లలిత అనేకమంది డాక్టర్లకి చూపించుకుంటే పిల్లలు పుట్టరని చెప్పారట. నర్సరావుపేటలో డాక్టర్ కమల కూడా అదే విధంగా చెప్పటం జరిగింది. డాక్టర్ కమల అమ్మని సేవించుకునే అపారభక్తురాలు. ఒకరోజున లలిత అమ్మ చెంత వున్నప్పుడు అమ్మ డాక్టర్ కమలని "ఏమిటి దీనికి పిల్లలు పుట్టరని చెప్పావుట" అని అడిగింది. అప్పుడు కమల "అవునమ్మా! ఏకోశాన పుట్టే అవకాశం లేదని" అన్నది. దానికి అమ్మ "ఆ -దానికేం తెలుసు దాని బొంద అదేమన్నా కడుపులోకి

వెళ్ళి చూసిందా ఏమిటి? ఎట్లా పుట్టరో చూద్దాం" అన్నారు. తరువాత ఇంతకు ముందు తెలియచేసిన సంఘటన జరిగింది. (హైమాలయంలో ప్రదక్షిణాలు చెయ్యటం హైమ ప్రసాదం ఇవ్వటం మొ॥)

తరువాత లలిత గర్భవతి అయింది. డాక్టర్లు మగపిల్లాడు పుడుతాడని చెప్పారు. లలిత " కాదు , ఆడపిల్లే" పుడుతుంది, హైమే పుడుతుంది" అన్నది. అదే విధంగా మొదటి బిడ్డ ఆడపిల్లే కావటం ఆ పిల్లకి హైమ అని అమ్మ నామకరణం చెయ్యటం జరిగింది. తరువాత ముగ్గురు మగపిల్లలు పుట్టారు. ఈ విధంగా నలుగురు సంతానం కలిగింది శ్రీరామమూర్తి దంపతులకి. మధ్యలో ఒక బిడ్డ పోవటం జరిగింది. హైమ 5 పండ్లు ఇవ్వటం అందులో ఒక పండు క్రిందపడి పోవటం అదే విధంగా 5 గురు పుట్టడం అందులో ఒకరు పోవటం జరిగింది. డాక్టర్ల ప్రకటనకి పూర్తి విరుద్ధంగా అమ్మ కరుణ వల్ల ఈ విధంగా వారికి సంతానం కలిగింది.

అమ్మ మహా సిద్ధి పొందినది 1985 జూన్ 12. 96-97 మధ్య శ్రీరామమూర్తి ఇంట్లో ఒక కుటుంబం అద్దెకి వుండటం జరిగింది. వాళ్ళు వీరి ఇంట్లో వున్న రోజులలో భార్యకి ఒకరోజు అర్ధరాత్రి ఆవిడ తలుపు తీసుకుని బయటికి రాగానే లలిత రూపంలో ఒక ఆడమనిషి ఇంట్లో అద్దెకి వున్నామెకి కనపడింది. లలితని ఆవిడ పిన్నీ అని పిలుస్తూ వుండేది. అందువలన "ఏమిటి పిన్ని , అర్ధరాత్రి ఈ సందులో నుండి వస్తున్నావు" అని అడిగింది. అప్పుడు లలిత రూపంతో వున్నామె "సరేలే లేలే" అంటూ నెట్టుకుంటూ అద్దెకి వున్న వారి భాగంలోకి వెళ్ళింది. "ఇదేమిటి పిన్నిగారు ఈ అర్ధరాత్రి ఈ సందులో నుండి రావటం ఏమిటి? పైగా మా ఇంట్లోకి వెళ్ళటం ఏమిటి?" అని ఆశ్చర్యంతో ఖంగారు పడుతూ ఇంట్లోకి వెళ్తే ఎవరూ లేరు. మరునాడు లలితని అడిగితే "నేను బయటికి రావటం ఏమిటమ్మా, తలుపులు వేసుకుని నిద్రపోతుంటే ఆ సమయంలో , అయినా సందులో నుండి ఎందుకు వస్తాను, మీ ఇంట్లోకి ఎందుకు వెళ్తాను" అన్నది లలిత. మళ్ళీ మరునాడు పెద్దబొట్టు పెట్టుకుని తెల్లని చీరతో ఒక ముత్తైదువ అర్ధరాత్రి అదే విధంగా కనపడింది. దానితో ఆ అమ్మాయికి ఇంట్లో ఏమన్నా పిశాచాలు వున్నవేమోనని భయం పుట్టి ఆ అమ్మాయి మామగారైన నరశింహరావుగారితో చెపితే ఆయన "వారింట్లో పూజలు చేస్తూ వుంటారా? ఏమైనా అమ్మవారి ఫొటోలు వున్నయ్యా "అని అన్నారు. అప్పుడు ఆ అమ్మాయి "జిల్లెళ్ళమూడి అమ్మ ఫొటోలు వున్నవి పూజలు జరుగుతాయి." అని చెప్పటం జరిగింది. వెంటనే ఆయన

"ఇంకేం అమ్మా! అమ్మే నీకు ఆ విధంగా కనపడి వుంటుంది. ఖంగారు లేదు. దయ్యాలు లేవు. గియ్యాలు లేవు. అమ్మకనపడింది. అదృష్టం" అన్నారుట . ఈ విధంగా కనపడిన వ్యక్తి ఏనాడు జిల్లెళ్ళమూడి రాలేదు. చూడలేదు. ఎవరికి ఏ విధంగా అనుభవం ఇవ్వాలో ఆయాచితంగా తన ఇష్టానుసారం అమ్మ యిస్తూ వుంటుంది. తరువాత ఒకరోజు లలిత నర్సరావు పేట నుండి ఒంగోలు ప్రయాణం అయింది. ఒంగోలులో వారి కూతురు హైమ వుంది. హైమ కొడుక్కి ఒంట్లో బాగోలేదు. అంటె చూద్దామని బయలు దేరింది. అదే సమయంలో పెద్దబొట్టు పెట్టుకుని ఒక ముత్తైదువ వచ్చి వరండా గదిలో నిలబడి "పసుపు కుంకుమ ఇస్తావా" అన్నది. లలిత కుంకుమ యిచ్చింది. ఆమె "నీకు 4గురు సంతానం. నీ రెండవ కొడుక్కి సరిగా చదువు అబ్బలేదు. వాడిని గురించి నీకు ఆలోచన. నీ పెద్దకొడుకు ఫలానా, నీ చిన్న కొడుకు ఫలానా చదువు తున్నారు" అని వారి కుంటుంబానికి సంబంధించిన విషయాలు అన్నీ చెప్పి రూ 21 చందాగా ఇవ్వవలసిందని అడిగింది. లలితకి కొంచెం ఆశ్చర్యం వేసింది. ఈ అడిగిన వ్యక్తికి యిస్తే తనకి ప్రయాణంలో ఇబ్బంది అవుతుందేమొ అని ఇప్పుడు లేదు ఇవ్వనని అన్నది. లలిత మూడవ కొడుకు అక్కడే వుంటే అతనిని కూడా అడిగింది. అతనూ ఇవ్వలేదు. "గుంటూరులో సాయిబాబా గుడి కడుతున్నాం' అన్నదట. ఇన్ని చెప్పినా లలిత కానీ వాళ్ళ అబ్బాయి కానీ పైసా కూడా ఇవ్వలేదట. " ఈసారి, రా అప్పుడు యిస్తాం," అన్నదిట లలిత. అప్పుడు ఆమె "ఈసారి ఇట్లా వస్తానా ఏమిటి అప్పుడు వచ్చేతీరులో వస్తాను, చీర, పసుపు కుంకుమ తీసుకుంటాను" అన్నదట. అని వెళ్ళిపోయింది.

తరువాత తాను ఒంగోలు వెళ్ళటం వారి మనవడు కులాసాగా వుండటం, తిరిగి వాళ్ళ కూతుర్ని , మనవడిని మనవరాలిని నర్సరావుపేట తీసుకుని రావటం జరిగింది. వీరందరూ అక్కడ శివాలయంలో అభిషేకం చేసుకున్నారు. లలిత అమ్మ వారి పూజ చేసి ముత్తైదువులకి పసుపు కుంకుమ చీరలు పెట్టుకుంది. ఆ సందర్భంలో వచ్చిన బంధువులందరూ వెళ్ళిపోయారు, అప్పుడు పళ్ళెంలో ఉన్న బియ్యంలో అమ్మ పాదం గుర్తు చూశారు. లలిత, శ్రీరామమూర్తి వాళ్ళ చిన్నకొడుకు వారం రోజుల క్రితం వచ్చిన వ్యక్తి చెప్పిన మాట గుర్తుకు వచ్చింది. శ్రీరామ మూర్తి దంపతులకి చీర, పసుపు కుంకం తీసుకుంటాను అన్నందుకు గుడిలో చీరె , పసుపు కుంకం పెట్టుకోవటం "ఈసారి ఇట్లా వస్తానా? నువ్వు ఇవ్వటానికి అన్నందుకు పళ్ళెంలో అమ్మ పాదాల గుర్తులు పడటం మొదలగు అనుభవాలని బట్టి

ఇవ్వన్నీ అమ్మ ఇచ్చిన అనుభవాలే అని వారు పులకించారు " ఈ రోజున ఎంత సంపాదన వస్తే అంత తెచ్చి వారి ఇంట్లో అమ్మ పూజామందిరంలో వున్న హుండీలో వేస్తాను" అన్నాడు. శ్రీరామమూర్తి. ఆరోజు 20 రూపాయలు వస్తే ఆ 20రూ॥ హుండీలో వేశాడు. మరొక రూపాయి వాళ్ళ అబ్బాయి వేశాడు. ఈ విధంగా ఇంతకు ముందు వచ్చిన ముత్తయిదువ అడిగిన 21-00రూ॥ అమ్మ హుండీలో వేశారు.

అమ్మ నామమయిన "జయహో మాతా" నామంలో 21 అక్షరాలు వున్నయి. ఆ వచ్చి ఆడిగిన వ్యక్తి 21 రూపాయలు అడగటం చివరికి హుండీలో 21-00 రూ వెయ్యటం జరిగింది. ఈ విధంగా అమ్మ ద్వారా పొందిన అనుభవానికి ఆనందపడ్డారు. శ్రీరామ మూర్తి దంపతులు.

లలిత తమ్మునికి అమ్మ అంటే ప్రత్యేకించి భక్తి కాని వ్యతిరేకత కానీ ఏమి లేవు. అతను ఈ మధ్య కాలంలో ఒకసారి వీరింటికి వచ్చినప్పుడు రాత్రి పూట దొడ్లోకి వెళ్ళినప్పుడు పైకి చూస్తే పెద్దబొట్టు పెట్టుకుని డాబా మీద ఒక ముత్తయిదువ కనపడింది. వెంటనే భయంతో లోపలికి వెళ్ళి లలితతో చెప్తే ఇద్దరూ వెళ్ళి చూడగా ఇద్దరికీ కనపడింది. అమ్మేనని నమస్కారం చేసింది లలిత. ఈ అనుభవంతో వాళ్ళ తమ్మునికి లక్ష్యభావం ఏర్పడింది అమ్మ మీద.

## సత్తిరాజు శేషగిరి రావుగారు

సత్తి రాజు శేషగిరిరావుగారు గుంటూరు జిల్లా - చిలకలూరిపేట వాస్తవ్యులు వీరు ఫొటో గ్రఫీ , డ్రాయింగ్‌లో మంచి నిష్ణాతులు. వీరు మొదటిసారిగా అమ్మని దర్శించింది

1960 వ సంవత్సరం. అప్పటికి వారి వయస్సు 20 సంవత్సరాలు. ఆ రోజుల్లో జిల్లెళ్ళమూడిలో గుడి కడుతున్నారు. ఆ సందర్భంలో చిలుకలూరి పేట దగ్గర వున్న బొప్పూడి గ్రామం నుండి కొండరాళ్ళు తోలుతూ వుండేవారు. రాళ్ళుతోలే లారీ డ్రైవర్ శేషగిరిరావుగారికి బాగా పరిచయం. పర్చూరు అనెడి గ్రామం చిలుకలూరి పేటకి దగ్గరగా వున్నది. పర్చూరు వాస్తవ్యులు శికాకొల్లి వెంకటేశ్వర్లుగారు జిల్లెళ్ళమూడిలో గుడికి సంబంధించిన పనులు చూస్తూ వుండేవారు. రాళ్ళు తోలే లారీ డ్రైవర్ శేషగిరిరావుగారిని" ఒక సారి జిల్లెళ్ళమూడి వెళ్ళివద్దాం రమ్మని " అన్నారు. వేరే సంచీ కానీ పంచ, గుడ్డలు ఏమి లేవు ఆ సందర్భంలో శేసగిరిరావుగారి దగ్గర . కానీ వాళ్ళతో లారీ ఎక్కి జిల్లెళ్ళమూడి చేరారు

ప్రస్తుతం హైమాలయం వున్న ప్రాంగణంలో పెద్ద మందిరం వున్నది. అక్కడ అనేక మంది అమ్మ దర్శనానికి కూర్చున్నారు. అమ్మ స్నానం చేస్తున్నారు. కాసేపు ఆగాలని చెప్పారు. ఆ జనంలో శేషగిరిరావుగారు కూర్చున్నారు. ఎవరూ అమ్మకి వీరి విషయం చెప్పలేదు. కానీ స్నానం అనంతరం అమ్మ "చిలుకలూరి పేట నుండి వచ్చిన శేషగిరిరావు అన్న కుఱ్ఱవాడిని లోపలికి" రమ్మని కబురు పంపారు, శేషగిరి రావుగారు ఇది మొదటిసారి కదా రావటం అని "నన్ను కాదేమో మరొకర్ని కనుక్కోండి" అన్నారు. ఆ వచ్చిన వ్యక్తి "కాదు మిమ్మల్నే" అని చెప్పారు. తరువాత శేషగిరిరావు గారు లోపలికి దర్శనార్థం వెళ్ళారు.

తన విషయం అమ్మకి ఎవరూ చెప్పకుండానే అమ్మ పిలవటం ఆశ్చర్యం వేసింది శేషగిరి రావుగారికి. అమ్మకి నమస్కారం చేసుకున్నారు. అప్పుడు అమ్మ వారి ముఖం మీద చెయ్యి పెట్టింది. వెంటనే వారికి ఒక విచిత్రమైన అనుభవం కలిగింది. అమ్మ చేయి ఒక మంచు గడ్డలా అమిత చల్లగా, తన శరీరమంతా అంతులేని వేడిగా వున్నట్లు ఒక విలక్షణమయిన అనుభవం కలిగింది. ఒకసారి అంతులేని శీతలం, ఉష్ణం రెండు అనుభూతలను అమ్మ చెంత అనుభవించారు. అప్పటి నుండి వారు జిల్లెళ్ళమూడి రావటం మొదలుపెట్టారు.

తరువాత వారికి వివాహం అయింది. పిల్లలు కలిగారు. అమ్మ వారిని ఆపరేషన్ చేయించుకోవద్దు అన్నారు. "నువ్వా ఏమిటి వాళ్ళని చూసేది? నేను చూసుకుంటా అంతా' వివాహాలు ఇప్పటికి జరిగినవి. వారు ఈ విషయం నాతో చెపుతూ "అంతా అమ్మ కృప , అమ్మే చేసింది నాదంటూ ఏమి లేదని" చెప్పారు. అమ్మ యొక్క అవ్యక్తమైన అదృశ్య హస్తమే వారికి అభయ హస్తం , ముగ్గురు ఆడపిల్లలు కలిగిన తరువాత అమ్మని ఆపరేషన్ చేయించుకుంటా మని అడిగితే 'తరువాత చేయించు కుందువుగానిలే" అన్నది. 6 గురు పుట్టిన తరువాత అడిగితే "నువ్వు ఎనిమిది మందిని భరించాల్సిందే. నేను చూసుకుంటా వారి సంగతి" అన్నది. అదే విధంగా జరిగింది.

తరువాత పెద్ద కుమార్తె శారదని అమ్మ పెద్దకోడలు శేషు తమ్ముడైన మతుకుమల్లి వెంకట్రామయ్యకి ఇచ్చి వివాహం చేసింది అమ్మ. హైమాలయం ప్రాంగణంలో అమ్మ స్వయంగా జరిపారు. 82 జనవరి ఒకటవ తారీఖున (81 డిసెంబర్ 31 రాత్రి 12 గం॥ దాటిన తరువాత) వేదిక మీద అమ్మకి చీరాల వాస్తవ్యులు సుబ్రహ్మణ్యంగారు, (బుద్ధిమంతుడు అంటారు) అమ్మకి పూజ చేసుకున్నారు. ఆ సందర్భంలో శేషగిరి రావుగారు అమ్మకి ఫొటో

తీద్దామని నిలబడ్డారు. అప్పుడు అమ్మ అభయ హస్తంతో కూర్చున్నారు. అభయ హస్తంతో తాను తీసిన ఫొటో లేనందున ఆ స్థితిలో ఫొటో తీద్ధామని వారు ప్రయత్నించితే వెంటనే చెయ్యి క్రిందకి దించేవారు అమ్మ. మళ్ళీ అభయహస్తం తో వుండేవారు. మళ్ళీ తీద్ధామని వీరు ప్రయత్నిస్తే మళ్ళీ క్రిందకి దించేవారు. ఈ విధంగా చాలా సార్లు జరిగింది. పూజ అయిన తరువాత అమ్మ వేదిక దిగి వెళ్ళారు. అప్పుడు వారు కూడా అమ్మ దగ్గరికి వెళ్తే చిలకలూరి పేట వాస్తవ్యులు, అమ్మభక్తులు అయిన వాసుదేవాచారి గారితో వెంటనే వెళ్ళమని పంపించారు అమ్మ.

వారు ఇంటికి వచ్చేటప్పటికి ఆశ్చర్యం వేసింది. వారిది పెంకుటిల్లు, ఇంటి, వెనుక పొట్టు బస్తాలు, సాన్నాల గది మీద కట్టెలు, తదితరమైనవి వున్నయి. ఆ యింటికి ఆనుకుని కాన్వెంట్ పాక ఒకటి పెద్దది వున్నది. అది అంటుకుని పెద్ద మంటలు లేచినవి. వాకిలి తలుపుకు తాళం వేసి లోపల పడుకున్న వారి కుటుంబం వారికి జనం తలుపులు కొట్టి పెద్దగా అరిచినా వినపడలేదు. వారికి మెలకువ వచ్చి బయటికి వద్దా మంటే ఖంగారులో తాళం చెవి కనపడలేదు. తాళం చెవి కనపడి బయటికి వచ్చేటప్పటికి చాలా సేపు అయింది. జరగిన ప్రమాదానికి పొట్టు బస్తాలు అంటుకుని అక్కడ నుండి అంతా అంటుకుని మొత్తం ఇల్లు తగలపడి లోపల పడుకున్న వారంతా ఏమై పోయేవారో తెలియని ఘోర ప్రమాదం, కానీ ఏమీ కాలేదు. వీరింట్లో చిన్నగడిపరకకూడా ముట్టుకోలేదు. అప్పుడు అర్థమయింది. శేషగిరిరావుగారికి. జిల్లెళ్ళమూడిలో వేదిక మీద అభయహస్తంతో అమ్మ ఎందుకు వున్నదీ వెంటనే తనని ఎందుకు పంపిందో. ద్రౌపదికి కౌరవులు చేస్తున్న మానభంగం నుండి కృష్ణభగవానుడు అభయహస్తంతో కాపాడినట్లు అమ్మ అక్కడ అభయమిచ్చి వీరి జీవితాలనే కాపాడింది.

వీరి అనుభవాలన్నీ అమ్మ రక్షణను తెలియచేస్తున్నాయి.

శారద తన చెల్లెలు మంచం చుట్టూ తిరుగుతూ ఆడుకుంటున్నారు. ఉన్నట్లు వుండి మంచానికి తగలటం వలన మంచం పడి మంచం కోడు వాళ్ళ 6వ చెల్లెలు అనసూయ మీద పడింది. అప్పుడు ఆ పాప మూడు నెలల పసిపిల్ల . ఆ పాపకణత మీద పడింది. పాప పోయిందని భయపడి శారద గడగడ లాడుతూ దాక్కుంది. వాళ్ళ అమ్మ వచ్చేటప్పటికి కోడు క్రింద పాప వుంది. మంచం ఎత్తింది కానీ పాపకి ఏమి కాలేదు. అట్లాగే వేడి గంజిలో వారి 5వ కూతురు నెలల పిల్లగా వున్నప్పుడు చెయ్యిపెట్టింది. తాట లేచిరావలసింది పోయి ఏమి

కాలేదు.

శైలజ వివాహం అప్పుడు మగపెళ్ళివారు వచ్చారని తొందరలో శారద పరిగెత్తుకుంటూ హాలుగేటు దాటబోగా గేటు కడ్డీలలో కాలు ఇరుక్కుపోయి బొక్కబోర్లా ముందుకు పడపోతుండగా ఒక చెయ్యి ముఖం పట్టుకుని పైకి లేపటం జరిగింది. అక్కడ ఆ సమయంలో ఎవరూ లేరు. కాలు విరగవలసింది. మొహం పగలవలసింది. కానీ అమ్మ కాపాడింది. శైలజ పెళ్ళి పిలుపులప్పుడే శారద పిలువటానికి వెళ్ళితే ప్రక్కనే సెంటు వాసన వచ్చింది. పిలుపులకి వెళ్ళిన ప్రతి చోటా, తక్కిన వారు కూడా ఏమిటి ఈ ఘుమఘుమ వాసన అని అడిగారు. ఈ విధంగా ప్రక్కనే వెన్నంటి వున్నానని అమ్మ ఋజువు చేసింది.

శైలజ వివాహమయి అత్తవారింటికి వెళ్ళింది. ఫ్రేముకట్టుకుని అమ్మ ఫొటో ఒకటి తనతో తీసుకుని వెళ్ళి వారింట్లో చెక్కమందిరంలో ఒక ప్రక్కన పెట్టుకుని పూజించుకుంటున్నది. అమ్మ ఫొటో ఒక ప్రక్క వుంటే మధ్యలో చాలా మంది దేవుళ్ళ ఫొటోలు వున్నవి. ఇటు చివరగా దీపారాధన వుంది. ఆ సమయంలో వాళ్ళ ఆడపడుచు "పూజా మందిరంలో ఈ మనిషి ఫొటో ఏమిటి ఈ అమ్మలు, బాబాలు, మోసగాళ్ళు ఎక్కువయ్యారు ఈ రోజులలో. తీసేయి ఆఫొటో" అని అరిచింది. శైలజ బాధపడింది పూజామందిరంలో అమ్మ ఫొటోకి దూరంగా దీపారాధన వుంది. అంటుకుంటే మందిరం, మందిరంతోపాటు తక్కిన ఫొటోలు అన్నీ కాలిపోవాలి. అట్లాంటిది అమ్మ ఫొటో మాత్రమే తగలపడింది. శైలజ బాధపడింది. వాళ్ళ మామయ్యగారికి అమ్మ అంటే భక్తి వుంది. ఎప్పుడయితే అమ్మ ఫొటో తగలపడిందో ఆయన వాళ్ళ అమ్మాయితో "ఆవిడ సాక్షాత్ రాజరాజేశ్వరి అవతారం. నీకేమైనా బుద్ధి వుందా? లేదా? ఎందుకు ఫొటో తీసేయి అన్నావు. చూశావా దృష్టాంతరం ఏమీ తగలపడకుండా అమ్మ ఫొటో మాత్రమే తగలపడింది" అని అరిచారు. తరువాత వాళ్ళ ఆడపడుచు బాత్‌రూమ్‌లో కాలుజారిపడి తలకి దెబ్బతగిలి కాలు విరిగి 6 నెలలు మంచం మీద వుండటం జరిగింది. తరువాత శైలజ భర్త కూడా "జిల్లెళ్ళ మూడి ప్రయాణం అని అదీ ఇదీ అని రెండు రోజులు లేట్ చేశావు" అని అరిచాడు. అతను కూడా బస్సు ఎక్కపోయి క్రిందపడి కాలువిరిగి పోయింది. అప్పటి నుండి ఏమీ అనటం మానేశారు.

శారదకి రెండవ కాన్పు అప్పుడు కాన్పు చాలా కష్టం అయింది. గుంటూరు తీసుకుని వెళ్ళవలసిన అవసరం వుండేమొ అని రాము (శారద భర్త) రాత్రి 9 దాటిన తరువాత అమ్మ

చెంతను చెప్పి పరిస్థితి వివరించాడు. అమ్మ "ఒక గంట జరగని తరువాత చూద్దాం" అన్నారు. అమ్మ అట్లా అన్న భరొసాతో రాము, డాక్టర్ ఇనజకుమారి తో సహా అందరూ నిద్రపొయ్యారు. ఆసుపత్రిలో ఆ సమయంలో నర్సుకానీ, పని చేసే వెంకాయమ్మ కానీ ఎవరూ లేరు. రాము తల్లి భాగ్యమ్మక్కయ్య బయటి పంచలో మంచం మీద కూర్చుని కునుకుపడుతున్నారు. శారద ఒంటరిగా పడుకుని విపరీతంగా బాధపడుతున్నది. వెంటనే తెల్లచీర కట్టుకున్న ఒకస్త్రీ చల్లని చేతులతో ముఖం మీద చెయ్యి పెట్టి పొట్ట నొక్కింది. ఇంతలో పిల్లాడు బయట పడటం జరిగింది. శారద పెద్దగా "అమ్మా" అని అరిచింది. అరుపు విన్న భాగ్యమ్మక్కయ్య లోపలికి వచ్చింది. శారద పొట్ట నొక్కిన మనిషి ఆపరేషన్ థియేటర్ వైపు వెళ్తున్నట్లు భాగ్యమ్మక్కయ్యకి కనపడింది. బిడ్డ బయటకు రావటం చూసి భాగ్యమ్మగారు థియేటర్ వైపు వెళ్తున్న మనిషి నర్సు అనుకుని "తల బయటకి వచ్చిందె అని అరుస్తూ థియేటర్ వైపు పరిగెత్తింది. అక్కడ వున్న మనిషి అదృశ్యం అయింది. వేసి వున్న తలుపు మొఖానికి తగిలి పూర్తిగా మెలకువ వచ్చింది. వెంటనే ఆవిడ నర్సుని, డాక్టర్‌గారిని అందర్నీ పిలిచింది. వాళ్ళు వచ్చి అక్కడే పురుడు పోశారు. ఈ విధంగా తానే మరొక రూపంతో వెళ్ళి రక్షించింది అమ్మ.

ఈ పురుడు అయిన 4వ రోజున శారదకి విపరీతంగా అమ్మ వారు శరీరమంతా పూసి, సీరియస్ అయి క్రింద పడుకోపెట్టి గుంటూరులో వున్న శారద వాళ్ళ డాక్టర్ బాబాయ్ గారికి ఫోన్ చేశారు. ఆయన గుంటూరు నుండి బయలుదేరారు. ఈలోగా అమ్మ తాను రాసుకునే పవడర్, కాలెండ్యులా పవడర్ రెండు పవుడర్లు కలిపి శారద ఒంటి మీద చల్లమని పంపారు. తాను సగం తిన్న అరటి పండును మజ్జిగలో స్వయంగా కలిపి పంపారు. ఆ మజ్జిగ గొంతులో పోయటం జరిగింది. అమ్మ పంపిన పవుడర్లు కూడా ఒంటి మీద చల్లారు. వెంటనే లేచి కూర్చుంది శారద . గుంటూరు నుండి వచ్చిన డాక్టరు బాబాయికి ఆశ్చర్యం వేసింది. ఇక తాను ప్రత్యేకంగా చేయలసినది. ఏమి లేదని, తాను తెచ్చిన యాంటి బయటిక్ టాబ్లెట్స్ ఇచ్చి, అమ్మకి నమస్కారం చేసుకుని వెళ్ళారు. అమ్మ పంపిన పవుడర్, మజ్జిగలతో అమ్మ వారు పోయి ఒంటి మీద మచ్చలు కూడా లేకుండా చక్కగా తగ్గిపోయినవి. ఈ విధంగా అమ్మ పంపిన మజ్జిగ సంజీవ కరణిగా, పవడర్ విశల్య కరణిగా పని చేసి, దివ్యమూర్తి అయిన అమ్మ ధన్వంతరి అయి కాపాడింది. సర్వం తానయిన అమ్మకి ఇటువంటివి అన్నీ అత్యల్పం కదా!.

## జరగబోయేదిది కలలో చూపించటం :-

ఒకసారి రాముకి కలలో జొన్నరొట్టెల విషయంలో తను, శారద విపరీతంగా అరుచుకున్నట్లు కలవచ్చింది. ఈ కలకి ముందు రోజు రాము అక్కయ్య అయిన శేషు ఇంట్లో జొన్నరొట్టెలు తిని వచ్చాడు. కలని తలుచుకుని జొన్న రొట్టెల విషయంలో ఇట్లా జరగటం ఏమిటి. ఇదేదో వూరికే వచ్చిన కల కాదు అని అనుకున్నాడు రాము. మరునాడు శారద జొన్నరొట్టెలు చేసింది. ఏ మాత్రం కుదరలేదు. దానితో రాముకి శారదకి మాటా, మాటా పెరిగింది. అరుచుకున్నారు. "నిన్న మా అక్కయ్య వాళ్ళ ఇంట్లో రొట్టెలు బ్రహ్మాండంగా వున్నయి. నువ్వు ఛండాలంగా చేశావు" అంటూ మధ్యాహ్నం రెండు గంటలకి వస్తే మళ్ళీ అన్నంతో రొట్టెలు పెడితే , తిరిగి అరిచి, భోజనం చేయకుండా లేచి వెళ్ళాడు. వాళ్ళ ఇంటి బయటికి వచ్చి బజారు మలుపు తిరిగినప్పుడు రాత్రి వచ్చిన కల గుర్తు వచ్చింది. సరిగ్గా అక్కడికి వచ్చేటప్పటికి పోట్లాట ఆగినట్లు కల వచ్చింది. సరిగ్గా అట్లాగే జరిగింది.

## అహంకారం పెరగటం, గర్వభంగంతో కనువిప్పు చేయటం :-

శేషగిరి రావుగారు జిల్లెళ్ళమూడికి తరుచూ వస్తూ పోతూ అమ్మకి ఫొటోలు తీసేవారు. వీరికంటే చాలా కాలం ముందు గానే చీరాల వాస్తవ్యులు బహుముఖ ప్రజ్ఞాశాలి మహా మహితాత్ముడు అయిన డాక్టర్ పొట్లూరి సుబ్బారావుగారు అమ్మకి వేల వేల ఫొటోలు, స్లైడ్స్, మూవీలు తీస్తూ అదే ఆరాధనగా తపస్వియై చేస్తూ వుండేవారు. 81 నుండి వారి కుమారుడు పార్థు కూడా తీస్తూ వుండే వాడు.

శేషగిరి రావుగారు "వీళ్ళేనా ఏమిటి తీసేది వీరికంటె గొప్పగా నేను తియ్యా"లని అహంకారం పెరిగింది. కొత్త బ్యాటరీలు, ఫిలుంలు తీసుకుని జిల్లెళ్ళమూడి వచ్చారు. అమ్మ వేదికమీద ఆసీనులైనారు. డాక్టరుగారు, పార్థు ఫొటోలు తీస్తున్నారు. శేషగిరిరావుగారు ఎంతగా ఫొటో తీద్దామని ప్రయత్నించినా ఫ్లాష్ వెలగలేదు. ఎన్నోసార్లు ప్రయత్నించినా ఫొటో తీయలేక పోయారు. అమ్మ వేదిక దిగి వెళ్ళిన తరువాత తీస్తే ఫ్లాష్ వెలిగి ఫొటో తీయగలిగారు. అప్పుడు అనుకున్నారు ఇది అమ్మ తన అహంకారం తొలగించటానికి కనువిప్పు చేసినదని. అమ్మ ఏ విధంగా రక్షిస్తుందో, శిక్షణనిస్తుందో కనువిప్పు కలుగ చేసే చిన్న చిన్న శిక్షణలతో సంఘటనలు కల్పించి జీవిత పాఠాలు నేర్పుతుంది.

శేషగిరిరావుగారు ఒక విశేషమయిన విషయం చెప్పారు. "అమ్మతో అతి సన్నిహితం

ఏర్పడితే దైవభావం యందు లక్ష్యం పోతుందని, అక్కడ ఎక్కువగా వుండేవాడిని కాదని, ఆ సమయానికి వెళ్ళి పని చూసుకుని అమ్మకి నమస్కారం చేసుకుని వచ్చే వాడినని" అన్నారు.

ఎక్కువ సాన్నిధ్యం కోరుకోక పోవటంలో కూడా ఒక ఉన్నతమయిన లక్ష్యం వుంది. "రూపాని కంటే, తత్వానికి దగ్గరగా మనస్సు వుండాలనే" వీరి ఆకాంక్ష ఎంతో మహోన్నతమయింది. పైకి సన్నిహితంగా లేనట్లు కనపడే వీరి చేతల వెనకాల వున్న విశిష్ట శీలం ఆలోచనా ఎంతో గొప్పవి కదా! వ్యక్తిగా అమ్మకి దగ్గరగా వున్నా లేకపోయినా అమ్మ అంతర్యానికి అందరూ అంతర్యులే, ఇట్టి విశిష్టమయిన వ్యక్తి శేషగిరిరావుగారు.

## నెల్లూరు కమలక్కయ్య

గుంటూరు జిల్లా పొన్నూరు వాస్తవ్యులు అధరాపురపు శేషగిరిరావుగారు. వారి కుమార్తె కమలక్కయ్య. శ్రీ శేషగిరిరావుగారు 1960 నుండి 68 వరకు జిల్లెళ్ళమూడి సంస్థకి సేవచేసుకుని మౌళికమయిన బాధ్యత వహించి నిర్వహించారు. జిల్లెళ్ళమూడిలో సంస్కృత కళాశాల రావటానికి రోడ్డు, కరెంటు, ఫోన్ మొదలైనవి రావటానికి కృషి చేసిన మూలమైన వ్యక్తి. ప్రెస్ తీసుకుని వచ్చి మాతృశ్రీ సంచికను అనేకమైన అమ్మ సాహిత్య గ్రంథాలు వీరున్నప్పుడే వచ్చినవి. అక్కడి అన్నపూర్ణాలయం బిల్డింగు, అఖండనామం జరుగుతున్న పర్ణశాల (60 నుండి 68 వరకు అమ్మ అక్కడే నివసించింది) ఈ విధంగా ఆవరణ విస్తరణకి జిల్లెళ్ళమూడికి అనేక సేవలు చేశారు. ఇటువంటి ధన్యజీవి కుమార్తె కమలక్కయ్య.

ఈవిడని నెల్లూరు నివాసులు ఎడ్వకేటు నారాయణ రావుగారికి ఇచ్చి వివాహం చెయ్యటం వలన నెల్లూరు నివాసి అయినారు. అందువలన నెల్లూరు కమలక్కయ్య అంటూ వుంటారు. శేషగిరి రావుగారి ధర్మపత్ని రాంబాయమ్మగారు. వీరంతా అమ్మని సేవించుకుని ఎన్నో అనుభవాలు పొందిన అదృష్టవంతులు. కమలక్కయ్య చెప్పిన అనుభవాలు వివరాలు అందచేస్తున్నాను.

రాంబాయమ్మక్కయ్య అమ్మ చెంత కూర్చుని వుండగా అమ్మలో నుండి మేళతాళాలు వినపడ్డవి. "ఇదేమిటమ్మా ఇట్లా వినపడుతున్నవి" అని అడిగితే "నాలోనే అంతా వున్నయ్ కదా! అందుకని అవ్వన్నీ నా నుండే వినపడుతున్నయ్" అని అమ్మ సమాధానం చెప్పారు. సర్వం మన ఆత్మలోని దేనని వేదాంతం చెపుతున్నది. అట్టి వేదవాక్కు యొక్క అనుభూతికి ప్రతిరూపం అమ్మ అని రాంబాయమ్మ గారి అనుభవం తెలియచేస్తున్నది.

కమలక్కయ్య పెద్ద కొడుకు ఫణికి 12వ సంవత్సరం నడుస్తున్నప్పుడు రాయవెల్లూరులో ఆపరేషన్ జరిగి మూడు నెలలు వున్నారు. 1967-68 సంవత్సరం మధ్యలో ఈ సంఘటన జరిగింది. ఈ సందర్భంలో అక్కయ్య మేనల్లుడు కంచి వెళ్ళి వచ్చాడు. ఆ విషయం అక్కయ్యకు చెప్పాడు. ఆయనతో అక్కయ్య "నాకు చెపితే, నేను కూడా వచ్చేదాన్ని కదా' అని అతనితో అన్నారు. తాను వెళ్ళలేక పోతినే అని విచారిస్తూ నిదుర పోయింది. అప్పుడు కలవచ్చింది. కలలో తాను కంచి వెళ్ళి దర్శనం చేసుకోవటానికి వెళితే గర్భగుడిలో జిల్లెళ్ళమూడి అమ్మ దర్శనం యిచ్చారు. అది తాను నిజంగా దర్శించినట్టే అనిపించింది అక్కయ్యకు. తరువాత పొన్నూరు వచ్చి జిల్లెళ్ళమూడి వెళితే అమ్మ" ఏ..అమ్మా - కంచి వెళ్ళావా? అక్కడ ఎవరు కనపించారు?" అని అడిగారు. దానికి అక్కయ్య "తెలీదుకదమ్మా? అక్కడ కూడా నువ్వే వున్నావు ఇంక ఎక్కడకి వెళ్ళనులే" అన్నారు. అది ఇప్పటికి తన ముందే జరిగినట్లు అనుభూతి చెందుతూ పులకరించిపోతూ చెప్పారు అక్కయ్య.

67-68 హైమ (వాళ్ళ కూతురు) ని కన్న కొత్తలో అక్కయ్య ఎడమ భుజము విపరీతంగా నొప్పి పుట్టి బాధపడుతున్నది. అక్కయ్య, నారాయణరావు గారు, బాబు ముగ్గురు కలిసి జిల్లెళ్ళ మూడి వెళ్ళారు. అప్పుడు అక్కయ్యతో అమ్మ "అబ్బ భుజమంతా జాలుగా వున్నది' అన్నారు. దానికి అక్కయ్య "నీకు కూడా ఇదేమిటమ్మా?నేను కరెంటు పట్టించుకుందామని ఇటు వైపు వచ్చాను" అన్నారు. వెంటనే అక్కయ్యకి భుజం మీద షాక్ కొట్టినట్లు, జివ్వున లాగినట్లు అనుభూతి అయింది. తరువాత అక్కయ్యకి ఆ నొప్పి పోయింది. "మందు తీసుకుందామని వచ్చానమ్మా" అని అంటే అమ్మ "తీసుకో అమ్మా" అన్నారు. 1992లో నర్వస్ ప్రాబ్లమ్‌తో వంగలేక విపరీతంగా బాధపడుతున్నది. అప్పుడు బెంగుళూరు వెళ్ళారు అక్కయ్య. ఒక మారు కలలో అమ్మ చీర పెట్టారు. రెండవ మారు కలలో మెడలోని పూలమాల తీసి పూలన్నీ దూసి పూలు ఇస్తుంటే అక్కయ్య వంగి నమస్కారం చెయ్యపోగా వద్దు అని అన్నారు. "ఎందుకమ్మా ఏమి తప్పు చేశాను" అని అక్కయ్య అంటే "ఏమి లేదమ్మా నీకు బాగు లేదుకదా! అందుకని వంగి దణ్ణం పెట్టవద్దన్నాను" అని అన్నారు. తరువాత అక్కయ్యకి ఆ బాధ తగ్గింది.

ఇంకొకసారి అక్కయ్యకి కంఠవాతం వచ్చి పరిస్థితి సీరియస్ అయి మద్రాస్ తీసుకుని వెళ్ళారు. ఆ సందర్భంలో యోగయ్య గారి చేత పొన్నూరు కబురు చేస్తూ "దానికి ఒంట్లో బాగా లేదు. అది మద్రాసులో వుంది. రాంబాయమ్మను మద్రాసు వెళ్ళమని చెప్పు. అది ఎట్లా

వుందో?" అంటూ జిల్లెళ్ళమూడిలో సాయంత్రం దాకా స్నానం చెయ్యకుండా కూర్చున్నారు అమ్మ. మద్రాసులో అక్కయ్యకి తగ్గిన తరువాత స్నానం చేశారు అమ్మ.

మరొకసారి అక్కయ్య కూతురు ఇంద్రాణికి కలలో కనపడి "అది ఎందుకు అట్లా బాధపడుతుంది. నేను చూసుకుంటాను కదా?" అన్నారు. "ఇంద్రాణి అక్కయ్యకి ఫోన్ చేసి "నువ్వెందుకు బాధపడతావు. అమ్మ నాకు కలలో కనపడి చెప్పింది అంతా నేను చూసుకుంటా"నని. ఆ తరువాత అక్కయ్య మనస్సు కుదుటపడింది. ఓర్పుకి అమ్మ ఇచ్చే ప్రాధాన్యత ఎటువంటిదో వ్రాయపోయే సంఘటన తెలియచేస్తుంది.

ఒకసారి అమ్మను దర్శించటానికి గదిలోకి వెళ్ళారు అక్కయ్య. అక్కడ శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు వున్నారు. అక్కయ్యతో అమ్మ "ఏదన్నా త్రాగుతావా అమ్మా" అని అడిగి పాలు ఇప్పించింది. శ్రీపాదవారు అమ్మకి నమస్కారం పెడుతుంటే "నాకు కాదు దణ్ణం పెట్టవలసింది. దానికి పెట్టు. దానికి ఎంత ఓర్పు వుందో చూడు " అన్నారు అమ్మ

66లో అక్కయ్య వింటూ వుండగా ఈ విధంగా అన్నారు అమ్మ "ఏమిటో ప్రొద్దున నుండి కదలి పోతున్నది" అట్లా అన్న రోజున బ్రహ్మాండమయిన భూకంపం వచ్చింది.

ఈ విధంగా సర్వాంతర్యామియై సర్వమాతానై సర్వరక్షా స్వరూపిణి అయిన అమ్మ కృపకు పాత్రులై ఎన్నో అనుభూతులు పొందిన ధన్యజీవి కమలక్కయ్య, అధరాపురపు శేషగిరి రావుగారి కుంటుంబం.

## మన్నవ ప్రభావతి

గంగరాజు లోకనాధరావుగారు గుంటూరు జిల్లా కొమ్మూరు వాస్తవ్యులు. వీరు అమ్మ భర్త నాగేశ్వరరావుగార్ని కలుసుకొనటానికి 1956లో జిల్లెళ్ళమూడి వెళ్ళారు. అప్పుడు అమ్మ భర్త ఊర్లోలేరు. లోకనాధరావుగారు అమ్మతో "నాగులు లేడు కదా! వెళ్తానులే!" అన్నారు. అమ్మ "ఆయనలేకపోతే ఏమి కాసేపు వుండండి" అన్నది. వారికి అమ్మ ఏమాత్రం వ్యవధి లేకుండా కాఫీ తీసుకుని వచ్చి ఇచ్చింది. ఎట్లా ఇచ్చిందో అర్థం కాదు. వెంటనే 10 నిమిషాలు అయిూ అవ్వకముసుపే వారికి అమ్మ అన్నం పదార్థాలు వేడి వేడిగా తీసుకుని వచ్చి వడ్డించింది. ఆ రోజులలో గ్యాస్ స్టౌవ్, కుక్కర్లు లేవు. కుంపటి కట్టెలతో చేయాలి. ఎక్కడా వండి తెచ్చినట్లు కనపడలేదు. ఎట్లా తెచ్చి వడ్డించింది అర్థంకాలేదు. ఏదో అలౌకికశక్తి వుండి వుండాలి ఈమెకి అని అనుకున్నారు. తరువాత కొమ్మూరు వెళ్ళారు. ఈ విషయం ఇంట్లో

వారికి ఊర్లోవారికి కొందరికి లోకనాధంగారు చెప్పారు. తరువాత లోకనాధంగారికి మధుమేహం వలన కాలు తీసే పరిస్థితి ఏర్పడి గుంటూరు హాస్పటల్‌లో చేర్చారు. మన్నవ బుచ్చిరాజుగారు మరొక ఇద్దరు కలిసి సైకిళ్ళ మీద జిల్లెళ్ళమూడి వెళ్ళి అమ్మకు విషయం చెప్పారు. అమ్మ గుంటూరులో హాస్పిటల్‌కి వెళ్ళి , లోకనాధం గారిని "ఎక్కడి నుండి తీసేయాలి" అని అడుగుతూ మోకాలి నుండి పాదం వరకూ కాలి మీద చేత్తో రాసింది. తరువాత లోకనాధంగారి కూతురు ప్రభావతి అమ్మ కలిసి రిక్షాలో బుచ్చిరాజుగారి తండ్రి ఇంటికి వెళ్ళారు. అప్పుడు అమ్మ ప్రభావతితో "నువ్వు నాతోరా" అంటే ప్రభావతి "వస్తా"నన్నది అమ్మ "అక్కడ ఇల్లు ఇట్లా వుండదు. అన్ని జంతువులు వుంటాయి. ఎలుకలు, పిల్లులు, పాములు ఇంట్లో తిరుగుతూ వుంటాయి. మరివస్తావా? అన్నది. "నువ్వు వుండగా నాకేమి భయం వస్తాను" అన్నది ప్రభావతి. "మీనాన్నకి తగ్గిన తరువాత వద్దువుగానిలే" అన్నారు అమ్మ. తరువాత లోకనాథంగారికి వ్యాధి తగ్గింది. కాలు తీయవలసిన అవసరం లేకుండా పోయింది. లోకనాథంగారు ప్రభావతితో "జిల్లెళ్ళమూడి వెళ్ళి అమ్మ సేవచేసుకో"నమని చెప్పారు. తరువాత ప్రభావతి జిల్లెళ్ళమూడి వెళ్ళి తొమ్మిదిరోజులు వున్నది. అప్పటికి ప్రభావతికి 13ఏండ్ల వయస్సు. ఎప్పుడూ తల్లిదండ్రులను విడిచిలేదు. అందువలన నాలుగు అయిదు రోజులు అవ్వగానే ఇంటిమీద ధ్యాసమళ్లి ఇంటికి వెళ్తానని గొడవ పెట్టింది. అమ్మ చెంత సేవ చేసుకుంటూ వుంటున్న ఊర్లో మనిషి రెడ్డి సుబ్బయ్యని ఇచ్చి బండి కట్టించి కొమ్మూరు పంపింది. కొమ్మూరు వెళ్ళిన క్రొద్ది రోజులలోనే మళ్ళీ జిల్లెళ్ళమూడి వెళ్ళాలని విపరీతంగా ధ్యాస మళ్ళింది ప్రభావతికి. మళ్ళీ జిల్లెళ్ళమూడి వెళ్ళింది. వంట వార్పు చెయ్యటం మొదలుపెట్టింది. ఈ విధంగా అమ్మ సేవ చేసుకుంటూ వుండేది. తరువాత క్రొద్ది రోజులలో ప్రభావతి వాండ్ల అమ్మ గర్భిణి అయింది. ఆ సమయంలో ఆవిడ కాలు నరం విపరీతంగా నొప్పి పుట్టి 9రోజులు అన్నం కూడా తినకుండా బాధపడింది. ఆ విషయం జిల్లెళ్ళమూడిలో అమ్మకి చెబితే అమ్మ బండి మీద కొమ్మూరు వెళ్ళింది. ప్రభావతి అమ్మగారి చెంతకి వెళ్ళి ఆవిడకి నొప్పి పుట్టినచోట తన చేతిని పెట్టి రాసింది. తరువాత ఆవిడకి ఆ బాధపోయింది. ఈ సందర్భంలో ప్రభావతి కొమ్మూరులో వుండి కొద్ది రోజులు అయిన తరువాత అమ్మ దగ్గరికి వెళ్ళాలని గోలపెట్టింది. అప్పుడు శ్రీ హరిరావుగారి భార్య రాముడక్కయ్య, డాక్టర్ సీతాచలంగారి భార్య వరలక్ష్మి మరొక అనంత వరలక్ష్మి, హనుమాయమ్మగారు అందరూ ప్రభావతిని తీసుకుని కొమ్మూరు నుండి జిల్లెళ్ళమూడి

నడిచి వచ్చారు. ఆ రోజులలో రెడ్డి సుబ్బయ్య కూతురు పార్వతి నీళ్ళు తెచ్చిపోయటం మొదలైన సేవలు చేస్తుంటె ప్రభావతి వంట పని చేస్తూ వుండేది. ఆ రోజులలో పిల్లులు, ఎలుకలు, కుక్కలు అన్నీ కలిసి వుండేవి. అప్పుడప్పుడు పాములు తిరుగుతూ వుండేది. ఏవీ ఏమీ చేసేవి కావు. ఒక సందర్భంలో 13 రోజులలో పుట్టి బియ్యం (13 బస్తాలు) వండి వార్చింది. నవరాత్రులలో అమ్మ నాన్నగారు పీటల మీద కూర్చుని పూజ చేస్తూ వుండేవారు. పూజ చేస్తుంటే చెయ్యి నిలిచి పోయేది అమ్మకి. వంట ప్రభావతి చేసేది. ఒకసారి అమ్మ భూమి నుండి పైకి లేచింది. సీతాచలంగారు జుట్టు పట్టుకుని దించటానికి ప్రయత్నం చేశారు. దడికి వున్న చిల్లి నుండి సన్నని వెలుగు ఎప్పుడూ వచ్చేది. అక్కడ పుట్ట ఒకటి వచ్చింది. అన్నం నివేదన పెడితే ఖాళీ అయ్యేది. పుట్ట దగ్గర వెల్తురు పడేది. సాసర్ పెడితే తేనెలాంటి పదార్థం పడేది. ఇవి అన్నీ ప్రభావతి చూసింది. కొంతకాలం ప్రభావతికి ముక్కులు ఊపిరి ఆడేది కాదు. అమ్మ ప్రక్కన పడుకుని నోటితో గాలి పీల్చేది. అమ్మ ప్రభావతి వంక చూస్తూ వుండేది. ఆ విధమయిన అమ్మ చూపుతోనే ప్రభావతికి ఆ జబ్బు తగ్గింది. ప్రభావతి పెళ్ళికి రాజు వాండ్లు ఏడో మైళ్ళో దిగారు. మబ్బులు విపరీతంగా వచ్చినవి. ఆ సమయంలో, అప్పుడు జిల్లెళ్ళమూడిలో అమ్మ అభయహస్తంతో కూర్చుంది. వర్షం ఆగిపోయింది.

అమ్మ కూతురు హైమ రజస్వలయింది. ప్రభావతి, అనసూయమ్మగారు (గంగరాజు చిదంబరరావుగారి భార్య) పాలపర్తి కృష్ణమూర్తిగారు పీపా కట్టుకుని కాలవకి వెళ్ళి నీళ్ళు తీసుకుని వచ్చారు. ప్రభావతితో సాధన విషయం వచ్చినప్పుడు అమ్మ "నా మీద నీ మనస్సు ఎప్పుడూ వుంటుంది. వేరే సాధన అక్కర్లేదు" అంటూ వుండేది. ప్రభావతి వాండ్ల అమ్మ ప్రభావతిని శ్రావణమాసం నోములకి తీసుకుని వెళ్తానంటే అమ్మ "దానికి ఏ వ్రతం అక్కర్లేదు" అనేది. బార్నీ దగ్గర అన్నం కలిపి పెడితే అయిపోయేది. భగళాదేవి, శకుంతల, అపర్ణ, శ్యామల వీరికి ఆహారం పంపేది. వారితో అమ్మ సమాధ్యవస్థలో ఈ విధంగా మాట్లాడేది. "మీకు ఆవకాయ , పాలు, సాంబారన్నం ఇట్లా ఎన్ని పంపుతున్నాను. మీరే ఆహారం తీసుకునే శక్తి సంపాదించాలి. రావి చెట్టు దగ్గర పెడితే తీసుకోవాలి. కాగితంలో అన్నం పెడితే కాగితం కదిలేది. ఎవ్వరూ కనపడేవారు కాదు. కాగితంలో పదార్థం అన్నం అయిపోయేది. ఒక్కొక్కప్పుడు బాపట్లలో వున్న నాన్నగారితో (అమ్మ భర్తతో) ఈ విధంగా మాట్లాడేది. "నేను ఎప్పుడూ ఇట్లా మాట్లాడితే బాగుండదు. నేను రాత్రి వెళ్తుంటే ఎవరో

వెంటపడ్డారు. నేను వారికి అందలేదు." ఇతర దేశాల వారితో ఇంగ్లీషు, హిందీలో మాట్లాడేది. ఒక సంవత్సరం నవరాత్రులకి మన్నవ తీసుకుని వెళ్ళారు. అప్పుడు పొట్ట భాగం అంతా కాలిపోయింది. అక్కడ నెయ్యి నవనీతం రాస్తూ కూర్చున్నారు. చాలా భాగం తగ్గింది అమ్మకి. శనివారం , ఆదివారం 150. 200 మంది వచ్చేవారు. ప్రభావతికి పెళ్ళి అయిన క్రొత్తల్లో 4 చోట్ల తేలుకుట్టింది. అమ్మకి చెబితే "కుడితే కుట్టిందిలే ముందు వీళ్ళకి కాఫీ తీసుకుని రమ్మని అన్నారు. అట్లాగే కాఫీ తీసుకుని వెళ్ళింది. ఏ మందుతో అవసరం లేకుండానే తనకి తగ్గింది.

మన్నవ బుచ్చిరాజు ప్రభావతి వివాహం అమ్మ సన్నిధిలో జరిగింది. అమ్మ ఆడపడుచు పాప జిల్లెళ్ళమూడి వెళ్తూ వుండేది. ఒకసారి అమ్మకి హారతి ఇస్తే అమ్మే హారతి పాట పాడింది. "కృష్ణ మాయింటికి రారా" అనెడి పాట పాడింది. ఈ సంఘటన కార్తీక సోమవారం నాడు జరిగింది. ప్రభావతి వాళ్ళ బామ్మగారు పచ్చళ్లు తీసుకుని వచ్చేవారు.

అమ్మ మహాసిద్ధి పొందిన తరువాత చాలాకాలం కలలో కనపడేవారు. జ్యోతిగా అమ్మ కనపడేది. అమ్మ ఇచ్చిన మట్టి ఘుమఘుమ వాసన వచ్చేది. కుంకుమ కూడా అదే విధంగా వచ్చేది. అమ్మని ప్రభావతి మొదలైన వారు ఎత్తుకునే వారు. అమ్మ వీళ్ళని "ఏదైనా పెడతావా?" అని అడిగి చేయించుకునేది. ఈ విధంగా జగజ్జనని అయిన అమ్మని బిడ్డగా ఎత్తుకోవటం తానుగా (బిడ్డలాగా) అడిగి చేయించుకోవటం జరిగేది. యశోద చెంత కృష్ణ భగవానుడులాగా. దీనినే భగవంతుని బిడ్డగా ఆరాధించే యశోద భక్తి అంటారు. ఇట్లా అందని అమ్మ అయిన లోకజనని అందెడి అమ్మ అయి సర్వసామాన్యంగా లీలామానుషమూర్తి అయి ప్రవర్తించేది. కొమ్మూరి డాక్టర్‌గారి వదిన జాలమ్మగారు ఒకసారి అమ్మ ఒడిలో పడుకున్న ఎల్లమంద, శంకరంని చూసి అమ్మని మరొకరకంగా తప్పుగా అనుకుంది. వెంటనే పెద్దకన్ను ఒకటి భయంకరంగా గోడమీదకనపడింది. మరుక్షణంలో ఆవిడ పడిపోయింది. తరువాత అమ్మని క్షమించమని అడిగింది. ఆవిడకి ఆస్థితి తగ్గి మామూలు స్థితికి వచ్చింది. జిల్లెళ్ళమూడిలో రాజు అనెడి వ్యక్తి వున్నారు. వారి మనవరాలు సుబ్బమ్మకి లివర్ వచ్చింది. అమ్మ బత్తాయి రసం త్రాగి క్రొద్ది రసం విడిగా సుబ్బమ్మకి పంపేది. తరువాత ఆవిడకి ఆ వ్యాధి తగ్గింది. భీమవరం టీ మాస్టరుగారి అబ్బాయికి లివర్ వస్తే తీర్థం ఇచ్చేవారు అమ్మ. తరువాత అతనికి ఆ వ్యాధి తగ్గింది.

ప్రభావతి అన్నయ్యకి పైల్స్ వ్యాధి అని సైకిల్ త్రొక్కలేక పోతున్నానని అమ్మతో చెబితే

"నీకు ఏవిట్రా" అంటూ వీపు మీద లాగి ఒక్కటి కొట్టింది. దాంతో ఆయనకి ఆ వ్యాధి తగ్గిపోయింది. ఒకసారి రెడ్డి సుబ్బయ్య బార్ని దగ్గర నీళ్ళు కాచి అమ్మని స్నానానికి రమ్మని కబురు పంపాడు. ఎంత సేపటికి రాకపోతే ఎందుకు రాలేదో అని వెళ్ళి చూస్తే అమ్మ ఎదురుగా తళతళ మెరిసిపోతున్న నాగేంద్రుడు భూమి మీద నుండి పైకి తేలి గిరగిరని తిరగటం చూశాడు. వెంటనే ఆ నాగేంద్రుడు క్రిందకి దిగి చరచరా వెళ్ళి పోయి మాయమయినాడు. ఒకరోజు అమ్మ దగ్గర పాలు పెడితే అదే సమయంలో నాన్నగారు కాఫీ కోసం కబురు పంపారు. ఎంతసేపటికి కాఫీ తీసుకుని రాకపోతే నాన్నగారు లోపలికి వచ్చి చూస్తే నాగేంద్ర స్వామి పాలు త్రాగుతూ కనపడ్డాడు. వెంటనే నాన్నగారు బెదిరి పోయి "పాము , పాము" అన్నారు. మరుక్షణంలో అది అదృశ్యమయింది.

ప్రభావతి హైమని (అమ్మ కూతురు) తెల్లవారు ఝామున ధ్యానం చేయించేది అమ్మ. ప్రస్తుతం అమ్మ ఆలయం ఉన్న చోట ఆ రోజులలో రామాలయం కోసం వేసిన పర్ణశాలలో ధ్యానం చేయించేది. కొందరు వారి ఆచారాలు వదలకపోయినా వారికి తగ్గట్లుగా ఏర్పాట్లు చేసేది. ఇటువంటి వారిలో ఒకరైన రెడ్డిపాలెం కాంతయ్యయోగి గారి దగ్గర వుండే భాగ్యమ్మ గారనెడి వ్యక్తి విడిగా వంట చేసుకుంటానంటే ఆవిడకి తగ్గ ఏర్పాట్లు చేశారు అమ్మ. ఆవిడ విడిగా వంట చేసుకునేది.

ప్రభావతికి కొమ్మూరులో ఆంజనేయస్వామి విగ్రహం వెనకాల అమ్మ దర్శనం ఇచ్చింది. ఒకసారి గుడికి (కొమ్మూరులో) వెళ్ళి వస్తూ 4 అడుగులలో వీరి ఇంటికి వచ్చింది అమ్మ. చాలా దూరం వున్న వీరి ఇంటికి నాలుగు అడుగులలో ఎట్లా వచ్చిందో వీరికి అర్థం కాలేదు. వీరి ఇంటి పంచలో స్తంభం పట్టుకుని నిల్చున్నది ఒకసారి అమ్మ. అప్పుడు ప్రభావతికి వాళ్ళ బామ్మగారికి జిగేల్ జిగేల్ మని ఎక్కడలేని వెలుగు కనపడింది.

బుచ్చిరాజు గారి తండ్రికి 6 బత్తాయిపళ్ళు పంపారు అమ్మ. మన్నవలో అవి వారు తీసుకున్నారు. 6వరోజు వారు అమ్మలో ఐక్యం అయ్యారు. జిల్లెళ్ళమూడిలో ఆంబోతు ఎద్దు చెరువులో వుండి ఎంతసేపటికి రాలేదు. అమ్మ వెళ్ళి పిలిస్తే వచ్చింది. దానికి అమ్మ ముద్ర వేసి వచ్చిన తరువాత అమ్మ బార్నిలో పడుకుంటే ఆ ఆంబోతు అక్కడికి వచ్చి అమ్మ పాదాల చెంత పడుకుంది. ఈ విధంగా అమ్మే "సర్వ భూతహిత సఖి సర్వ భూతాత్మ ఆత్మనః" సకల జీవరాసుల హితం కోరుకునేది. స్నేహ బంధం కలిగి వాటి ఆత్మతో తన ఆత్మ కలిసిపోతుంది. అనెడి దైవాన్ని గురించిన ఆర్యోక్తికి ప్రతిరూపమే అమ్మ అని ఈ సంఘటన

తెలియచేస్తుంది.

మన్నవలో గడ్డివాముల వెనకాలకి అమ్మ వెళ్ళి ఎంత సేపటికి రాకపోతే కొందరు వెళ్ళి చూస్తేఅక్కడ పాము ఒకటి వుండి చాలాసేపు అమ్మ దాని ఎదుట నిలబడింది. ఇట్లా కొందరు చూశారు. కేశవాచారి అనెడి పూజారి మన్నవలో వున్నాడు. అమ్మకి 7 ఏండ్ల వయస్సులో అమ్మ ఆలయానికి వెళ్తే ఈ పూజారి అమ్మ మెడలోని బంగారు గొలుసు లాక్కుని హోమగుండంలో పడేశారు. అమ్మ ఏమీ అనలేదు. అమ్మ మెడలో బంగారు గొలుసు కనపబడక పోయేటప్పటికి అక్కడ వున్న పెద్దవారికి అనుమానం వచ్చి వెళ్ళి చూస్తే హోమగుండంలో కనపడింది. ఈ విధంగా ఎందరెందరినో ఏమీ అనకుండా కనువిప్పు కలిగించిన సంఘటనలు ఎన్నో అమ్మ చరిత్రలో ఉన్నవి. అమ్మ అవ్యాజ ప్రేమ క్షమా స్వరూపిణి కదా?

వరసకి అమ్మ పినతండ్రి మన్నవ రామబ్రహ్మంగారి భార్య పుల్లమ్మగారు ఒకసారి జిల్లెళ్ళమూడి వచ్చి అమ్మ చెంత నారాయణ తరంగం పాడితే "ఝుంకిత పోయిందే?" అన్నారు అమ్మ. ఝుంకిత అనే పదం పాడకపోతే అన్నారని రాజుగారి తల్లి చెప్పింది. విద్యాస్వరూపిణి అమ్మకి తెలియనిది ఏముంటుంది.? గంగరాజు పున్నయ్యగారికి అమ్మ కృష్ణుడుగా కనపడినట్లు ఆ రోజులలో జనం చెప్పుకున్నారని బుచ్చిరాజుగారి తల్లి చెప్పింది. రాజుగారి తల్లిని ఆధ్యాత్మిక రామాయణ కీర్తనలు పాడమంటే "గొంతు నొప్పిగా వుందమ్మా' అన్నారు. రాజుగారి తల్లి. అప్పుడు అమ్మ "నీకు నొప్పి ఏమిటి?" అంటూ గొంతు దగ్గర చేతితో రాసింది. వెంటనే బాగా పాడగలిగింది. గొంతునొప్పిపోయింది.

వాత్సల్య స్వరూపిణి, సర్వవ్యాధి ప్రశమనీ, రక్షా స్వరూపిణి, విద్యా స్వరూపిణి అయిన అమ్మ ప్రభావం యొక్క అనుభూతులు ఎన్నో పొంది, సకల జీవరాసులు అమ్మ చెంత బిడ్డలుగా ఏ విధంగా ఆడుకున్నవో, ఎక్కడెక్కడో వున్న ఎందరో సాధకులకు ఆ అమ్మ ఏ విధంగా ఆహారం పంపిందో, దూర శ్రవణం, దూర దర్శనం అత్యల్పమైన విశ్వ జనని చెంత ఎన్నో అనుభూతులు పొందిన ప్రభావతి - రాజు గారి కుటుంబం ధన్యమయినది. మల్లెలు, జాజులు కొల్లలు కొల్లలుగా పోసినట్లు అమ్మ దేహం , కట్టుకున్న చీరెలు వాసనలు వచ్చేవి. అన్నం దగ్గర్నుండి అన్నీ విపరీతమయిన వాసనలు వచ్చేవి. తట్టుకోలేక పోయేవారు. "నా కేమిటి నీకు కూడా వస్తాయ్" అని అమ్మ అంటే కొంతకాలం ప్రభావతి కట్టుకున్న చీరెలు కూడా అదే విధంగా గుబాళింపు వాసనలు వచ్చేవి.

## మన్నవ బుచ్చిరాజుగారు

మన్నవ బుచ్చిరాజుగారి తండ్రిగారి ఊరు మన్నవే. వీరి పేరు మన్నవ బాలకృష్ణ. వీరు గంగరాజు లోకనాథరావుగారికి మేనల్లుడు అవుతారు. అమ్మతో బంధుత్వం ఉన్నవారే. వీరిని అందరూ రాజు బావ అంటారు. "అనుభవసారం " అనే పేరుతో వచ్చిన పాటల పుస్తకం వీరు వ్రాసినదే. వారి దగ్గర సేకరించిన విషయాన్ని అందచేయటం జరుగుతున్నది.

వీరి మేనమామ గారికి షుగర్ వ్యాధి వచ్చి ఫారంతుమ్మముల్లు తొక్కినందు వలన కాలిబ్రొటన వేలు కొంత ఆపరేట్ చేశారు. అందువలన వారి మేనమామ లోకనాధంగారు అమ్మ చెంతకు వెళ్ళి ప్రసాదం తీసుకు రమ్మని బుచ్చిరాజుగార్ని 1954 జూన్‌లో జిల్లెళ్ళమూడికి పంపారు. అప్పుడు అమ్మ చెంతకు చేరి తాను వచ్చిన కారణం చెప్పారు. అమ్మ "లోకం బావ మేనల్లుడివి కదూ?" అని రాజుగార్ని అడిగారు. ఆ సందర్భంలో అమ్మ పొట్లకాయ తరుగుతూ వున్నది. 'ప్రసాదం తీసుకుని రమ్మని చెప్పా"రని తెలియచేశాడు రాజుగారు. తరువాత అమ్మ రాజుగారికి స్వయంగా భోజనం వడ్డించింది. పొట్లకాయకూర, కమ్మని సున్నిపొడి, గారెలు ఇంకా కొన్ని పదార్థాలు వడ్డించారు. అప్పుడు రాజుగారు "పొట్లకాయ కూర తినను " అన్నారు. 'చిఎందుకు అని?" అమ్మ అడిగితే " పాము మంత్రం చేస్తాను అందుకని" అన్నారు రాజుగారు. అమ్మ "పాము మంత్రానికి దీనికి సంబంధం ఏమిటి? అంటే "పాములాగ పొడుగ్గా వుంటుంది" అన్నారు రాజుగారు అమ్మ ఉంటే ఏమిటి? నీవు అంత మనస్సుని నిలిపిజపం చేసిన దానిని ఈ పొట్లకాయ ఆకర్షిస్తే అదే శక్తివంతమయినదన్నమాట. అప్పుడు దానినే పూజించవచ్చు. దీనికి దానికి సంబంధం లేదు. ఇది దేహానికి సంబంధించినది. అది మనస్సుకి సంబంధించినది. దీనికి దానికి సంబంధం లేదు. తినుచూద్దాం ఏమి చేస్తుందో". తరువాత కమ్మసున్నిపొడి తినమన్నారు అమ్మ.

రాజుగారు:- "అమ్మ! అది నాకు ఇష్టమే కాని, అది తింటే వాంతి అవుతుంది. అమ్మా, అందుకని తినను.

అమ్మ: తిను వాంతి అయితే వాంతి కాని, మళ్ళీ తిందువుగాని" వెంటనే రాజుగారు కమ్మసున్ని తిన్నారు. కాని వాంతి కాలేదు. మామూలుగానే వున్నది. అది మొదలు ఎప్పుడూ తింటూవుండేవారు. తరువాత లోకనాథంగారికి ప్రసాదం తీసుకుని కొమ్మూరు వెళ్ళారు రాజుగారు. లోకనాథంగారికి కాలికి సంబంధించిన వ్యాధి ఎక్కువయి గుంటూరు హాస్పటల్‌లో

చెప్పారు. ఈ విషయం తెలిసి అమ్మ తన పినతల్లి అయిన సౌభాగ్యమ్మ గారి కూతురు సావిత్రమ్మగారి ఇంట్లో వున్నారు. రాజుగారు సావిత్రమ్మగారి ఇంటికి వెళ్ళి అమ్మని లోకనాథంగారున్న హాస్పటల్‌కి తీసుకెళ్ళారు. అమ్మ వారిని చూసి కాలు ఎక్కడ నుండి తీసివేయాలి అన్నారో అక్కడి నుండి పాదం వరకు తన చేతితో రాసింది. తరువాత రాజుగారు వారి ఇంటికి రమ్మని ఆహ్వానించి తీసుకుని వెళ్ళారు. రాజుగారి తల్లి కారప్పూస పెడితే అది అందరికీ పెట్టారు అమ్మ. తరువాత లోకనాథంగారికి కాలు తీయవలసిన అవసరం లేక తగ్గింది.

తరువాత 1955లో దేవీ నవరాత్రులకి జిల్లెళ్ళమూడి వెళ్ళారు రాజుగారు. అమ్మ రాజుగార్ని కాలవలో స్నానం చేసి రమ్మన్నారు. అంతకు ముందు రాజుగారు తలమీద స్నానం చేసేవారు కారు. చేస్తే జలుబు చేసి బాగా బాధపడేవారు. అదీకాక మామూలు స్నానం కూడా రోజు విడిచి రోజు చేసేవారు. చలికాలం అయితే ఒక్కొక్కప్పుడు వారానికి ఒకసారి చేసేవారు. ఇటువంటి వారిని కాలువస్నానం చేసి రమ్మన్నది అమ్మ. అమ్మ చెప్పినదని కాలవస్నానం చేసివచ్చారు రాజుగారు. అది మొదలు ఎప్పుడూ తలస్నానం చేసేవారు. ఏ ఇబ్బంది లేదు. తరువాత కలశం ముందు కూర్చున్నారుఅమ్మ. ప్రక్కనే పీట వేసుకుని రాజుగారు కూర్చున్నారు. వీరిని సంకల్పం చెప్పమన్నారు అమ్మ. నాకు తెలీదన్నారు రాజుగారు. అప్పుడు అమ్మ "నిన్ను ఇక్కడ కూర్చోపెట్టా కూర్చో .పిచ్చి పిచ్చి వేషాలు వేయకుండా కదలకుండా కూర్చో మాటవినక పోయావా! తలపగలకొడతా" అని " ఊ చెప్పాను సంకల్పం. కాని నామాలు చదువు' అన్నారు అమ్మ (కలశాన్ని పట్టుకుని దేవీ రూపం వంక చూస్తూ) ఆ విధంగా అమ్మ అనగానే రాజుగారికి ముచ్చెమటలు పోసినవ్. ఆశ్చర్యపోయి ఎక్కడ లేని భయం వేసింది. వెంటనే లలితా సహస్రం, త్రిశతి అఘ మేఘాల వేగంతో చదివారు రాజుగారు. ఈ విధంగా నవరాత్రులు పూర్తి అయినాయి.

రాజుగారు కొంతకాలం 11 ఆవృతాలు ప్రాణాయామం చేసేవారు. మోతడక రామచంద్రరావుగారు, సీతాచలంగారు, లోకనాథంగారు వీరందరూ కలిసి అమ్మ దగ్గరికి వచ్చారు. అమ్మతో చాలాసేపు మాట్లాడారు. అమ్మ కాసేపు మాట్లాడి పడుకున్నారు. తరువాత వీరంతా వాళ్ళు వాళ్ళు మాట్లాడుకుని లేచారు. తరువాత మోతడక రామచంద్రరావుగారు రాజుతో మాట్లాడుతూ రాజు చేసే ప్రాణాయామం సంగతి విని " 11 ఆవృతాలు చేయవద్దని, నీ దేహానికి రెండు చాలని, ఏదైనా గురువు కావాలని లేకుండా చేయటం మంచిదికాజీ'దని చెప్పారు. రాజు ప్రాణాయామం చేసే రోజులలో వారి ముఖం పచ్చగా కాంతివంతం అయిందని వారి దేహం హాయిగా తేలికగా వుండేదని చెప్పారు.

మోతడక రామచంద్రరావుగారు అమ్మ భర్తగారైన నాగేశ్వరావుగారికి గురువుగారు.

ఇక్కడ గమనించవలసినది కలశాన్ని పట్టుకుని అమ్మ అన్న మాటలు ఒకటి "పరిపూర్ణులైన వారు సకల దేవదేవతలని లెక్క చెయ్యరని ఎందుకంటే వీరంతా తిరిగి తిరిగి తన ఆత్మ నుండి వెల్లివిరుస్తున్నట్లు వుంటుందని " శంకరులవారు చెబుతారు. నిందాస్తుతుల యందు సుఖ దుఃఖముల యందు సమదృష్టి కలిగిన అమ్మకి తనకు తానే శాసించుకున్నట్లు పొందే దివ్యాత్మానుభూతితో అనెడి మాటలవి. శాసనోల్లంఘనము, శాసనము రెండూ తానే అయి చేసిన ప్రకటన అది. ఇది పరిమితమయిన అహంభావంతో కూడుకున్న మనలాంటి మాటలు కావు. పూర్ణత్వానుభూతితో కూడుకున్న విలక్షణ విశిష్టతత్వం అది.

రెండవది మోతడక రామచంద్రరావుగారు మొదలైన వారు మాట్లాడుతుంటే అమ్మ పడుకోవటం. జ్ఞానానికి పరమావధి అయిన స్థితి కేవలం మాటలతో తేలేది కాదు. అదీ కాక సాధకుల అనుభవాలు కాని, శాస్త్రాల జ్ఞానం కాని పరిమితం. లక్ష్య మార్గాలు కాక లక్ష్యసిద్ధికి ఇదేఅనేదిలేదు. ఎవరి మార్గంలో పొందిన అనుభవాలు వారివి. పూర్ణత్వానికి ఈ అనుభవాలు పరిధి గీయలేవు. అందువలన వారి మాటలని చింతని సాగనిచ్చి వీరికై వీరే శాంతించిన తరువాత తాను చెప్పేది చెప్పటం ఇచ్చే స్థితి ఇవ్వటం జరుగుతుంది. ప్రకృతి స్వభావ గుణాలని అణచటం, బలవంతపు విశ్వాసాల మూసలో బిగించటం కాక వారి వారి మార్గాలలో పరివర్తన సహజంగానే వచ్చేట్టు చేస్తుంది. ఇందుకుగాను అప్పుడప్పుడూ మౌనంగా వుండటం, తన దోవన తాను నిద్రపోతూ పడుకోవటం జరుగుతుంది. ఇది కూడా అవతల వారికి ఇచ్చెడి శిక్షణలో భాగం. స్థూలంగా చూసేవారికి అయోమయంగా వుంటుంది. వారి చెంత సంఘటనల ద్వారా జరిగెడి ఉపచర్యలు, శిక్షణలు లోకసామాన్యులకు అర్థం అవటం కష్టమవుతుంది. అందువలన వారి దోవన వారిని వదిలి తన దోవన తాను పడుకుంది.

మూడవది రాజుగారికి ప్రాణాయామం చేయవద్దని అనటం. ముఖం కాంతివంతంగా వచ్చినప్పుడు , దేహం తేలికగా హాయిగా వున్నప్పుడు చేయవద్దని అనటం. రామకృష్ణ పరమహంస దేహం కొంతకాలం కాంతివంతంగా మెరిసిపోతుంటే ఆకర్షణకి జనం వస్తుంటే పరమహంస జగజ్జనని సన్నిధికి పోయి "తుచ్ఛమయిన భౌతిక ఆకర్షణకి ఈ జనం వస్తున్నారు. ఇదంతా నీవే తీసుకుని నా సహజ సిద్ధమయిన చావంచాయని ఇవ్వ"మని అడుగుతారు. తరువాత అట్లాగే జరుగుతుంది. అందువలన ఆధ్యాత్మిక పురోభివృద్ధికి ఏది పురోగమనమో, తిరోగమనమో తెలీదు. తాత్కాలికంగా మంచిగా కనబడుతూ వక్రగతిని పట్టించెడి స్థితులను ఆ విధంగా మాన్పిస్తుంది. ఈ విధముగా ఇతః పూర్వం వివరించిన మూడు సంఘటనల్లోని ధర్మసూక్ష్మాన్ని, ఆదర్శాన్ని గ్రహించాలి.

తరువాత ఒకసారి రాజుగారు పొగాకు బార్నీకి అమ్మ పర్ణశాలకి మధ్యలో వున్న రాళ్ళగుట్ట మీద కూర్చున్నారు. అమ్మ వారి దగ్గరికి వచ్చి చేతిలో మట్టి గడ్డ పెట్టి తినమన్నది. ఆ మట్టి గడ్డ నోట్లో వేసుకుంటే ఎక్కడలేని సువాసన వచ్చింది. ఆ మట్టినంతా తిన్నారు రాజుగారు. అమ్మ తన చిన్న తనంలో మన్నవలో జరిగిన సంఘటన రాజుగారితో ఈ విధంగా చెప్పారు. ఒకసారి మన్నవలో జరిగిన సంఘటనలను ఒక పెద్ద పుట్ట వెనకాలకి తను వెళ్ళి కూర్చున్నది. ఆ పుట్ట పది అడుగుల ఎత్తు వుంటుంది. ఆ పుట్ట వెనకాల బాస్పట్లు వేసుకుని కూర్చున్న అమ్మకి విపరీతంగా మూత్రం వచ్చి ఆ మూత్రం ఘుమ ఘుమ సువాసనలు వచ్చింది. వెంటనే అమ్మ దేహం పైకి తేలింది. అమ్మ దేహం ఆ పుట్ట అంత ఎత్తు తేలింది. తరువాత కొంతసేపటికి క్రిందికి వచ్చింది.

ఒకసారి అమ్మ ఈ విధంగా అన్నదట "కళ్ళు తెరిచేటప్పటికి అన్నం కుండ కనపడింది. తిన్నాను. ప్రత్యేకించి ప్రయత్నం ఏమీ చేయలేదు." దివ్యత్వం తానయిన అమ్మకి సాధనలతో పనిలేదని, దివ్యత్వం సిద్ధాన్నంలాగ వుంటుందని తెలియచేశారు అమ్మ.

## పి.వి.ఆర్ శంకర్

1962లో శంకర్‌గారు తనకి 14 సంవత్సరములు ఉన్నప్పుడు జగ్గాపురంలో ముద్దరామయ్యగారు వ్రాసిన 20 పద్యాల పుస్తకం అమ్మ పరంగా వ్రాసినవి చదివారు. గుంటూరులో పి.యు.సి. చదువుతున్నప్పుడు తూబాటి పార్థసారథి అమ్మను గురించి చెప్పాడు. ఇతను, శంకర్‌గారు స్నేహితులు, జాలాది నుండి ఈ ఏప్రియల్‌లో వీరు, వీరి తమ్ముడు, స్నేహితులు కలిసి జాలాది కొప్పర్రు అన్నపర్తి మీదుగా పాదయాత్రతో పెదనందిపాడు చేరి అక్కడ ఆగారు. మరునాడు జిల్లెళ్ళమూడి చేరారు. అప్పుడు పెద్ద మందిరంలో అమ్మ కూర్చున్నారు. వీరంతా అక్కడ నుల్చున్నారు. అప్పుడు మొదటి సారిగా వీరు అమ్మ ముఖతః విన్నమాటలని గురించి ఈ విధంగా చెప్పారు. "నిత్యమైంది సత్యం. తృప్తే ముక్తి. ఇష్టం లేనిది కష్టం. వర్గం లేనిది స్వర్గం" ఈ సూక్తులు అమ్మ ముఖతః విన్నారు. పండు మిరపకాయల చింతకాయ పచ్చడి తిన్నారు.

66-67లో మూలాంకులేశ్వరి కొండవీటి రెడ్డి రాజుల దేవత ఆలయంలో అమీనాబాద్‌లో ఉండగా మొదటిసారిగా లలితాసహస్రనామం పరిచయం అయి చేశారు. ఆ అమ్మే ఈ అమ్మ అనెడి భావం వుండేది. వీరు దేశంలో ఏ క్షేత్రం వెళ్ళినా ఏ నామరూపాన్ని చూసినా నా అమ్మ అనిపించేది. నర్సరావుపేటలో పనిచేస్తూ వుండగా ఇండియన్ బ్యాంకులో ఇన్‌టర్‌వ్యూ వచ్చింది. 69 నవంబర్ 25న కార్డు వచ్చింది. 24 ఇంటర్‌వ్యూ. నర్సరావుపేటలో గురునాథశర్మగారు శంకర్‌గారితో 'అయినా వెళ్ళిరా" అని సలహా ఇచ్చారు. అమ్మకి

నమస్కారం పెట్టి నర్సరావుపేట నుండి గుంటూరు వచ్చి ఇండియన్ బ్యాంకు లో అడిగితే " ఈ రోజు కూడా ఇంటర్వ్యూ లు విజయవాడలో వున్నాయ్" అని చెప్పారు. విజయవాడ వెళ్తే సాయంత్రం 5-30 అయ్యింది. విజయవాడలో దుర్గ గుడి వైపు తిరిగి నమస్కారం చేసుకుని ఆఫీసు వెళ్ళారు. అక్కడ ఒకాయన కూర్చుని ఇప్పుడు ఇంటర్వ్యూలు అయిపోయినాయి కదా? అని అన్నారు. ఏమీ పాలుపోక వర్షం వస్తుంటే అక్కడ ఒక ప్రక్కన నిల్చున్నారు. ఆఫీసులో కూర్చున్నవారు శంకర్‌గారిని పిలిచి 'మద్రాసు నుండి వచ్చిన ఆఫీసర్ కె.ఎస్. శాస్త్రిగారు మనోరమ హోటల్‌లో ఉన్నారు. అయినా ఒకసారి వెళ్ళి వారిని కలవమని సలహా ఇచ్చారు. వీరు మనోరమ హోటల్ వెళ్ళి ఆఫీసర్ గార్ని కలిసారు.

ఆఫీసర్ :- ఎక్కడి నుండి వస్తున్నావ్

శంకర్ :- నర్సరావు పేట నుండి

ఆఫీసర్ :- ఈ రోజు ఇంటర్వ్యూ అయిపోయింది కదా? ఇప్పుడు వచ్చావ్ ఏమిటి?

శంకర్ :- ఇంతకముందు నేను ఉన్న అడ్రస్ వేరు. ఇప్పుడు నేనువుండే చోటు వేరు, పోస్ట్ కార్డు అందేటప్పటికి ఈ రోజు అయింది. అయినా హోప్ పెట్టుకుని వచ్చాను.

ఆఫీసర్ :- నీకు మాథమాటిక్స్ లో ఎంత వస్తుంది?

శంకర్ :- సెంట్ పర్సంట్

ఆఫీసర్ :- తప్పకుండానా ?

శంకర్ :- తప్పకుండా వస్తాయి సార్.

ఇట్లా సంభాషణ సాగింది. అదే రోజు రాత్రికి ఆఫీసర్ గారికి రిజర్వేషన్ అయింది. ఇదంతా వారు తన రూమ్‌లో మంచం మీద పడుకుని శంకర్‌గారితో మాట్లాడారు. తరువాత ఆఫీసర్ గారు విజయవాడలో వున్న మరొక ఆఫీసర్ పేరు చెప్పి" వారు వస్తారు. కొద్దిసేపట్లో ఆయన వచ్చిన తరువాత చూద్దాం" అన్నారు. తరువాత విజయవాడలోని ఆఫీసర్ డి.ఎం. సోమేశ్వరరావుగారు వచ్చి విషయం తెలుసుకుని విసుగ్గా "ఇప్పుడు ఇంటర్వ్యూ ఏమిటి? అన్నారు. శంకర్ గారు ఈ ఆఫీసర్ గారికి కూడా తను లేట్ గా రావటానికి కారణం చెప్పారు. అప్పుడు మద్రాసు ఆఫీసర్‌గారు "నర్సరావుపేట ఎంత దూరం వుంటుంది?" అన్నారు "సుమారు 70 కిలోమీటర్లు" అని అన్నారు శంకర్‌గారు.

మద్రాసు ఆఫీసర్ :- "బికాజ్ ఆఫ్ హిజ్ హోప్ ఐ హావ్ బీన్ సెలెక్టెడ్ హిం" అన్నారు.

ఎందుకంటే అంతదూరం నుండి వచ్చి ఎంతో ఆకాంక్షతో ప్రయత్నం చేసినందుకు వారు ఆ విధంగా అన్నారు. అప్పుడు విజయవాడ ఆఫీసర్ కూడా ఒప్పుకున్నారు. తరువాత శంకర్‌గారికి 1970 జనవరి 16న అపాయింట్‌మెంట్ ఆర్డర్ వచ్చింది. ఏ కోశాన ఊహించని రీతిలో జరిగిన సంఘటన ఇది. జీవితానికే ఆధారమయిన అఘటన ఘటనాసంఘటన ఇది.

"సంఘటనల కూర్పే జీవితం అని, సంఘటనలు నేను కల్పిస్తాను. మీరు అనుభవిస్తారు" అని అమ్మ చెప్పారు. ప్రేరేపించే ప్రేరణ తానయిన అమ్మ తన అద్భుత లీల ద్వారా వారి జీవనానికి ఆధారం చూపించింది.

వీరు వీరి స్నేహితుడు 1984 నవరాత్రులలో అమ్మని దర్శించుకుని సాయంత్రం మోటారు బైకు మీద జోరున వర్షం వస్తున్న సమయంలో జిల్లెళ్ళమూడి నుండి బయలు దేరారు. వారి మోటార్‌కి వెనుక ముందు జోరున వర్షం. దారిలో అనేక ఊర్లలో జనం "ఈ వర్షంలో ఈ చీకటిలో ఎట్లా వెళ్తారు" అని అడిగారు. వీరు పెదనందిపాడు చేరారు. ఇంతవరకు వెనక ముందు పడిందికాని వారి మీద పడలేదు. తడవలేదు. వారికి ఆశ్చర్యం వేసింది. అక్కడి నుండి బయలు దేరి గుంటూరు చేరారు. చాలా మంది గుంటూరులో "మధ్యలో 4,5 చోట్ల బాగా వాగులు పొంగి ప్రవహిస్తున్నాయ్. ఈ బైక్ మీద మీరు ఎట్లా చేరారని " అడిగారు. కాని వీరికి ఏ వాగు అడ్డురాకుండా పొంగుతున్న వాగులే తగలకుండా గుంటూరు చేరారు. ప్రకృతి నడక నడకగానే సాగుతూ దాని ప్రభావం పడకుండా దారి చూపి దరిని చేర్చిన అమ్మకి నమస్సులు తెలియచేశారు. "సర్వానుల్లంఘ్య శాసనాయైనమః" అనెడి ఆర్యోక్తికి ప్రతిరూపం అమ్మ అని తెలియచేస్తుంది శంకర్‌గారి అనుభవం.

ఒకసారి శంకర్‌గారు, వారి స్నేహితుడు ఇద్దరూ కలిసి మోటార్ బైక్ మీద గుంటూరులో పట్టాభిపురం మీదగా శ్యామలానగర్ వెళ్తే త్రోవలో రైలుగేటుమీద నుండి వెళ్తున్నారు. రైలుగేటు ఎత్తు పల్లంగా వుంటుంది. గేటుకి ఎదురుగా గడ్డి బండి వస్తున్నది. అది గేటు ఎక్కుతున్నది. వీరిద్దరూ బైక్‌ని ఒక ప్రక్క నుంచి పోనివ్వచ్చులే అనుకుని ముందుకు సాగారు. ఎదురుగా వస్తున్న బండి ఎడ్లు బెదిరి వీరు వెళ్తున్న వైపు వేగంగా వచ్చినవి. వీరు బైక్‌ని ప్రక్కకు నడపబోయారు. అటువైపు పెద్దగొయ్యి వుండి ఇరువురూ బైక్‌తో సహా పడ్డారు. ఇది చూసినవారు వీరు ఏమైపోయారో ఎంత ప్రమాదం జరిగిందో అని ఖంగారు పడ్డారు. కాని వీరికి ప్రమాదం జరగలేదు. క్రొద్దిగా గాయం అయి వెంటనే లేచి బైక్‌ని పైకి తెచ్చి నడిపించుకుని వెళ్ళారు. "సర్వరక్షా స్వరూపిణి అమ్మ" కృపవలన ప్రాణాంతకమయిన ప్రమాదం నుండి ఆ విధంగా బయటపడ్డామని చెప్పారు శంకర్‌గారు.

**ఆ ఘటన ఘటనా కృపాస్వరూపిణి అమ్మ**

**సర్వానుల్లంఘ్య శాసనాయై నమః**

**సర్వరక్షా స్వరూపిణి అమ్మ**

పైన వివరించిన మూటి తత్వాల సారాంశాన్ని వీరి అనుభవం ద్వారా మనకు విశదమవుతుంది. వీరు వీరి కుటుంబం అమ్మపై అపార విశ్వాసంతో భక్తి శ్రద్ధలతో జీవిస్తూ ధన్యులైనారు.

## వఝ్ఝా అరుణ

అరుణ తల్లిదండ్రులు సీతామహలక్ష్మి, లక్ష్మీకాంతంగారు. లక్ష్మీకాంతంగారు నంబూరు గోపరాజుగారి పెద్ద కొడుకు. వీరిది గుంటూరు దగ్గర నంబూరు గ్రామం. గోపరాజుగారు నంబూరు గ్రామ కరణం. అమ్మ కి వరసకి బాబాయి అయితారు. అరుణ ధూళిపూడిలో వారి పెద్దమ్మ చెంత పెరిగింది. 1961లో అమ్మ మేనమామ గారైన చంద్రమౌళి సీతారామయ్యగారి కూతురు వివాహానికి అమ్మ తెనాలి వెళ్ళారు. అప్పుడు అరుణ తల్లి తెనాలి వెళ్తే మాటల సందర్భంలో అమ్మ ఆమెతో "నీకు అరుణ అనే కూతురు వుంది కదా!'అని అడిగారు. ఎవరిపై అమ్మ దృష్టి పడుతుందో వారు అమ్మని విశ్వసించటం అమ్మ సన్నిధికి చేరటం జరుగుతుంది. దీనికి నాందిగా అమ్మ అరుణని గురించి అడగటం జరిగింది. తరువాత కొంతకాలానికి అరుణ మేనమామగారైన వఝ్ఝా శివరామకృష్ణగారు అరుణని జిల్లెళ్ళమూడి అమ్మ చెంతకు తీసుకుని వెళ్ళారు . అమ్మని దర్శించి బాపట్ల వెళ్ళి ధూళిపూడి వెళ్ళింది అరుణ. ధూళిపూడిలో అరుణ ఈ విధంగా అనుకున్నది. "అమ్మ తన వంటి మీద ఉన్న వస్తువు ఏదైనా తనకి ఇవ్వాలి అమ్మ అయితే" ఇట్లా అనుకున్న మరుసటి రోజున శివరామకృష్ణగారు ధూళిపూడి వెళ్ళి "అమ్మ నీకోసం తన వంటి మీద ఉన్న సూత్రంలో నల్లపూస ఒకటి నీకని వుంచింది." అన్నారు. తన మనస్సులో అనుకొనటం మరునాడే ఈ కబురు అయాచితంగా అందటం అరుణకి ఆనందం ఆశ్చర్యం వేసింది.

తరువాత శివరామకృష్ణయ్య గారి పెద్ద కుమారుడు వఝ్ఝా ప్రసాదుతో జిల్లెళ్ళమూడిలో అమ్మ దివ్యాశీస్సులతో వివాహం జరిగింది. శివరామకృష్ణయ్యగారు ప్రసాదు వారి కుటంబం అమ్మ చెంతకు తరచూ వస్తూ వుండటంతో అరుణ కూడా అమ్మని పదే పదే దర్శించటం జరిగేది. క్రమేపి అరుణకి కూడా అమ్మపై విశ్వాసం ఏర్పడింది. ప్రసాదుకి కొన్ని సంవత్సరాలు చావు భయం అనెడి రుగ్మత పట్టుకున్నది. 1972లో శివరామ క్రిష్ణయ్యగారు అమ్మలో ఐక్యమయినారు. హైదరాబాదులో ప్రసాదు ఉద్యోగం చేస్తూ వుండేవారు. ఆ రోజులలో ప్రసాదుకి వళ్ళంతా చల్లపడి చనిపోతాననెడి భయంతో మనిషి ఆహారం తీసుకోకుండ చిక్కిపోయి ఏమౌతాడో అనెడి ఖంగారు పట్టుకున్నది. ఆ సందర్భంలో ప్రసాదు తమ్ముడు మల్లిఖార్జున్ అమ్మ చెంతకు పోయి "అమ్మా! మాకు నాన్న పోయాడు, అన్నయ్య కూడా లేకుండా పోతే ఎట్లాగమ్మా?"అని విలపించాడు. అప్పుడు అమ్మ పాదతీర్థం యాపిల్ పండు ప్రసాదం తీసుకుని హైదరాబాదు వచ్చి ప్రసాదుకు ఇచ్చాడు. అవి తీసుకొనటానికి ప్రసాదుకు ఇష్టం లేక తీసుకొనను అన్నాడు. కాని అరుణ, మల్లిఖార్జున్ పట్టు పట్టి అవి తీసుకోవాలి అన్నారు. పండులో కుల్లిన భాగాన్ని తీసివేసి మిగిలిన పండుని తిన్నాడు

ప్రసాదు. తీర్థం కొద్ధిగా తీసుకున్నాడు. రెండు మూడు రోజులు గడిచేటప్పటికి ఆ తీర్థం క్రమేపి స్వచ్ఛందంగా అయి కర్పూరపు సువాసన కలిగిన తీర్థంగా అయింది. ఈ తీర్థం ఆ విధంగా మారుతున్న కొలది ప్రసాదు ఆరోగ్యం కూడా మారుతూ వచ్చి బాగుపడింది. ఈ విధంగా అమ్మ పంపిన తీర్థం , ప్రసాదం సంజీవని అయి ప్రసాదుని సంరక్షించి కాపాడింది. తరువాత ఒకసారి అమ్మ చెంత ప్రసాదు కూర్చుంటే " ఎందుకురా అట్లా భయపడతావు? నీ వెన్నంటి నేను లేనూ ..... ? అంటూ వీపు మీద లాగి తన చేత్తో ఒక్క దెబ్బ కొట్టింది. ఆ తరువాత ప్రసాదుకి ఆ భయం పోయింది. ఈ విధంగా అభయప్రదాయిని అమ్మ వారి జీవితాన్ని కాపాడింది.

1984లో ప్రసాదు మచిలీపట్నంలో ఉద్యోగం చేస్తూన్న రోజులవి. ఆ రోజులలో అరుణ అవనిగడ్డ వెళ్ళి హిందీ చదువుకుంటూ వుండేది. ఒక రోజు బస్సు ఆలస్యం అగుట వలన బస్సులో వారిని టైమ్ అడిగితే 10-45 అన్నారు. అది అవనిగడ్డ చేరేటప్పటికి 10 నిమిషాలు. . అరుణ కాలేజీకి చేరేటప్పటికి ఇంకొక 10నిమిషాలు . ఎట్లాగైనా దరిదాపు 20లేక 30 నిమిషాలు పడుతుంది. 10-30కి కాలేజి. తను మనస్సులో విపరీతంగా బాధ పడింది. ప్రిన్స్‌పాల్ నిలపెడతాడు, అడుగుతాడు తనేమి చిన్నపిల్లకాదని ఆ విధంగా అడిగించుకోవటం బాగుండదని బాధ పడింది. కాలేజీకి వెళ్తే అప్పుడే మొదటి గంట కొట్టారని హాస్టల్‌లోని వారు క్లాసుల్లోకి వెళ్తూ వెళ్తూ వున్నారు. అప్పుడు అరుణ ఆశ్చర్యంగా "ఇంకా ప్రిన్స్‌పాల్ గారు రాలేదా? క్లాసులు మొదలు కాలేదా ? అని అడిగితే " ఇంకా 10-20య్యే కదా అయింది ఇప్పుడే మేమంతా వెళ్తున్నాం. ప్రిన్స్‌పాల్‌గారు రాబోతున్నారు అన్నారు. అమ్మ కాలాన్ని ఏ విధంగా ఆపిందో తలుచుకుంటే అంతులేని ఆశ్చర్యం వేసి పులకించి పోయింది అరుణ. కాల గమనాన్ని తన కోసం అపిన అమ్మ కరుణని, అనంతశక్తిని తలచుకొని నివాళులర్పించింది.

1985 జూన్ 12న అమ్మ మహాసిద్ధి పొందారు. వీరి కుటుంబం తరువాత కొంతకాలం మచిలీపట్నంలో వున్నారు. అప్పటికి అరుణ పరీక్షలురాసింది. ఒక రోజు అమ్మ వ్యక్తిగా కనబడి అరుణని తట్టి "లే! నువ్వు పాస్ అయినావు" అని తనకు వచ్చిన మార్కులు కూడా చెప్పటం జరిగింది. మరునాడు మధ్యాహ్నం పోస్ట్‌లో మార్పులు కూడా అమ్మ చెప్పినట్లే వచ్చినవి. "నేను చేయ తలచుకున్నదానికి నాకు శరీరమే అక్కర్లేదు " అని అమ్మ చెప్పినట్లు అమ్మమహాసిద్ధి పొందిన తరువాత ఆ విధమయిన అనుభవాన్ని ఇచ్చారు అమ్మ.

ఒకసారి శ్రీకాకుళం జిల్లా అరుసవిల్లి సూర్యదేవాలయంలో దర్శనానికి వెళ్ళారు ప్రసాదు అరుణ దంపతులు. ఆ రోజు ఆదివారం సూర్యునికి ముఖ్యమయిన రోజు అయినందున జనసందోహం ఎక్కువగా వున్నది. పూజారి వేషంలో వున్న ఒక వ్యక్తి వచ్చి వీరిది ప్రత్యేక దర్శనం లేండి! లేండి! అంటూ లోపలికి తీసుకుని వెళ్ళి దర్శనం చేయించారు.

మరుక్షణంలో ఎటు చూసిన ఆ వ్యక్తి కనిపించలేదు. అరుణ దంపతులు తీసుకున్నది అందరితోపాటు పావలా టికెట్టే. కాని అంతమంది జనంలో ప్రత్యేకమయిన దర్శనం ఇప్పించిన అజ్ఞాత వ్యక్తి రూపంలో దేశకాలాతీతమైన అమ్మ ఇచ్చిన అనుభూతికి, కరుణకి అంజలి ఘటించారు ప్రసాదు అరుణ దంపతులు. ఒకసారి వీరి కుటుంబం బంధువులు కలిసి రమణ మహర్షి ఆశ్రమం వెళ్ళారు. అందరూ కలిసి ఉదయాన్నే ఫలహారం కాఫీ తీసుకుని గిరి ప్రదక్షిణానికి బయలుదేరాదు. క్రొద్ది దూరం వచ్చిన తరువాత ఒక మలుపు వస్తుంది. అక్కడ రెండు త్రోవలు చీలుతాయి. ఒకటి అడవిలోకి వెళ్తుంది. రెండవది చుట్టూ వున్న మెయిన్ రోడ్డు. వీరు మెయిన్ రోడ్డులో వెళ్తూ వీరు వెళ్తున్న రోడ్డు సరియైనదా? లేక ఇతః పూర్వం చూసిన రోడ్డు సరియైనదా? అటు వెళ్ళాలా అని సందేహిస్తూ నిమిష నిమిషానికి వెనక్కి తిరిగి చూస్తూ వెళ్తున్నారు. క్రొద్దిదూరం వెళ్ళిన తరువాత వీరికి 10-15 గజాల దూరంలో ఒక వ్యక్తి నవ్వుతూ వీరి వంక చూస్తూ నిలపడింది. ఆ రోడ్డుకి ఇరుప్రక్కలా చెట్లు వున్నాయ్. క్షణక్షణానికి వెనక్కి తిరిగి చూస్తూన్నా ఎవ్వరూ కనపడని వీరికి ఆ వ్యక్తి చెట్టు కొమ్మ నుండి క్రిందికి దూకిందా ? అన్నట్లు వీరికి అనిపించింది. ఆ వ్యక్తి వచ్చీ ప్రసాదుతో ఇంగ్లీషులో మాట్లాడింది. దారి ప్రక్కనే వున్న గౌతమీ ఆశ్రమము చూపించింది. కుబేర లింగం దగ్గరికి దేవతలు వస్తారని అభిషేకం చేస్తారని తరువాత అరుణాచలేశ్వరునికి అభిషేకం చేసి వెళ్తారని చెప్పినది. కుబేర లింగం దగ్గర వీళ్ళుకాసేపు కూర్చున్నారు. అరుణకి రమణాశ్రమ లేఖలు చదివి వినిపించాడు ప్రసాదు. ఆ వచ్చిన వ్యక్తి తను కూడా మరొక పుస్తకం చదువుతూ కూర్చున్నది. మళ్ళీ గిరిప్రదక్షిణం మొదలుపెట్టారు. ప్రసాదు ఆమెను " మీదే ఊరు" అని అడిగితే అన్నీ ఊర్లు నావే"నన్నది. "నీ పేరేమిటి?" అంటే " అన్ని నామాలు నావేనన్నది" మధ్యలో మాట్లాడపోతే "ఇ...ష్ మాట్లాడవద్దని నామం చేస్తూ నడవమ"న్నది. అరుణని " నీ పేరేమిటి" అని తెలుగులో అడిగింది. అరుణాచలేశ్వరుని గుడి శిఖరం చూస్తే గిరిప్రదక్షణం పూర్తి అయినట్లు చెబుతారు. అంతవరకు ఆమె వీరితో నడిచింది. కొంతదూరం ఊరి వైపు నడిచి అక్కడ వున్న కొండగుహలోకి వెళ్తూ "నేను ఈ గుహలో వుంటాను. నా పేరు సత్యానంద" అని చెప్పి వెళ్ళిపోయింది. తరువాత వీరు రమణాశ్రమం చేరారు. ఆశ్రమం నిర్వాహకులు మణిగారిని, ఇంకా మరి కొందరిని "ఇక్కడ సత్యానంద అనెడి విదేశీ సన్యాసిని వున్నదా?అంటే అటువంటి వారు ఎవరూ లేరని వారు చెప్పారు. అక్కడ అమ్మ ఈ విధమయిన అనుభవం వారికి ఇచ్చింది.

మరొకసారి అన్నవరం సత్యనారాయణ స్వామి దేవాలయంలో వ్రతం చేసుకుని స్వామి దర్శనం కోసం చాలా పెద్ద క్యూలో నిలబడ్డారు వీరి కుటంబం. ఇంతలో ఒకాయన వచ్చి "మీరు కళ్యాణానికి డబ్బు కట్టారా?" అని అడిగితే, ప్రసాదు ఏదో ధ్యాసలో "కట్టాం"

అన్నాడు. వెంటనే వారిని ముందుకు తీసుకుని వెళ్ళి దర్శనం ఇప్పించారు ఆ వచ్చిన వ్యక్తి. ఈ విధంగా కాకపోతే ఆ రోజు వున్న జనసందోహానికి రాత్రి 10గంటలు అయ్యేది. కాని వారికి అరగంట చక్కగా దర్శనం అయి బయటికి వచ్చారు. కాని వారు కళ్యాణానికి డబ్బు కట్టలేదు. యాదృచ్ఛికంగా జరిగిన ఈ సంఘటనకి వారు ఆనందించి అమ్మకి అంజలి ఘటించారు.

ఒకసారి వీరు కంచి క్షేత్రం వెళ్ళారు. అక్కడ అంతా అరవం కదా? ఇబ్బంది అవుతుందని అనుకున్నది అరుణ. కాని అక్కడ దేవాలయం ఎన్క్వైరీ ఆఫీస్‌లో ఒకాయన వీరితో "మాది తెనాలి దగ్గర వేమూరు. మేము కంభంపాటి వాళ్ళం" అని చెప్పి వీరికి చక్కగా దర్శనం ఇప్పించారు. కంచిలో కామాక్షి ని దర్శిస్తే మళ్ళీ మళ్ళీ దర్శించాలనెడి భావం ఉప్పొంగి అదే దేవతామూర్తి ఎంతో ఆహ్లాదంగా కనపడింది వీరికి. ఈ విధంగా ఎక్కడికి వెళ్ళినా అనుక్షణం అమ్మ వెన్నంటి వీరిని నడిపిస్తున్నదనెడి అనుభూతి కలిగింది.

ఒకసారి వరఘూప్రసాదు అమ్మ గదిలోకి వెళ్తే అమ్మ మంచం మీద ఉండి శూన్యమయిపోయి మంచం మీద ఎవరూ కనపబడలేదు. ఈ విధమైన అనుభూతితో కాసేపు దిగ్భ్రమ చెంది అయోమయమైపోయాడు ప్రసాదు. తరువాత అమ్మ వ్యక్తిగా కనపబడింది. భౌతికమైన పదార్థానికి మూలం ఆకాశమని ప్రేరణకి ప్రాణశక్తి మూలమని చెబుతారు. సర్వం తానయిన అమ్మకి సర్వం సామాన్యమే కదా! వ్యక్తిగా అదృశ్యమయి శూన్యాకాశంగా కనపడుటమనేది మూలమయిన తత్వం ప్రేరణ తానని తెలియచేయటమే అవుతుంది. మాటలుగా కాక అనుభవ పూర్వకంగా ఇచ్చారు అమ్మ.

అం ఆ

## బి.జి.కె. శాస్త్రిగారు - విజయకుమారి సుబ్బలక్ష్మి

బి.జి.కె. శాస్త్రిగారు గుంటూరు వాస్తవ్యులు. వీరు నర్సరావు పేటలో హోమ్-మినిస్ట్రీ లో ఉద్యోగం చేస్తూ ఉండేవారు. 1962వ సంవత్సరంలో నర్సరావు పేటలో ఉన్నారు. లలితాంబగారు అనెడి మరొక అమ్మ భక్తురాలు జిల్లెళ్ళ మూడి వస్తూ అమ్మని అపారమయిన భక్తితో ఆరాధిస్తూ ఉండేవారు. లలితాంబగారు బి.జి.కె. శాస్త్రిగారికి బంధువు. 62లో లలితాంబగారి ఇంటికి అమ్మవెళ్ళారు. ఆ సందర్భంలో లలితాంబగారు శాస్త్రిగారికి అమ్మ తన ఇంటికి వస్తున్న సంగతి చెప్పారు. శాస్త్రిగారు అమ్మ దర్శనార్థం లలితాంబగారి ఇంటికి వెళ్ళారు. అమ్మలలితాంబగారి ఇంట్లో గదులన్నీ తిరుగుతూ ఒక ప్రక్కగా గోడకి ఆనుకుని నమస్కరిస్తూ నిలుచున్న శాస్త్రిగారి దగ్గరకు వచ్చి చేతులు పట్టుకుని వాత్సల్యంగా తట్టి వెళ్ళారు. తన నమస్కారాన్ని అమ్మ ఆ విధంగా స్వీకరించిందని సంతృప్తిచెందారు శాస్త్రిగారు. అమ్మ చెంతకు శాస్త్రిగారు వెళ్ళకపోయినా అమ్మశాస్త్రిగారి చెంతకు వెళ్ళారు. ఈ విధంగా

ఏమూలనున్న బిడ్డనయినా దరి చేర్చేమాతృవాత్సల్యానికి అంజలి ఘటించారు శాస్త్రిగారు.

62లో అమ్మ చీరాల వెళ్ళారు. ఆసందర్భంలో వారి సతీమణి విజయకుమారి సుబ్బలక్ష్మిగారిని కూడా అమ్మ దర్శనార్థం తీసుకుని వెళ్ళారు శాస్త్రిగారు. అమ్మ బత్తాయిరసం త్రాగుతుందని వినినందువలన బత్తాయిపళ్ళు కొనుక్కొని వీరిద్దరూ వెళ్ళారు. వేదిక మీదకి వెళ్ళిపోతూ అమ్మ"బత్తాయిరసంతాగాలని ఉన్న"దని అన్నారు. అదే సమయంలో వీరిద్దరూ వెళ్ళి అక్కడ ఉన్నవారికి పళ్ళు ఇస్తే బత్తాయిరసంతీసి ఇచ్చారు అక్కడ ఉన్నవారు. ఈ విధంగా అమ్మకి ఎట్లా ఇవ్వటమా? అనెడి ఆర్తితో ఉన్న వీరి కోరికని అమ్మతీర్చటం జరిగింది. తరువాత అమ్మ వేదిక మీదకి వెళ్ళి దర్శనం ఇస్తున్నారు. సుబ్బలక్ష్మి అక్కయ్యకి అమ్మకి విసరాలని తీవ్రమయిన ఆకాంక్ష కలిగింది. ఎట్లా వేదిక మీదకి వెళ్ళాలా అని అనుకుంటూ ఉండగా పదేళ్ళ పిల్ల వేదికమీదకి వెళ్తూ" మా మనిషేరానివ్వండని" వేదిక మీదకి తీసుకుని వెళ్తే అక్కయ్య అమ్మకి విసిరింది. ఈ విధంగా తమ మనసులోని కోరికను అమ్మతీర్చింది. ఈ సంఘటనలతో వారికి ఎనలేని సంతృప్తి విశ్వాసం ఏర్పడింది.

63 జులై లో వీరి పెద్దమ్మాయి పుట్టినప్పుడు వీరు వీరి బంధువులతో జిల్లెళ్ళమూడి వెళ్ళారు. వీరి పెద్దమ్మాయికి "ఫణీదేవి" అని పేరు పెట్టారు అమ్మ. అమ్మ కొంతమందిని తన చెంత ఉండమంటుందని విన్నారు అక్కయ్యగారు. అందువలన అమ్మ చెంత ఉండాలని కోరిక కలిగిన అక్కయ్యకి అమ్మ ఉండమని చెబుతుందేమోనని లోపల గదిలో నుండి కదలి బయటకు రాకుండా సాయంత్రం దాకా కూర్చున్నారు. వీరికుటుంబ సభ్యులందరూ తిరిగి ప్రయాణమై ఎంత సేపటికి ఈవిడరావటం లేదేమిటి? అని బయట వేచి ఉన్నారు. అప్పుడు అమ్మ బాలింతలాగ ముసుగు వేసుకుని చెవులకు గుడ్డకట్టుకుని వీరి పాపని ఎత్తుకుని బయటకు వచ్చి వందగజాల వరకు నడిచారు. వెంటనే అక్కయ్యగారితో సహా అందరూ అమ్మ వెంటనడిచారు. 100 గజాలు నడిచిన అమ్మ ఆగి పాపని అక్కయ్య చేతికి ఇచ్చి "వెళ్ళు" అన్నారు. వెంటనే అక్కయ్య శాస్త్రిగారితో, వచ్చిన బంధువులతో జీపు ఎక్కి బయలుదేరారు. ఒక్కొక్కప్పుడు మనకోరికలు తాత్కాలికంగా అతీతంగా ఉన్నట్లువుంటయ్. కాని మనం నడవవలసిన జీవన పథంలో మనలను నడిపి తరింపచేస్తుంది. అమ్మ. ఎవరి మార్గాలు ఎట్లా నిర్దేశింపబడినవో తెలిసిన అమ్మ ఆ విధంగా నడుపుతుంది. సంసారం నుండి తప్పుకోవటంకాక సంసారం లో ఉండే తరింపచేసెడి పథంలో అమ్మ అక్కయ్యని తన బాధ్యతని తెలియచేస్తూ పంపింది.

**ఈ పర్యటనలోనే మరొక ముఖ్య విషయం:-**

వీరు అమ్మదర్శనార్థం వస్తూ సబ్బు, గంధం పన్నీరు మరికొన్ని స్నానానికి సంబంధించినవి తీసుకుని బయలు దేరారు. జిల్లెళ్ళమూడి లో అమ్మ స్నానానికి వెళ్ళకుండా "వాళ్ళు

తెస్తున్నారు" అంటూ వీరు జిల్లెళ్ళమూడి వెళ్ళి తెచ్చినవన్నీ ఇచ్చేదాక స్నానానికి వెళ్ళకుండా కూర్చున్నారు. ఈ విధంగా సాక్షాత్ జగజ్జనని వీరి ఆర్తిని వీరు ఇవ్వదలచిన వానిని ఆ రకంగా స్వీకరించిందని ఆనందించారు. బిడ్డ ఏమి ఇచ్చినా స్వీకరించే మాతృవాత్సల్యానికి పులకించిపోయేవారు. లోకజననికి లేకనా? ఇవ్వన్నీ కావాలా! బిడ్డ సంతృప్తి కోసం అవసరాలు కల్పించుకుని సంతృప్తిని ఇచ్చెడి దైవం అమ్మ.

ఒకసారి వీరి పెద్ద అమ్మాయి 2 సంవత్సరాల పసిపిల్ల అయినప్పుడు శాస్త్రి గారు అక్కయ్యగారు 7 వ మైలులో దిగి నడిచి వస్తున్నారు. అక్కయ్య చేతిలో రెండవ కూతురు ఉన్నది. మరొ చేతిలో సంచీ ఉన్నది. శాస్త్రిగారు సంచీలు పట్టుకుని ముందు నడస్తుంటే వెనక అక్కయ్య నడుస్తుంటే వీరిద్దరికి మధ్యలో అంత చిన్నపిల్ల జిల్లెళ్ళమూడి దాక నడిచివచ్చింది. ఇంతదూరం ఆ రోజులలో అట్లా నడిచిరావటం వారికి ఆశ్చర్యం వేసింది. ఎవరికి ఏ విధమయిన శక్తినిచ్చి అమ్మ నడిపిస్తుందో మనపరిధికి అందని విషయం. పెద్దకొండ దగ్గరికి వెళ్ళి గులకరాయిని అడిగినట్లు అమ్మని మనం కోరికలు కోరుకుంటూ అడగటమేమిట? అని అనుకుండే వారు శాస్త్రిగారు, అక్కయ్యగారు. 62లో అమ్మని దర్శించిన తరువాత శాస్త్రిగారికి సిక్కిం ట్రాన్స్‌ఫర్ అయింది. సాక్షాత్ జగజ్జననిని వదిలి ఇక్కడ ఉండటమేమిటని రిజైన్ ఇచ్చి అమ్మ మీద భారం వేసి గుంటూరు వచ్చారు శాస్త్రిగారు. అప్పట్లో వారు చేస్తున్న ఉద్యోగం ఆఫీసర్ పోష్టు . అయినా రిజైన్ చేసి వచ్చారు. తరువాత వీరికి బందరులో లైఫ్ ఇన్‌సూరెన్స్‌లో ఉద్యోగం వచ్చింది. రెండు మూడు ఉద్యోగాలకి ఇంటర్‌వ్యూలకి వెళ్ళారు వీరు. ఎల్.ఐ.సి తోపాటు బరోడా బ్యాంక్ కి కూడా ఇంటర్‌వ్యూకి వెళ్తే దీనిలో కూడా వారికి జాబ్ వచ్చింది. గుంటూరు బరోడా బ్యాంక్‌లో ఆఫీసర్ పోస్ట్ వచ్చింది వీరికి. 63 నుండి 69 వరకు గుంటూరు లో ఉన్నారు. అక్కయ్యకి ఒకసారి కలలో సహస్రనామంలో ఒకనామం మార్చి (లలితా సహస్రంలో) ఇచ్చారు అమ్మ. అక్కయ్యకి మంత్రం అంటే ఏమిటో తెలియదు. అమ్మ చెంతకూర్చుంటే "మంత్రం ఇస్తానుపుచ్చుకుంటావా? " అని అడిగారు అమ్మ, యాంత్రికంగా విని ఊరుకుంది కాని ఏమి అనలేదు అక్కయ్యగారు. తరువాత కలలో 68వ సంవత్సరంలో కార్తీక మాసంలో అమ్మ మంత్రం ఇచ్చింది. ఆ మంత్రం అక్కయ్య చేసుకుంటూ ఉండే వారు. ఈ విధంగా ఇలలో అమ్మ అడిగితే యాంత్రికంగా విని ఊరుకున్న అక్కయ్యగారు కలలో అమ్మ ఇచ్చిన మంత్రాన్ని చేసుకొనటం జరిగింది.

"నేనే మిమ్మల్ని కని మీ తల్లి తండ్రులకి పెంపుడు ఇచ్చాను" అనెడి అమ్మ సూక్తి వీరికి

ఎప్పుడూ స్ఫురిస్తూ ఉండేది. కారణం వీరి మనసులో కోరికను , వీరు ఏమి తెచ్చినా స్వీకరించి సంతృప్తిని ఇచ్చేది అమ్మ వాత్సల్యం చూస్తుంటే పైన వివరించిన అమ్మ సూక్తి గుర్తుకు వస్తూ ఉండేది వీరికి. గుంటూరు లో రాచర్ల లక్ష్మీన్నారాయణగారు ఎక్కువగా అమ్మని గురించి వీరికి చెబుతూ ఉండేవారు. ఒకసారి శాస్త్రిగారు అమ్మని "సెల్ఫ్ రియలైషేజను ఎట్లా వస్తుంది?" అని అడిగితే " నీకుందిగా నాన్నా" అన్నారట అమ్మ. ఈయన ఆశ్చర్యపోయారట. "మీలో నేను దైవత్వం చూస్తాను. మీరు నాలో మానవత్వం చూస్తారు"అనెడి అమ్మ వాక్యం తలచుకుని అమ్మ జవాబును ఈ విధంగా సమన్వయం చేసుకున్నారు. సర్వత్రాదైవాన్ని చూస్తున్నది కనుక " నీకుందికదా! నాన్నా" అన్నారని, ఎప్పటికయినా సెల్ఫ్ రియలైషేజన్ వస్తుందేమో నని సంతృప్తి చెందారు. ఎందుకంటే అమ్మకి సర్వం వర్తమానమే కనుక ఏ జన్మకైనా వస్తుందేమోనని వీరి భావన.

64లో వీరి రెండవ అమ్మాయికి అన్నప్రాశన చేయించాలని జిల్లెళ్ళమూడి వచ్చారు. అప్పుడు రాచర్ల కమలక్కయ్యకి అమ్మ హోమియోమందు చెబుతున్నదట. శాస్త్రిగారి పెద్దమ్మాయికి చెవులో చీముకారుతూ ఉండేది ఆ రోజులలో. రాచర్ల కమలక్కయ్యకి హోమియో మెడిసెన్ చెబుతున్నదికదా? తను కూడా వీరి పెద్దమ్మాయి సంగతి చెబుదామా? అని సుబ్బలక్ష్మి అక్కయ్య మనస్సులో అనుకుంది, కాని చెప్పలేదు. జగజ్జననికి కాలునొప్పి చెవులో చీము ఇటు వంటివి చెబటం ఏమిటని అనుకుని చెప్పలేదు. కాని వీరు అమ్మకి ఏమీ చెప్పకుండా ఏమందు లేకుండా గుంటూరు తిరిగి వచ్చిన తరువాత వీరి పెద్దమ్మాయికి చీముకారటం పోయి పూర్తిగా నయమయింది. "మనస్సులో ఉద్దేశ్యం తెలిసినప్పుడు వాక్కుతో పనిలే" దని అమ్మ వాక్యం తలుచుకుని ఆ వాక్యానికి ప్రతిరూపం అమ్మ అని నమస్సుమాంజలలు అర్పించారు. శాస్త్రిగారు సుబ్బలక్ష్మి అక్కయ్యగారు. అమ్మని సాక్షాత్ దైవంగా విశ్వసించి జీవితం ధన్యమయిన పుణ్యదంపతులు వీరు. ఒకసారి కలలో అమ్మ పాదాలలో కొండలు కోనలు నదులు ఈ విధంగా విశ్వమంతా కనపడింది అక్కయ్యగారికి. శాస్త్రిగారికి పాట్నా ట్రాన్స్‌ఫర్ అయి వెళ్ళారు. పాట్నాలో రాజేంద్రప్రసాద్ అనెడి సోదరునికి అమ్మని గురించి చెప్పి జిల్లెళ్ళమూడి తీసుకుని వచ్చారు. అంతకుముందు రాజేంద్ర ప్రసాద్ గారికి డిప్రెషన్ ఉండేదట. అమ్మ చెంతకు వచ్చిన తరువాత అదిపోయింది. రాజేంద్ర ప్రసాద్‌గారు తరువాత అమ్మపై అపార విశ్వాసంతో జీవించారు. హైదరాబాదులో 82 నుండి 94 వరకు మొదటి ఆదివారం పూజ వీరి ఇంట్లోనే జరిగేది. వీరి భార్య విజయలక్ష్మి అమ్మ అంటే భక్తి, అపారమయిన సేవా తత్పరత కలిగిన వ్యక్తి. బి.జి.కె. శాస్త్రిగారి ద్వారా అమ్మ

చెంతకు చేరిన రాజేంద్ర ప్రసాదుగారి కుటుంబం కూడా అమ్మ ఆరాధన సేవలో ధన్యమయినది. హైదరాబాదులో ప్రతినెల 4వ ఆదివారం బి.జి.కె.శాస్త్రి గారి ఇంట్లో అమ్మపూజ జరుగుతున్నది. ఆనాటి నుండి ఈనాటి వరకు అమ్మని ఆరాధించు కుంటూ ధన్యులైనారు శాస్త్రిగారు సుబ్బలక్ష్మి అక్కయ్య దంపతులు.

## వల్లూరిరామమోహనరావుగారు -బాలక్కయ్య

అమ్మ చెంతకు చేరి అపారమయిన విశ్వాసంతో అమ్మని సేవించుకుని ధన్యులైన దంపతులు వల్లూరి రామమోహనరావుగారు బాలక్కయ్య.59-60లో బాలక్కయ్య అమ్మని దర్శించటం జరిగింది. జిల్లెళ్ళమూడిలో బాలక్కయ్య క్రిష్ణవేణక్కయ్య విడిగా ఏదితిన్నా చాలా క్రొద్దిగా తినెడివారు. అది అన్నం కాని మరేదైనా. అటువంటిది అమ్మ స్వయంగా పెడితే ఎక్కడ లేని తిండి తిన్నప్పటికి ఇంకా ఆకలిదహించేదట. ఆ విధమయిన ఆకలి ఎట్లా వేసేదో అమ్మ ఆ విధంగా ఎందుకు చేసేదో అవగతమయ్యేదికాదు వీరికి. అమ్మ పర్ణశాలలో ఉండే రోజులలో ప్రక్కనే ఉన్న రెల్లమందిరంలో ఒకమూలగా పడుకుంది బాలక్కయ్య. అప్పుడు నిద్ర మెలకువ కాని స్థితిలో అక్కయ్యకి రకరకాల ఆభరణాలతో దేదీప్యమానంగా వెలిగిపోతూ వెడల్పాటి నాగేంద్రుని రూపం కనపడింది. అప్పుడు అక్కయ్య బహిష్టు అయిన రోజులు. మూడురోజులు అయిన తరువాత అమ్మ చెంతకు వెళ్తే "అమ్మ, ఈ మూడురోజులలో నీకేమైనా కనపడిందా?" అని అడిగింది." ఏమీ లేదు" అన్నది అక్కయ్య, ఏమీ కనపడలేదా, ఈ మూడు రోజులలోజి" అని నొక్కినొక్కి అడుగుతూ ముందుకు వచ్చి కనపడినా గుర్తించలేరు. అన్నది అమ్మ. సరిగ్గా తనకి కనపడిన రూపమే అమ్మ ముఖంలో కనపడింది. అమ్మ పై మాట అంటున్నప్పుడు . ఎప్పుడైతే అమ్మ అట్లా అన్నదో అక్కయ్యకి ఒళ్ళు జలదరించింది. అనటమేకాక అమ్మలో అదే దర్శనం మూడురోజులు కలిగింది. బాలక్కయ్యకి తాను ఇచ్చిన దర్శనాన్ని తనే రూఢిచేసి చెప్పింది. అమ్మ. అంత వరకు అక్కయ్యకి అది అమ్మ ఇచ్చిన దర్శనమే అని అర్థం కాలేదు. గుర్తించే గుర్తు లేకపోతే దీపమున్నా గుర్తించలేరని" అమ్మవాక్యం. దివ్యజ్యోతి అయిన అమ్మ గుర్తించే గుర్తు అయి గ్రహించేటట్లు గుర్తు చేసింది.

అమ్మ సమాధ్యవస్థలో వివిధ భాషలలో మాట్లాడటం వినేది అక్కయ్య. కొండలలో కోనలలో ఉన్న ఋషులకి ఈ ఆహారం పంపుతున్నానని అనేది అమ్మ. (ఆహారం పంపుతున్న సమయంలో) కూర్చున్న అమ్మకి కూర్చున్నట్లుగా ముద్రలువస్తూ ఉండటం చూసేది. అక్కయ్య. డ్రైన్ కాలవకి స్నానానికి వెళ్ళి నప్పుడు అందర్నీ దూరంగా ఉండమని అమ్మ

ఒక్కరే వెళ్ళేవారు. పాముల్ని గడ్డిపరకల్ని విసిరి వేసినట్లు అటూ ఇటూ విసిరివేసేవారు అమ్మ. తరువాత మీకేమి కనపడింది? " అని అడిగే వారు అమ్మ "పాముల్ని అటూఇటూ విసిరివేశావు కదమ్మా?" అంటే "ఓసి. మీకు కనపడిందిటే!" అనే వారు అమ్మ. ఈ విధంగా సకల జీవరాసులతో ఆడేవారు అమ్మ. మనదృష్టిలో విషసర్పాలు అనుకునే వాటితో ఆ రకంగా ఆడుకునేవారు అమ్మ.

తరువాత రామమోహనరావుగారు మద్రాసులో ఉద్యోగరీత్యా ఉన్నారు. అక్కడి నుండి హైదరాబాదు వచ్చారు. అమ్మ చెంత ఉన్న అక్కయ్యకి అమ్మని వదిలి రావాలని అంటే అవేదనగా ఉండి అమ్మతో "నేను వెళ్ళను "అమ్మ అంటే" నువ్వు ఎక్కడ ఉంటే నేను అక్కడ ఉంటాను. నీవెన్నంటి ఉన్నాను" అన్నారు. అదే విధంగా హైదరాబాదు వచ్చిన తరువాత 8 ఏండ్లపిల్ల పట్టుపరికిణి జాకెట్ వేసుకుని సర్వాభరణాలతో అలంకృతమయి పూజ చేసుకుంటున్నప్పుడు వెనకగా కనపడుతూ ఉండేది. వెనక గజ్జలశబ్దం అవుతూ ఉంటే వెనకకి తిరిగి చూస్తే పైన వివరించిన బాలిక రూపం కనపడుతూ ఉండేది. తరువాత అదృశ్యమయ్యేది. అది ఈ నాటి వరకు జరుగుతూనే ఉన్నది. "నీ వెన్నంటి ఉన్నాను. నువ్వు ఎక్కడ ఉంటే నేను అక్కడ ఉంటాను వెళ్ళు" అని ఆనాటి మాటకాక అక్కయ్యకి ఎప్పటి కప్పుడు బాలికగా కనపడుతూ సంతృప్తిని ఆనందాన్ని ఇస్తున్నారు అమ్మ ఈ నాటికి. 1958లో రామమోహనరావుగారు చీరాలలో టీచర్‌గా పనిచేస్తూ ఉండేవారు. ఆ రోజు లలో అమ్మని అపారంగా సేవించుకున్నారు. పగలంతా ఉద్యోగం చేసి, చీరాల నుండి సైకిల్ మీద జిల్లెళ్ళమూడి వచ్చి రాత్రంతా అమ్మని సేవించుకుని మళ్ళా మరునాడు చీరాల వెళ్ళి తన డ్యూటీ చేసుకునేవారు. ఈ విధంగా నిద్రాహారాలని కూడా పట్టించుకోకుండా అమ్మని సేవించుకున్న ధన్యజీవి.

వీరి కొడుకుకి అమ్మ "హైమాకర్" అని పేరుపెట్టింది. 2000 సంవత్సరం ఏప్రియల్ నెలలో అతని వివాహం జరిగింది. వీరికోడలకి వీరి ఇంటికి వచ్చిన తరువాత అమ్మని గురించి వినటం జిల్లెళ్ళమూడి వచ్చి నమస్కరించుకోవటం జరిగింది. కాని వీరు నమస్కారం చేయమన్నారు కనుక చేయటం తప్పిస్తే ప్రత్యేకించి అనుభవం లేక పోవటం వలన విశ్వాసం ఏర్పడలేదు. వీరికోడలకి కూడ ఈ మధ్య ఒక అనుభవం అయింది. రామమోహన్‌రావుగారికి సీరియస్ అయి హాస్పటల్‌లోచేర్చారు. అప్పుడు వీరి కోడలు ఇంట్లో ఉన్నది. అప్పుడు ఎఱ్ఱని పట్టుచీర కట్టుకుని ఎత్తుగా ఎఱ్ఱగా ఆకర్షణీయమైన ఒక ముత్తైదువ వీరి కోడలు దగ్గరికి వచ్చి" నేను వచ్చిన పని అయిపోయింది వెళ్తున్నాను" అన్నది.

అప్పుడు వీరి కోడలు "వెళ్తానంటావు ఏవిటె..రా! కూర్చో!" అంటూ ఆవిడ చేయిపట్టుకుంది "కాదు వెళ్ళాలని" చేయి విదిలుంచుకుని ఆ వచ్చినవ్యక్తి బయటికి వెళ్ళింది. వెంటనే వెళ్ళి చూస్తే ఎవ్వరూ కనపడలేదు. ఈ సంఘటనతో ఇటువంటివి అమ్మ వల్ల జరుగుతయ్ అనెడి భావం ఏర్పడింది. ఈ విధంగా అమ్మని సేవించుకుని ఆరాధనలో జీవితం గడిపిన ధన్య జీవులు వల్లూరి రామమోహనరావు - బాలక్కయ్య దంపతులు.

## సింగుపాలెం సత్యవతి అక్కయ్య

గుంటూరు జిల్లా రేపల్లె తాలుకా సింగుపాలెం గ్రామకాపురస్తులు సత్యవతి అక్కయ్య, భర్త రాఘవులు గారు. వీరు అమ్మని మొదటిసారిగా దర్శించినప్పుడు గుంటూరుకి చేరువలో ఉన్న చేబ్రోలు అనెడి గ్రామం వచ్చి అక్కడి నుండి 1958 లో జిల్లెళ్ళమూడి చేరి అమ్మపై అపారమయిన భక్తి ఏర్పడింది. అమ్మ మాతృవాత్సల్యానికి ముగ్ధులైనారు. తరువాత అమ్మ చెంత ఉపదేశం పుచ్చుకున్నారు. 62లో అమ్మ సింగుపాలెంలో యార్లగడ్డ భాస్కరరావు గారి ఇంటికి వెళ్తూ సత్యవతి అక్కయ్యతో "మనం ఇప్పుడు విదురుడి ఇంటికి వెళ్తూన్నం" అన్నారు. ఆరోజులలో అమ్మ ఇచ్చినమట్టిని సీసాలలో పెట్టుకుంటే ఎంత కాలమైన సువాసన వస్తూ ఉండేది. ఈ రకమయిన ప్రత్యేకమైన అనుభూతులతో వీరికి విశిష్టమయిన ఆకర్షణ ఆనందం కలిగి పదేపదే అమ్మని దర్శించే వారు . ఒకసారి సత్యవతి అక్కయ్య జిల్లేళ్ళమూడిలో 2 రోజులు ఉందామని వచ్చి 20 రోజులు ఉన్నారు. అప్పుడు అక్కయ్య బాధపడుతుంటే అమ్మ వచ్చి ఏమైనా" అంటాడని భయపడుతున్నావా? ఏమి అనడులే!" అన్నారు. తరువాత అక్కయ్య సింగుపాలెం వచ్చారు. భర్త రాఘవయ్య గారు జిల్లెళ్ళమూడి వచ్చారు. జిల్లెళ్ళమూడి ఈయన వచ్చేటప్పటికి అక్కయ్య సింగుపాలెం చేరారు. అందువలన ఆయన ఆ రాత్రి జిల్లెళ్లమూడిలో నిద్రచేసి ఉదయాన్నే లేచారు. అప్పుడు అమ్మ వచ్చి "ఇప్పుడు ప్రసాదం ఇవ్వటానికి ఏమీలేదని తను కప్పుకున్న దుప్పటి ఆయన మీద కప్పింది. తరువాత సింగుపాలెం చేరారు. అక్కయ్యని చూసి "ఏమిటి? ఇన్ని రోజులా ఉండేది" అన్నారే కాని మరేమీ అనలేదు. తరువాత అమ్మ అన్నదట "సరాసరి ఎదురుకుండా వెళ్తే దాని తల కాయ పగిలేదని" ఈ కారణం చేతనే వారిని జిల్లెళ్ళమూడి రప్పించి దుప్పటి కప్పిపంపిందని అక్కయ్య భావం. మానవునిలో పెరిగే ప్రకోపాన్ని శాంతింప చేసి జరగపోయే తీవ్రపరిణామాన్ని (అఘాయిత్యాన్ని ) అమ్మ ఏ విధంగా తొలగిస్తుందో తెలియచేసే సంఘటన ఇది.

సత్యవతి అక్కయ్యతో పాటు చంద్రమ్మక్కయ్య అనెడి మరొక వ్యక్తి సింగుపాలెంలో

ఆ రోజులలో ఉంటూ ఉండేది.యార్లగడ్డ భాస్కరరావు గారు వీరిద్దరిని చూస్తూ నమస్కారం చేస్తూ ఉన్నారు. అప్పుడు వీరు "ఏమిటి మాకు సమస్కారం చేయట మేమిటి? అని అడిగితే " మీరు అమ్మగా కనపడుతున్నారు." అన్నారట. సత్యవతి అక్కయ్య చిన్న కూతురు 'గంగ' గంగని తనతో పాటు జిల్లెళ్ళమూడి ఒకసారి తీసుకొని వచ్చింది. అప్పుడు గంగకి106° జ్వరం వచ్చింది. అమ్మ "వేపాకు వేసి పడుకోపెట్టమని' చెప్పారు. నర్సరావు పేటలో డాక్టరుగా పనిచేసున్న కమల ఆ రోజు జిల్లెళ్ళమూడిలో ఉన్నది. గంగని చూసి "ఇది అమ్మ వారు రేపటికి బొబ్బలు పొక్కుతై" అన్నది. తరువాత వ్యాన్ ఒకటి వస్తే దానిలో వారిని పంపింది అమ్మ. సత్యవతి అక్కయ్య సింగుపాలెం వచ్చిన తరువాత గంగకి జ్వరం తగ్గింది. డాక్టర్ కమల చెప్పినట్లు బొబ్బలు పొక్కలేదు. కాలుమీద క్రొద్దిగా మచ్చలు వచ్చినవి. ఈ విధంగా ఒక భాద వచ్చినా అది అనుభవించవలసినంత అనుభవించకుండా కొంత అనుభవాన్ని ఇచ్చి తొలగించేవారు అమ్మ.

అక్కయ్య నాతో అన్నారు "అమ్మ కార్యకారణ స్వరూపిణి నాన్నా! ప్రత్యేకించి అనుభవం ఏముంది?" అన్నారు. ఇట్టి భావం విశ్వాసం నిలవటమే పెద్ద అనుభవం. అమ్మ జీవితంలో ఒక భాగం కాక జీవిత సర్వస్వం కావటం ఒక మహాద్భుతం. ఈ అక్కయ్య ఇంటికి వెళ్తే మాతృమూర్తిలాగ ఆదరించేది. ఈ విధంగా ఆదరించే స్వభావంతో హృదయం పరిపక్వత చెందటమే మహిమాన్వితమయిన అనుభూతి. అమ్మ సేవలో ఆరాధనలో ధన్యత్వం పొందినది వీరి కుటుంబం.

## యార్లగడ్డ భాస్కరరావు గారు

యార్లగడ్డ భాస్కర రావుగారు గుంటూరు జిల్లా రేపల్లె తాలుకా సింగుపాలెం గ్రామనివాసి. వీరు అమ్మని 58లో దర్శించారు. వీరు మొదటినుండి తత్వచింతన కలవారు. సత్వగుణప్రధానులు. రైతుకుటుంబీకుడు. వ్యవసాయం చేసుకుంటూ జీవించేవాడు. అమ్మని దర్శించి అమ్మ పట్ల దైవభావం, విశ్వాసం ఏర్పడినప్పటినుండి అమ్మయే వీరికి సర్వస్వం అయినది. అమ్మకి నమస్కరించి ప్రసాదం తీసుకుని ఊరికి బయలుదేరారు. ఒకసారి. అప్పుడు తలమీద పసుపు చల్లినట్లు పసుపు పచ్చదనం కనపడింది. ఆయనతో పాటు ప్రక్కనే నడుస్తున్న సోదరీసోదరులు ఆది గమనించి చెబితే వారికి తెలిసినది.పసుపు అంటటానికి ఏకోశాన అవకాశం లేదు. అప్పుడు అట్లా ఎందుకు అయినదో అర్థం కాలేదు. అది కొంతకాలం అట్లా ఉండి క్రమేపి పోయినది. అమ్మ చెంతకు వస్తూ పోతున్న రోజులలో కొంతకాలం అమ్మ ధ్యాస తప్పితే మరొకటి లేకుండా ఉండేదట వీరికి. ఆ గ్రామనివాసులైన సత్యవతి అక్కయ్య. చంద్రమ్మ అక్కయ్య వీరికి అమ్మలాగ కనపడేవారు. కొంతకాలం

ఇలయులు కూడా అమ్మలాగ కనపడిన విశిష్టమయిన అనుభూతిని ఇచ్చింది వీరికి అమ్మ. వీరికి సింగుపాలెంలో టైఫాయిడ్ జ్వరం వచ్చి బాధ పడ్డారు కొన్ని రోజులు. అదే సమయంలో ఎవ్వరూ కబురు చేయకుండానే జిల్లెళ్ళమూడిలో అమ్మ తలుపులు వేసుకుని అటూ ఇటూ తిరుగుతూ "వాడికి నా బిడ్డకి ఏమి పెడుతున్నదో ఏమో అది" అని అన్నది అమ్మ. తరువాత సింగుపాలెం మనిషిని పంపి తన దగ్గరకు రప్పించుకున్నారు అమ్మ. అమ్మ సర్వజ్ఞత్వం దీనిని మించి తన బాధతో తాదాత్మ్యం చెంది వేదన పడిన అమ్మ మాతృవాత్సల్యానికి అంజలి ఘటించారు భాస్కరరావుగారు.

మూల్పూరి సుబ్రమణ్య శాస్త్రిగారనెడి వ్యక్తితో భాస్కరరావు గారికి పరిచయం ఉన్నది. వారు శాస్త్రాలు బాగా చదువుకున్నారు. శాస్త్రిగారు భాస్కరరావు గారితో అమ్మని గురించి చెబుతూ వుంటే వారి ప్రక్కన భాస్కరరావు గారికి అమ్మ కనపడింది. తరువాత కొంతకాలనికి శాస్త్రిగారికి పూర్వపు గాఢమయిన విశ్వాసం ఆర్తి లేకుండా మాట్లాడితే వారి ప్రక్కన అమ్మ కనపడలేదు. భాస్కర్ అన్నయ్యకి. 1985 జూన్ 14న అమ్మ ఆలయప్రవేశం చేసిన తరువాత కొద్ది రోజులకి గర్భగుడి ముందు భాస్కర్ అన్నయ్య కూర్చుంటే పూలలో అమ్మ కదులుతున్నట్లు వారికి అనుభవం అయింది. ఆవిధంగా కనపడింది.

వ్యాసుల వారు గణపతి దేవునికి భారతం చెబితే వ్రాశారని వింటాము. అదే విధంగా సాక్షాత్ జగజ్జనని తన జీవిత చరిత్ర చెబితే భాస్కర్ అన్నయ్య వ్రాశారు. అమ్మ జీవిత చరిత్రలో సంభాషణలు చెబుతుంటే భాస్కర్ అన్నయ్యకి ఆ సంభాషణలు చేసిన వ్యక్తులు గొంతులు వినపడేవి. " నా చరిత్ర పండితుడైన పామరుడు వ్రాయడు. పామరుడైన పండితుడు వ్రాస్తాడు" అన్నారు అమ్మ. అంటే లోకంలో చదువుకున్న వ్యక్తులు కాక చదువు చాలా తక్కువగా ఉన్నా మహోన్నతమయిన సంస్కారం ఆంతరంగిక పరిపక్వత కలిగిన సత్త్వగుణప్రధానుడైన వాడు. వాడు పామరుడైన పండితుడు అని అర్థం. పండితుడు లాగ కనపడి మేధా సంపత్తి కలిగి శీలరాహిత్యంతో లోక కంటకుడు అయిన వాడు పండితుడైన పామరుడు. ఉదా: రావణాసురుడు. ఎక్కువగా చదువుకోక పోయినా రైతు కుటుంబంలో పుట్టి పెరిగినా భాస్కర్ అన్నయ్య మహానుభావుడు. అమ్మ చెబితే భాస్కర్ అన్నయ్య వ్రాసిన "జీవిత మహోదధిలో తరంగాలే " ఈనాడు మనం పారాయణం చేస్తున్నది చదువుకుంటున్నది. వీరు పైకి చాలా తక్కువ మాట్లాడుతారు. అనుభవాలు కూడా చాలా తక్కువ చెబుతారు.కాని వీరి హృదయం సంస్కారం తొణకనిమహాసముద్రం లాంటిది. వీరు 1992 జూన్2 వరకు జిల్లెళ్ళమూడిలో అమ్మని సేవించుకుని ప్రస్తుతం వారి స్వగ్రామం సింగుపాలెంలో ఉంటున్నారు.

ఓం అం ఆ

# సర్వతో ముఖ చైతన్యం అమ్మ

## అమ్మను గురించి

అమ్మ జన్మించింది చైత్రశుద్ధ ఏకాదశి తెల్లవారుఝామున 4-30ని. 1923 మార్చి 28వ తేది. గుంటూరు జిల్లా పొన్నూరు మండలం, మన్నవ గ్రామంలో. అమ్మ జన్మించక ముందే 34 సంవత్సరములు కల పాంచ భౌతిక స్థూల దేహంతో అమ్మ తండ్రి అయిన మన్నవ సీతాపతి శర్మగారికి దర్శనం ఇచ్చింది. "నేను అమ్మను మీ ఇంట్లో పుడతాను" అని చెప్పినారు. అమ్మ తండ్రి మన్నవలో చెన్న కేశవ స్వామి, రాజరాజేశ్వరి ఆలయంలో ప్రదక్షిణాలు చేస్తూ వుండేవారు. ఒకసారి పొన్నూరులో చింతచెట్టు క్రింద కూర్చుని "ఈ సారి పుట్టే బిడ్డ అయినా దక్కేనా" అని వారు అనుకుంటూ వుండగా ఎదురుగా చెన్న కేశవస్వామి కనపడి, ఆ స్వామి ఒక బాలికగా మారి అదృశ్యమవుతుంది. ఈ దృశ్యాన్ని దర్శించి ఇంటికి చేరుతారు అమ్మ తండ్రి సీతాపతి శర్మగారు. ఈ రెండు దర్శనాల అనంతరం అమ్మ అవతరించటం జరుగుతుంది.

అమ్మ అంటే అంతులేనిది, అడ్డులేనిది ఆధారమయినది. జనని అంటే జన్మస్థానం అని, భారం వహించే శక్తి ఎక్కడ వుందో అది మాతృత్వం, అని ప్రకటించింది. అంటే అమ్మ అనేది ఒక ఉజ్జ్వలతత్త్వం. కేవలం అది ఒక స్త్రీ వాచకం మాత్రమే కాదు. ఈ విధంగా తన పూర్ణత్వ స్థితిని తెలియ చేసింది అమ్మ. సర్వం తానైన అమ్మకి సర్వం సామాన్యమే. అమ్మకి ప్రత్యేకత లేదు. కాని ప్రత్యేకతే తాను అయినది. ఇతః పూర్వం వివరించిన దర్శనాలు ఆద్యంత రహితమయిన అమ్మ ఉనికికి నిదర్శనాలు. "రూపం పరిమితం - శక్తి అనంతం' ' అమ్మ వివరణకి ప్రతి రూపం "అమ్మ "అని తెలియజేసినయ్ అమ్మ తండ్రి యొక్క అనుభూతులు.

## సాధనలకు గమ్యం తాను

అమ్మకి 19 నెలలు వయస్సులో మన్నవ రాజమ్మగారి ఇంట్లో సాయంత్రం 5-30ని. లకు దానిమ్మ చెట్టు క్రింద కూర్చుని నల్ల గుడ్డ పైకి పోనిచ్చి అరమోడ్పు కన్నులతో పద్మాసనం వేసి కూర్చుంటుంది. ఇంతలో బావి నీళ్ళు తెచ్చిన రాజమ్మగారు పద్మాసనం చూడక చిన్న బిడ్డ నొప్పి అనుకుని నెత్తి మీద నీళ్ళు కుమ్మరిస్తుంది. మన్నవ కృష్ణ శర్మగారు

కూడా జబ్బు అనుకుని ఉల్లిపాయలు జిల్లేడు, రసములు ముక్కులో పోసి పైకి ఎగుర వేయటం మొదలైనవి చేస్తారు. అమ్మ ఇవి అన్నీ చేసిన అరగంటకు జాగ్రత్తకు రావటం జరుగుతుంది. ఇది వైద్య ప్రభావమని అనుకుంటారే కాని అమ్మ సమాధ్యవస్థను గుర్తించరు. తరువాత తెనాలిలో అమ్మ బంధువుల ఇంట్లో దానిమ్మ చెట్టుక్రింద కూర్చుని నల్లగుడ్డు పైకి పోనిచ్చి అరమోడ్పు కన్నులతో చేప నిద్ర మాదిరిగా ఎడమకాలును చాచి కుడి కాలును వెనక్కు పోనిచ్చి దానిమ్మ పువ్వును చేతిలో పట్టుకుని ఉచ్ఛ్వాసనిశ్వాసములాగి పోయి కూర్చుంటుంది. ఇది చూసిన అమ్మ పెదతల్లి అన్నపూర్ణమ్మగారు అమ్మ దగ్గరకు వచ్చేటప్పటికి అమ్మ లేవబోయే సమయం ఒకటి అవుతుంది. అప్పుడు ఆవిడ "ఎందుకమ్మా అట్లా కూర్చున్నావ్" అంటే "శాంభవీ ముద్రలే" అంటుంది అమ్మ. ఆ వయస్సులో ముద్రలు వేయటం కాక, ముద్రలు రావటం జరిగినది. "ముద్రలు వేయటం కావు రావాలి" అంటుంది అమ్మ. ముద్ర అంటే అధికారం అన్నది. ఆ లక్ష్య సిద్ధి కోసం ముద్రలు వేస్తారు. ఇది సాధన స్థితి. ఈ సాధనలకి గమ్యం తానని తెలియచేసింది అమ్మ. గమ్యమే తానైన అమ్మకి ముద్రలు వచ్చినవి.

## దైవమే తాను

పుట్టిన తరువాత సాధన చేసి దైవత్వం సంపాదించటం కాదు. దైవమే తానైన అమ్మ చిన్నప్పటి నుండి అనేక మందికి దివ్య దర్శనాలు, అలౌకిక అనుభూతులు కలుగచేసింది. 4,5 సంవత్సరాల పిల్లగా వున్నప్పుడు ఎంతో మందికి దివ్య దర్శనాలు ఇచ్చింది. గంగరాజు పున్నయ్య గారికి కృష్ణుడుగా, తరిమెల్ల వెంకటప్పయ్య గారికి సత్యన్నారాయణ స్వామిగా, గుండేలు రావు గారికి రామునిగా, తిరువల్లూరులో పైల్‌మాన్‌కి కృష్ణునిగా, లక్ష్మణాచార్యుల వారికి నరశింహ స్వామిగా అంకదాసుకి విశ్వరూప సందర్శనం, మస్తాన్‌కి తనలో ఉన్న జీవం లేచి అమ్మలో ప్రవేశిస్తున్నట్లుగా భావించి తాను లేను వున్నదంతా అమ్మ అనుకుంటాడు. ఇదే సమయంలో ఒకముసలి తాతకు నాగేంద్రునిగా దర్శనం ఇచ్చి తరింప చేస్తారు అమ్మ. చిదంబర రావుగారికి అనేక దేవ దేవీ దర్శనాలు ఇవ్వటమే కాక, నిష్ఠాతుడైన బ్రాహ్మణుని వేషంలోను, ఊడ్చుకునే వాని దగ్గర్నుంచి అన్ని రకాల వృత్తులలో వుండే వ్యక్తుల రూపంలో, దర్శనం ఇస్తారు అమ్మ. ఈ విధంగా ఎందరికో దివ్య దర్శనాలు ఇచ్చి దైవమే తానని తెలియ చేసింది. దైవత్వం సంపాదించటం కాక దైవమే తానైనది అమ్మ. 'ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూప కల్పనః" ఉపాసకుల నిమిత్తమై బ్రహ్మము రూపము కల్పించుకొనునని ఉపనిషత్తు చెప్పుచున్నది. సేవించుకొనే వానికి తగిన విధంగా తనను

తాను పులుచు కొనుట కొఱకే భగవంతుడు అవతారాలు ఎత్తుతుంటాడు.

## అమ్మగా ఎందుకు వచ్చిందో వివరణ ఈ క్రింద విషయం

ఆంధ్ర వాల్మీకిగా బిరుదు పొందిన వాసుదాస స్వామి రామాయణం మందరంలో ఈ విధంగా చెబుతారు. త్రేతాయుగంలో ధర్మావతారంగా శ్రీరామ చంద్రుడు ఆవిర్భవించారు. ధర్మాన్ని ఆచరిస్తూ పోయారు. ధర్మ ప్రబోధం కాక ధర్మాన్ని ఆచారిస్తూ పోతుంటే చూసి మారెడి సమాజం, తమ నడకని మార్చుకునే స్థితి వున్నది ఆ రోజులలో. ద్వాపర యుగంలో కృష్ణావతారం, కేవలం ఆచరణ కాక ప్రభోధం అవసరమయినది. అందువలన గీతాచార్యుడై భగవద్గీతని ప్రబోధించారు శ్రీ కృష్ణుడు, అంటే ధర్మాచరణ కాక ధర్మ ప్రబోధం అవసరమయినది. శంకరుని కాలంలో ఒక పద్ధతిగా వాదోపవాదాలు సాగేవి. మండన మిశ్రుడు ఓటమిని ఒప్పుకుని సురేశ్వరాచార్యుడై శంకరుని శిష్యుడైనాడు. అంటే శంకరుని కాలంలో ప్రబోధ అవతారంగా వాదించి నాటి సమాజానికి కావలసింది చేశాడు. ఈనాడు ఆచరిస్తూ పోతే చూసి మారేవారు లేరు. ప్రబోధిస్తే వినేవారు లేరు. వాదిస్తే వితండ వాదం చేస్తారు. సంహరిస్తే అందరిని సంహరించాలి. అందు వలన దివ్య శక్తి మాతృరూపంలో తనే సరెండరై surrender) బురద పూసుకున్నా క్షాళనం చేసుకుని ఒడిలోకి తీసుకొనే ఓ అమ్మయై ఈ భూమిపై (దివ్యశక్తి) అవతరించింది.

## దేశ కాల నియమాలకి అతీతము అమ్మ

అమ్మ ఉనికి అనసూయా దేవిగా భూమిపై జన్మించక ముందే వున్నది. అమ్మ జననానికి ముందే అమ్మ తండ్రికి ఒకసారి 34 సంవత్సరాల పొంచ భౌతిక దేహంతో దర్శన మిచ్చి 'నేను అమ్మను, మీ ఇంట్లో పుడతాను'' అని చెప్పటం జరిగింది. పొన్నూరులో చింత చెట్టు క్రింద వారికి చెన్న కేశవ స్వామిగా దర్శన మిచ్చి, మళ్ళీ ఒక బాలికగా మారి అదృశ్యమవుతుంది. ఈ విధమయిన దర్శనాలు ప్రకృతీ పురుషుల మేలు కలయికతో పరిపూర్ణ అవతార మూర్తి ఈ భూమిపై అవతరించబోతున్నదని ఒక నిదర్శనం జగతికి.

అమ్మ జన్మించిన తరువాత అనేక మందికి ఎన్నో చోట్ల దర్శనం ఇచ్చింది. సోదరులు సుందర రామిరెడ్డిగారు నెల్లూరు దగ్గర విడ వల్లూరు వాస్తవ్యులు. వారు 1930లో పండరీపురం వెళ్ళారు. దేవుని దర్శనం చేసుకుని బయటకు వచ్చి జనంలో నుండి వెళ్తుంటే, వెనక నుండి ఒక స్త్రీ " ఏం(.. నాన్నా...'' అని పలకరించారు. రెడ్డిగారు, "ఏవమ్మా ఒంటరిగా వున్నావ్. నీతో మొగవాళ్ళు ఎవ్వరూ రాలేదా?'' అని అడిగారు. "ఊళ్ళోకి వెళ్ళారు నాన్నా'' అన్నారు

ఆనెడ. "మీదేవూరు" అని అడిగారు రెడ్డిగారు. "విజయవాడ నాన్నా" అన్నారు ఆ స్త్రీ. ఆమె ముఖవర్చస్సు చూస్తే ఈమె ఎవ్వరో అలౌకికమైన వ్యక్తిలాగ వున్నది. ఈమెను మళ్ళీ దర్శించుకోవాలి అని ఆయన మనస్సులో అనుకుంటూ రెండు అడుగులు ముందుకు వేసి, మళ్ళీ దర్శించాలి అనే ఉద్దేశ్యం తో, అడ్రస్ అడుగుదామని వెనక్కి తిరిగి చూస్తే ఆమె కనపడలేదు. ఆ సమయానికి అదృశ్యమయినదో లేక జనంలో కలిసిపోయినదో తెలుసుకోలేక పోయారు. 1966 లో అమ్మని గురించి విని జిల్లెళ్ళమూడిలో అమ్మని దర్శించారు. ఒకరోజు మాటలలో అమ్మవారిని "నీవు ఏఏ క్షేత్రాలు దర్శించావు నాన్నా(... అని అడిగారు. వారు "కాశీ, రామేశ్వరం ఈవిధంగాకొన్ని క్షేత్రాల పేర్లు చెప్పారు. అప్పుడు అమ్మ "పండరీపురం వెళ్ళావా?నాన్నా? (.." అని అడిగారు. వారు "వెళ్ళాను అమ్మా" అన్నారు. అప్పుడు అమ్మ "ఎవరన్నా ఏం (....నాన్నా అని పలకరించారా? అని అడిగారు. రెడ్డిగారు ఒక్కసారి షాక్ తిన్నట్లు అయినారు. 36 సంవత్సరాలు రీల్ వెనక్కి వెళ్ళింది వారికి. వారు 1930లో పండరీపురంలో సరిగ్గా (... ఇదే అమ్మని ఈ రూపంతోనే చూశారు. ఆనాడు వెనక నుండి " ఏం (నాన్నా (..." అని పలకరించిన వ్యక్తి ఈ అమ్మే (.... 1966లో ఏ అమ్మని ఈ రూపాన్ని చూస్తున్నారో సరిగ్గా ఇదే అమ్మ రూపాన్ని 1930లో పండరీపురంలో దర్శించారు. వారు ఆశ్చర్యానికి ఆనందానికి హద్దులేని తన్మయత్వం చెందారు. అమ్మ నన్ను ఆనాడే ఎన్నుకుంది. అమ్మని దర్శించి గుర్తించే భాగ్యం నాకు ఈనాడు కలిగిందని ఆనందించారు. అమ్మ సర్వ వ్యాపకత్వానికి, అపార కరుణకి పులకించి అంజలి ఘటించారు. అమ్మ పుట్టింది 1923లో , ఈ లెక్కలో అమ్మకి 1930లో 7 సంవత్సరాలు. మన్నవ , బాపట్ల, గుంటూరు, తెనాలి మధ్యలో తిరుగుతున్నట్లు వున్నది. 1966లో తాను వున్న రూపంతో1930లో దర్శనం ఇచ్చింది.

అదే విధంగా 1962లో మద్రాసు వెళ్ళినప్పుడు, అక్కడ మహా బలిపురంలో ఒక ముసలమ్మ పాలు తీసుకుని వచ్చి అమ్మకి ఇస్తే అక్కడ వున్నవారు అమ్మని పరిచయం చేయబోతే ఆ ముసలమ్మ "ఈమెకు రోజు నేను పాలు ఇస్తూ వుంటాను కదా? మీరెందుకు పరిచయం చేస్తారు" అన్నది. ఈ విధంగా ఆమెకు దర్శనం ఇస్తూ వుండేది.

North నుండి (ఉత్తర భారతదేశం నుండి) South (దక్షిణ భారత దేశానికి) 10 మంది సాధువులు వెళ్తుంటే వారిని బాపట్లలో దించారు. బాపట్ల గవర్నమెంట్ హాస్పిటల్ దగ్గర వున్న ఒక చెట్టు క్రింద వారు తలా ఒక గ్రంధం పఠిస్తూ కూర్చున్నారు. అమ్మ నీళ్ళ

బిందె తీసుకుని వెళ్తూ వీరిని చూసి వీళ్ళకి ఏదైనా పెడితే బాగుండును అనుకుని, వారికి రొట్టెలు చేసి తీసుకుని వచ్చి పెట్టింది. వారంతా అమ్మని గమనిస్తూ నీవు మాకు Northలో ఇదే విధంగా రొట్టెలు పెట్టావు కదా? అప్పుడే ఇక్కడికి ఎట్లా వచ్చావని అడిగారు. అమ్మ "ఏమో... నాకు తెలియదు. నేను కాదు" అని వారికి పదార్థం వడ్డించి , నీళ్ళ బిందె తీసుకుని వేగంగా వెళ్తుంటే వారిలో ఒకడు, ఈ అమ్మాయే మనకు Northలో కనపడి రొట్టెలు పెట్టింది. ఈ అమ్మాయి ఇల్లు జాడ తెలుసుకోవాలని వెంబడించారు. అప్పుడు అమ్మ అదృశ్యమయింది. వారిని ఆ విధంగా కనిపెడుతూ వచ్చిన అమ్మ అదృశ్యమయింది. ఈ విషయం సుందర రామిరెడ్డి గారికి అమ్మ స్వయంగా చెప్పినది. ఈ విషయం చెప్పి అమ్మ వారిని పండరీపురం విషయం అడిగింది. అంటే ఆనాడు తాను కనిపించి అదృశ్యమయ్యానని వారికి తెలియచేసింది. 1962లో చీరాల వెళ్ళారు అమ్మ. అప్పుడు అక్కడి వారితో అమ్మ " ఇక్కడ ఒక శబరి వున్నది. నాకోసం పరితపిస్తున్నది. దాన్ని చూడాలి నాన్నా(..." అన్నది. కారంచేడు సీతమ్మగారి జీపులో అమ్మ, డాక్టర్ పొట్లూరి సుబ్బారావుగారు, మరి కొందరితో చీరాల సముద్రం దగ్గర వున్న ఓడరేవు పల్లెకారుల గుడిసెలలోకి దూసుకుని పోయింది. ఒక చిన్న గుడిసె ముందు జీపుని ఆపింది అమ్మ. ఆ గుడిసెలో 80 సంవత్సరముల వృద్ధురాలు కుక్కి మంచంలో పడుకుని వున్నది. అమ్మ ఆవెడని తట్టి లేపింది. అమ్మను చూడగానే ఆమె ఆనందంతో ఎంత కాలానికి వచ్చావమ్మా?" అన్నది. ఊ (....వచ్చాలే కాని లే, అంటూ తీర్థం, ప్రసాదాలు ఆవ్యక్తికి ఇసుత్తిది అమ్మ. తరువాత డాక్టారు గారితో "నాన్నా (... మా ఇద్దరికి ఫోటో తీ(.... అన్నది. డాక్టర్ గారు " ఇక్కడ లైట్ సరిగ్గా లేదు. బయటకు వస్తే ఫోటో బాగా వస్తుంది. " అన్నారు. అప్పుడు ముసలమ్మతో అమ్మ "లే (.... బయటకి పోయి ఫోటో తీసుకుందాం" అన్నారు. ఆ వృద్ధురాలు "నేను లేవ లేనమ్మా! 7 సంవత్సరాల నుండి అన్నీ మంచంలోనే చేస్తున్నాడు నా కొడుకు" అన్నది. వెంటనే అమ్మ ఆ అవ్వ చేయి పట్టుకొని"లేస్తావులే, లే అన్నది. మరుక్షణంలో అవ్వలేచింది. అమ్మ చేయి పట్టుకుని నడిచి బయటకు వచ్చి కూర్చుంది. అమ్మ ఆ శబరి శిరస్సుపై చేయివుంచి ప్రక్కన తాను నిలబడి ఫోటో తీయించింది. తరువాత లోపలికి తీసుకుని వెళ్ళి కూర్చోపెట్టింది. అప్పుడు ఆమె "ఇంకా ఎందుకమ్మా నీలో కలుపుకో" అన్నది. ఆ అవ్వకి ఆ విధంగా దర్శనం ఇచ్చి వచ్చింది అమ్మ. ఆ మరుసటి రోజు ఆవిడ శరీరం చాలించింది. అమ్మలో విలీనం అయింది. ఆ శబరీ మాతశ్రీ రామాయణంలో శబరి కూడా రాముని కోసం వేచి వుండి, రాముని దర్శనం

అయిన తరువాత మతంగ మహర్షి ఆశ్రమం చూపించి, అగ్ని గుండంలో దూకి దేదీప్యమానమయిన శరీరంతో, గగన తలంలోకి వెళ్తుంది. అదే విధంగా ఈ శబరి కూడా అమ్మ కొఱకు పరితపించింది. అమ్మ దర్శనం అనంతరం శరీరం చాలించింది. ఆ శబరికి అమ్మకి వున్న బంధమేమిటో అమ్మ చెప్పలేదు.

అన్నమ్మ అనెడి వ్యక్తిది తిరువాన్కూరు. ఆమె బ్రాహ్మణులు, బాల్యంలో భర్త పోతాడు. ఇంటర్ పాస్ అవుతుంది. కన్యాకుమారి భక్తురాలు. బీదకాపురం కావటం చేత డాక్టర్ చదవటానికి అవకాశం లేక చాలాకాలం పూజలు, పునస్కారాలు చేసుకుంటూ వుండేది. కొంతకాలం గడిచిన తరువాత తండ్రి కూడా చనిపోతాడు. నలుగురు అన్నదమ్ములు ఒక్కతే ఆడపిల్ల. తల్లి చిన్నప్పుడే పోతుంది. ఇంట్లో వుండటానికి తావులేక స్వతంత్రించి మద్రాసు వస్తుంది. మద్రాసులో బజార్ల వెంట, ఏ రైలు ఎక్కాలో, ఏ రైలు దిగాలో తెలియక అటూ ఇటూ తిరుగుతూ వుంటుంది. అప్పుడు పది సంవత్సరముల పిల్ల వచ్చి (కనపడి) చేతిలో ఒక యాభై రూపాయలు డబ్బు పెట్టి బయలుదేరు గుంటూరు వచ్చి, కుగ్లర్ హాస్పిటల్‌లో చేరమన్నట్లు వినబడుతుంది. నాకెందుకమ్మా డబ్బు అని చెయ్యి పట్టుకుని చేతిలో పెట్టబోతుండగా అదృశ్యమైపోతుంది. నాలుగు మూలలా పిచ్చెత్తిన దానిలా తిరుగుతుంది. చేతిలో పెట్టిన యాభై రూపాయలు కనపడవు. వెంటనే తను కొల్చే కన్యాకుమారి యిట్లా వచ్చిందని, కనపడే తల్లివి పూర్తిగా కనపడ కూడదా? అని రోడ్డు మీద పడి దొర్లుతుంది. ఏడుస్తూ పడుకుంటుంది. కాసేపు ఏడ్చినాక తన వీపు తట్టి "లే ఎందుకేడుస్తావ్ బయలుదేరు' ' అని వినపడుతుంది. వెంటనే లేచి కాళ్ళు చేతులు కడుక్కుని రైలుస్టేషన్‌కి బయలుదేరుతుంది. ఎన్నడూ వీధి వాకిట్లోకి కూడా వచ్చి ఎరుగదు. కాకపోయినా ఎవరో కూడా వుండి తీసుకెళ్ళినట్లుగా తోస్తుంది. ఎవర్నీ ఏమీ అడక్కుండానే గుంటూరు చేరుతుంది. ఒక్క స్టేషన్‌లో కూడా టిక్కెట్టు అడగరు. సరాసరి కుగ్లర్ హాస్పిటల్ చేరి తన విషయం చెప్పుకుని హాస్పిటల్‌లో చేరుతుంది. అదే హాస్పిటల్‌లో అమ్మ చేరుతుంది. అమ్మ చేరిన పది పదిహేను రోజులలోగా అన్నమ్మ నర్సుగా చేరుతుంది. అమ్మను చూడగానే మద్రాసులో తనకు కనపడ్డ అమ్మాయిలాగా కనపడుతుంది. అదే హాస్పిటల్‌లో ఒక బోధకురాలు ఎప్పుడూ వస్తూ పోతూ వుంటుంది. అమ్మ, అన్నమ్మ, బోధకురాలు, ముగ్గురూ కలిసి గుఱ్ఱబండి మీద లాం వెళ్ళారు. బోధకురాలిది అసలు ఆంధ్రయే. వారి పూర్వీకులు తిరువాన్కూరు చేరుతారు. వారు మల్లాది వారని, ఆవిడ భర్త అనుమానలతో కొట్టి వేధిస్తుంటే ఆ బాధలకి

తట్టుకోలేక ఇల్లు వదలి అప్పటికి 12 సంవత్సరాల క్రితం గుంటూరు చేరానని, తన భర్త వెంకటేశ్వరావధాని తనకి 4 గురు మొగపిల్లలు, ఒక ఆడపిల్ల అని, తన పేరు లక్ష్మీ జ్ఞాన ప్రసూనాంబ అని తన వృత్తాంతం చెప్పి, తను బయలు దేరేనాటికి తన పిల్లకు పదకొండు సంవత్సరాలు అని కూడా చెబుతుంది. వెంటనే ప్రక్కనే వున్న అన్నమ్మ ఒక్కసారి అమ్మా నువ్వేనా అని కౌగిలించుకుని ఏడుస్తారు. ఈ విధంగా తల్లీ బిడ్డలను సర్వమూ తానయిన జగజ్జనని అమ్మ కలుపుతుంది. అమ్మ వున్నన్నాళ్ళు వారూ అక్కడే వుండి తరువాత వారు బయలుదేరి ఇద్దరూ పండరీపురం చేరుతారు. పండరీపురం చేరిన కొద్ది రోజులలో తల్లి జ్ఞాన ప్రసూనాంబ చనిపోతుంది. (బోధకురాలు) అన్నమ్మ చంద్రభాగా నదిలో ఒక గట్టు మీద కూర్చుని, ఎండకు ఎండుతూ వానకి తడుస్తూ అమ్మను ధ్యానం చేసుకుంటూ వుంటుంది. అక్కడ వుండి అమ్మను చూస్తూ మాట్లాడ గల శక్తి కలుగుతుంది. అక్కడ కొంతకాలం వుండి మైసూరు చేరుతుంది. ఎంతమందికి అద్భుతమయిన స్థితి ఇచ్చిందో, మన పరిధికి అందని మహాత్ములు ఎంతమంది వున్నారో , దేశ కాలాతీతమయిన అమ్మ ఉనికిని అనుబంధాన్ని మనం గ్రహించలేము. అయినా ఈ సంఘటనలు అమ్మ యొక్క సర్వ వ్యాపకత్వాన్ని ,దేశకాలా తీతమయిన అనంత స్థితిని మనకు తెలియ చేస్తాయి. సంఘటన, వ్యక్తీకరణ లేనిది మనం గ్రహించలేము గనుక, ఇటువంటి విశ్వైక్యమూర్తులని గురించి వివరిస్తూ "స్వదేశో భువన త్రయః" ఈ అఖండ భువనాలు వారికి స్వదేశమే, అని ఆర్యులు ఘోషించారు.

## అంతరిక్షం, అంతరంగం మీద విజయం (జయించటం)

అమ్మ చిన్నతనంలో మన్నవలో చింతలతోపులో 11 రోజులు కళ్ళు మూసుకుని సమాధ్యవస్థలో వుంటుంది. 12వ రోజు కళ్ళు తెరిచి మాములు స్థితికి వచ్చేటప్పటికి నాలుక విరుచుకుపోతుంది. దగ్గర్లో ఎక్కడా మంచి నీళ్ళు వుండవు. ఆ చింత చెట్టు మాను వంకనే ఒక అరగంట చూస్తూ కూర్చుంటుంది. మాను పగిలిపోతుంది. ఆ పగిలిన చప్పుడు, వచ్చే ధ్వని ఓంకార ధ్వనిగా, పెద్ద మోతగా పిడుగు పడినట్లుగా ఊరంతా వినపడుతుంది. వెంటనే మేఘాలు పట్టి పెద్ద వర్షం కురుస్తుంది. ఊరంతా చల్లపడుతుంది. చచ్చిపోయే వన్నీ బ్రతుకుతై. ఆ సంవత్సరానికి, గ్రామానికి అదే తొలకరి వాన. అయిదు రోజుల కల్లా భూమి అంతా పచ్చపడుతుంది. అమ్మ ఆ వానలో అక్కడే వుంటుంది. ఆ చెట్టు పగిలినప్పుడు దానిలో నుండి నురుగు నురుగుగా కారుతూ వుంటుంది. అమ్మ పోయి దోసిళ్ళతో రసం తాగుతూ వుంటుంది. అమ్మదాహం తీరే దాక కారుతుంది. దీనిని "తింత్రిణీ సుధ" అంటారు. అమ్మ

అదే పరికిణి, చొక్కాతో ఎండకు ఎండుతూ, వానకు తడుస్తూ అక్కడే ఇంకా పదకొండు రోజులు వుంటుంది.

మౌలాలీ దొప్పలపూడిలో అడుక్కు తింటూ రోజూ తోటలోకి అమ్మ దగ్గరికి వచ్చి వెళ్తూ వుంటాడు. తరువాత ఎక్కువ కాలం దొప్పలపూడి రాక మానుకుని అక్కడే వుంటాడు. అమ్మలో అనేక రూపాలు చూస్తాడు. అమ్మను చూస్తూ అమ్మలో కలిసి పోయిన వాడిలాగ, చైతన్యం లేని వాడిలాగ కన్ను ఆర్పకుండా కూర్చుంటాడు. అమ్మ మీద పక్షులు వాలుతున్నా, పురుగులు వాలు తున్నా కొట్టాలనుకున్నా కొట్టలేడు. తీసి వేద్దామనుకున్నా తీసివేయలేడు. కనపడ్డది గుర్తిస్తాడే కాని ఏమీ సంకల్పాలు కూడా రావు. ఇట్లా అయిదు రోజుల గడిచిపోతయ్. ఆ రోజు పౌర్ణమి, అమ్మని చుట్టూతా చుట్టేసుకుని. తలకు అర్ధ గజం ఎత్తున లెక్క లేనన్ని పడగలతో రకరకాలతో రంగులతో మెరిసిపోతూ అర్ధరాత్రి 12 గంటలకు వెన్నెలలో దర్శనం ఇస్తుంది. తరువాత అమ్మకు గొడుగు పట్టినట్లుగా, అమ్మ విష్ణుమూర్తి శేషశాయి అయినట్లుగా, అమ్మ అతనితో "అయితే నీవు బ్రహ్మవైనావన్న మాట '' మౌలాలీ అమ్మతో " నిన్ను బ్రహ్మంగా గుర్తించా కనుక నేను బ్రహ్మనైనాను. ఇవి అన్నీ పోయి అమ్మ లెక్కలేనన్ని తలలతో ఒకే అమ్మగా, కిరీటం పెట్టుకుని కనపడుతుంది. ఇవన్నీ పోయి అమ్మ ఒక్కటిగానే కనపడుతుంది. ఇన్ని దర్శనాలు అయిన పిదప తాను తరించానని , ఇక జన్మలేదని, అన్నింటికి మూలం అమ్మేనని మనోవాక్కాయ కర్మల గుర్తించటమే తరించటం అని తెలుసుకుంటాడు. తరువాత అమ్మతో "ఏమీ లేదమ్మా! నేను కూడా భగవందుడ్నేనని గుర్తిస్తున్నాను. అదే బ్రహ్మంగారి తత్వాలలో "నేనే బ్రహ్మను రా అనేగా?". ఏమిటోనమ్మా ఇప్పుడు అంతా తెలిసిపోయినట్లు వున్నది. ఎక్కడా గోడలు అడ్డంలేవు. ఇప్పుడు నిన్ను వదిలి పెట్టి వుండగల్గుదునమ్మా" అని అంటాడు. మొదటిసారి భౌతికమయిన ప్రకృతిని కదిలించింది అమ్మ. రెండవసారి మౌలాలీ అంతరంగాన్ని జ్ఞానమయం చేసింది. ఈ సంఘటన అమ్మ పరిపూర్ణ దివ్యత్వాన్ని తెలియచేస్తుంది. అంతరంగం మీద, అంతరిక్షం మీద అమ్మ ఆధిపత్యాన్ని తెలియచేస్తుంది. మొదటిసారి అమ్మ బాహ్యమయిన పంచభూతాలని, ప్రకృతిని కదిలించింది. ఒక్కొక్కప్పుడు అసు శక్తు కూడా బాహ్యమయిన ప్రకృతిని కదిలించ గలవు. అంతరిక్షాన్ని జయించిన రావణాసురుడు అంతరంగాన్ని జయించలేదు. కనుక లోక కంటకుడు అయినాడు. ఇతః పూర్వం వివరించిన సంఘటనలో దగ్గరే వున్న మౌలాలీ అమ్మ వలన జీవత్వం దివ్యత్వంలో విలీనమయి జ్ఞాని అయ్యాడు. ఈ విధంగా అంతరంగం

జ్ఞానమయం అవ్వటం, చేయటం కేవలం దైవానికే సాధ్యం. యోగ వాశిష్టంలో వశిష్ఠ మహర్షి ఒక విషయం చెబుతారు. "సముద్రాన్ని ఇంకించటం తేలిక అవుతుందేమోకాని, మనస్సుని నిలపటం కష్టం. మనస్సుని నిలపటమే కాక జ్ఞానిగా దివ్య పథ శిఖరంగా మారటం మరీ కష్టం కదా? అట్లాంటిది అమ్మ మౌలాలీ విషయంలో అసాధారణమయిన దానిని సర్వ సాధారణంగా చేసినది. ఉదాహరణకి బాగా మెరిసేటట్లు ఒక లోహాన్ని తోమటమే కష్టమనుకుంటే, అది బంగారంగానో, వజ్రంగానో మారటమనేది అనితర సాధ్యం కదా? మనకు అసాధారణం అమ్మకి సాధారణం. "నాకు సర్వ సాధారణమే" దైవం అయిన అమ్మకి సర్వం సాధారణమే. అంతరంగం అంతరిక్షం సర్వం తానయి సర్వానికి అతీతమయి ఆధారమయిన అమ్మకి అంతా అతి సహజం కదా?

## మాతృత్వం - ప్రేమ తత్వం

చిన్నతనం నుండి మూర్తీభవించిన మాతృత్వం అమ్మది. చిన్నతనంలో అమ్మ ఆటలలో పాటలలో కూడా "అమ్మ" పాత్రనే వేసేది. నీవు ఎవరికి అమ్మవమ్మా? అంటే "నీకు, మీకు, అందరికి, అన్నింటికి అమ్మని " అన్నది.

అమ్మ చిన్నతనంలో అమ్మ పినతండ్రి మన్నవ రామబ్రహ్మం గారు, అమ్మను వాసదాస, స్వామి ధ్గరికి తీసుకుని వెళ్లారు. ఆ సందర్భంలో వారికి పరిచయం చేస్తూ " మా అన్నయ్య కూతురు. తల్లి లేని పిల్ల అని పరిచయం చేస్తారు. అప్పుడు వాసదాస స్వామి" తల్లి లేని పిల్ల కనుక నీ మీ అందరికి ప్రేమ వుండేటట్లు దీవిస్తాను" అంటే అమ్మ, "నాకు అందరి మీద ప్రేమ వుండేటట్లు దీవిచండి" అంటుంది. ప్రేమంటే ఏమిటో తెలియాలంటే నాకు వుంటేగా తెలిసేది. ఇతర్లకు వుంటే నాకేమి అర్థమవుతుంది?. అని అంటుంది. మరొక సంధర్భంలో "అమ్మ లేనప్పుడు నేనే అమ్మనై వుంటాను" అంటారు అమ్మ. ఈ విధంగా మాతృ ప్రేమ సాకార రూపం దాలిస్తే అమ్మ అయింది. కలకండ రూపం, తీపి రెండూ వేరు కానట్లు దివ్య మాతృత్వం, అమ్మ రూపం రెండూ వేరు కాదు.

## దివ్య మాతృమూర్తిగా మహాత్ముల ప్రకటనలు, అనుభూతులు

అమ్మకి 20వ మాసము. అప్పుడు తెనాలి తీసుకుని వెళ్తుంది అమ్మను కన్నతల్లి రంగమ్మగారు. తిరిగి మన్నవ ప్రయాణమై ఒంటెద్దు బండి మీద రైల్వేస్టేషన్‌కి వస్తుంటే దారిలో కాషాయ గుడ్డలు కట్టుకున్న ఘోషాయి కనపడి రంగమ్మ గారితో " నీ బిడ్డ

భగవంతుడు, నీవు జన్మలే"దని అదృశ్యమాయెను.

అమ్మ చిన్న వయస్సులో అమ్మ, అమ్మ తండ్రి సీతాపతిశర్మగారు, అమ్మ అన్నయ్య రాఘవరావు గారు మరి కొందరు బంధువులతో తిరువళ్లూరు వెళ్లారు. అక్కడ కోనేటిలో మధ్య వున్న మండపం మీదకి వెళ్ళి కూర్చుంటుంది. ఆ సంధర్భంలో ఆ కోనేటి ఒడ్డున నిలుచున్న అమ్మ తండ్రితో అక్కడున్న జనంలో కాషాయాలు కట్టుకున్న మనిషి ఒకరు"ఇందాక మండపంలోకి వచ్చిన అమ్మాయి ఎవరు?" అని అడుగుతారు. అమ్మ తండ్రి :-" మా అమ్మాయే నండి" అంటారు

సాధువు :- "మీ అమ్మాయి అంటే మీకుమార్తా?"

అమ్మ తండ్రి :-:- "ఆ మా కుమార్తే నండి'"

సాధువు :– " ధన్యుడివి నాయనా ధన్యుడివి. దేవతను కన్నావు" ఆ మాట అని వెళ్ళిపోతాడు.

సీతాపతి శర్మగారు. "ఏమిటి? ఏమిటి మీరన్నదేమిటి మీరన్నది, అంటూ వెంటపడతారు. సాధువు కనపడడు, అదృశ్యమవుతాడు.

అన్నంరాజు రామకృష్ణారావు గారు జిల్లెళ్ళమూడిలో కొంతకాలం వున్నారు. అక్కడ ప్రముఖమయిన పనులు నిర్వహించారు. వారు జిల్లెళ్ళమూడి రాకముందు శ్రీశైలం వెళ్ళారు. అక్కడ పూర్ణానంద స్వామిని కలవటం వారు ఉపదేశం చేయటం జరుగుతుంది. "త్రిభువనేశ్వరి " మంత్రోపదేశం చేస్తారు స్వామిజీ రామకృష్ణారావుగారికి. ఆ సమయంలో "దీని వలన ఏమి జరుగుతుంది? అసలు మంత్రమంటే ఏమిటి? ఎందుకు చెయ్యాలి? అని అడిగారు స్వామిజీని.రామకృష్ణారావు గారు. అప్పుడు స్వామీజీ ఈ విధంగా సమాధానం చెబుతారు. "మంత్రమంటే మననంతో మంత్రమవుతుంది. ఏమి జరుగుతుందంటే బాహ్యమయిన ఉపకరణాలతో పనిలేకుండా నీలో నీకు అఖండ శాంతి, తృప్తి ఏర్పడుతుంది. ఈ జపం అక్షర లక్షలు పూర్తి అయ్యేటప్పటికి భగవంతుడ్ని చూస్తావ్, ఆడతావ్, మాట్లాడుతావ్" అని చెబుతారు. కొంతకాలం గడిచిన తరువాత, రారామకృష్ణాంవుగారు జిల్లెళ్ళమూడి వచ్చి అమ్మని దర్శిస్తారు. ఆ రోజులలో వారు కారేపల్లి అనెడి ఊరిలో వుండేవారు. అక్కడ వారు కొంతమందితో కలిసి ఆలయం ఒకటి కట్టిస్తారు. అమ్మని దర్శించి వెళ్ళిన తరువాత ఆలయంలో దేవుని విగ్రహం ముందు కూర్చుని వారు ఈవిధంగా అనుకున్నారు. "ఊరికే కాస్త పూజ చేసే పూజారికి హారతి పళ్లెంలో డబ్బు లిస్తున్నావు. నేను ఆలయం కట్టించి ఇంత

చేశాను నీకు. కాని నాకేమి చేశావ్. సర్వ ధర్మాలని పరిత్యజించి నన్నే శరణు వేడితే నేను యోగక్షేమములు చూసి మోక్షాన్ని ఇస్తాను అన్నావు కదా? నేను అన్నీ వదలి కూర్చుంటా నాకు పెడతావా? చేస్తావా? అనుకున్నారు. వారికి ఏ సమాధానం రాలేదు. ఈ సంఘటన జరిగిన కొద్ది రోజులలో జిల్లెళ్ళమూడి రమ్మని వారికి ఉత్తరం వస్తుంది. జిల్లెళ్లమూడి వస్తారు వారు. అక్కడ హైమాలయంలో స్వామిజీ చెప్పిన మంత్రం జపిస్తారు. లక్షర లక్షలు పూర్తి అవుతుంది. అమ్మ దగ్గరకు వెళ్తే అమ్మ వారితో కేరం బోర్డ్ ఆడింది. వారికి అన్నం పెట్టింది. వారిని చేయి పట్టుకుని మూడవ అంతస్తు ఆరు బయట అటూ ఇటూ త్రిప్పుతూ మాట్లాడింది. ఆ సందర్భంలో అమ్మకి తనకు ఒక స్వామిజీ ఉపదేశించారని చెబుతూ వారి సంగతి వివరించబోగా, అమ్మ "ఆయన కదా? నాన్నాక్రాషాయ బట్టలు కట్టుకుని జటాఝూటాలు ధరించిన వ్యక్తి కదా నీకు ఉపదేశం చేసింది" అని వారు చెప్పకుండానే అమ్మ వివరించింది. వారు స్వామిజీని కలిసినప్పుడు స్వామిజీతో పాటు తెల్ల బట్టలు కట్టి బోడి తలతో మరొక వ్యక్తి కూడా వున్నారు. వారిద్దరిలో, ఎవరో కూడా వివరించి చెప్పినది. అంతేకాక "నేనే త్రిభువనేశ్వరిని" ప్రతి అణువు నేనై వున్నాను. నీ సర్వ బాధ్యతలు నాపై వదిలి నీవు నిశ్చింతగా వుండు. నీ బిడ్డల బాధ్యత నాపై వదిని వేయి అంతా నేను చూసుకుంటాను." అని తన దివ్యత్వాన్ని, సర్వజ్ఞత్వాన్ని సర్వ బాధ్యతలు వహించెడి కరుణా వాత్సల్యాలని తెలియచేసింది. ఆ సందర్భంలో స్వామిజీ చెప్పిన మాట గుర్తుకు వచ్చింది. అక్షర లక్షలు పూర్తి అయ్యేటప్పటికి భగవంతుడ్ని చూస్తావ్. ఆడుతావు. మాట్లాడతావు.అన్న మాట గుర్తుకు వచ్చింది. "ఓహో(.... ఇప్పుడు నాకు దైవాన్ని చూసే భాగ్యం కలిగింది. స్వామీ చెప్పిన దైవం అమ్మ అని గుర్తించి ఆనందించారు. కారేపల్లిలో తాను అనుకున్న దానికి చెప్పకనే సమాధానం వచ్చింది. అమ్మ సర్వజ్ఞత్వానికి, సర్వ బాధ్యతలు వహించే కరుణా వాత్సల్యాలకి ముగ్ధుడై అంజలి ఘటించారు.

తదనంతరం అమ్మ పుట్టిన రోజుకు ముందు అమ్మని గురించి వ్యాసం వచ్చిన ఒక దిన పత్రిక తీసుకుని శ్రీశైలం వెళ్లారు. అక్కడ వారు పూర్వం తాను వున్న సత్రానికి వెళ్తే ఆ సత్రం మేనేజరు వారితో "మీరు పూర్వం ఒక స్వామిజీని మీ రూమ్‌లో వుంచుకున్నారు కదా? ఆయన గొప్ప మహనీయుడు. ఇక్కడ హటకేశ్వరంలో పంచాగ్నుల మధ్య తపస్సు చేస్తున్నాడు. "శివోహం" అంటున్నారు. ఎందరో శిష్యులు వారికి ఏర్పడ్డారు" అని వివరించాడు. రామకృష్ణారావు గారికి చాలా సంతోషం కలిగింది. వెంటనే స్వామిజీని కలిశారు. తన దగ్గర వున్న పత్రికలో అమ్మని గురించిన వ్యాసం చూపించారు. దానిలో "సర్వకాల సర్వావస్థల

యందు సమాన స్థితే సమాధి స్థితి" అనెడి అమ్మ సూక్తిని చదివి "తప్పకుండా ఈమె రాజ రాజేశ్వరి, ఈమెను దర్శించాలి" అన్నారు. తరువాత జిల్లెళ్ళమూడి వచ్చి అమ్మను దర్శించారు. ఆ సందర్భంలో అమ్మ, పూర్ణానంద ఏమీ మాట్లాడలంట మాట్లాడు కోలేదు. రామకృష్ణా రావుగారు స్వామీజీతో "అమ్మతో మాట్లాడావచ్చు. అభ్యంతరం లేదు" అంటే "అవసరం లేదు. మేము భావాలు Transfer చేసుకుంటాం" అంటారు. మౌనంగా రెండు గంటలు కూర్చుని క్రిందకి వచ్చిన తరువాత, రామకృష్ణారావు గారితో "పరిపూర్ణత్వం అంటే అమ్మ దగ్గర వున్నది" అని ప్రకటించారు. నాలుగు అయిదు రోజులు గడచిన తరువాత అమ్మ నివసించే మూడవ అంతస్తులో స్నానాల గదిలో స్వామిజీ, రామకృష్ణారావు గారు ఇద్దరూ అమ్మ అన్నం ముద్దలు పెడితే తిన్నారు. ఆ సమయంలో అమ్మ స్వామిజీకి నోట్లో ముద్దలు పెట్టింది. వెంటనే స్వామిజీ "The Motherless Siva at last Found his Mother" అన్నారు. తల్లి లేని శివుడే చివరకి తన తల్లిని కనుగొన్నాడు" అన్నారు. ఈ విధంగా అని అమ్మ పాదాలపై వ్రాలారు స్వామిజీ. ఈ విధంగా "నేను పరమశివుడ్ని" అని ప్రకటించిన మహా తాపస్వికుడు, ఆ పరమ శివుడే చివరకి తన తల్లిని కనుగొన్నాడు, అమ్మ పాదాలపై వాలి అంజలి ఘటించారు.

అమ్మ చీరాల బేర్ హాస్పిటల్‌లో కొంతకాలం వున్నది. ఆ సందర్భంలో అక్కడ డాక్టర్ మిస్ మేయర్‌కి, కంపౌండర్‌కి,అద్భుతమయిన అనుభవాలు ఇచ్చింది. వారు అరుణాచలం దగ్గర ఒక హాస్పిటల్ ప్రారంభం చేయటానికి వెళ్తూ అమ్మని కూడా తీసుకుని వెళ్ళారు. రమణ మహార్షి ఆశ్రమానికి వెళ్ళారు.రమణ మహర్షి అమ్మని చూసి "మాతృశ్రీ' ' అన్నారు. గుంటూరు జిల్లాలో చేబ్రోలు దగ్గర కొత్తరెడ్డిపాలెం అనెడి ఊరు వున్నది. అక్కడ "లక్ష్మీకాంత యోగి" అనెడి గాయత్రీ ఉపాసకులు వున్నారు. వారిని చీరాల వారు జిల్లెళ్ళమూడి తీసుకుని వెళ్ళారు. వారు అమ్మని దర్శించినప్పుడు అమ్మ పంచముఖ గాయత్రీగా వారికి దర్శనం ఇచ్చారు. వారు "అమ్మా గాయత్రీ ఇక్కడ వున్నావా?" అని అమ్మ పాదాలపై వ్రాలారు. ఈ విధంగా ఎందరో మహానుభావులు అమ్మని దివ్య మాతృమూర్తిగా దర్శించారు. నీరాజనాలు అర్పించారు.

## త్రిమాతలు తాను అని తెలియ చేయటం

డాక్టర్ పొట్లూరి సుబ్బారావు గారు చీరాల వాస్తవ్యులు. అద్భుతమయిన అనుభవాలు

పొంది అపారమయిన సేవలు చేసుకున్న ధన్యజీవి.కొన్ని వేల ఫొటోలు, ఆడియో, వీడియో క్యాసెట్లు, స్లైడ్స్ సినిమాలు తీశారు. వారు డాక్టరు అయినా బహుముఖ ప్రజ్ఞాశాలి. యోగాసనాలు, వ్యాయామం, కఱ్ఱ,కత్తిసాములు, ధ్యాన సాధనలు ఈ విధంగా ఎన్నో సామర్థ్యాలు కలిగిన వ్యక్తి. నిరంతరం అమ్మ స్మరణతో పండిన ధన్యజీవి అయిన సోదరులు. వారు ఒక రోజు అమ్మ సాన్నిధ్యంలో కూర్చున్నారు. రాత్రి 10 లేక 11గం॥ల సమయం అది. ఆ రోజులలో అక్కడ కరెంటు కాని, ఈ బిల్డింగులు కాని లేవు. అమ్మ సమాధ్యవస్థలో అనేక రకాల భాషలలో మాట్లాడింది. ఎందరో మహానుభావులను పిలిచింది. తరువాత లేచి తను స్నానానికి వెళ్తూ డాక్టర్ గార్ని కెమెరా సిద్ధం చేసికొనమని చెప్పి , స్నానానికి వెళ్ళి వచ్చి నిలుచున్నది అమ్మ. ముప్పల సత్యం అనెడి వ్యక్తి పెట్రోమాక్స్ లైట్లు వెలిగించి పెట్టాడు. డాక్టర్ గారు కెమెరా సిద్ధం చేసుకుని ఫొటో తీయటానికి నిలుచున్నారు. వెంటనే అమ్మ దేహంలో నుండి కాంతులు విరజిమ్మినై. వెంటనే మైనం ముద్ద కరిగి రక రకాల రూపాలుగా అవుతున్నట్లు అమ్మ అనేక రూపాలుగా మారటం జరిగింది. వానిలో ఒక రూపం మాత్రమే డాక్టర్ గారు తీశారు. చైనా రూపం, జపాన్ రూపం, , ఈ విధంగా అనేక రూపాలుగా మారుతూ దర్శనం ఇచ్చారు అమ్మ. తరువాత కాంతులు విరజిమ్మటం పోయి మాములు స్థితికి వస్తుంది. ఈ సంఘటనకి చాలా కాలం ముందు "అన్ని రూపాలు నావే, అన్ని నామాలు నావే" అని చెప్పింది. ఈ సూక్తిని అనుభవ పూర్వకంగా డాక్టర్ గారికి ఇచ్చింది. మరొక విషయం "రూపం లక్ష్మి జ్ఞానం సరస్వతి, శక్తి పార్వతి " అని త్రిమాతల తత్వాన్ని తెలియ చేసింది. రకరకాల భాషలు మాట్లాడటం ద్వారా సరస్వతీ తానని, కాంతులు విరజిమ్మటం ద్వారా శక్తి అయిన పార్వతి తానని. అనేక రూపాలు మారుతూ దర్శనం ఇవ్వటం వలన లక్ష్మి తానని తెలియచేసింది. శక్తి జ్ఞానం -రూపం సర్వం తానని తెలియ చేసింది.

మనం చూసే ఈ విశ్వంలో పదార్థమంతా ఆకాశానికి ప్రతిరూపమని మనకు కలిగే సంకల్పమంతా ప్రాణశక్తికి ప్రతిరూపమని స్వామి వివేకానంద వివరిస్తారు. డాక్టర్ గారికి, మరి కొంత మందికి ఇచ్చిన అనుభవం ఒకటి పై సూక్తిని తెలియ చేస్తుంది. ఒక రోజు అమ్మ నివసించే పాకలో ఆకాశం నుండి తేనెలాంటి తియ్యని పదార్థం ధారగా పడింది. డాక్టర్ గారు మరి కొందరు దోసిళ్ళతో పట్టుకుని త్రాగారు. ఇది కేవలం ఒక మహిమగా కాక తత్త్వంగా తీసుకుంటే సర్వంలో ఆకాశం, ఆకాశంలో సర్వం ఇమిడి వుంది అని, అనంత విశ్వంలో ఏర్పడిన పదార్థానికిమూలమంతా ఆకాశంలో వున్నవని తత్వ శాస్త్రవేత్తలు చెబుతారు.

ఆకాశం, ప్రాణా శక్తి యొక్క తాడనం. వలన విశ్వం ఏర్పడిందని చెప్తారు. సంకల్పం , సర్వం, తానని తెలియ చేసింది. ఇతః పూర్వం డాక్టర్ గారికి ఇచ్చిన అనుభూతి. సర్వం తానయి, సర్వానికి అతీతమయిన అమ్మకి ఇటువంటివి చిన్న విషయం. దీని ద్వారా మహోత్కృష్టమయిన తత్త్వం అనుభవం లోకి వచ్చింది.

## అవతారమూర్తి ఆవిర్భావం - సామాన్యులకు దివ్యానుభూతి

చీరాల నుండి లింగేశ్వరరావు గారు అనెడి సోదరులు వస్తూ వుండే వారు. వారు ఒకసారి అమ్మని ఈవిధంగా అడిగారు. " అమ్మా అనేకత్వంలో ఏకత్వం అంటే ఏమిటి? అన్నారు. అమ్మ ఇవన్నీ ఎందుకునాన్న! హాయిగా భోంచేసి పడుకో అన్నారు. కాని వారికి తాను అడిగిన ప్రశ్నను గురించి అదే పనిగా ఆలోచన సాగింది. తరువాత వారు,వారి స్నేహితులు ప్రసాదుగారు ఇద్దరూ కలసి ఏడవ మైలు వచ్చి బస్సు కోసం వేచి వున్నారు. ఉన్నట్లు వుండి ప్రక్కనే నిలపడిన ప్రసాదు గారు అమ్మగా కనపడ్డారు. వారికి ."ఓ (... అమ్మా ! అంటూ ప్రసాదు గార్ని పట్టుకున్నారు. ప్రసాదుగారు అదేవిట్రా! నేను నీ స్నేహితుడ్ని ప్రసాదుని" అంటే వారు అమ్మా (...నన్ను మాయలో పడేయబాక అంటూ ప్రసాదు గార్ని పట్టుకున్నారు. గుఱ్ఱబండి వచ్చినా, ఏది చూసినా, ఎవర్ని చూసినా అందరూ అమ్మలాగ కనపడ్డారు. అదే విధంగా అరవటం మొదలు పెట్టారు. చీరాల వెళ్ళిన తరూవాత ఇంటిలోని వారు, వీధిలోని వారు, ఆఫీసుకి వెళ్ళినా, ఎక్కడికి తీసుకువెళ్ళినా అన్నీ, అందరూ అమ్మగా కనపడటం జరిగింది. వారి బంధువులు వారికి పిచ్చి ఎక్కింది అనుకుని, విశాఖపట్నమా, మద్రాసా, ఎక్కడికి తీసుకుని వెళ్ళాలి? అనెడి ఆలోచనలు మొదలు పెట్టారు. అయినా ఒకసారి అమ్మతో చెబితే బాగుంటుంది అని అమ్మకి విషయమంతా వివరించి చెప్పారు. అమ్మ వారితో "అనుభవం లేదు, అనుభవం ఇవ్వలేదు" అంటారు. ఇస్తేనేమో పిచ్చాసుపత్రిలో చేర్చి కొడతామంటారు, అంటూ అదే పోతుందిలే పోండి! అన్నది. వెంటనే లింగేశ్వరరావు గారికి ఆ స్థితి పోయి మామూలు స్థితికి వచ్చారు. చెట్టు, గోడ, తల్లి, చెల్లి, భార్య ఎవరికి వారు వారుగా కనపడ్డారు. అది మొదలు అటువంటి ప్రశ్న ఎప్పుడూ వేయకూడదని లింగేశ్వరరావు గారు, తక్కిన చీరాల వారు ఒక నిర్ణయం చేసుకున్నారు. అందరూ ఆ విధంగా కనపడితే సంపాదించేదెట్లా? తినేదెట్లా? తన వారిని పోషించేదెట్లా? ఇదెక్కడ గొడవ! వద్దు బాబోయ్, వద్దు ఆ ఆధ్యాత్మిక అనుభూతులు, అనేకత్వంలో ఏకత్వం వద్దూ, ఏమీ

వద్దా మామూలుగా వుంటే చాలు. లేనిపోంది అడిగాను.ఇక ఇట్లా ఎప్పుడూ అడగకూడదు అని ఒక తీర్మానం చేసుకుని నిర్ణయానికి వచ్చారు.

అవతారం ఒక ఉప్పెన లాంటిదని, అవతార మూర్తి అవిర్భవించినప్పుడు ఎక్కడికక్కడ దివ్య దర్శనాలు జరుగుతాయ్. సాధారణ మానవులకు మహాభక్తులకు కలిగిన అనుభవాలు కలగటం జరుగుతుందని. పరమ హంస తెలియచేస్తారు. వారి ప్రకటనని తెలియచేసేది ఇతః పూర్వం లింగేశ్వరరావు గారి అనుభవ సంఘటన. వివేకానంద ఒక సంధర్భంలో పరమహంస వెంటపడి అదే పనిగా ఆధ్యాత్మికంగా ఒక స్థితి ఇవ్వమని అడుగుతారు. అట్లా కొంతకాలం అడగ్గా అడగ్గా పరమహంస ఒకసారి వివేకానంద శిరస్సు మీద చేయి పెడతారు. వెంటనే వివేకానందకి తన దేహంలో మెడ దగ్గర్నుండి క్రిందిభాగం కనపడకుండా పోతుంది. ఎదురుగా జగత్తంతా గిరగిరా తిరిగి మాయమవుతుంది. వివేకానంద కంగారు పడి పిచ్చి కేకలు పెడుతూ "ఏమిటి?మీరు నన్నేమి చేస్తున్నారు, నాదేహం ఏమైంది? నాకేమి కనపడుటలేదు. నాకు తల్లి, తండ్రి, అక్క, తమ్ముడు వున్నారు. నాదేహం కనపడటంలా!" అంటూ అరుస్తారు. వివేకానంద అంతటివారు ఒక స్థాయిలో ఆ అనుభూతిని తట్టుకోలేక పోయారు. ఎప్పుడు ఎవరికి ఏది ఇవ్వాలో మహాత్ములకు తెలుస్తుంది. ఈ లోగా చాక్లెట్ కొట్టినట్లు గొప్ప అనుభూతులు పొందాలంటే చీరాల సోదరుని లాగ అవుతుంది.

## మహిమా సిద్ధి, ఇతరమైన అనుభూతులు

చీరాల దగ్గర "స్వర్ణ" అనెడి ఊరు వున్నది. ఆ ఊరు నుండి కోటేశ్వరరావు అనెడి సోదరుడు వస్తూ వుండేవాడు, ఆయన రైతు. ఒక రోజు ఆయన అమ్మని చూస్తూ వుండగా భూమ్యాకాశాలు ఏకమయ్యేటట్లు పెరిగిపోయింది. ఉదాహరణకి వామనుడు త్రివిక్రముడు అయినట్లు. ఇది మహిమా సిద్ధికి సంబంధించినది. దైవమయిన అమ్మకి ఇటువంటివి అత్యల్పం. ఒకసారి ఆయన స్వర్ణలో పూలు కోసుకుని వద్దామని వెళ్ళారు. అప్పుడు చెట్లు అమ్మగాను, ఆ పూలు అమ్మ శిరస్సు మీద వున్నట్లు దర్శనం అయింది. పూజకి పూలు కోయకుండా తిరిగి ఇంటికి వెళ్ళాడు. మరొకసారి అమ్మకి నీళ్ళు కాచెడి ముసలమ్మ అమ్మలాగ కనపడింది. చుట్టు ప్రక్కల ప్రకృతి, వడ్డించిన అన్నం, మిరపకాయ, అంతా అమ్మగా కనపడింది కోటేశ్వరరావుగారికి. చెట్లు, చెట్ల మీద పూలు అమ్మగా కనపడిన అనుభూతి ఒకసారి రామకృష్ణ పరమహంసకి కూడా అయింది. ఈ అనుభవంతో ఆయనకి ఒక ధృఢమైన అభిప్రాయం కలిగింది. అదేమిటంటే ప్రకృతి రూపమంతా అమ్మయే. సహజంగా ప్రకృతి బాహ్యమయిన

రూపముకంటే ప్రకృతిలోని శక్తికి ప్రాధాన్యత ఇస్తారు, వేదాంత పరంగా ఎక్కువమంది కాని వస్తువు రూపంగా వున్నది కూడా అమ్మయే అనెడి భావం స్థిరమయినది. మహాత్ములకు అయినటువంటి అనుభవం ఆయనకి అయింది. అవతారమూర్తుల కరుణా విశేషం అటువంటిది.

## "అమ్మ" అని అన్నందు వలన కాదు, అయినందు వలన అయింది

"జన్మ నిచ్చే జనని అయిన ఎఱుక లేక ఎఱుగ లేరు" అని సోదరుడు రాజు ఉటంకించాడు. కొందరు అమ్మని అమ్మగా గుర్తించక పోయినా, నిరసించి ద్వేషించినా బిడ్డగా దరిచేర్చి లాలిస్తుంది. "గిద్దలూరు" అనెడి ఊరునుండి ఒకసారి డాక్టరొకరు వచ్చారు. అతను క్రింద వున్నాడు. అతనితో వచ్చిన ఆడవాళ్ళు పైకి వచ్చి అమ్మ దర్శనం చేసుకున్నారు. ఒకామె వచ్చి " అమ్మా! వీళ్ళతో ఒక మగాయన వచ్చాడు. క్రింద వున్నాడు. మనిషి సరిగ్గాలేడు. మంచివాడే. పైకి తీసుకుని రావచ్చా?" అని అడిగింది. అమ్మ " తీసుకుని రండి " అన్నది. అతను పైకి వచ్చాడు. మనిషి సన్నగా వున్నాడు. ఒకకాలు విరిగి స్టీలు పరికరాలతో కట్టబడి వున్నది. ఆ కాలుని కట్టెలాగ ప్రక్కకు చాచి కూర్చున్నాడు, మనిషి త్రాగి వున్నాడు. అమ్మతో ఈ విధంగా మాట్లాడటం మొదలు పెట్టాడు. "నాకు మీ అమ్మలన్నా, బాబాలన్నా నమ్మకం లేదు. నాకు కృష్ణుడిలాగా ఎనిమిది మంది భార్యలు. ఇది నా ఐదవ భార్య. మీరంటే ప్రాణాలు వదులుతుంది. కాని మీరంటే నాకు నమ్మకం లేదు. నేను పక్కా త్రాగుబోతుని, వ్యభిచారిని' ' అన్నాడు. అమ్మ నవ్వుతూ ఆహ్లాదంగా, వాత్సల్యంతో అతని వంక చూస్తూ "నీవు నన్ను నమ్మనందు వలన నాకేమి అనిపించటం లేదు నాన్నా! నేను నీకు అమ్మనైనా కాకపోయినా నీవు నాకు బిడ్డవే. నన్ను ఆరాధించే నీ భార్య కన్నా నిన్ను చూస్తే నాకు జాలిగా వున్నది. మనిషివి చిక్కిపోయి వున్నావు. కాలు విరిగి వున్నది. సరిగ్గాలేవు. మజ్జిగన్నా ఏమైనా తాగుతావా? రా దగ్గరికి రా! అన్నది. అతను నేల మీద జరుగుతూ అమ్మ చెంతకు వచ్చాడు. నెల్లూరక్కయ్య పారిజాత పూలతో పూజచేసిన పూలని పట్టుకుని "ఇది నా మొదటి భార్యకి చాలా ఇష్టం. కాని చనిపోయింది. అప్పట్నుంచి వాడంటే నాకు చాలా కోపం.

అమ్మ :- ఎవడు వాడు?

అతను :- కృష్ణుడు

అమ్మ :-మరి వాడ్ని ఎందుకు పట్టుకున్నావ్? వదిలివేయక పోయావా?

అతను :- "ఎందుకో వాడంటే నాకు ప్రేమ"

ఈ సంభాషణ జరిగిన కొద్దిసేపట్లో అతను అమ్మ వంక చూస్తూ ఒక్కసారి అమ్మపాదాలపై వ్రాలాడు. అమ్మ చూసిన ఆ చూపులో ఏ అవ్యక్త సంస్కార కరుణా కిరణం అతని గుండెలలోకి చొచ్చుకుపోయిందో బాహ్యంగా ఒక వస్తువుగా చూపటానికి సాధ్యమయ్యేది కాదు. రెండు నిమిషాలు అయిన తరువాత లేచి "క్షమించండి" అని చెంపలు వేసుకున్నాడు. బొట్టు పెట్టండి అని బొట్టు పెట్టించుకుని అమ్మచేత తీర్థ ప్రసాదాలు తీసుకున్నాడు. ఏ ప్రతిఘటనా అమ్మవైపునుండి లేదు. తానుగా అతనికి అది తప్పు ఇది తప్పు అని ప్రబోధం చేయలేదు. ప్రేమ వల్ల లొంగిపోయాడు. "లొంగి లొంగ తీసుకుంటా" అని అమ్మ ప్రబోధం. అదే విధంగా ఆ వ్యక్తి లొంగిపోయి ఎంతగానో మారి అమ్మ చెంతకు వచ్చాడు. మౌనంగా అమ్మ చూసిన ఆ చూపులో భాష కందని ఏ మహోన్నత భావ తరంగాలు అతని అంతరంగంలోకి చొచ్చుకుని పోయినాయో, అమ్మనుండి పొంగిన ఏ మాతృ వాత్సల్య అమృత తరంగాలు బీటలు వారిన అతని హృదయాన్ని తడిపి సుభిక్ష చేసినవో బాహ్యంగా చెప్పటానికి ఏమిారీలు లేదు. కాని వ్యక్తి రీతి, నీతులనే ఉజ్జ్వలంగా మార్చిన సంఘటన ఇది. ప్రబోధం లేని ప్రభావితం చేసిన అమ్మ మహిమాన్విత ప్రభావం ఇది. ప్రబోధం లేకుండా ప్రభావతం చేయటం, ప్రతిఘటన లేకుండగ లొంగి లొంగ తీసుకోవటం "జన్మనిచ్చే జనని అయిన ఎఱుక లేక ఎరుగ లేరు" అని రాజు వ్రాసిన వాక్యార్ధంలోని తాత్పర్యాన్ని అనుభవ పూర్వకంగా ఈ సంఘటన విపులీకరిస్తుంది. అతను "మీ అమ్మలన్నా, బాబాలన్నా నాకు నమ్మకంలేదు" అంటున్నప్పుడు "నేను నీకు అమ్మనైనా కాకపోయానా నీవు నాకు బిడ్డవే" అనెడి అమ్మ వాక్యం రాజు పాటలోని అర్థాన్ని తెలియచేస్తుంది. అంటే అతను అమ్మని అమ్మగా గుర్తించక పోయినా అమ్మకి అతను బిడ్డే . జన్మనిచ్చే జనని అంటే భౌతికమయిన పరిధిలో కాదు. విశ్వానికంతా జన్మ స్థానమయిన విశ్వజనని అమ్మకి అందరూ బిడ్డలే. అందరికి జన్మనిచ్చే జననియే. కాని ఈ ఎఱుక, అనుభూతి లేనప్పుడు తెలుసుకోలేరు. అందుకని గిద్దలూరు డాక్టర్ గుర్తించలేదు. ఆ ఎఱుక అతనికి కలుగలేదు. " అమ్మ" అని అన్నందు వలన అవ్వలేదు. అయినందు వలన అయినది. భౌతికంగా చూసినా ఒక తల్లికి పుట్టిన బిడ్డని ఉయ్యాలలో నుండి మాయ చేశారు అనుకుందాం. ఆ బిడ్డ ఇరవయి సంవత్సరాలు ఎక్కడో పెరిగి తిరిగి ఆ తల్లి ఊరు వచ్చి , ఆ తల్లి ప్రక్కనే వెళ్తున్నా గుర్తించలేడు. కారణం కన్నతల్లే అయినా ఆ ఎఱుక లేకపోవటం వల్ల మరి భౌతికమయిన

పరిధిలోనే కొన్ని కొన్ని పరిస్థితులలో గుర్తింపు కలగటం ఎంతో కష్టమయినప్పుడు విశ్వజనని అయిన అమ్మ విషయంలో వేరే చెప్పనవసరంలేదు. ఇతః పూర్వం వివరించినట్లుగా ఈ సంఘటనలో గ్రహించవలసిన తాత్విక ఆదర్శాలు ఎన్నో వున్నవి.

## మాటలు లేని అనుభూతి

"శబ్దమే కాదు నిశ్శబ్దం కూడా బ్రహ్మమే" అని అమ్మ వాక్యం. ప్రేరణ కనపడదు.ప్రయత్నం కనపడుతుంది అంటారు అమ్మ. ప్రయత్నమయిన క్రియతో కాని, భావాన్ని ప్రకటించే మాటతో కాని, పని లేకుండగ వీటన్నింటికి మూలమయిన ప్రేరణ - శక్తి తానయిన అమ్మకి పై వానితోవ అవసరం లేకనే అనుభవ పూర్వకంగా సమాధానం ఇస్తుంది అమ్మ. మాటలు లేని సమాధానాలు ఎక్కువగా హృదయానికి హత్తుకుని సంశయ నివృత్తి అవుతుంది. అందుకనే మౌనం యొక్క విశిష్టతని గూర్చి ఈ విధంగా చెప్పారు.

"చిత్రం వటతరోర్మూలే వృద్ధా శిష్యా గురుర్యువా
గురోస్తు మౌనం వ్యాఖ్యానం, శిష్యాస్తు ఛిన్న సంశయాః!

తా॥ అల్లవటతర మూలమందు జరుగుతున్న వింత చూడండి. వృద్ధుడైన శిష్యుడు, యువకుడైన గురువు. మౌనమే గురుని వ్యాఖ్యానము. శిష్యుని సంశయములన్నీ ఛిన్నా భిన్నమై తీరి పోతున్నయ్. ఇది శంకరాచార్యులవారు చెప్పిన దానిలో కూడా వున్నది. ఈ ప్రబోధం చదివారు. సోదరులు వీరమాచినేని ప్రసాదరావుగారు. దీనిలోని విశిష్టత తన మానసిక పరిధికి అనుభూతికి అతీతంగా వున్నందువలన, ఇది శంకరాచార్యుల వారు ఉత్ప్రేక్షగా చెప్పి వుంటారు. మౌనం ఏమిటి? వ్యాఖ్యానం ఏమిటి? శిష్యునికి సందేహాలు తీరటమేమిటి? చెబితేనే అర్థం కావటం లేదు అనుకున్నారు ప్రసాదరావు గారు. అమ్మని దర్శించి అనేక సంభాషణలు చేసి గొప్ప అనుభూతులు అమ్మ వల్ల పొందారు. వానిలో పై సూక్తికి సంబంధించినది ఈ క్రింద తెలియ చేయబోయే అనుభూతి. వీరమాచినేని ప్రసాదరావుగారు అమ్మ దగ్గరికి తరచూ వస్తూ పోతూ వుండేవారు. ఒకసారి మూడవ అంతస్తులో అమ్మ స్నానాల గదిలో మంచం మీద కూర్చున్నారు. గంటన్నరసేపు అమ్మ, వారు ఏమీ మాట్లాడుకొనలేదు. వారికి మనస్సులో ఒక సందేహం రావటం, సమాధానం రావటం ఈ విధంగా ప్రశ్న సమాధానం, ప్రశ్న, సమాధానం గంటన్నర తనలో తనకే వచ్చినయ్. ఇంతసేపు మంచం మీద వున్న అమ్మ ఏమీ మాట్లాడకుండా కూర్చున్నది. గంటన్నర అవ్వగానే ఒక్కసారి వారి వంక చూస్తూ "అయ్యిందా? సందేహాలు తీరినయ్యా? ఇంకా వున్నయ్యా? అని అడిగింది. అప్పుడు

అనుకున్నారగ ఓహో! ఇదన్నమాట మౌనమే గురుని వ్యాఖ్యానం, శిష్యునికి సందేహాలు తీరుతయ్ అంటే. మౌన వ్యాఖ్యానమేమిటి, శిష్యునికి, సందేహాలు తీరటమేమిటి అని ప్రశ్నార్థకంగాను, ఎగతాళిగాను అనుకున్న వారికి అమ్మ చెంత పైవిధంగా అనుభవ పూర్వకంగా సందేహం తీరినది.

గుంటూరు వాస్తవ్యులు ఏకా రాజేశ్వరరావుగారు మొదటి సారిగా అమ్మని దర్శించినప్పుడు అమ్మ దర్శనాలు ఇస్తున్నారు. ఆ సందర్భంలో ముందుగా కలిగిన భావన, తరువాత వారికి కలిగిన అనుభవం వారు ఈ విధంగా తెలియచేశారు. 1960 ప్రాంతంలో అమ్మని దర్శించినప్పుడు అమ్మ ఒడిలో ఎందరో స్త్రీలు పురుషులు తల్లి ఓడిలో వ్రాలినట్లు వ్రాలటం చూశారు. అప్పుడు ఆయన మనస్సులో ఈ విధంగా అనుకున్నారు. " ఈమె ఏమిటి స్త్రీ అయి కూడా ఈ విధంగా మగవారిని కూడా ఒడిలోకి తీసుకుంటుంది., పెద్ద, చిన్న అని లేకుండ.ఇట్లా అనుకున్న మరుక్షణంలో మంచం మీద ఈ అమ్మలేదు. వారిని కన్నతల్లి కనపడింది. ఆ విధంగా దర్శనం ఇచ్చింది. ఈ అనుభవంతో ఆయనకి వచ్చిన అనుమానం పటాపంచలయింది. అక్కడ ఏ మాట లేకనే వారికి సమాధానం వచ్చింది. అప్పుడు వారు ఈ విధంగా అనుకున్నారట, "నీకు ఏ విధంగా అమ్మనో, అందరికీ అదే విధంగా అమ్మని. కనుక అందరూ అదే విధంగా అమ్మనయిన నాఒడిలోకి వస్తారు" అని వారిలో వారికే సమాధానం వచ్చింది. కొందరికి ఈ విధమయిన దర్శనాల ద్వారా ఏ మాటలేని సమాధానం వచ్చేది. రమణ మహర్షి చెప్పినట్లు ఫలములేని ఉద్ఘాటనం కాక నిశ్శబ్దంగా సాటి వారికి శాశ్వత సమాధానం అమ్మ ఇచ్చింది.

ఇంగ్లాండ్ నుండి వచ్చిన సోదరుడు "జేమ్స్" మొదటిసారిగా అమ్మని రమణ మహర్షి ఆశ్రమంలో దర్శించాడు. మొదట చూడగానే అమ్మ అత్యున్నతం, పరిపూర్ణం అనిపించింది. అక్కడ ఏ మాటలేని ఆంతరంగిక అనుభూతి. ఈ అనుభూతిలో అతను జిల్లెళ్ళమూడి వచ్చి వుండిపోయాడు. అమ్మని పరిపూర్ణంగా విశ్వసించి జీవితాన్నే అమ్మ సన్నిధిలో గడిపి సమర్పణ చేశాడు. ఇట్టి అవ్యాజ సమర్పణ మాటలు లేని అనుభూతి వల్ల జరిగింది.

మాటలేని సంఘటన ద్వారా ఇ.సి రామమూర్తి గారికి అనుభవం అయింది. వీరు ఆర్.ఎస్.ఎస్. ప్రచారకులు. వీరికి పక్షవాతం వచ్చి అమ్మ దగ్గరికి వస్తే చీరాల పొట్లూరి సుబ్బారావు గారి దగ్గరికి పంపించటం జరిగింది. డాక్టర్ గారు సర్వ శక్తులా వైద్యం చేసి

చివరికి తన పరిధిలో వున్నంత వరకు చేశానని, ఇక అసంభవమని చెప్పారు. తరువాత వారు అమ్మ చెంతకు వచ్చారు. అమ్మ "ఇది వరకు తిరగి చేసే దేశ సేవ ఇప్పుడు రిక్షా ఎక్కి వెళ్ళి చెయ్యమన్నారు". ఆ సందర్భంలో జరిగిన ప్రబోధాత్మకమయిన సంఘటనను ఈ విధంగా తెలియచేశారు వారి కంటే కూడా నడవలేని వ్యక్తి మరొకరు అక్కడికి వచ్చారు. ఆయనను ఇద్దరు వ్యక్తులు రెండు వైపులా పట్టుకుని తీసుకుని వచ్చారట. "నాకంటే కూడా నడవలేని వారు, ఇబ్బంది పడుతున్న వారు ఎంతోమంది వున్నారు కదా? ఇదేనేమో అమ్మ ప్రబోధంలో "నవ్వుతూ అనుభవించే వాడి దగ్గరికి ఏడుస్తూ అనుభవించే వాడు సలహాకి వస్తాడని సూక్తిలోని సారాంశం. ఈ విధంగా చెబుతూ వారు చక్కని ఉదాత్తమయిన వివరణని ఈ విధంగా ఇచ్చారు. "కష్టాలని తొలగించటం కాదు, కష్టాలని ఏ విధంగా చూడాలి" అని అమ్మ ప్రబోధించినది అన్నారు. ఈ విధంగా పైన వివరించిన సంఘటన వారికి చెప్పకనే చెప్పిన వజ్రతుల్యమయిన ప్రబోధాత్మక సందేశం అయినది. దైవాన్ని ఆరాధించటం, జీవితాన్ని అర్థం చేసుకోవటం, ధ్యేయానికి అంకితమవ్వటం అంటే ఏమిటో సరియైన రీతిలో హృదయానికి హత్తుకున్నది. కష్టం-సుఖం సంపద-దారిద్ర్యం, ఆరోగ్యం-అనారోగ్యంతో కూడుకున్న అనివార్యమైన ద్వంద్వాల జీవితంలో వీటిని తలచుకుని మానసికంగా కృంగిపోవటం కాక వీని నుండే ఒక ఉజ్వల స్ఫూర్తిని పొందటం. తనకు ఏర్పడిన స్థితినుండే, తాను అంకితమయిన ధ్యేయ సాధనా మార్గంలో జీవితాన్ని గడపటమనేది పంచాగ్నుల మధ్య తపస్సు లాంటిది. ఇట్టి వజ్రతుల్య అందరంగమనేది వారికి ఏర్పడింది. మాటలు లేని సంఘటనతో అంతకు ముందు తాను చేసిన ప్రబోధంలోని ఉజ్వల తాత్విక తేజః కిరణం వారి హృదయంలోకి చొచ్చుకుని పోయి సమాధానం వచ్చింది.

మొదటిసారిగా నాగార్జునసాగర్‌లో మన్నవ దత్తుకి అయిన అనుభవం. తాను చూస్తున్న ఎదురుకుండా వున్న చెట్టు, చేమ, కొండ, బిల్డింగులు,మొదలైనవి మారలేదు. కాని ఈ ప్రకృతి మొత్తం అమ్మ శక్తి ఆవరించినట్లు అనిపించింది. కారు మబ్బులు కమ్మితే నల్లని చీకట్లు కమ్మినట్లు, అమ్మశక్తి ఈ విశ్వాకారమంతా ఆవరించి వున్నట్లు అనిపించింది. ఇది సాకార రూప దర్శనం కాదు. ఐదు తలకాయల గాయత్రీగానో, రాముని గానో, కృష్ణునిగానో కాదు. ఇది దృశ్యానుభూతి కాదు. హృదయానుభూతి. ఈ అనంత విశ్వాకారమే అమ్మఅని ప్రత్యేకించి ఒక రూపంతో అమ్మ కనపడలేదనే అసంతృప్తి, కోరి లేకపోగా, సాకార రూప సాక్షాత్కారాలు సర్వం కాదనే భావనతో పాటు ఒక్కొక్కప్పుడు అల్పం అని కూడా

తోస్తుంది. ఈ అనుభవం జిల్లెళ్ళమూడి వెళ్ళకుండా ఎంతో దూరంగా వుండేటటువంటి వ్యక్తికి జరిగింది. ఈ అనిర్వచనీయమయిన మాటలు లేని అవ్యక్త హృదయానుభూతి ఒక మహోన్నతమయిన బంధమై నిలచి,నడచి శాశ్వతంగా అమ్మకి అంకితమవ్వటమనేది జరిగింది.

ఈ మౌనం యొక్క విశిష్టతని గూర్చి రమణ మహర్షి ఈ విధంగా చెబుతారు. 'మొట్టమొదట శుద్ధ చైతన్యం (అవ్యక్తం) వున్నది. దానినుండి అహమిక, దాని నుండి క్రమంగా తలపులూ, మాటలూ, ఇట్లు, పదములు మూలానికి ముని మనవళ్ళు, మాటలే అంత శక్తివంతములైతే అవ్యక్తమౌన వ్యాఖ్యానం ఇంకెంత శక్తివంతమో నీవే నిర్ణయించుకో. ఫలంలేని ఉద్ఘాటనమా? నిశ్శబ్దంగా కూర్చుని విజ్ఞాన శక్తులను ఇతరులపై ప్రసరింప చేయటమా? మౌనమంటే ఆత్మస్ఫూర్తి, ఆత్మస్ఫూర్తిలేనిది మౌనం ఎలాగ అవుతుంది. మౌనమంటే ఎడతెగని భాష అన్నమాట. "శబ్దమే బ్రహ్మంకాదు, నిశ్శబ్దం కూడా బ్రహ్మమే' ' అని అమ్మ ప్రబోధం. ఇట్టి అవ్యక్త హృదయానుభూతులు ఎందరికో ఎన్నో వున్నయ్. ఎన్ని మాటలు విన్నా, ఎన్నో బాహ్యమయిన మహిమలు చూసినా ఏర్పడని మహోన్నత భావం, సమాధానం వీటితో పనిలేని, నిశ్శబ్దం నుండి పొందే అవ్యక్త హృదయానుభూతి వలన ఏర్పడుతుంది. ఇదే సానుకూల వ్యతిరేకతలకి, శుభాశుభాలకి అతీతంగా అంకితమయి జీవించే ఆంతరంగిక స్థితిని ఇస్తుంది.

## దైవత్వం జయించంది, మాతృత్వం జయించిందిది భాషాతీత, భావాతీత దివ్యపథం అమ్మ వాత్సల్యం

కాసు రాధా కృష్ణారెడ్డి అంధుడు. సంగీత విద్వాంసుడు. 1963లో సత్యసాయి ఆశ్రమంలో కొంతకాలం వున్నాడు. వేదాంతం లక్ష్మీపతి గారిది రేపల్లె. వారు సత్యసాయి ఆశ్రమం వెళ్ళి రాధా కృష్ణారెడ్డిని కలిసినప్పుడు అమ్మని గురించి చెప్పాడు. "ఆంధ్రదేశంలో గుంటూరు జిల్లా బాపట్ల తాలుకా జిల్లెళ్ళమూడి గ్రామం కరణం గారి భార్యగా సాక్షాత్ స్వయంభూ పరమాత్మ అవతరించి వున్నాడు" అని చెప్పారు. తరువాత అమ్మని చూడటానికి 1963 జూన్ 12వ తేదీ జిల్లెళ్ళమూడి వచ్చాడు. అప్పుడు వర్షం పడి వెలిసింది. 7 వ మైలులో దిగగానే జారి పడ్డాడు. పడగానే అక్కడ మట్టి, ఏలకులు వేసి చేసిన అరిశెల వాసన వచ్చి ఆ మట్టిని నారింజ కాయన్నా ముద్దంత తినాడు. జిల్లెళ్లమూడి చేరి అమ్మను పరీక్షించుటం మొదలు పెట్టాడు. ఆ వ్యక్తిది బండ తామసిక భక్తి. బొడ్డులో నుండి ఓంకార

నాదం తీస్తూ గుద్దితే తట్టుకున్నవాడు, ప్రణవ స్వరూపుడు అనెడి భావం కలవాడు. కీర్తనలు పాడుతూ, ఓంకార నాదం తీస్తూ కొడుతూ, గుద్దుతూ 40 రోజులు అతను, అతని తమ్ముడు వెంకటేశ్వరెడ్డి వున్నారు. వాళ్ళకి ప్రత్యేకించి ఏ అనుభవం కాలేదు. ఒకవైపు ఇట్లా కొడుతూ వాళ్లకి కావలసినవి అడిగి చేయించుకు తినేవాళ్ళు. ఒకసారి ఒక్కొక్కరూ 400 గారెలు తిని చెరొక బక్కెట్ పాయసం త్రాగారు. ఒంటి గంటకి వాళ్ళ లెక్కలో భోజనం చేశారు. 40 రోజులు అయిన తరువాత ఊరికి వెళ్ళి మళ్ళీ కొంతకాలనికి జిల్లెళ్ళమూడి వచ్చాడు. రెండవసారి అదే విధంగా చేస్తుంటే వివిధ దేవ దేవీ రూపాల దర్శనం అయింది. పురుషరూప దర్శనం అయినప్పుడు పురుష స్పర్శ, స్త్రీ రూప దర్శనం అప్పుడు స్త్రీ స్పర్శ ఈ విధంగా అతనికి అనుభవం అయింది. పాదాల నుండి పంచాక్షరి , అష్టాక్షరి, గాయ్రతీ అనేకమయిన మంత్రాలు, నాదాలు విన పడినయ్. అమ్మ ఒక ప్రణవ సముద్రం అయితే ఆ సముద్రం యొక్క అలలకి తన చేయి తాకుతున్నట్లు అనుభవం అయింది. ఎన్ని అనుభవాలు అయినా కొడుతూనే వుండేవాడు. ఎన్ని దెబ్బలు కొట్టాడో అన్నీ మళ్ళీ రాత్రి పడూతూ వుండేవి. బంగారం గని త్రవ్వటం మొదలు పెడితే ఇత్తడి, సత్తు దొరికితే ఆగకూడదు. దొరికే దాక కొట్టాలి అన్నాడు ఆ వ్యక్తి. అంటే రూప దర్శనాలు తదితరమయిన అనుభవాలు, కామరూపం ధరించటం మొ॥ చిన్న చిన్న సిద్ధులు వున్న అసంపూర్ణులు, గుణాలకి దాసులైన వారు సహితం ఇవ్వగలరు. ఇవి కాదు దైవత్వం, నిజంగా గుణాలు జయించిందా లేదా? ఈ ప్రదర్శించే సహనం సహజ సహనం అవునా?? కాదా? అనెడి ప్రమాణాలతో బండ పరీక్ష పెట్టాడు? ఒకరోజు అయిదు గంటలు కొట్టి తమలపాకులు లాగ వుండే అమ్మ పాదాలని క్రిందకి పైకి మెలిక పెట్టాడు. ఈ విధంగా చేసి చేసి చివరికి ఏమీ చెయ్యలేక కూర్చున్నాడు. అప్పుడు అమ్మ " ఏం... నాన్నా! చెయ్యి నొప్పి పుట్టిందా?'' అని చెయ్యి రాస్తూ లాలించింది. దీనితో అమ్మ పాదాపై వ్రాలి అంజలి ఘటించాడు. పర్వతం కూడా బద్దలు అయి లావా కారుతుంది. భూమి కూడా కంపించి బద్దలవుతుంది. ఈ కోమలమయిన స్త్రీ ఏమిటి? ఈ విధమయిన సహనం, మాతృ వాత్సల్యం ఏమిటి? అని ఆశ్చర్యపోయాడు. దైవత్వం జయించలేనిది మాతృత్వం జయించింది.

భాషాతీత, భావాతీత దివ్య పథం మాతృత్వం. గుణాతీత, కాలాతీతమయిన అమ్మ సహజ సహనానికి దివ్య మాతృ వాత్సల్యానికి పాదాక్రాంతుడైనాడు. ఒక ఊరిలో ఒక వేశ్యాలోలుడు వున్నాడు. బిడ్డ చెడిపోతే తల్లి ఊరుకోదు, కనుక తల్లి నిరోధించింది. తల్లికి

తెలియకుండా ఒకరోజు వేశ్య దగ్గరకు వెళ్ళాడు. అతని తల్లి అడ్డు అయినదని తెలిసిన వేశ్య ఒక కోరిక కోరింది. రేపు రాత్రికి ఈ సమయానికి నీ తల్లి గుండెకాయ తీసుకుని వచ్చినా చేతిలో పెట్టాలని అడుగుతుంది. సరేనని వెళ్ళి నిద్రపోతున్న తల్లిగుండె చీల్చి, రక్తసిక్తతమయిన తల్లి గుండెను గుడ్డలో చుట్టుకుని పరుగులు తీస్తూ ఎదురుదెబ్బ తగిలి క్రింద పడ్డాడు. అప్పుడు వాని చేతిలోని తల్లి గుండె అన్నదట "ఏం నాయనా! దెబ్బ తగిలిందా? మందు వేసుకో, తొందరగా నయం కాదు నీకు" అని. కామాంధుడైనాడు, గుండెలు కోసి రక్తసిక్తం చేసిన సమయంలో కూడా మాతృవాత్సల్యాన్ని మాత్రమే వర్షింపచేసిన ఒక భాషాతీత, భావాతీత దివ్యపథం మాతృత్వం. అట్టిది అమ్మ వాత్సల్యం. ఆ తల్లి గుండె తన బిడ్డ వరకే అన్నది. ఈ తల్లి గుండె అందరి విషయంలో అదే విధంగా అన్నది. అందుకనే అమ్మ విశ్వజనని.

పూర్వపు అవతారాలు పరాక్రమంలో శక్తిని చూపిస్తే అమ్మది సహనశక్తి. ప్రతిఘటించి లొంగ తీసుకునే పద్ధతి, నిర్జించే పద్ధతి పూర్వపు అవతారాలది. ప్రతిఘటన లేకుండగ లొంగి, లొంగ తీసుకునే పద్ధతి అమ్మది. సహన శక్తి మేరు పర్వతం లాంటిది. గొఱ్ఱె పొటేలు ఎన్ని సార్లు ఢీ కొన్నా మేరు పర్వతం కదలదు. పొటేలు తలపగులుతుంది. సీతాదేవి సహనశక్తి యొక్క విశిష్టతని గురించి ఆంజనేయస్వామి ఈ విధంగా చెబుతారు వానరులతో. "సీతాదేవి యొక్క సహన శక్తి రావణాసురుని సర్వశక్తులను హరించింది. వాడిని ఇప్పుడు ఎవరైనా గెలవగలరు. రాముడు నిమిత్త మాత్రమే" అంటాడు. కనుక సహన శక్తి యొక్క విశిష్టత మహోన్నతం.

రాధా కృష్ణారెడ్డి యొక్క మరొక అనుభవం. అతనితో కుక్కనామం చేసింది. అతను ఎన్ని రాగాలతో అమ్మనామం చేశాడో, అన్ని రాగాలలో అమ్మనామం, మనుష్యుని గొంతుతో చేసింది.

## భౌతికమయిన ఉపకరణాలతో అవసరంలేని స్థితి

చీమల మఱ్ఱి లలితాంబగారు అమ్మ చెంతకు చేరిన పద్ధతి. "ఆధ్యాత్మిక శక్తి సంపన్నులు భౌతికమయిన ఉపకరణాలతో పనిలేకుండగనే తమ పనులను చేసుకుని పోతారని" అరవింద యోగి అంటారు. అంటే ప్రత్యేకించి ప్రచారాల వలన కాని లేఖలు, వార్తల వలన, టెలిగ్రాం, టెలిఫోన్ మొదలైన వానితో పనిలేకుండగ జరిగే ఆధ్యాత్మిక క్రియ.

చీమలమఱ్ఱి అనే గ్రామం గుంటూరు జిల్లా నర్సరావు పేట తాలూకాలో వున్నది. అక్కడ లలితాంబ గారు మడి ఆచారంతో జీవితం గడుపుతూ దైవపూజ, పారాయణాలు

చేస్తూ వుండేది. 1959 జూన్ నెలలో ఒక సాధువు మిట్ట మధ్యాహ్నం ఎండలో ఆవిడ ఇంటికి వెళ్ళాడు. వెళ్ళి "అమ్మా నాకులన్నం పెడతావా" అని అడిగారు. ఆమె ఒంటరిగా వుండటం వలన ఒకే వ్యక్తికి (తన వరకే ) వండటం వలన వున్న పదార్థం ఆయనకి సరిపోతుందో, లేదో అని ప్రక్కనే వున్న వారి ఆడపడుచు ఇంటికి వెళ్ళి అడగమని చెబుతుంది. వారి ఆడపడుచు ఇంటికి వెళ్ళిఅడిగితే పెట్టరు . తిరిగి వచ్చి వాళ్ళు పెట్టమన్నారు అమ్మా అని సాధువు చెప్పటం జరుగుతుంది. వెంటనే ఆవిడ తాను వండుకున్నది ముందు ఆ సాధువుకు పెట్టి , తాను వండుకుని తింటుంది. భోజనం అయిన తరువాత సాధువు ఈ విధంగా అన్నారు. "అమ్మా(.... నీకు భక్తి బాగా వున్నది. నేను ఎన్నో క్షేత్రాలు తిరగాను. జిల్లెళ్ళమూడి లాంటి క్షేత్రం లేదు, అమ్మలాంటి దైవం లేదు. అక్కడికి వెళ్ళి ఒకసారి అమ్మను దర్శించు. బాపట్ల వెళ్ళి పెదనందిపాడు వెళ్ళె రోడ్డులో 7వ మైలు దగ్గర దిగి మైలున్నర నడిస్తే జిల్లెళ్ళమూడి వస్తుంది. అని మార్గం చెప్పి, వాకిలి తలుపు తీసుకుని, వెళ్తారు ఆ సాధువు. మీరు క్షణంలో తలుపు వేసుకుందామని ఆవిడి వాకిలి దగ్గరకు వస్తే, ఆయన కనపడడు. ఆవిడ ఇల్లు ఒక పొలంలో వుంటుంది. చుట్టు ప్రక్కల మైలు దూరం వరకు ఎవరు వెళ్ళినా కనపడతారు. అటువంటిది మరుక్షణంలో ఆవిడ ఎటు వెళ్ళి చూసినా, ఆయున కనపడలేదు. అదృశ్యమయ్యారు. తనకు అమ్మని గురించి చెప్పడమే కాక, అదృశ్యమవ్వటం కూడా జరిగేటప్పటికి, ఆమెలో అమ్మవెంటనే దర్శించుకోవాలి అనెడి తీవ్రమయిన ఆకాంక్ష పెరిగి జిల్లెళ్ళమూడి వస్తుంది. అమ్మని చూసి చూడగానే సాక్షాత్తు రాజరాజేశ్వరి అనిపించింది. అమ్మ సాన్నిధ్యంలో కూర్చుంటే అమ్మ " ఏం అమ్మ ! సాధువు చెబితే వచ్చావా?" అని అడిగింది. జగజ్జనని అమ్మే అయాచిత కరుణతో స్వయంగా వచ్చి తెలియ జేసి దరి చేర్చుకుందని పులకితురాలై అవ్యక్త హృదయానందంతో విలపిస్తూ కూర్చుంది. అమ్మ "ఎందుకమ్మా ఏడుస్తున్నావ్ పిల్లలుపోయినందుకా? భర్త పోయినందుకా? " అని అడగటం జరిగింది. తన అనుభూతిని వివరించ లేదు. కారణం లేని మాటలు మూగ పోయిన అవ్యక్తానుభూతి అమ్మ ఎడల వీడని విశ్వాసమై, శాశ్వత బంధాన్ని నిలిపింది. ఏ భౌతికమయిన ఉపకరణాలు లేక సర్వం తానయిన అమ్మ ఎక్కడికక్కడ ఏ విధంగా ఏర్పడి దరి చేర్చి తరింప చేసిందో పైన లలితాంబ గారి అనుభవం, సంఘటన తెలియచేస్తుంది. అరవింద యోగి సూక్తి సారాంశం ఈ సంఘటన.

## కుటుంబి - విశ్వ కుటుంబి సంసార సన్యాసాలు ఏకత్రితం

రామకృష్ణ పరమహంస సంసార రూపు దాల్చిన సన్యాసి. అంటే వివాహితుడు అయినాడే గాని, భార్యలో జగజ్జననిని దర్శించి, ఆరాధించి ఆధ్యాత్మిక శిఖరంలో విహరించిన పరమ హంస అయ్యారు. పరిమితమయిన కుటుంబమే లేని సంసార రూపు దాల్చిన సన్యాసి అయి, జగత్తుకై మోడ్పులర్పించే మహాతాత్ముడైనాడు. వివేకానంద సన్యాసి రూపు దాల్చిన లోకకుటుంబి. అసలు వివాహమే చేసుకోలేదు. లోకం కోసం, జాతి కోసం పరితపించాడు. "సకల జగత్తుకు జ్ఞాన భిక్ష పెట్టిన వేద ఋషులకు వారసులైన వీరు నిరక్షరాస్యులై ఇసకలో పొర్లాడుతున్నారు. జగత్తుకంతా అన్నంపెట్టిన అన్నపూర్ణ బిడ్డలైన వీరు అన్నమో రామచంద్రా అని ఆకలి మంటలతో అల మటిస్తున్నారు. నాకు ఈవేదాంతం వద్దు, గురుదేవుడు కూడావద్దు. వీరి సేవలో ఆప్రయత్నంలో విఫలుడ్ని అయినా సరే! హరించుకు పోనీ" అని జాతి కోసం, లోకశ్రేయస్సు కోసం తల్లి బిడ్డల కోసం పరితపించినట్లు తపించేవాడు. ఈ విధంగా సన్యాసి రూపు దాల్చిన లోకకుటుంబి వివేకానంద.

అమ్మవీరిద్దరికి విలక్షణం; అతీతం, సన్యాసి అంటే మానవతా హృదయం ఇంకి పోయి బండరాయి అవ్వటం కాదు. ద్రవించి, వికసించి సర్వత్రు ప్రవహించటం. అమ్మ పరమ హంస లాగ సంసారం లేని సన్యాసి కాదు, వివేకానంద లాగ అసలు సంసార జీవితంలో అడుగు పెట్టని లోకకుటుంబి కాదు. అమ్మలో అద్భుతమయిన ప్రత్యేకత ఏమిటంటే, పరిమితమయిన కుటుంబం కలిగిన సంసారి అయినది. విశ్వ కుటుంబి అయిన సన్యాసి అయినది. పరిమితత్వాన్ని, పరిపూర్ణత్వాన్ని ఒకేసారి చేత పట్టిన ఉజ్జ్వల మూర్తి అమ్మ. ఈ విధంగా కుటుంబి, విశ్వ కుటుంబియై, సంసార సన్యాసాలు ఒకేసారి చేతపట్టిన ఏకత్రిత మయిన స్థితి అమ్మ.

## పరిమితత్వ పరి త్యాగం కాదు

పూర్వం ఆవిర్భవించిన మహాత్ములు శంకరులు, రమణ మహర్షి,వివేకానంద పరిమితత్వాన్ని వదిలితేనే (అంటే కుటుంబం, సంసారం మొదలైనవి)పూర్ణత్వంలో నిలిచి నడవటం జరిగింది. కాని అమ్మ పరిమితత్వాన్ని వదలకుండా పరిపూర్ణ మూర్తియైనది.

పూర్వం విరాగాన్ని పునాదులుగా ఆధ్యాత్మికానికి సోపానాలు వేస్తే, అమ్మఅనురాగాన్ని పునాదులుగా ఆధ్యాత్మికానికి సోపానాలు వేసింది.విరాగాన్ని వివరిస్తూ "సర్వత్రా అనురాగమే విరాగము" అని ఒక వినూత్న తాత్విక తేజఃపుంజాన్ని ఆధ్యాత్మిక మహదాకాశంలో

విరజిమ్మింది.

## దేహాన్ని విడిచి పెట్టటం కాదు, దేహాన్ని అతిక్రమించటం

నీవు ఎవరికి అమ్మ వమ్మా? అంటే నీకు, మీకు, అందరికి అన్నింటికి అమ్మని అన్నది. అమ్మ మాతృత్వం, విశ్వ జననీ తత్వం. నీలో నన్ను నేను చూసుకుంటున్నాను. మీలో నన్ను నేను చూసుకుంటున్నాను. అన్ని నేనులు నేనైన నేను" అన్నది. ఈ విధంగా అమ్మతన ఆత్మైక్యతను అనంత విశ్వంతో విలీనమయిన స్థితిగా తెలియ చేసింది. ఆధ్యాత్మిక ఔన్నత్య స్థితిలో వ్యక్తిత్వం నశించి విశ్వత్వం సిద్ధిస్తుంది. మనం మన దేహంతో ఐక్యత చెంది ఏవిధంగా అనుభవిస్తామో అదే విధంగా అందరి దేహాల ద్వారా, అనంత విశ్వం ద్వారా అనుభవించినప్పుడు అనంత విశ్వమే వారి దేహమవుతుంది.దేహాన్ని విడిచి పెట్టవలసిన (పరిత్యాగం) అవసరం లేదు. దేహాన్ని అతిక్రమించటం జరిగింది. అనేకత్వంలో ఏకాత్మతను అనుభవించటం.

## జీవితాన్ని గెంటి వేయటం కాదు; జీవితం రూపాంతరం చెందటం

" ఈ సంసారం బాధ అనిపిస్తుందమ్మా", బాధలు తొలగించి ముక్తిని ప్రసాదించమని" ఒకరు అడిగితే, "సంసారం బాధ అనిపించక పోవటమే ముక్తి" అని విశదీకరించింది అమ్మ. సంసారాన్ని. లోకాన్ని వదిలినందు వలన తాత్కాలికంగా గుణాలను అణచటానికి, జీవితాన్ని గెంటి వేయటానికి పనికి వస్తుందే కాని జీవితం రూపాంతరం చెందటానికి పనికి రాదు. దీనికి ఋష్యశృంగుడు అనెడి మహర్షి గాధ చెబుతారు. ఈయన ఈ లోకానికి దూరంగా అరణ్యంలో జపతపాదులు చేసుకుంటూ ఆడవారంటే ఎమిటో తెలియకుండగా జీవితం గడుపుతూ వుంటాడు. రోమపాదుని రాజ్యంలో క్షామం వస్తే, ఋష్యశృంగుడ్ని తీసుకుని వచ్చి వారి రాజ్యంలో అడుగు పెడితే, వర్షాలు కురిసి క్షామం పోతుందని చెబుతారు. ఋష్యశృంగుని తీసుకుని రావటానికి, మచ్చిక చేసుకొనటానికి, మారు వేషంలో అందమైన వేశ్యలను పంపుతాడు. ఒక్కసారి వేశ్యల స్పర్శే ఆయనకి తగిలినంత మాత్రాన, ఆ స్పర్శ కావాలని ధ్యాస పెరిగి తదేకంగా వారి కోసమే ఎదురు చూస్తూ కూర్చుంటాడు. తరువాత రోమపాదుని రాజ్యానికి వెళ్ళటం, ఆయన కూతుర్ని వివాహ మాడటం మొదలైనవి జరుగుతయ్. జీవితాన్ని గెంటి వేయటమంటే ఇది. గుణాలను అణచటం, జీవితాన్ని గెంటి వేయటం వలన ఉజ్వలమయిన రీతిలో రూపాంతరం చెందలేరు.

శుకదేవుడు జనకుని ఆస్థానంలో అప్సరసల లాంటి స్త్రీ జనం ముందు వున్నా, ఎంతటి అఖండ భోగైశ్వరాల ముందు న్యాటం చేస్తున్నా, తాను ఇన్నింటిని తన ఆత్మగానే అనుభవిస్తూ ఏ విధమయిన గుణ వికారాలు లేక వుంటాడు. జీవితం రూపాంతరం చెందటమంటే ఇది. వజ్రం వేయి సంవత్సరాలు కొండలలో వున్నా తన అస్థిత్వాన్ని కోల్పోదు. చెకుముకు రాయి 100 సంవత్సరాలు నీటిలో వున్నా బయటికి తీసి గీస్తే రవ్వలు విరజిమ్ముతుంది. ఈ విధంగా జీవితాన్ని గెంటి వేయటం కాక జీవితం రూపాంతరం చెందటం గురించి ప్రబోధించింది.

## గుణాల మూలంగా భగవంతుని ఆరాధించటం

ప్రకోపించే గుణాలు శాంతించాలి. గుణరహితుడు అయిన వానిని పొందాలంటే గుణాలని, నిరోధించాలి అని ఒక నానుడి వుంది. ఒక వ్యక్తి వచ్చి "నిగ్రహిస్తును". అని పదే పదే అంటే, అమ్మ అన్నది "నిగ్రహం లేనప్పుడు నిగ్రహిస్తున్నాను అనే మాట వస్తుంది" అన్నది. అదే విధంగా చూస్తున్నది కాని, మన నిత్య జీవిత వ్యవహారమును కాని పూర్ణంగా వర్జించి రమణ మహర్షి లాగ కూర్చొనటం అందరికి సాధ్యం కాదు. "మనస్సుని పరిపరి విధాల ఆకర్షించే దైనందిన వ్యవహారాల అన్నింటి మధ్యకూడా భగవంతునిపై భక్తి భావనను నిలుపు కోవటమనేది, నిరోధం సాధ్యం కాదు అనుకుంటామో అది (సాధ్యం కాని నిరోధం) సాధ్యమయిన పద్ధతి ద్వారా స్వభావానికి అనుగుణంగా నడుస్తూ ధ్యానించటంలో సహజంగా జరుగుతుంది. భగవంతుని మీద మనస్సు నిలపటం లేదు, సంసార వ్యవహారాలు, మమతాను బంధాలను అనుభవిస్తూ వీని వలన భగవ ధ్యాన్నం కుదరటం లేదు అనెడి నిరంతర ధ్యాసలో నిజంగా భగవంతుని ధ్యానించటం జరుగుతుంది. గుణాలని నిరోధించాలి అనెడి ధ్యాస, అసలు ధ్యేయం మీద మనసు నిలవక పోవటం జరుగుతుంది. అమ్మ చెంతకు ఒకామె వచ్చి " తన మనుమరాలి మీద అదే పనిగా ధ్యాస పోతున్నది, అందువలన భగవంతుని మీద ధ్యాస నిలవటం లేదు" అంటే " నీ మనుమరాలికి నీళ్ళు పోస్తూ, కృష్ణునికి నీళ్ళు పోస్తున్నానని, నీ మనుమరాలికి అలంకరిస్తూ కృష్ణునికి అలంకరిస్తున్నానని" అనుకొనమన్నది. ఇదే గుణాల మూలంగా భగవంతుని ఆరాధించటం. పరిపరి విధాల ఆకర్షించే దైనందిన వ్యవహారాల మధ్య భగవంతుని ఆరాధించటం.

## గుణము - ధనము

"గుణానికి మనకంటే మించిన వారిని, ధనానికి మన కంటే తక్కువ వారిని పోల్చుకోవాలి" అని అమ్మ ప్రబోధం. ధనం, గుణంలో గుణానికి ఇట్టి ప్రాధాన్యత ఇచ్చింది.

"గుణైరుత్తుం గతా మ్యాతి, నోచ్చైరాసన సంస్థితైః ప్రాసాద శిఖర స్తోపి, కాకో న గరుడాయతే' ॥ అని ఆర్యోక్తి. గుణాలని బట్టి ఎవరి ఔన్నత్యమయినా తెలుస్తుంది కాని వారు సంపాదించిన ఎత్తైన పదవీ స్థానాలని బట్టి కాదు. ఏదైనా ఒక శిఖరం మీద కూర్చున్నంత మాత్రాన కాకి గరుత్మంతుడు కాబోదు, (గుడి) గర్భగుడిలో మూల విరాట్ క్రింద వుంటాడు. గుడి శిఖరం మీద కాకి వుంటుంది. శిఖరం మీద వున్నంత మాత్రాన కాకిని ఆరాధించము. మూల విరాట్ నే ఆరాధిస్తాము. అదే విధంగా అమ్మ ప్రబోధంలో గుణానికి ఇచ్చిన ప్రాధాన్యత అటువంటిది. ఉదాహరణకి రావణాసురుడు రాజ్యాధికారాన్ని చేత పట్టాడు. శ్రీ రాముడు రాజ్యాధికారాన్ని చేత పట్టాడు దుర్యోధనుడు ధర్మరాజు రాజ సింహాసనం అధిష్టించారు. కాని రామునికి ధర్మరాజుకి ఉన్న ఎనలేని ఆరాధన విలువ, రవాణాసురునికి దుర్యోయధనునికి లేదు. కారణం వారు సంపాదించిన ఎత్తైన అధికార పీఠాలకి కాదు . రామునికి ధర్మరాజుకి, విలువని కీర్తిని ఇచ్చింది.వారి గుణ సంపత్తికి నీరాజనాలు పట్టింది లోకం. గుణ సంపత్తి ఉన్నతంగా వున్నప్పుడే సమస్యలు తీరి లోకం సుభిక్షం అవుతుంది. ఒక లోకోక్తి ఈ విధంగా వున్నది "ధనం కోల్పోతే ఏమీ పోనట్లే. ఆరోగ్యం కోల్పోతే కొంత పోతుంది. శీలం కోల్పోతే సర్వం పోయినట్లే" (If wealth is lost nothing is lost, If health is lost something is lost, If character is lost every thing is lost") అదీ కాక అదే పనిగా అసంతృప్తి అనేది ఆర్ధికమయిన విషయాలలో వుంటే మానవుడు కృంగి పోయి, జీవితం నాశనం చేసుకోవటం, లేక ప్రతి క్రియా భావంతో సమాజంలో కంటకమవుతాడు. ఈ విధంగా వ్యక్తి జీవితం దెబ్బతినకుండా, సమాజ శ్రేయస్సుకు ఆలంబనం ఆదర్శం కావాలంటే, గుణానికి మనకంటే మించిన వారిని, ధనానికి మనకంటే తక్కువ వారిని, పోల్చుకోవాలి అనెడి అమ్మ ప్రబోధం శిరోధార్యమై విలసిల్లుతుంది.

## రాగం - త్యాగం

"తన కోసం చేసేది రాగం. ఇతరుల కోసం చేసేది త్యాగం" అన్నది. నేను నాది అనెడి పరిమితయిన సంకుచిత రాగం నుండి ఇతరుల కోసం చేసెడి త్యాగమయ జీవితం వలన సమిష్టి శ్రేయస్సులో వ్యక్తి ఔన్నత్యం, క్షేమం వుంటుంది. రాగ త్యాగాలలో త్యాగానికి వున్న ప్రాధాన్యత తెలియ చేసింది.

**తన కుటుంబం వరకూ వుంటే పాషురత్వం - అదే సర్వత్రా వుంటే**

## మాధవత్వం

ప్రేమ, సమర్పణ అనేది కటుంబ పరంగా సంకుచితంగా అందరూ అనుభవిస్తున్నదే. ఈ అనుభూతిని వికసింప చేసుకుని మాధవత్వంలోకి చేరుకొనమని తెలియచేసింది. తను తన కుటుంబాన్ని చూసు కొనటం ఘనతగా చెప్పుకొనటం జరుగుతుంది, కొందరు "మా నాన్నకి అట్లా చేశాను. ఇట్లా చేశాను" అంటుంటే అందులో విశేషం లేదు. ఎవరికైనా ఇతరులకి చేస్తే విశేషం అనేది అమ్మ. మానవులు అయినందుకు మానవత్వం నుండి మాధవత్వానికి చేరు కోవలసిన ప్రబోధం చేసింది. పామరత్వం నుండి మాధవత్వంలోకి చేరుకోవాలని బుద్ధి జీవులైన మానవులుగా జీవన లక్ష్యానికి, మానవాత్మ వికాసానికి కాంతి కిరణమయి ఈ సూక్తి విలసిల్లుతుంది.

## అజ్ఞాన దశ నుండి ప్రజ్ఞాన జ్యోతిని వెలిగించింది

రూపం లక్ష్మి, శక్తి పార్వతి, జ్ఞానం సరస్వతి. అని వివరించారు అమ్మ. ఇది స్త్రీ పురుష లింగ బేధాలకి అతీతంగా. సకల ప్రకృతికి అతీతంగా చెప్పటం జరిగింది. ఉదాహరణకి ఒక వ్యక్తి వుంటే ఆవ్యక్తి స్త్రీ అయినా, పురుషుడైనా ఆ వ్యక్తి రూపం లక్ష్మి, వారిలోని శక్తి పార్వతి, జ్ఞానం సరస్వతి. అదే విధంగా సకల జీవరాసులు ఈ అనంత విశ్వం. అదే విధంగా వస్తువుగా తీసుకుంటే ఆ వస్తువు రూపం లక్ష్మి, దానిలోని శక్తి పార్వతి, దాని ఉపయోగ గుణం సరస్వతి. ఇదే తత్వాన్ని బ్రహ్మ-విష్ణు-మహేశ్వరుల పరంగా తీసుకుంటే ఒకరైతు దగ్గర్నుండి అందరికి అర్థమయ్యేటట్లు వివరించింది. ఉదాహరణకి వరి విత్తనాలు భూమిలో చల్లాడనుకున్నప్పుడు విత్తనం భూమిలో మొక్కగా భూమిలో పుడుతూ వస్తున్న దశ బ్రహ్మ. పెరుగుతున్న దశ విష్ణు, పండి ఎండిరాలిన దశ ఈశ్వరుడు. ఈ విధంగా వివరిస్తూ సృష్టి స్థితి లయాలు అనుక్షణం జరుగుతూనే వుంటయ్ అని సూక్ష్మంగా జరిచే విషయాన్ని కూడా తెలియ చేసింది. మనం గుర్తిస్తూ వస్తున్న దశని అని, పరిణామం చెందుతున్న దశని స్థితి అని, మనం గుర్తించని పరిణామ దశని లయం అని పేరు పెట్టుకున్నాం. వాస్తవానికి స్థితి తప్పిస్తే సృష్టి లయం లేదు. వ్యక్తం-అవ్యక్తం తప్పిస్తే నాశనం, రహితము లేదు. పైవిధంగా మనం చూస్తున్న జగత్తుకి, మనం గుర్తించే పరిణామ దశ అనుభూతులతో బ్రహ్మ-విష్ణు-మహేశ్వర తత్వాలని విశదీకరించింది.

"పంచ భూతాల సమ్మేళనమే గాయత్రి" అన్నారు అమ్మ. ఈ జగతి అంతా పంచ

భూతాల సమ్మేళనమే. కానిదంటూ లేదు. ఏ ప్రకృతిని అయితే అజ్ఞాన దశగా చెప్పారో ఆ అజ్ఞాన దశ నుండి ప్రజ్ఞాన జ్యోతిని వెలిగించింది. పైన త్రిమూర్తులు, త్రిమాతలు గాయత్రీ మొదలైన దివ్య తత్వాలని అజ్ఞానంగా చెబుతున్న ప్రకృతికి ప్రజ్ఞానమయంగా సమన్వయించి జ్ఞాన జ్యోతిని అంతరంగాలకి అందించింది.

## కామ ధేనువా? ధర్మ ధేనువా? కల్ప వల్లా? సంస్కార వల్లా?

అమ్మలాంటి అవతారమూర్తులు, మహాత్ములను గురించి ఆలోచించేటప్పుడు వారు మనం కోరిందల్లా ఇస్తే శక్తి వంతులు లేకపోతే ప్రయోజనం ఏమిటి? అని ఒక విచిత్ర భావన చాలా మందిలో వుంటుంది. దీనికి సమాధానం ఈ క్రింది కధానిక ద్వారా తెలియచేయటం జరుగుతుంది.

ఒక వ్యక్తి ఒక ఊరు నుండి చాలు దూరం నడిచి సాయంత్రం అయ్యేటప్పటికి ఒక చెట్టు క్రింద అలసి కూర్చున్నాడు. "దాహమవు తున్నది ఒక గ్లాసు మంచి నీళ్ళు వస్త బాగుండు అనుకున్నాడు. అనుకుని అనుకోక ముందే గ్లాసుతో మంచి నీళ్ళు వచ్చినయ్. వెంటనే ఆహా... ఇంకేముంది నేను కల్ప వృక్షం క్రింద కూర్చున్నాను. ఇంద్రాది దేవతలు సహితం నాలాగ ఘఖం అనుభవించ లేరు." అనుకున్నాడు. వెంటనే పాలు కావాలని, ఈ విధంగా పన్నీటి స్నానం, పంచ భక్ష్య పరమాన్న భోజనం, పట్టు పాన్పు అన్నీ కోరుకున్నాడు.అన్నీ వచ్చినయ్. మానవుడు ఎంతగా గుణాలకి విపరీతంగా దాసుడవుతాడో అంతగా దిగజారటమనేది జరుగుతుంది. కోరికలు తీర్చు కుంటున్నాడు కాని గుణాలని జయించ లేదు. భయమోహాదులు, కామ క్రోధాదులు అనెడి గుణాలు వ్యక్తిలో వున్నయ్. చీకటి పడింది, అర్థరాత్రి అయింది. భయం అనే గుణం ప్రకోపించింది. ఆ కల్ప వృక్షం క్రింద ఏదైనా సరే అనుకునీ అనుకోక ముందే పని అయిపోతున్నది. అప్పుడు అతను ఈ విధంగా అనుకున్నాడు . అర్థరాత్రి అయింది, చీకటిపడింది ఎవరైన దొంగ వస్తాడేమో" అని అనుకునీ అనుకోక ముందే దొంగ వాచ్చాడు. కత్తి తీసుకుని పొడుస్తాడేమో అనుకోగానే కత్తి తీసుకుని పొడిచాడు. కనుక. కల్ప వృక్షం ఏమి చేసింది కోరిన కోర్కె తీర్చిందే కాని మేలు కోరలేదు. చేదు మందు, కఠిన పధ్యం పెడుతున్నప్పుడు ఎన మేలే తనకు తెలియని పసి పిల్ల వానికి తల్లి మీదకోపం, విసుగు వస్తుంది. కాని ఆ క్రియ వెనకాల పిల్లవానికి మేలు, తల్లి వాత్సల్యం వుంటుంది, అందుకే అమ్మ అంటుంది "మీరు కోరుకున్నది నేను ఇవ్వను, నేను ఇవ్వదలుచుకున్నది ఇస్తాను" అందరి జీవితాలు వడ్డించిన విస్తరి లాగ వుండవు. కొందరివి ఆర్థికంగా, భౌతికంగా

ఆవిధంగా వున్నట్లు కనపడినా వారికి మరొక విధమయిన బాధా గాధలు వుంటయ్. " శిల్పానికి అందం రావాలంటే ఉలి దెబ్బ అవసరం " అని అమ్మ సూక్తి. అంటే మన అంతరంగం అనెడి శిల, సాధక బాధకాలు కష్ట సుఖాలు అనెడి ఉలి దెబ్బలతో ఉన్నతంగా నిర్మాణమవుతుంది. జీవితంలో ఎదురయ్యే దారిద్ర్యానికి, కష్టాలు బాధలకి కృంగి పోకుండా ఇవి అన్నీ ఉన్నత భవితవ్యానికి చక్కగా అంతరంగం ఎదగటానికి కావలిసిన వని ప్రబోధం చేసింది. అమ్మ కామధేనువు కాదు. ధర్మధేనువు. కల్పవల్లి కాదు, సంస్కార వల్లి.

## వృత్తిని కాదు-ప్రవృత్తిని మార్చింది

రామకృష్ణ పరమ హంస జ్ఞాని లక్షణానికి, అవతార లక్షణానికి భేదాన్ని తెలియ చేస్తూ "జ్ఞాని కొంత నీరు వున్న బావిలో పూడిక తీసి నీరు తెప్పించగలడని, అవతార మూర్తి ఏ మాత్రం నీరు లేని శుష్కమైన బండరాతి నేలలో నీరు పుట్టించ గలవాడని తెలియచేస్తాడు. అంటే ఏ మాత్రం భక్తి జ్ఞాన భావాలు లేని, చదువు సంధ్య సంస్కారాలు లేని బండరాతి హృదయాలలో భక్తి జ్ఞాన సంస్కారాలు పుట్టించగలవారని అర్థం. ఈ ప్రబోధం ఆచరణాత్మకంగా జరిగిన సంఘటన.

జిల్లెళ్ళమూడిలో మంత్రాయి అనెడి మాలవాడు వున్నాడు. అతనికి చదువు అసలే లేదు. దొంగతనం, చారత్వం, మధుపానం ఈ విధంగా వుండవలసిన అవలక్షణాలన్నీ వున్నయ్. ఊర్లో అతని పేరు చెబితే హడల్. అటువంటి వ్యక్తిని అమ్మ తమ పొలం పనులు, ఇంటి పనులు చేసే పాలేరుగా పెట్టుకొనమని నాన్నగారికి చెప్పింది. నాన్నగారు మొదట భయపడ్డారు. కాని అమ్మ గట్టిగా చెప్పినందు వలన పెట్టుకున్నారు. ఆ వ్యక్తి అమ్మసాన్నిధ్యంలో మహోన్నతంగా మారాడు. అన్ని దురలవాట్లు పోయినయ్. భగవద్గీత, సుమతీ శతకం ఇంకా అనేకమయిన లోతైన విషయాలు వేదాంత సంబంధమయినవి చెప్పింది. అతనికి అహర్నిశం అమ్మ చింతన భగవధ్యాన్నం మనుస్సులో నిలిచింది. అతను ఎంతగా మారాడంటే పొలంలో నాగలి దున్నుతూ అమ్మ ఇప్పుడు తెల్ల చీరతో వున్నది, ఎఱ్ఱ చీరతో వున్నది అని, ఇంటి దగ్గర అమ్మ ఎట్లా వున్నదో పొలంలో వుండే చెప్పేవాడు. ఈ విధంగా మహోన్నతంగా మారి తుది శ్వాస వరకు అమ్మని సేవించి అమ్మలో విలీనం అయ్యాడు. ఈ విధంగా అసలు సంస్కారం కాని, ఆధ్యాత్మిక జలదే లేనటువంటి రాతి హృదయంలో అద్భుతమయిన భక్తి జ్ఞానాలను ఉద్భవింప చేసినది. మరొకటి గమనించవలసిన విషయం ఏమిటంటే ఏ వృత్తి చేసేవాడైనా, ఏరంగమయినా, వాటి ఔన్నత్యం కాని, దిగజారిన స్థితి గాని, ఆయా

రంగాలలోను, వృత్తులలో వున్న వ్యక్తుల ప్రవృత్తిని బట్టి ఆధారపడి వుంటుంది, అదే విధంగా మంత్రాయి వ్యవసాయం మొదలైన వృత్తి మారలేదు. అదే వృత్తిలో వుండి, అతని అంతరంగం, ప్రవృత్తి, మహోన్నతంగా మారింది. రామకృష్ణ పరమహంస వివరణ ప్రకారం, ఈ సంఘటన అమ్మ యొక్క అవతారతత్వాన్ని తెలియచేయటమే కాక, ఇతః పూర్వం వివరించినట్లు, ఆధ్యాత్మిక లౌకిక రంగాలకి ఏ ఉన్నతమయిన ప్రవృత్తి ఆదర్శమో, ఆధారమో, అట్టి ప్రవృత్తిని మార్చింధి అమ్మ. "వృత్తిని కాదు ప్రవృత్తిని మార్చింది" అమ్మ.

## వ్యక్తి సముహం సమన్వయం

"సమిష్టి యొక్క వ్యష్టిత్వమే ఈ సృష్టి"అని తెలియ చేసింది అమ్మ. "ఏకమేవా అద్వితీయం బ్రహ్మ" అన్నారు ఆర్యులు. ఒకే దివ్య శక్తి అనంతమయినది. అంటే సృష్టిలో సమూహాన్ని కాని వ్యక్తిని కాని దేనిని అశ్రద్ధ చేయకూడదు. అదే విధంగా అణువు దగ్గర్నుంచి మహత్తు వరకు అంతా ముఖ్యమే. " అద్భుతమయిన ఈ అన్యోన్యాశ్రయము సకల సృష్టిలో సమిష్టి సుస్థితి కావలెనన్న అందుకు ప్రతి అణువు ఆవశ్యకమే, ఈ సృష్టిలో ప్రతి అణువును తీసివేస్తూ పోతే ఇక మిగిలేదంటూ ఏమీ లేదు. ప్రతి ఇసుక రేణువు, ప్రతి తలంపును, ప్రతి ఆత్మయు, అనంతమే. అనంతమే సొంతము. సొంతమే అనంతము. ఇది మన ఉనికి అంటారు" వివేకానంద. అందువలన సృష్టిని గురించి భగవంతుని గురించి ఇచ్చిన వివరణను సామాజికంగా కూడా సమన్వయించటం జరిగింది. వ్యష్టిని కాని సమిష్టని గాని అశ్రద్ధ చేయటం అసంబద్ధమవుతుంది. సృష్టిధర్మానికి తత్వానికి విరుద్ధమయినది ఏది శాశ్వత పరిష్కారాన్ని సుఖాన్ని ఇవ్వలేవు.

దీనిలో సామాజికంగా రెండు ఇజాలు (సిద్ధాంతాలు) వున్నయ్. ఒకటి Capitalism ఇది వ్యక్తికి ప్రాధాన్యత ఇచ్చేది, రెండవది Communism ఇది సమూహానికి, సమాజం మొత్తానికి ప్రాధాన్యత ఇచ్చేది Capitalism లో ధనానికి ప్రాధాన్యత Communism లో అధికారానికి ప్రాధాన్యత. సమూహం మీద ప్రతి క్రియ చేసేది Capitalism గా వ్యక్తి మీద ప్రతి క్రియ చేసేది Communism. క్రియ చేయాలి కాని ప్రతి క్రియ చేయకూడదు. వ్యక్తి అభివృద్ధి చెందాలంటే సమూహం అణగాలని , సముహం అభివృద్ధి చెందాలంటేవ్యక్తి అణగాలని ఈ రెండు అసంపూర్ణాలే, ప్రతి క్రియలే.

వ్యక్తి కాని, సమాజం కాని రెండు అభివృద్ధి చెందుతూ సకల సమాజము సుఖశాంతులతో జీవించేటటువంటి ప్రబోధం అమ్మది. సృష్టి ధర్మమే అది. సృష్టి ధర్మానికి

విరుద్ధమయినవి ఏవీ శాశ్వత పరిష్కారాన్ని ఇవ్వవు.

దీనికి అమ్మచేసి, చూపించిన విధానం గుప్పెడు బియ్యం పథకం. ఒకప్పుడు జిల్లెళ్ళమూడిలో ప్రతి ఒక్కరూ ప్రతి రోజు ఎసట్లో బియ్యం పోసేటప్పుడుగుప్పెడు బియ్యం తీసి ప్రక్కన పెట్టి అందోరు ఈ బియ్యాన్ని ఒక చోటికి చేర్చేవారు.తరువాత ఆ వ్యక్తికి పని దొరికి గింజలు వచ్చినప్పుడు, ఆ గింజలు తెచ్చి వీరు సేకరించ్చెడి కేంద్రంలో ఇచ్చేవాడు. ఈవిధంగా వ్యక్తి సమాజం పరస్పరం సర్దుబాటు ధోరణతో పాటు పడుతూ జీవించే విధానం చూపించింది. పై వాక్యం ఆధ్యాత్మికంగా, లౌకికంగాను సమన్వయం అయి, ఈనాడు సామాజికంగా చెలరేగే అనేక ఇజాల (సిద్ధాంతాల) మధ్య సమన్వయాన్ని తీసుకుని వచ్చి సమస్యలను పరిష్కరించే ప్రబోధం, తత్వం వున్నది. ఇదే సరియైన Socialism (సామ్యవాదం)

## సంగత్వం - నిస్సంగత్వం

అమ్మ స్వర్ణోత్సవం 1973 ఏప్రియల్ 12న జరిగింది. ఆ సమయంలో అమ్మని అడిగారు "లక్ష రూపాయల పర్సు కావాలా? ఏమి కావాలి?" అని ఈ విధంగా అనేక మంది ఏవేవో ప్రశ్నలు వేస్తే,అమ్మ "లక్ష మంది బిడ్డలు ఒకే పంక్తిలో కూర్చుని భోజనం చేస్తుంటే చూడాలని వున్నది'' అన్నది. ఈ సందర్భంలో అమ్మ చెప్పిన మరొక ముఖ్యవిషయం "లక్షమంది తిన్నారు అనే దాని కన్నా ఒక్కడు తినలేదు అనేది బాధగా వుంటుంది'' అన్నది. జరిగిన ఘన కార్యానికి పొంగిపోవటం కాక ఏ చిన్న లోపం వుండకూడదనెడి వివేకంతో పాటు, ప్రతి ఒక్కరితో అమ్మ తాదాత్మ్యం తెలియచేసింది. ఆ సంధర్భంలో చేసిన పదార్ధాలని, గడ్డ పెరుగును అన్నింటిని కలిపించి పొలాలలో డ్రైన్ కాలవలో వేయించింది. ఎందుకంటే పశు పక్ష్యాదులు కూడా తన స్వర్ణోత్సవం సంధర్భంలో తినాలని, అంతే కాక జలచరాలు సహితం కూడా తినాలని కాలవలో వేయించింది. మట్టిలో మన కంటికి కనపడని సూక్ష్మ క్రిమి ఆకలి దాకా అమ్మ మాతృ వాత్సల్యం చొచ్చుకుని పోయింది. ఇంత చేసికూడా "ఎవడి అన్నం వాడికి వుంటుంది. వాడి అన్నం వాడికి లేకపోతే వాడు రాడు. నేను పెట్టడం కాదు. వాడన్నం వాడే తిని వెళ్తున్నాడు'' అన్నారు అమ్మ. లవలేశం కూడ అహంకారం లేని పరిపూర్ణ నిరహంకార స్థితిని తెలియ చేస్తుంది పై ప్రకటన.

## సర్వత్రా నిండిన వాత్సల్యం విషయంలో సంగత్వం

పరిమితమయిన అహంకారం, పరిపూర్ణంగా రహితమయిన నిస్సంగత్వం.

మనకు మన విషయంలో సంగత్వం ఇతరుల విషయంలో నిస్సంగత్వం. వ్యక్తి

గీతంగాను. కుటుంబ పరంగా సంతగ్వవం మనకు. సంస్థాగతమయిన విషయంలోను, దేశ ప్రపంచ విషయంలో నిస్సంగత్వం మనది. అంటే సమాజం మొదలగు వాని విషయంలో నిస్సంగత్వం. ఈ నిస్సంగత్వం స్వార్థంతో కూడుకున్నది (మన నిస్సంగత్వం స్వార్థం-భయం)

వివరణ :- సమాజంలో విషయంలో, విశ్వ శ్రేయస్సు విషయంలో విస్తృతంగా అందరి బాధా గాధలతో , సుఖ సంతోషాలతో ఐక్యత లేక ఇట్టి సమిష్టి విషయంలో త్యాగ సమర్పణలు లేని సంకుచితత్వంతో కూడుకున్న నిస్సంగత్వం మనది.

అమ్మకి అందరి శ్రేయస్సు విషయంలోనూ, సర్వత్రా నిండిన మమకార హృదయం విషయంలో సంగత్వం. తన విషయంలో నిస్సంగత్వం.

దీని విషయంలో మీ గర్భ తీపి మీ పిల్లల వరకే వుంటుంది. నా గర్భ తీపి సర్వత్రా వుంటుంది, అని వివరించింది అమ్మ, " తినకే పోతే మీరు చిక్కి పోతారు. మీకు పెట్టుకొనక పోతే నేను చిక్కిపోతాను" అన్నారు. అంటే తన విషయంలో ఎంతటి నిస్సంగత్వమో, విశ్వ శ్రేయస్సు విషయంలో అంతటి అమ్మ సంగత్వం సంపూర్ణంగా పరియితమయిన స్వార్థం నిండిన సంగత్వం మనది. అమ్మ సంగత్వం  నిస్వార్థ సంగత్వం. సర్వత్రా నిండిన ప్రేమ త్యాగాలతో కూడుకున్న నిస్వార్థ సంగత్వం.

సమాజం, విశ్వశ్రేయస్సు విషయంలో స్వార్థంతో కూడుకున్న నిస్సంగత్వం మనది. ఈ విధంగా సంగత్వం, నిస్సగత్వం యొక్క మేలు కలయికల ఉజ్వల తత్వాదర్శాలను అమ్మ నుండి బుద్ధి జీవులైన మానవులుగా మనం గ్రహించవలసింది ఎంతో వున్నది. దేని విషయంలో సంగత్వం కలిగి వుండాలి. దేని విషయంలో నిస్సంగులమవ్వాలో అమ్మనుండి గ్రహించాలి. అమ్మ స్వర్ణోత్సవ మహోత్సవం నుండి భౌతికంగా జరిగిన క్రియ వెనకాల పొందవలసిన స్ఫూర్తిని, తత్వాదర్శాలని ఆకలింపు చేసుకుని జీవించాలి.

## అమ్మ తత్వంలో ఐక్యతాను సంధానం

రామకృష్ణ పరమహంస ఒక ఉదాహరణ ఇస్తారు. పావన గంగానది ప్రవహిస్తున్నది. దానిలో గుడ్డ బొమ్మపడి చీకి చీకి కొంతకాలానికి కలిసి పోతుంది. ఉప్పు బొమ్మ పడి వెంటనే కరిగిపోయింది. రాతి బొమ్మ ఎంతకాలమయినా కరగలేదు. అంటే అమ్మనుండి ప్రవహించిన ఉజ్వల సంస్కార పావన గంగలో మన హృదయాలు గుడ్డ బొమ్మలలాగ వుంటే నిదానంగా చాలాకాలానికి ఆ తత్వంలో కరిగి పోతుంది. ఉప్పు బొమ్మ అయితే

వెంటనే కరిగిపోతుంది. రాతి బొమ్మ అయితే ఎంతకాలయినా ఆ తత్వంలో కరుగదు. ఉప్పు బొమ్మలను చేసి కరిగించు కొనమని వేడుకుని ఆ తత్వంలో జీవించి అంకితమయ్యే ప్రయత్నం చేద్దాం.

## ధర్మానుష్ఠానం

అమ్మని దర్శించటం, అమ్మ చేసేవి చూసి వూరు కోవటం కాక కొంతైనా ఆ తత్వంలో జీవించటానికి కావలసిన ప్రబోధం అమ్మ చేసింది. "నేను ఈ విధం ఎందుకు పెడుతున్నానంటే మీరు మరొకరికి పెట్టటానికి" అన్నారు అమ్మ, అంటే ధర్మ ప్రబోధం కాక ధర్మానుష్ఠానం. అమ్మ ఆచరించే విధానాన్ని మళ్ళీ అందరూ ఆచరించాలని తెలియచేసింది.

ప్రబోధం ఆచరణలో లేనిది సాధారణ మానవుడు స్పందించలేడు. అందువలన వాత్సల్య ప్రపూర్ణమయిన అంతరంగాలతో మరొకరిని ఉద్ధరిస్తున్నాము, ధర్మం చేస్తున్నాము అనెఢి అహంకారాన్ని కూడా దరి రానీయని భావంతో ఆచారించాలని, దీపం తో దీపాన్ని వెలిగించినట్లు అందరి ఆచరణ ఆ విధ వుండి సహ జీవన సామాజిక వ్యవ స్థ ఏర్పడుతుంది. పదార్థం పెట్టడం అనెడి క్రియ కేవలం యాంత్రికంగా కాక సాటి వాని కోసం పైన వివరించినట్లు పాటు పడటమనేది, అదోక ఉన్నతమయిన భావం శీలమయి అనెక రంగాలు, వ్యవస్థలు సర్వతోముఖంగా సుభిక్షమవుతుంది. ఈ విధంగా ప్రభోధం అనుష్ఠానం రూపంలో రావటమే కాక ఉన్నతమయిన తత్వానికి ప్రతి రూపమయిన అమ్మనుండి పొందిన స్ఫూర్తితో చేయటం వలన ప్రభోదం- ఆచరణతో పాటు భావం శీల సంపద కూడా నిర్మితమయిన సుఖ ప్రదంశుభ ప్రదమవుతుంది. భావం, శీల సంపద పునాదిగా ఏ కార్యమయినా జరిగినప్పుడు శాశ్వత సత్ఫలితాన్ని ఇస్తయ్. లేని ఎడల కేవలం క్రియ జరిగితే తాత్కాలిక సత్ఫలితాన్ని ఇచ్చినా తరువాత విషమ పరిణామం కలుగుతుంది.

## పరిమితత్వంతో పరిపూర్ణత్వానికి ఆదర్శం

ఒకసారి రామరాజు కృష్ణమూర్తి గారితో అమ్మ అన్నది. "నాలో మానవత్వం - అతి మానవత్వం - మాధవత్వం - మూడు వున్నయ్. మానవత్వంలో తన కుటుంబాన్ని, తన వారిని చూడటం, అతి మానవత్వం లో సర్వ మానవులు జీవరాసులను చూడటం మాధవత్వంలో అంతా నిండిన స్థితి. అక్కడ చెప్పటానికి ఏమీ లేదు.అ ంటే పరిమితమయిన కటుంబీకునికి, నేను నా కుటుంబం అనెడి పరిధిని అధిగమించి సాటి సమాజాన్ని గురించి ఆలోచించి అంకిత మయిన ఆదర్శ వాదులకి, ఆదర్శానికి అనాదర్శానికి అతీతులైన అంటే ఆత్మకోసం పృథ్వినే పరిత్యజించాలి అనెడి సర్వ సంగపరిత్యాగులకి, అందరికి మార్గ దర్శనం

ఆరాధ్యం అయినది అమ్మ. పరిమితత్వానికి అంతకంటే మించిన మధ్య దశకి, పరిపూర్ణత్వానికి ఆదర్శమై విరాజిల్లింది. నేను నాది అనెడి పరిమితంలోనే వుండక మహోన్నతంగా వికసించెడి స్థితికి ప్రతి రూపమై నిలచి ఆదర్శమయినది.

## అమ్మ జ్ఞానానికి అంతం లేదు. జ్ఞానమే తానయిన స్థితి

అమ్మ చెంతకు గుంటూరు నుండి గోవిందరాజుల దత్తు గారనెడి సోదరులు ఒకరు వస్తూ వుండేవారు. వారితో ఒకసారి "నాన్నా! నీవు మంగళ గిరిలో బాలాంబగారి సత్రంలో వడ్డన చేశావు కదూ! "అని అడిగారు అమ్మ. ఇంటికి వెళ్ళి వారు ఆ సంఘటన ఎప్పుడు జరిగిందో విచారిస్తే 1918లో జరిగిన సంఘటన. ఇది సాధారణ మానవుని జ్ఞాపక శక్తా అమ్మ పుట్టింది 1923లో. అమ్మ అడిగిన విషయం 1918లో జరిగినది. అమ్మ అనంతజ్ఞానాన్ని మన స్థాయికి తగ్గట్లు గుర్తించటానికి ఇది ఒక చిన్న సంఘటన మాత్రమే .

శ్యామల అనెడి వ్యక్తికి తాను భూమిపై అవతరించక ముందే ఆ అమ్మాయికి అక్షరాభ్యాసం అయినప్పటి నుండి ఓంకారం స్మరణతో పాటు ఓంకారం అక్షరం కనపడి దానిలో ఒక బాలికగా కనపడి తరువాత దరి చేర్చింది. అమ్మలో శ్యామలా దేవి తండ్రి తనతో చెప్పిన దృశ్యాలన్నీ కనపడుతయ్. తరువాత అమ్మ ప్రభావంతో ఆధ్యాత్మికంగా మహోన్నతమయిన స్థితికి వెళ్తుంది.

అమ్మ తాతగారైన చిదంబర రావు గార్ని అమ్మగా భూమిపైకి రాక ముందే 12 సంవత్సరాల నాటి సంగతి అడుగుతుంది. వారిపై వచ్చిన నేరారోపణ సంగతి, తరువాత వారికి ఇచ్చిన దివ్యదర్శనాలతో పాటు పొన్నూరులో జరిగిన సంఘటన అంతావారికి కనపడుతుంది. ఈసంఘటన వారిపై వచ్చిన నేరారోపణ. ఎవరెవరు చేసినది వివరంగా సినిమా తెర మీద కనపడినట్లు కనపడుతుంది. ఈ విధంగా అమ్మ జననానికి ముందు జరిగిన సంఘటనలని గురించి అడగటం, ఆ సంఘటనలను చూపించటం సహితం జరుగుతుంది. ఇట్టి అమ్మ జ్ఞానానికి అంతం ఏది. జ్ఞానమే అమ్మ అయి భాసిల్లింది.

## చరా చర జంతు దేహ నివాసిని

మన్నవ దత్తుకి అయిన అనుభవం, 1967లో జరిగిన సంఘటన. స్వర్ణ కోటేశ్వర రావు అనెడి వ్యక్తి దత్తుని కొండపాటూరు రమ్మని చెప్పి వెళ్ళాడు. అక్కడ నారు తీసుకుని వచ్చి డ్రైన్ కాలువ అవతల పొలంలో వేయాలి. దత్తు దున్నల బండి తీసుకుని కొండపాటూరు వెళ్ళాడు. అక్కడ కోటేశ్వరరావు కనపడలేదు. బండి మెట్టచేలో పోతున్నది. అప్పుడు విసుగుతో

ఈ విధంగా అన్నాడు.

"అమ్మా........ కోటేశ్వరరావుని చూపించి నారు మడి దగ్గరికి నన్ను చేర్చావా సరే . లేకపోతే ఖాళీ బండి తోలుకుని జిల్లెళ్ళమూడి వస్తాను" అని అనుకున్న మరుక్షణంలో ఎడమ చేతి వంక వున్న దున్నదానంతటదే వెనుకకు తిరిగింది. ఇందులో ఏదో సంకేత ముందని బండిని వెనుకకు మరల్చి కొంత దూరం తీసుకుని వచ్చాడు. పొలంలో నుండి రోడ్డు మీదకు వచ్చే చోట కోటేశ్వరరావు కూర్చుని వున్నాడు. అతనితో కలిసి నారు మడికి వెళ్ళి, నారు వేసుకుని వస్తున్నాం. ఇది చిన్న విషయం లాగ కనపడవచ్చు. ఎటు వెళ్ళాలో తోచని పరిస్థితిలో దున్న దానంతట అదే తిరగటం మొదలగు సంఘటనలు. "శబ్ద జాల మయం చరాచర జంతు దేహ నివాసినామ్" అనెడి శంకరాచార్యుల వారి గురుపాదుకా స్తవంలో తెలియ చేసిన విషయం గుర్తు వస్తున్నది. ఆ దివ్యశక్తి " శబ్ద జాల మయమని, చర అచర జంతు దేహాలలో నివసించేదని" దీని అర్ధం. అదే విధంగా నేను స్మరించిన మరు క్షణంలో జరిగిన సంఘటనఇతః పూర్వం శంకరుల వారి వాక్య తాత్పర్యాన్ని తెలియచేస్తుంది.

ఈశ్వర కృపతో జీవ జంతువులు సహితం విశిష్టమయిన పనులు చేస్తయ్. ఒక సందర్భంలో కాసు రాధా కృష్ణారెడ్డి అర్ధరాత్రి నామ సంకీర్తనం చేస్తుంటే, కుక్క ఒకటి అతని ప్రక్కన కూర్చుని **12** గంటల నుండి తెల్లవారు ఝామున **4** గంటల వరకు వివిధ రాగాలలో మనుష్యుని గొంతుతో నామం చేసింది. పశు,పక్షి,వృక సంతులం నుండి అనంత విశ్వం వరకూ అమ్మ నిండినది.

బండిలో నారు వేసుకుని వస్తున్న సమయంలో నేను రాగానే కోటేశ్వరరావు లేని కారణం చేత " ఎందుకు రెడీగా నీవు లేవు" అని అడగటం జరిగింది కోటేశ్వరరావుని. మాట మాట పెరిగి అరుచుకుంటుంటే ఒక ముసలమ్మ దోవలో వెళ్తూ "నేను బండి ఎక్కి వస్తా అయ్యా! ఎక్కించుకుంటారా?" అన్నది. ఎక్కమని ఎక్కించుకున్నారు. అవ్వ ఎక్కిన తరువాత మళ్ళీ ఇద్దరూ అరుచుకుంటుంటే, ఆ అవ్వ "ఊరుకోండయ్యా ఊరుకోండి, ఎందుకూ ఎందుకూ అట్లా అరుచుకుంటారు" అని అన్నది. అంతటి ఆవేశంలో వున్న ఇద్దరూ మంత్ర ముగ్ధులైనట్లు చల్ల పడి శాంత పడ్డారు. అప్పుడు ఆ ముసలమ్మని "నీవు ఎక్కడ దిగాలి" అని అడిగితే ఆ బిల్డింగుల కాడ వుంటాను '' అన్నది. కొంతదూరం వెళ్ళిన తరువాత "ఈడ ఆపండి'' అన్నది. దిగి సన్న పిల్ల కాలవ ఒడ్డున నడుస్తూ వెళ్ళింది. రెండు మూడు తుమ్మ చెట్లు దాటి వెళ్ళి న తరువాత కనపడలేదు. దగ్గర్లో బిల్డింగులు ఏమీ లేవు. దత్తు

ఇదంతా గమనిస్తూ తరువాత అనుకున్నాడు. దగ్గర్లో బిల్డింగులు ఏమీ లేవు కదా? ఇదేమిటి? ఇందాక ఆ అవ్వ అట్లా చెబితే మనస్సుకి తట్ట లేదని అనిపించింది. దున్న వెనక్కి తిరగటవం దగ్గర్నుండి అవ్వ, వారిద్దరిని ప్రశాంత పరచి వెళ్ళిన అంత వరకూ జరిగినది తలుచుకుని అమ్మ సర్వాంతర్యామి యొక్క లీలా విలాసానికి మనస్సులో ఆనందంతో నమస్కరించటం జరిగింది.

## రక్షణే తల్లి - శాసనాలతో పనిలేని సమాజం

"తల్లి రక్షణ కాదు రక్షణే తల్లి" అని అమ్మ ఉవాచ, భగవంతుని రక్షణ సర్వత్రా అవ్యక్తంగా వుంటుంది. మాతృ మూర్తి నుండి ఆవిర్భవించే క్షాత్ర శక్తి, త్యాగ నిరతి యొక్క విశిష్టతని గురించి వివరించే కథానిక ఇది.

"ఒక ఊర్లో తల్లి-బిడ్డ ఉన్నారు. ఒకరోజు ఆ తల్లి రోడ్డు మీద వెళ్తుంటే పిల్లి ఒకటి మీద పడితే బెదిరి పారిపోయింది. మరొక రోజు ఇంట్లో పని చేసుకుంటున్నది తల్లి. బిడ్డ రోడ్డు మీదకి వెళ్ళటం జరిగింది. ఇంతలో పులి ఒకటి వచ్చింది అక్కడికి . అది చూసిన వారు తల్లితో చెప్పారు. వెంటనే అక్కడ వున్న గొడ్డలి ఒకటి తీసుకుని పులి మీదకి వెళ్ళింది. పులిని చంపి తాను ప్రాణాలు వదిలింది. తనకోసం పిల్లిని చూసి భయపడి పారిపోయిన తల్లి తన బిడ్డకోసం క్రూర మృగంతో పోరాడి ప్రాణాలు వదిలే క్షాత్ర శక్తి త్యాగ నిరతి ఎక్కడి నుండి వచ్చింది? సైనికుడు సహితం తగ్గ ఆయుధం, పరిస్థితి లేకపోతే పారిపోవచ్చు. అబల అయిన ఆ తల్లిలో ఆవిర్భవించిన త్యాగం - క్షాత్రం, వచ్చింది అనుపమానమైన మాతృ వాత్సల్యం నుండి, అక్కడ ఏ శాసనం లేదు. ఇట్టి వాత్సల్యం పరస్పరం సమాజంలో ఏర్పడినప్పుడు ఏ శాసనాలతో పనిలేని సమాజం ఏర్పడుతుంది. ఈ మౌళికమయిన వాత్సల్యం లేని ఎడల శాసనాల దోవన శాసనాలు, అకృత్యాల దోవన అకృత్యాలు సాగిపోతూ వుంటయ్. ఒకప్పుడు ధర్మ బద్ధమయిన సమాజం ఏ విధంగా వుండేదో భీష్ముల వారు ధర్మరాజుతో ఈ విధంగా చెబుతారు.

"న రాజ్యం నైవ రాజాసీత్ నదండ్యో న దాండికాః
ధర్మణ్యేవ ప్రజాః రక్షంతి స్వ పరస్పరం " ॥

రాజులేడు, రాజ్యంలేదు, దండించే వాడు లేడు, దండింప బడేవాడు లేడు, ప్రజలలో వున్న ధర్మ నిష్ఠా గరిష్ఠతే పరస్పర ఒకరి నొకరిని రక్షిస్తూ వుండేదని. ఇట్టి మహోత్కృష్టమయిన

సమాజం సంస్థిత మయ్యేటటు వంటిది. అమ్మ యొక్క వాత్సల్య త్యాగ నిరతి, రక్షణ (క్షాత్ర శక్తి). రక్షణే తానయిన అమ్మనుండి పొందవలసిన స్ఫూర్తి, ఏర్పడే సమాజ స్థితి ఇది.

## అన్నీ తానై, తానే దరి చేర్చటం - అంతా వర్తమానం

వర్షుూ మల్లు అనెడి సోదటుడు కొంతకాలం అమ్మ సాన్నిధ్యంలో వున్నాడు. ఒకసారి రాత్రి 10 గంటలకి వెళ్ళి తాను ఊరికి వెళ్ళాలని బొట్టు పెట్టించుకుని బయలుదేరాడు. ఆ సమయంలో చివరి బస్సు కూడా వుండదు. కాని ఆ ఆలోచన అతనికి రాలేదు. 7వ మైలు వచ్చాడు. ఎంతసేపటికి బస్సు రాకపోతే జమ్ములపాలెం దాకా నడిస్తే గుఱ్ఱబ్బండి దొరుకుతుందేమోనని నడవటం మొదలు పెట్టాడు. నర్సాయిపాలెం అడ్డ రోడ్డు దగ్గరికి వచ్చేటప్పటికి, ఒక్క అడుగు వేస్తే ముందు వెళ్తున్న పొడుగాటి త్రాచు పాము మీద అతని పాదం పడేది. ఇంతలో బ్రహ్మాండమయిన లైట్ పడింది. ఆ వెల్తుర్లో దాన్ని చూసి వెనక్కి అడుగు వేశాడు. వెనక్కి తిరిగి చూస్తే బస్సు ఒకటి వస్తున్నది. బస్సు ఆపి ఎక్కాడు. బస్సులో ఎవ్వరూ లేరు. డబ్బు ఇవ్వపోతే S.R. Close చేశామని చార్జీ తీసుకొనలేదు. బాపట్ల రైలు గేటు వేయటం వలన బస్సు ఆగింది.డ్రైవర్, కండక్టర్లని టీ త్రాగుదాం రమ్మని మల్లు అడిగాడు. ముగ్గురు కలిసి టీ కొట్టు దగ్గరికి వచ్చారు. మల్లు, మూడు టీ ఇవ్వమని టీ కొట్టు అతనికి చెప్పాడు. తనతో వచ్చిన ఇద్దరూ ఆ కొట్టు అతనికి కనపడలేదు. అందువలన "మూడు ఎవరికి సార్" అని అడిగాడు అతను. "మా ముగ్గురుకి" అన్నాడు మల్లు. " మీ ముగ్గురెవరని" అడిగాడు అతను. అదేమిటని వెనక్కి తిరిగి చూస్తే బస్సులేదు, వారిద్దరూ లేరు. ఆశ్చర్యపోయి అమ్మ కరుణకి లీలా విలాసానికి ఆనందించి అమ్మకి ఆనందాశ్రువులతో అంజలి ఘటించాడు. కొట్టు అతనికి మూడు టీలకి డబ్బు యిచ్చి ఇంటికి చేరాడు. ఇక్కడ పాము నుండి ప్రమాదం తప్పించి, బస్సు, డ్రైవర్, కండక్టర్, సర్వం తానయి బాపట్ల చేర్చింది అమ్మ. అన్నీ తానే అయితానే దరి చేర్చి అదృశ్యమయింది. ఇట్టి అమ్మ కరుణకి భగవంతుడు భక్తుని సేవించినట్లు తానే అతనిని బాపట్ల చేర్చటం జరిగింది. ఇది అమ్మ యొక్క సర్వత్రా ఉనికిని రక్షణని తెలియచేస్తూ అమ్మ బిడ్డలని పులకాంకితులను చేస్తుంది.

ఇతని విషయంలో మరొక విశిష్ట సంఘటన. సోదరుడు మల్లు ఇంట్లో చెప్పకుండా వెళ్ళిపోయాడు. వారి తండ్రి వర్షుూ. శివ రామ కృష్ణ గారు అమ్మని అపార విశ్వాసంతో ఆరాధించేవారు. వారి పెద్ద కొడుకు ప్రసాదు కొంతకాలం శ్రీశైలం వెళ్ళి జపము, తపము

ధ్యానం చేస్తూ కూర్చున్నారు. శివ రామకృష్ణ గారు అమ్మ దగ్గరకు వచ్చి " పెద్ద వాడు ఆ తీరు చిన్నవాడు ఈ తీరు అని తన బాధని చెప్పుకున్నారు. తరువాత వారి పెద్ద కొడుకు వచ్చాడు. అతనికి వివాహం నిశ్చయం చేశారు. ఆ సందర్భంలో మల్లుని తలుచుకుని శివరామ కృష్ణ గారు బాధ పడ్డారు. ఆయనతో " మల్లు ఉపనయానానికి ముహూర్తం పెట్టమని" చెప్పినది అమ్మ. మల్లు ఏమైనాడో తెలియదు. ఎక్కడ వున్నాడో తెలియదు. వారి పెద్ద కొడుకు వివాహం సందర్భంలోనే మల్లు వడుగు కూడా నిశ్చయించారు. ఎడ్రస్ లేని వ్యక్తి మల్లుకి ముహూర్తం నిశ్చయం అయింది. అందరికి ఆశ్చర్యం వేసింది. రెండు రోజులు వివాహం వున్నదనగా మల్లు వస్తున్నట్లు జాబు వచ్చింది. మల్లు వచ్చాడు. జిల్లెళ్ళమూడిలో మల్లు ఉపనయనము, ప్రసాదు వివాహం జరిగింది. మల్లు బొంబాయి వెళ్ళాడు. అక్కడ్నుంచి తిరిగి వచ్చాడు. అమ్మముందుగానే ఉపనయనాకికి ముహూర్తం పెట్టించటం, అతను రావటం, మొదలైనవి అన్నీ కూడా అధ్యయనం చేస్తే అమ్మ సూక్తి గుర్తుకు వస్తుంది. "నాకు అంతా వర్తమానమే " అన్నది అమ్మ. ఈ సూక్తికి ప్రతి నిదర్శనమే పై సంఘటన.

## తల్లి ఒక్కటే - వేల్పులనేకం

నీవు ఎవరివి? రాజ రాజేశ్వరివా? రాముడువా? ఈ విధంగా ప్రశ్నలు వేస్తే "నేను ఎవరిని అయితేనేమి. నేను అమ్మను మీరు బిడ్డలు" అని చెబుతూ వుండేది. ఈ విధంగా మాతృత్వం అనేక ఆరాధనా పద్ధతుల మధ్య సమన్వయాన్ని తీసుకుని వస్తుంది. ఒక ఇంట్లో నలుగురు బిడ్డలు వున్నారనుకుంటే, వారిలో ఒకరు విష్ణువుని, ఇంకొకరు శివుడిని, మరొకరు శాక్తేయ తత్వాన్ని, ఇంకొకరు ఏ నామం రూపంలేని శూన్యం మీద మనస్సుని నిలపటం, ఈ విధంగా అనేక మంది వేల్పులను ఆరాధించినప్పటికి వీరి అందరికి తల్లి ఒక్కటే. వివిధ ఆరాధనా పద్ధతుల మధ్య ఏకాత్మ భావాన్ని తీసుకని వచ్చేది మాతృత్వం. ఎవరు ఏ రూపాన్ని ఆరాధించినా మనమంతా ఒకే తల్లి బిడ్డలమన్నే భావన అనుభూతి వీరిలో ఏకాత్మతని నిలుపుతుంది. ఈనాడు అందరూ తిండి , ఇల్లు మొదలగునవి కలిగి, మతాల వున్నప్పటికి వానికి అతీతంగా విభేదాలు లేకుండా జీవించే పద్ధతికి లౌకిక వాదం అంటున్నారు. అట్టి సెక్యులరిజమ్ అమ్మ తత్వంలో ఇమిడి వుంది.

"గుణాలకి ఆధారమయిన వాడు కృష్ణుడు. కృష్ణుడే గృష్ణుడు అన్నది.

విరామం లేని వాడు రాముడు.

రాగ ద్వేష అసూయలు లేనిది అనసూయ అని.

అనసూయ అంటే ఆడ అని రాముడు అంటే మగ అని కాదు. రామునిలో అనసూయలో వున్న శక్తి ఒక్కటే అని వివరించినది. "నాకు అన్నీ సరిపడతయ్" అని తెలియచేసింది. లౌకిక జీవనానికి ఆధ్యాత్మిక ఆరాధనలకి సమన్వయాన్ని సహజీవనాన్ని తీసుకుని వచ్చేది మాతృత్వం. తల్లి ఒక్కటే వేల్పులు అనేకమయినా.

## విశ్వాసం

"విశ్వాసమే భగవంతుడు. భగవంతుడ్ని విశ్వసించటం కాదు" అంటారు అమ్మ. విషయ వాంఛలు, జీవితం యొక్క ఒడుదుడుకులు, శారీరకమయిన స్థితిగతులు కోకొల్లలుగా మారినా చెదరనిది విశ్వాసం. ఈ విధంగా జీవితంలో విషయాలు ఎంతగా మారినా, కలిమిలేముల కష్ట సుఖాలు మొదలైన వాటి నడుమ కదలని చెదరని తత్వం అనుభూతి విశ్వాసం. విషయాల ముందు విశ్వాసం వెల వెల పోకూడదు, పోతే అది విశ్వాసమే కాదు. విశ్వాసం ముందు విషయాలు వెలవెల పోవాలి. మహాభక్తులు , జ్ఞానుల చరిత్రలో జరిగినది అదే. చాలా మంది ఈ మౌళికమయిన తత్వాన్ని అర్థం చేసుకోలేరు. చాలా మందిలో విశ్వాసం బీటలు వారి, కూలి పోయి, వ్యతిరేక గాలులు వీచి భ్రష్టమయ్యేది అందువల్లనే. భౌతికంగా శరీర యాత్రకి కావలసిన కనీస అవసరం కోరుకొనటం సాధారణ మానవ నైజం. కాని జీవన సర్వస్వంలో అదే ఆధారం దైవారాధనకి ఊతం కాకూడదు. జగత్తును సాధనంగా దైవం లక్ష్యంగా పెట్టుకున్నప్పుడు, అట్టి విశ్వాసం వజ్రత్యుము నిలచి విశ్వాసం ముందు విషయాలు వెలవెల పోతాయ్. జగత్తు లక్ష్యం అయి భగవంతుని సాధనమగా తీసుకున్నప్పుడు, అంటే జీవితంలో అగ్నిలో నెయ్యి పోస్తే మండే మంటలాగ ఆరని విషయ వాంఛలను తీర్చుకొనటం లక్ష్యమయి దైవం సాధన అయినప్పుడు విషయాల ముందు విశ్వాసం వెల వెల పోతుంది. అందుకనే అమ్మ ప్రబోధంలో "నమ్మకం కలగటానికి ప్రార్ధన. నమ్మికాదు' ' అని వుంది. ఇదే విషయాల ముందు విశ్వాసం వెల వెల పోకుండా వుండటం. ఆరాధన సర్వస్వం విశ్వాసం కోసం. ఆధ్యాత్మిక చింతనని, ఆరాధనని ఏ విధంగా అర్థం చేసుకుని జీవించాలో , అర్థాన్ని పరమార్థాన్ని అమ్మ తెలియ చేసింది. దీనిని ఆకలింపు చేసుకుని అంకితమయ్యే అంతరంగాలని, సామర్థ్యాన్ని ప్రసాదించమని అమ్మని వేడుకుని జీవితాన్ని సమర్పిద్దాం.

## భగవదారాధనకి పరిధి లేదు

విధులు, పద్ధతులు భగవంతుని ఆరాధించటం కోసం. భగవంతుని ఆరాధన సాగే వారికి కొంతమంది ఏర్పరుచుకున్న విధులు పద్ధతి పేరుతో సాగే ఆరాధనని ఆక్షేపించటం, నిలపటం, అర్ధ రహితం. దేహం యొక్క స్థితి గతులకి ఆరాధనకి ముడి పెట్టకూడదు. ఈ విషయంలో అమ్మ ఒకసారి ఈ విధంగా అన్నది..“సాధన వద్దని కాదు. సాధ్యంలో సాధన వుంది అంటాను. ఏది సాధ్యమయితే అదే సాధన. ఒకరు పద్మాసనం వేయలేకపోతేనో, లేక కాళ్ళు వంగవనుకో వారు పనికి రారు అనటం తప్పంటాను.” మనస్సు నిలవటం ముఖ్యం. అష్టావక్రుడు మహాజ్ఞాని. ఆయన దేహం నిటారుగా వుంటేనో, కూర్చుంటేనో జ్ఞాని కాలేదు. అన్ని అవస్థల ద్వారా భగవంతుని ఆరాధించే పద్ధతిని స్వాగతించింది అమ్మ. ఆరాధనకి ఒక పరిధి లేక నిరంతర ధారగా సాగే పద్ధతి అమ్మ ప్రబోధంలో ధర్మ సూక్ష్మం. శారీరక, ఆర్థిక స్థితి గతులకు అతీతమయింది. భగవంతుని ఆరాధన. అంతరంగం యొక్క పరితాపానికి సంబంధించినది. దీని ప్రాముఖ్యమే అమ్మ ప్రబోధం.

## ఆనందం ఏక ముఖం కాదు

సాధారణంగా ఈ జగత్తు తెలియకుండా శరీరం కట్టెలాగ అయిపోయి ఈ ద్వంద్వాలు లేని స్థితిని బ్రహ్మానందం అని భావిస్తూ వుంటారు.దీనికే ద్వంద్వాతీత ఆనందం అంటారు. ద్వంద్వాలు లేని స్థితిలో అనుభవించే ఆనందం ఏకపక్షం అవుతుంది. దీనికి ఒక ఉదాహరణ ఇస్తారు. సాధకుడ్ని సర్వత్రా వ్యాపించిన విష్ణువుని దర్శించమని చెబితే దర్శించగలిగాడట. అందరిలో నివసించే ప్రవర్తించే వాసుదేవుని దర్శించి ఆరాధించమని చెబితే తట్టుకోలేక పోయాడట సాధకుడు. కారణం ద్వంద్వాలు లేని స్థితిలో ఆనందం అనుభవించాడు. “పోపోయ్ పుల్లాయ్” అని అనేవాడు కూడా నివసించే వాసుదేవుడే. అనేక గుణ గణాల ప్రకోపంతో కూడుకున్న , మనస్సులు, బుద్ధులు, పదార్థాన్ని, ఒకే విధమయిన ఆనందంగా అనుభవించటం ఒళ్ళ తెలియకుండా పోయిన స్థితి ఇవ్వలేదు. “సర్వం ఖల్విదం బ్రహ్మ” అనెడి పరిపూర్ణ అనుభూతిలో, అన్నీ తానై అన్నింటికి అతీతంగా వుండే స్థితి. అనేకత్వంలో కూడా ఏకత్వానుభూతి. ఇట్టి స్థితే. “ద్వంద్వాలు బ్రహ్మగా తోచటం బ్రహ్మానందం” అనెడి అమ్మ సూక్తి.

“వున్నదంతా దైవంగా అనుభవించి, అది తానే కనుక దేనిని చూసినా, దేనిని విన్నా,

దేనిని ఆలోచించినా, ఇంత ఆనందంగా వుంటుంది" అన్నారు అమ్మ. ఆనందం అంటే అన్నీ అదేనని గుర్తించటమేగా? అంటూ పై వివరణ ఇచ్చింది. ఆనందం ఏక ముఖం కాదు. అది సర్వత్రా అనుభవించ గలగటం బ్రహ్మానందమని, అన్నీ తానై అన్నింటికి అతీతమయిన స్థితిని అనేకత్వంలో ఏకత్వం యొక్క అనుభూతిని సంపూర్ణ తత్వంగా తెలియ చేస్తూ ఆనందం సర్వతో ముఖం అవ్వటమే బ్రహ్మానందమని తెలియ చేసింది.

## సర్వమూ వరమే. అవరోధం కూడా అనుగ్రహమే

జీవితంలో ఎదురయ్యే శుభాశుభాలు, కష్టసుఖాలు చూసి నిర్విణ్ణులవటం జరుగుతుంది. ఆధ్యాత్మిక చింతనలో ఒక విచిత్రమయిన న్యూనతాధిక్యతలు, వారు అనుభవించే వానికి అన్వయించి మానసిక వేదన కలుగచేస్తారు. ఒక సందర్భంలో వివేకానంద అంటారు. "నిరోధం నుండే శక్తి ఉద్భవిస్తుందని. కుంభకాన్ని గురించి వివరిస్తూ చెప్పారు. ఒకరు వచ్చి "నేను రామజపం ఉపదేశం పొందాను. ఒక పద్ధతిగా అనుష్ఠానం కొంతకాలం సాగింది. ఇప్పుడు అట్లా కుదరటం లేదు. ఎప్పుడు అదే ధ్యాస అయిందమ్మా. ఒకటే బాధగా వుంది" అంటే "ధ్యాస కూడా క్రియే నాన్నా!" ఇది వరకు స్నానం చేసి కూర్చున్న కాసేపు చేస్తే, ఇప్పుడు  రామజపమే చేస్తున్నావ్. ఇది వరకటి కంటే ఇప్పుడే ఎక్కువగా చేస్తున్నావ్. అవరోధం కూడా అనుగ్రహమే అన్నది. "అనుగ్రహం ఎప్పుడూ వున్నది. శుభాశుభాల్లో కష్టసుఖాల్లో ఎప్పుడూ వున్నది." అని వివరించింది అమ్మ. "అవరోధం అనేది వినూత్న పురోగతికి నూత్న సన్నాహం" అంటారు అరవిందయోగి, మారువేషం వేసుకుని వచ్చిన దీవెనయే బాధ" అని కూడా అంటారు. ఇట్లా మహాత్ముల ప్రబోధం కాని, జీవితాలు కాని అధ్యయనం చేస్తే అవరోధాలు, దారిద్ర్య కష్టాలు ఆధ్యాత్మికానికి సోపానాలయినవి. భగవంతుని కృప యొక్క రూపం మారుతుంది. కాని లక్ష్య సిద్ధి ఒక్కటే. మనస్సుని కృంగదీసి జీవితాన్ని అణిచేది కాక, ఉత్తేజ పరచి స్ఫూర్తిని పొంది, బాధలు అవరోధాలని గురించి అనూచానంగా వస్తున్న మూఢ ఆలోచనలకు స్వస్తి చెప్పి ధీరోదాత్తులను చేసింది అమ్మ. అవి కూడా భగవంతుని కృపగా తెలియచేసింది. అవి మనకు పురోగతికి సోపాన సాధకాలుగా నిలిపింది అమ్మ.

## విశ్వాసంలో మూఢత్వాన్ని - ఆధ్యాత్మిక చింతనలో భయ బీజాల్ని నాశనం చేసింది

ఒక నామ రూప ఆరాధన అనేది అకుంఠితమయిన విశ్వాసం వటం ఉన్నతమే. కాని సాధారణంగా విశ్వాసంలో మూఢత్వం జొర పడుతుంది. దీనికి కారణం ఏ నామమైనా రూపమైనా అదే పరిధి విధించటం జరిగింది. శైవ, వైష్ణవ, ఈ విధంగా దేశ వ్యాప్తంగా ప్రపంచ వ్యాప్తంగా విభేదాలతో సంఘర్షించుకుని జాతి మనుగడకే చేటు తెచ్చారు. అద్వైతం కూడా ఒక ప్రత్యేక మతమయి సమాజంలో ఒక వర్గమై నిలిచింది. మత వాదాలతో జ్ఞాన విభాగాన్ని వదిలి వాదాలు, ఆచార విభాగానికి ప్రాముఖ్యత పెరిగి అనేకత్వంలో ఏకత్వాన్ని తెలియ చేస్తూ వుండెడి సమరవం పోయింది. అమ్మలో విశిష్టత ఏమిటంటే అమ్మ అనెడి నామం రూపం వుండి కూడా సకల నామాలతో రూపాలతో ఐక్యతాను సంధానం కలిగి, రాగ ద్వేష అసూయలు లేని అనసూయ అని తన ప్రత్యేక విశిష్టతని తెలియ చేసింది. "అన్ని నామాలు నావే, అన్ని రూపాలు నావే, ఏ పాదాలకి మ్రొక్కినా ఈ పాదాలకి మ్రొక్కినట అని వివిధ నామ రూప ఆరాధనా పద్ధతుల మధ్య ఐక్యతాను సంధానం చేసింది. "సర్వ సమ్మతమే నా మతం " అని "సర్వేషాం అవిరోధేన" అనెడి శృతి వాక్కుకి ప్రతి రూపమై విశ్వాసాన్ని నిలుపుతూ, విశ్వాసంలో మూఢత్వాన్ని విరిచింది. "ఏకం సత్ విప్రా బహుధా వదంతి" అనెడి సూక్తికి ప్రతి రూపములు అమ్మ అనెడి నామం, రూపం అందరికీ అందుతూ సార్వ జనికము విశ్వ జనీనము అయిన పూర్ణత్వం. సాకారానికి, నిరాకారం ఆధారం, నిరాకారానికి సాకారం ఆధారం, అని పువ్వుకు రూపం వుంది వాసనకి రూపం లేదు. రూపం లేని వాసనకి పువ్వు ఆధారం. రూపం వున్న పువ్వుకి రూపంలేని వాసన ఆధారం. ఈ విధంగా సాకార నిరాకార తత్వాల సమన్వయంతో శక్తి -నామం రూపం ఏది తక్కువ కాదని చెపుతూ భావానికి రూపముంది. రూపానికి పేరు వుంది, రూపానికి శక్తి వుంది. ఇందులోది తక్కువది కాదన్నది. ఈ విధంగా విశ్వాసంలో మూఢత్వాన్ని వివరించింది.

రెండవ విషయం "ఎల్ల వేళల గుర్తు రావటం మనేది ప్రమాణమే కాని ప్రమాదం కాదని" చాటి చెప్పి నిరంతర తైలధారగా సాగే ఉజ్వల ఆధ్యాత్మిక సాధనకి రాజబాట వేసింది. ఆ సంధర్భంలో గుర్తుకు వచ్చింది. ఈ సందర్భంలో గుర్తుకు వచ్చింది. అని భయపడే వారికి అమ్మ చెప్పిన విషయ మిది. నిరంతర ధ్యానం కోసం ప్రారంభంలో పద్ధతి పెట్టారు. పద్ధతుల పేరుతో నిరంతర ధ్యానాన్ని ఆపటం ఆధ్యాత్మిక చింతనకే గొడ్డలి పెట్టు. సాధకుడు ఒక స్థాయికి వచ్చిన తరువాత సాధకుని ధర్మంలోక ధర్మంగా మారి పోతుంది. లోకులు అనుకునే రీతిలో వారి సాధనా పద్ధతి వుండదు. అందువల్లనే ఎందరో భక్తులు,

జ్ఞానులు చిత్ర హింసల పాలు అయ్యారు. ఒకప్పుడు జిల్లెళ్లమూడిలో పిల్లలు డ్రైన్ కాలవ ఒడ్డున చెట్ల మీద కూర్చుని మంత్ర పుష్పం చదివే వారు. భద్రాది రామశాస్త్రి గారనే తాతగారు "అట్లా ఎక్కడ పడితే అక్కడ చదవ కూడదని, అమ్మ సన్నిధిలో చదవాలి కాని ఇదేమిటి ఎక్కడపడితే అక్కడ చదవటం" అని అరిస్తే అమ్మ అన్నది "అదేమిటి నా సన్నిధికి పరిధి గీస్తున్నావు. నేను అంతటా వున్నాను. వాళ్ళు ఎక్కడ చదివితే ఏమి? ఎక్కడైనా చదువవచ్చు' ' అని వివరించారు. "హృదయమునకు సరియైన వర్ణము లభించిన ఎడల ఎట్టి బాహ్య వర్ణము తోడను అక్కర వుండదు. ఇదియే సత్యమగు పారమార్థిక స్థితి" అంటారు వివేకానంద. వర్ణము అంటే ఏదో ఒక రంగు అని కాదు అర్థం. సాధనకి ఒక్కొక్కరికి ఒక పట్టు దొరుకుతుంది. కొందరు ఏదో రెండు అక్షరాలతో కూడుకున్న మంత్ర జపం అందు మనస్సు నిలచి, నిరంతరం దాని యందే ఏకాగ్రత నిలచి, ధ్యాస లక్ష్యమందు నిలుస్తుంది. మరొకరి మరొక విధంగా కొందరికి గాత్రం. ఈ విధంగా ఎవరికి ఏ విధమయిన పట్టు దొరుకుతుందో వారి అంతరంగానికి తెలుస్తుంది. దాని మార్గంలో వారు లక్ష్యాన్ని చేరుకుంటారు. బలవంతాన మరొక మార్గంలేక అనేక మార్గాలు తొక్కినందు వలన అసలే చంచలమయిన, మనస్సు ఇంకా చంచలమవుతుంది. దీనికి వివేకానంద మరొక దశకి వెళ్ళి ఈ విధంగా అంటారు. " ఒక స్థితిలో రంగులు మొదలైనవి అనావశ్యకములై అవుతయ్. బాహ్యమైన విషయములతో మనస్సు పెనవేసుకుని (అభిన్నములుగా భ్రమించి) దేవాలయములు దర్శించుటే పరమార్థిక జీవనమై పోవును. పురోహితులకు దానం చేయుటే మత ధర్మాచరణమై పోవును. ఇట్టివి అపాయకరములు. అవినీతికరములు. ఇట్టి వానిని తత్ క్షణమేపరిత్యజించవలెను." ఈవిధంగా ఒక స్థాయిలో దేవాలయములు దర్శించటం దగ్గర్నుండి అపాయకరములు అన్నారు వివేకానంద. త్యాగరాయస్వామి" కోటి నదులు ధనుష్కోటిలో వుండగా ఏల తిరిగేదవే మనసా" అని అంటారు. ఆధ్యాత్మిక అనుభవ సీమ బహుముఖ కోణాలతో వుంటుంది. రామకృష్ణ పరమహంస ఎన్నో మార్గాలు అనుసరించి పరమ పదాన్ని జగత్తుకి చూపించారు. రమణ మహర్షి "నేను" ఏమిటో విచారించి ఏక మార్గంలో పరమ పదాన్ని చూపించారు. త్యాగరాజు గానంతో, పరీక్షిత్తుడు శ్రవణంతో, వాల్మీకి మననంతో,ఈ విధంగా కొందరు అన్నీ, కొందరు ఒక్కొక్క మార్గంలో లక్ష్య సిద్ధి పొందారు. మౌలికంగా గ్రహించ వలసింది. నిరంతరం తైల ధారగా ధ్యాస నిలవటం, గుర్తుకు రావటం అనేది లక్ష్య ప్రాప్తికి మూల సూత్రం, పునాది అవుతుంది. అటువంటప్పుడు దైవచింతన మంత్రం తరింప చేసేది

అయినప్పుడు అట్లా అయితే నెత్తనుస్తుంది. ఇటాగైతే నెత్తనుస్తుంది. అంటారేమిటి? అంటారు అమ్మ.

"ఎల్ల వేళల గుర్తు రావటమనేది ప్రమాణమే కాని ప్రమాదం కాదు" అని చాటి చెప్పి ఆధ్యాత్మిక చింతనలో భయ బీజాలని పార ద్రోలింది.

"విశ్వాసంలో మూఢత్వాన్ని విరిచింది. నశింప చేసింది."

"ఆధ్యాత్మిక చింతనలో భయ బీజాలని నాశనం చేసింది"

## నాలుగు దశల వారికి ఆదర్శం - ఆరాధ్యం

దివ్యత్వం నుండి మరొక దశకి వచ్చి ఆలోచిస్తే జాతీయ, అంతర్జాతీయ వాదులకి కాని, సామాజికంగా వీరిలో ఆదర్శం వుందా? అనుకుంటారు. ఏ విధంగా అమ్మలో వుందో వివరణ. మొదటి మెట్టు జాతీయ వాదులు. వీరు "జననీ జన్మ భూమిశ్చ స్వర్గాదపి గరీయసీ' ' కన్న తల్లి, మాతృదేశం స్వర్గం కన్న మిన్న.

"కోటి కోటి కంఠ కల కల నినాద కరాళే
కోటి కోటి భుజై ధృత ఖర కరవాలే
త్వం హి దుర్గా దశ ప్రహరణ ధారిణీ కమలా కమల దళ
విహారిణీ వాణీ విద్యా దాయినీ, సుఫలాం, సుజలాం
మాతరం వందే"

శక్తికి దుర్గగా, సంపదకి లక్ష్మీ దేవిగా , జ్ఞాన ప్రదాయినీ అయిన సరస్వతీ దేవిగా దేశాన్ని దర్శించి కీర్తించి ఆరాధించారు దేశ భక్తులు. అమ్మ అన్నది. "దేశ సేవ, దైవ సేవ, రెండూ వేరు కాదని" తుఫాన్లు ,ఉపద్రవాలు వచ్చినప్పుడు ఎవరైనా వారికి సేవ చేస్తుంటే" అది కూడా నా సేవే" అనేది.

అమ్మలోని దివ్య మాతృత్వం పైన వివరించినట్లు దేశభక్తి, జాతీయ వాదులకు ఆదర్శం - ఆరాధ్యం.

"మాతా భూమిః పుత్రోహం పృధివ్యాం" ఈ భూమే మాకు తల్లి. మేమంతా ఈ భూమికి పుత్రులమే అంటూ, "వసుధైక కుటుంబకం" అన్నారు. "ఈ భూమి మీద నివసించే మానవులంతా ఒకే కుటుంబం" అన్నారు.

"భూమే తల్లి అయినప్పుడు ఏ భూమి అయినా తల్లే కదా? అంటే దేశాంతర, ఖండాంతర వాసులందరిని దరి చేర్చి ఒడిలోకి తీసుకున్న అమ్మ అంతర్జాతీయ వాదులకు

ఆదర్శం - ఆరాధ్యం.

ఈ రెండు దశలని దాటి మరొక స్థాయికి వెళ్ళిన మహాత్ములు వున్నారు. వారు "కృణ్వంతో విశ్వం ఆర్యం" అన్నారు. వీరు విశ్వైక్య వాదులు. ఈ సృష్టే నాకు దైవం అన్నది . కొందరు "ఏకాత్మ మానవతావాదం" అంటుంటే అమ్మ "ప్రాణవతా వాదం" అనేది. విశ్వమంతా ప్రాణమయమే. ఈ విధంగా అమ్మ విశ్వైక్య వాదులకి ఆదర్శం -ఆరాధ్యం.

మహోత్తమ స్థితి బ్రహ్మైక వాదం. వీరు "ఈ అనంతమయిన విశ్వానికి మూడు రెట్లు వుండి దానిలో ఒక వంతుగా ఈ విశ్వాన్ని ధరించింది. ఆ దివ్య శక్తి" అని పూర్ణత్వం యొక్క పరాకాష్ఠని తెలియ చేశారు. వేదం ఆ విధంగా ఘోషించింది. "అమ్మ అంటే అంతులేనిది. అడ్డులేనిది. ఆధారమయినది." అని అమ్మ తెలియచేసింది. అంతులేని, అడ్డులేని ఈ అనంతమయిన విశ్వానికి ఆధారమయిన దివ్యమూర్తి అమ్మ బ్రహ్మైక్య వాదులకు ఆదర్శం ఆరాధ్యం.

ఈ విధంగా జాతీయ - అంతర్జాతీయ -విశ్వైక్య బ్రహ్మైక్య వాదులకి, అందరికి ఆదర్శం ఆరాధ్య. నాలుగు దశల వారికి ఆదర్శ ఆరాధ్యం అయింది.

## ఉత్తమ వికాసానికి ప్రబోధం

అమ్మ, అంతా అదే అన్నది, మరొక దశ నుండి ఏమీ చెప్పలేదని అనుకుంటారు. అబేధ స్థితి నుండి అట్లా చెప్పినా విబేధ స్థితి నుండి చేసిన ప్రబోధాలు ఎన్నో వున్నయ్. ఈ అనంతమయిన విశ్వంలో మానవుడు ఉత్తమమయిన, విచిత్రమయిన జీవి. పశువులో పశుత్వమే వుంటే, దేవతలలో దైవ తత్వమే వుంటే, రాక్షసులలో రాక్షసత్వమే వుంటే, మానవుడిలో మానవత్వంతో పాటు ఇన్నీ కలిసి వున్నయ్. మానవుడు అతి మానవుడై మాధవుడవ్వచ్చు. పశువుగా, రాక్షసుడుగా దిగజారవచ్చు. ఇట్టి విచిత్రమయిన మానవుడు ఉత్తమ మానవుడుగా మాధవత్వం యొక్క విలీనానికి చేసిన ప్రబోధమిది.

"మనిషి మృగం లాగ వుండ కూడదు. మృగం మృగం లాగ వుండవచ్చు బాగుంటుంది" అన్నారు అమ్మ. ఇది పశుత్వంలో నుండి మానవత్వంలోకి వచ్చెడి ప్రబోధం. కొందరు. పశు పక్షాద్యులు కునక నుండి రెక్కలు వస్తేనో, వాని దోవన అవి బ్రతక గలిగితేనో, తల్లి తండ్రి అని పట్టించుకోకుండగ వెళ్ళి పోయినట్లు, తల్లి తండ్రిని పట్టించుకోరు. ఇట్టివారు అమ్మ ప్రబోధం నుండి స్ఫూర్తిని పొంది మానవత్వంలోకి నిలిపే ప్రబోధం. మానవత్వానికి ప్రబోధం.

రెండవ దశలో "ప్రేమ కంటే ధర్మం గొప్పదని" తెలియ చేసింది. ప్రేమ, నేను నాది

అనెడి కేవలం కుటుంబంవరకూ కాక, ఈ పరిమితమయిన పరిధిని అతిక్రమించి సాటి మానవుని గురించి ఆలోచించి అంకితమయ్యేటటు వంటి అతి మానవతా వాదం ఈ ప్రబోధం. అదీ కాక ప్రేమ ధర్మం నీతి లేని వ్యామోహం కాకూడదని, ఉదా:- ధృతరాష్ట్రునికి దుర్యోధనుని మీద వున్నట్లు. అది నీతి బాహ్యమయినది కాకూడదని తెలియచేశారు అమ్మ. మరొకటి మానవుడు కేవలం స్వార్థ సంకుచిత జీవి కాక, సాటి సమాజాన్ని గురించి అంకితమయ్యేడి సంఘజీవి అయి వికసించి అతి మానవుడయ్యేటటు వంటి మార్గ దర్శనంపై ప్రబోధం.

"ఎవ్వరూ ఎవ్వరికీ పెట్టడం లేదు. ఎవ్వరు ఏది చేసినా తనకు తను చేసుకుంటున్నాడు". దీనిలో ఇంకొకరికి నేను చేస్తున్నాను అనెడి పరిమితమయిన భావం పూర్తిగా నశిస్తుంది. "ఆత్మవత్సర్వభూతాని వీక్షంతే ధర్మ బుద్ధయః" అనెడి పూర్ణ జ్ఞానం.తన ఆత్మనే సకల చరాచర జీవ జగుత్తులో ధర్మ బుద్ధి కల జ్ఞాని దర్శిస్తాడని ఆర్యోక్తికి ప్రతి రూపంగా జీవించే విధానం అమ్మ ప్రబోధం. ఇది మాధవత్వపు శిఖరాగ్రం. ఈవిధంగా తను తన కుటుంబం అనెడి మానవత్వం నుండి అతి మానవత్వం - మాధవత్వం యొక్క, శిఖరాగ్రం యొక్క స్థితికి అధిరోహించి వికసించే ప్రబోధం చేసింది అమ్మ. ఇట్టి ఉజ్వల ప్రబోధం నుండి స్ఫూర్తిని పొంది అమ్మకి అంకితమవుదాం. ఇదే ఉత్తమ వికాసానికి కావలసిన మార్గ దర్శనం, ప్రబోధం.

## జాగ్రత్ స్వప్న సుషుప్తీనాం

మేలుకున్నప్పుడు, కలలోను, గాఢ సుషుప్తిలోను సాక్షీభూతమయింది ఆ దివ్య శక్తి అని లలితా నామాల్లో వున్నది. జిల్లెళ్ళమూడిలో 40 సంవత్సరాల నుండి వుంటున్న క్రిష్ణవేణక్కయ్య అనుభవం ఒకటి ఇతఃపూర్వం సూక్తిని తెలియ చేస్తుంది. జిల్లెళ్ళమూడి చేరక ముందు క్రిష్ణవేణక్కయ్య కాకుమానులో వుంటూ వుండేది. ఒకసారి ఆవిడికి, గుండెలో తులసీ చెట్టు కనపడింది. అక్కయ్యకి ఇదేమిటి? ఇట్లా కనపడుతున్నది? అని భయం పుట్టి జిల్లెళ్ళమూడి వచ్చింది. ఆవిడ్ని చూసి అమ్మ అడిగింది "అక్కడే కనపడింది కదా? ఇక్కడికి దేనికి వచ్చావ్?" అని క్రిష్ణవేణక్కయ్య చెప్పక ముందే ప్రశ్నించింది. ఇట్లి సంఘటనలు అనేక సందర్భాలలో ఎందరి విషయంలోనో జరిగింది.

డాక్టర్ పొట్లూరి సుబ్బారావు గార్ని వారి స్వప్నం సంగత్తి అడిగింది ఒకసారి. ఇటు జాగ్రదావస్థ, అసలు స్వప్నావస్థ కాని ఒకానొక సమాధ్యవస్థ పొట్లూరి సుబ్బారావు గారికి

అమ్మ ఇచ్చింది. ఆ సందర్భంలో అంతకు ముందు ఎన్నో సార్లు ధ్యానం చేసినా అట్లా మనస్సు అంతర్ముఖం కాలేదు. రామ్‌లాలా ప్రభూజీ ధ్యానిస్తే కనపడలేదు. కాని అమ్మ ప్రభావం, వలన రామ్‌లాలా ప్రభూజీని కనపడ్డారు. ఈ విధంగా జాగ్రత్ - స్వప్న -సుషుప్తియే కాక ఇవి ఏమీ కాని మరొక స్థితిని కూడా ప్రసాదించింది. వీటన్నింటికి సాక్షి, వీటికి అతీతమయిన స్థితి కూడా ఇచ్చినటువంటి దివ్య మూర్తి అమ్మ.

## సాధకులకు ఆహారం పంపటం పిల్లవాడుగా కనపడి మాయమవ్వటం

ఒక సందర్భంలో క్రిష్ణవేణక్కయ్య అమ్మ చెంత కూర్చున్నది. అప్పుడు అమ్మ సమాధ్యవస్థలో ఏదో మాట్లాడింది. తరువాత అక్కయ్యతో పచ్చడి చేసి తీసుకుని రమ్మని, ఆ పచ్చడి చేతిలో పెట్టుకుని కూర్చుంది. నిమిషంలో అది మాయమయింది. "ఏమిటమ్మా? అంటే నన్ను నమ్ముకుని లంబాడీలు కొందరు అడవిలో వున్నారు. వారు రొట్టె చేసుకున్నారు. పచ్చడి లేదు అందువలన పచ్చడి పంపాను" అని చెప్పింది అమ్మ. మరొక సందర్భంలో మెంతి మజ్జిగ అన్నం ఆకులో పెట్టి రావి చెట్లు మీద పెట్టింది. అది కూడా అదృశ్యం అయింది. ఎక్కిరాల భరద్వాజ తన పుట్టిన రోజుకి పాయసం నివేదన ఇస్తే, అమ్మ "ఈ కాస్తేగా త్రాగు శ్యామలా? త్రాగ మంటుంటే "అంటూ మొత్తం పాయసం త్రాగింది. తరువాత మామూలు స్థితికి వచ్చి భరద్వాజతో "అరె! నీకు కాస్త కూడా లేకుండగ అయిపోయింది? " అన్నది, అప్పుడు భరద్వాజ "నాకు లేకపోతే లేక పోయింది కాని ఇప్పుడు ఇదేమిటి? శ్యామల ఏమిటి? అని అడగటం జరిగింది. అప్పుడు అమ్మ" శ్యామాలా దేవి అన్న ఆవెడ నన్నే నమ్ముకుని అరణ్యంలో తపస్సు చేస్తూ వున్నది, మూడు రోజుల నుండి ఆహారం లేదు. దానికి బలవంతాన ఇచ్చాను" అన్నది, ఈవిధంగా ఎన్నోసార్లు ఎక్కడో తనని నమ్ముకున్న వారికి ఆహారం పంపటం జరిగేది.

ఒకసారి క్రిష్ణవేణమ్మ అక్కయ్య కాకుమానులో వున్నది. వారి ఆడపడుచు కూడా అక్కడే వున్నది. మధ్యాహ్నం వేళ పంచలో వారి ఆడపడుచుకి అన్నం పెట్టింది. ఇంతలో ఒక పిల్లవాడు పొట్టిగా వున్నాడు, తలకాయ ముదురుగా వున్నది. నీలం రంగు గల్ల చొక్కా తొడుక్కుని వున్నాడు. అక్కయ్య ఇంటి వాకిట నిలపడి "ఊ.....ఊ.... అంటూ మూగివాని సౌజ్ఞలు చేస్తూ అన్నం వేయమని అడిగాడు. అక్కయ్య అన్నం తెచ్చి వేస్తే చొక్కా పట్టి రెండు చేతులతో వేసిన పదార్థాన్ని ముందుకు లాక్కున్నాడు. అక్కయ్య ముద్దుగా రెండు చేతులు చాచి "ఇటు రారా.... నాన్నా!" అని అన్నది, ఆ పిల్లవాడు "ఊహు...... ఊహు...."

అంటూ పరుగెత్తాడు. ఆ పిల్లవాడు ఎదురుకుండా పరుగెత్తినట్లు వారి ఆడపడుచుకి కనపడింది. కుడి ప్రక్కకు తిరిగి పరుగెత్తినట్లు అక్కయ్యకి కనపడింది. ఒకే సమయంలో ఇద్దరికి రెండు విధాల కనపడింది.ఇదే సమయంలో వాళ్ళ బావ మరిది సైకిల్ వేసుకుని వచ్చాడు. జరిగిన సంఘటన అతనితో చెప్పి ఆ పిల్లవాడు ఎటు వెళ్ళాడో చూడమని పంపితే మరుక్షణంలో సైకిల్ వేసుకుని ఎటువెళ్ళి చూసినా కనపడలేదు. ఆ పిల్లవాడు ఈ విధంగా భిక్ష తీసుకుని మాయమైనాడు. ఈ సంఘటన జరిగిన సమయంలో అక్కయ్య భర్త హరిదాసుగారు జిల్లెళ్ళమూడిలో గుడి శంఖు స్థాపన అమ్మ చేస్తుంటే అక్కడ వున్నారు. హరిదాసు గారితో అమ్మ "నువ్వు వెళ్ళేటప్పటికి ఏదో విశేషం జరుగుతుందిలే " అన్నది. ఆయన కాకుమాను వచ్చేటప్పటికి ఈ విషయం చెప్పింది. క్రిష్ణవేణక్కయ్య.తరువాత జిల్లెళ్ళమూడి వస్తే "బ్లూ గళ్ళ చొక్కా తొడుక్కున్నాడు కదా?" అని ఆ పిల్లవాడు ఎట్లా వున్నాడో వారు చెప్పక ముందే అమ్మ అడిగింది. ఎక్కడి కక్కడ తాను రూపం ధరించి ఆ విధమయిన అనుభూతులు ఇచ్చి తన నిరంతర ఉనికిని తెలియచేసి వారికి అకుంఠిత విశ్వాసాన్నిచ్చి వారి జీవితాన్నే అమ్మ సేవకు అంకితం చేసుకుండో అదృష్టాన్ని ప్రసాదించింది.

## శిఖరాగ్రమైన అమ్మ

మూడు దశల వారు ఈ జగత్తులో కనపడుతూ వుంటారు. పరి పూర్ణలైన మహాత్ములు, తత్వమే తానయిన వారు. రెండవ దశలో తత్వంలో ఎక్కువగా జీవించే ఆదర్శ మూర్తులు. మూడవ దశవారు తత్వ ప్రబోధం మాత్రమే చేసేవారు. వీరు మేధావులు. అమ్మ పరాకాష్ఠకి సంబంధించిన పరిపూర్ణ మూర్తి. తత్వమే తానయినది. దీనికి అమ్మ చెప్పిన విషయం "మీది అను భావం. నాది అనుభవం" ఈ విధంగా కలకండ కొండేతానయిన స్థితి.

రెండవ దశలో దైవ భక్తులు దేశ భక్తులు వస్తారు. వీరు ఆదర్శ మూర్తులు. మహాత్ములు, ఉదా :- త్యాగరాయ స్వామి, ఏకనాధుడు, పోతన మొదలైన వారు. దేశ భక్తి విషయంలో గురు గోవింద సింహ, రాణా ప్రతాప్ సింగ్ మొదలైన వారు.

మూడవ దశకి సంబంధించిన వారు ప్రబోధం మాత్రమే చేస్తారు. ఇటువంటి వారు చాలా మంది వున్నారు. తత్వశాస్త్రమును గురించి చెప్పెడి వారు, ఆదర్శ వాదాలని గురించి చెప్పెడి వారు మాత్రమే, జీవించెడి వారు కాదు. వీరు మేధావులు. అమ్మ తత్వానికి ప్రతి రూపమై నిలిచింది. తత్వమే తానయిన శిఖరాగ్ర శిరోమణి. దీనితో పాటు ఆదర్శం,

ప్రభోదాత్మకం కూడా వున్నది.

## సామాన్య స్థితిలో అసామాన్యాన్ని దర్శించటం

జిల్లెళ్ళమూడికి దగ్గరగా పూండ్ల అనెడి గ్రామం వున్నది. అక్కడ మాణిక్యమ్మ గారు వుండే వారు, ఆవెడ స్వగ్రామం అది మాణిక్యమ్మ గారికి అమ్మని గురించి మజ్జిపూడి గుడికి చాందాలకి వచ్చే వారిలో ఒకరు చెప్పారు. వారు చెప్పి వెళ్ళిన తరువాత ఆకాశంలో అమ్మ రూపం కనపడింది, తరువాత ఆవెడ అమ్మని దర్శించటానికి వెళ్ళింది. అమ్మ చెంతకు వెళ్ళగానే అమ్మ ఆవెడ్ని "ఏ... నే... ఎందుకు వచ్చావే? ఇక్కడ ఏముందని వచ్చావే?" అని మొదటిసారి దర్శనంలోనే అడిగింది. అప్పుడు ఆమె "ఇదే వైకుంఠం అనుకుంటున్నాను, నీవు సాక్షాత్ ఆది లక్ష్మీదేవివని అనుకుంటున్నాను" అన్నది. ఈమె ప్రధమ దర్శన సంఘటన ఇది. ఇది 1950-51 మధ్యలో జరిగిన సంఘటన, అమ్మ ఒక చిన్న పాకలో వుండేది, ఒక చిన్న కుంపటి, నాలుగుగిన్నెలు, గాస్లులు. చాలా కొద్దిసామాను. సర్వ సామాన్యమైన భౌతిక స్థితి అది. అమ్మ ఒక నూలు చీరెతో సామాన్యంగా వున్నది. ఇట్టి సామాన్యమైన భౌతిక స్థితిలో అసామాన్యమైన భావాత్మక స్థితిని అంతరంగికంగా అనుభవించింది. వైకుంఠంలో ఇంత ఆనందం వుంటుందా? సాక్షాత్ లక్ష్మీదేవిని దర్శిస్తున్నానా? అనెడి అనుభూతి పొందినది మాణిక్యమ్మ గారు.

తరువాత ఆవెడ పూండ్లలో వుంటే, ఆమెకు అమ్మ పిలుపు వినపడేది, వినపడీ వినపడక ముందే పగలనకా, రాత్రి అనకా, ఎండకాని, వానకాని, పొలాలు నాట్లువేసి వుండని, ఎట్లా వున్నా సరే జిల్లెళ్ళమూడి వచ్చేది. వచ్చినప్పుడల్లా నెత్తి మీద ఏదో ఒక సరుకు వంటకి కావలసినవి పెట్టుకుని వచ్చేది. పూండ్ల నుండి జిల్లెళ్ళమూడి ఎవరైనా వెళ్తుంటే తన దగ్గర వున్న పప్పు, బియ్యం, చింతపండు, కూరగాయలు, ఇట్లా వారికి ఇచ్చి పంపుతూ వుండేది. అమ్మ "అది నాకు పుట్టినిల్లు" అంటూ వుండేది. ఒక నాగుల చవితికి అమ్మ పాదాల చెంత పాము కనపడింది. ఆవెడకి. దగ్గరికి వెళ్ళటానికి భయపడితే నవ్వుతూ అమ్మ రమ్మన్నది. పాము అదృశ్యమయినది. నాగేంద్రుడైనా, ఆదిలక్ష్మి అయినా సర్వం అమ్మ అనెడి భావంతో అమ్మనోట్లో పాలు పోసుకున్నది. ఆరాధించే భక్తురాలే తనకు తల్లిలాగా అనుకుని "మాణిక్యమ్మ గారి ఇల్లు తనకు పుట్టినిల్లని" అమ్మయే ప్రకటించిందంటే అమ్మని దైవంగా ఆరాధ్య భావంతో ఆరాధిస్తూ, తను తల్లి వలె బిడ్డని సేవించినట్లు సేవించుకున్నది. ఏ బాహ్యమయిన పటాటోపాలు లేని ఒక చిన్న పాకలో సామాన్యమయిన స్థితిలో ఎంతోమంది "ఇక్కడేముంది?

ఎందుకు వస్తావ్" అని ఎగతాళి చేస్తూ నిరుత్సాహపరిచే వాతావరణంలో, అసామాన్యమైన స్థితిని దర్శించి, సేవించిన ధన్యజీవి మాణిక్యమ్మగారు. ఈ జన సందోహం లేని రోజులలో అమ్మని అనేక విధాల సేవించుకుని ఆ రోజులలో ఎన్నో పనులు చేసి పెట్టిన వ్యక్తి ఈవిడ.

## లఘిమా, గరిమా సిద్ధులు. భక్తుని రూపంలో తాను నిలబడి సేవించటం

రెడ్డి సుబ్బయ్య జిల్లెళ్ళమూడి నివాసి. మొదట అమ్మని అనుమానించి పరీక్షకని వచ్చి అమ్మకి పాదాక్రాంతుడైనాడు. తరువాత అమ్మ అతనికి ఎన్నో అనుభూతులు ఇచ్చింది. ఒక సందర్భంలో అమ్మ గాలిలో తేలటం చూశాడు. ఇది "లఘిమా" సిద్ధికి సంబంధించినది. మరొక సారి అమ్మను ఎత్తుకుంటే విపరీతంగా బరువు ఎక్కటం జరిగింది. ఇది "గరిమా" సిద్ధికి సంబంధించినది. అంతఃకరణ దివ్యమయమయినప్పుడు మామూలు పని పాటలు చేసుకొనెడి ప్రతి ఒక్క స్థితి నుండి సమాధ్యవస్థను పొందటం జరుగుతుంది. ఇట్లా అమ్మ అనేక సందర్భాలలో సమాధ్యవస్థను అనుభవించటం జరిగింది. ఒకసారి రెడ్డి సుబ్బయ్య వెళ్లి చూస్తే, చిమ్ముతూ చిమ్ముతూ వున్న అమ్మ అట్టాచే నిలబడిసమాధ్యవస్థలో కట్టెలాగ నిలపడి పోయింది. ఎదురుకుండా పాము ఒకటి గిర గిర తిరుగుతూ వుండటం చూశాడు. తరువాత అది అదృశ్యమయింది. దానికి రెడ్డి సుబ్బయ్య నమస్కారం చేసుకున్నాడు. ఎన్నో సందర్భాలలో తిరగమోత వేస్తూ బాండీలో చెయ్యి అట్లాగే వుండేది. అమ్మ సమాధ్యవస్థలో వుండేది. తిరగ మోత మాడి, పొయ్యి బాండీ పొగలు సెగలు ఎక్కేది. అమ్మ చెయ్యి కాలేది కాదు. పరమ గమ్యం తానయిన అమ్మనుండి ఉజ్వల మయిన స్థితులు జీవితంలోని, నిత్య కృత్యాలలో స్పందించేవి. వాస్తవానికి ఈ స్థితులు పూర్ణత్వానికి గీటు రాళ్లు కావు. పూర్ణత్వమే తానయిన అమ్మకి అన్ని స్థితుల నుండి అవి స్పందించినవి.

మరొక సందర్భంలో అమ్మ మన్నవ వెళ్ళటం జరిగింది. మన్నవలో రెడ్డి సుబ్బయ్య నిలపడి అందర్నీ పరామర్శిస్తూ అన్నం తినండి, టిఫిన్ కాఫీ తీసుకోండని చెప్తూ, సేవించటం జరిగింది. విచిత్రం ఏమిటంటే అసలు రెడ్డి సుబ్బయ్య మన్నవ వెళ్ళలేదు. జిల్లెళ్ళమూడిలోనే వున్నాడు. అక్కడ మరొక రెడ్డి సుబ్బయ్య , వచ్చిన అమ్మ బిడ్డలను సేవించాడు. స్వయంగా అమ్మ భక్తుని రూపంలో (రెడ్డి సుబ్బయ్య)నిలబడి తన బిడ్డలను సేవించింది.

## జీవితంలో సాధుత్వాన్ని ఏ విధంగా అర్థం చేసుకోవాలి

అమ్మ శక్తే తానైనది. అందువలన సహనం సహజమయినది. సాధుత్వానికి

కొంతమంది నయ వంచనతో కూడుకున్న వినయం. నిర్వీర్యతని, ఉపమానంగా తీసుకుంటారు. ఇదే సాధ్వీ తత్వము అనుకుంటారు. కాని అమ్మ "సర్వాన్ని స్వాధీనం చేసుకున్నదే సాధ్వి" అన్నది. అంటే సర్వానికి అధీనమయిన శక్తి విహీనత సాధుత్వము కాదని, తెలియచేసింది. అంటే ప్రతి ఒక్కరిని విరుచకు తినే రాక్షసత్వం కాదు. పరుల హితాన్ని కోరుకోవటం, పాటు పడటమనే సాధు శక్తి,భౌతికంటా ఉన్నతం కాని పరుల దౌష్ట్యాన్నించి రక్షించుకునే జ్ఞానం - శక్తి కూడా వుండాలనేది స్పష్టం. లేని పక్షంలో మానవ జాతి ఉనికికే భంగం. సాధువులు అయినవారు, ఏకనాధుడు, మహర్షి, ప్రహ్లాదుడు,ఈ విధంగా వీరందరూ బాధలకు స్వాగతం పలికినారు. బాధా గాధల విషాద ఘట్టాలు వారిని దివ్య పధాన్ని చేర్చినవి. ఇవి అన్నీ ఇచ్ఛా పూర్వకంగా స్వేచ్ఛ స్వాగతం పలికినవి. కాని అందరి జీవితాల్లో వఅనుభవించేవి ఇటువంటివి కావు. విధి లేక అనుభవించేవి. పైన వివరించిన అలౌకిక మూర్తులు, భక్తులు, ఒక్క క్షణం కూడా వారి ఉదాత్త లక్ష్యం నుండి ఇవతలకు రాలేదు. దిగజాలేదు వారి అకుంఠిత మే గంభీర ధీరత్వంతో కూడుకున్న శక్తి కేంద్రాలు. గొఱ్ఱె పొటేలు ఎన్ని సార్లు ఢీకొన్నా దాని తలకాయ పగులుతుందే కాని వజ్రపు కొండ ఏమీకాదు. వారికి జీవితంలో ఎదురయినవి అటువంటివి. ఈ సాధు శక్తి వివిధ రకాలు. " ప్రహ్లాదుడు ప్రతి ఘటించని సత్యాగ్రహి. మాతృగర్భంలో వున్న నాటినుండి అతని వ్యక్తిత్వం తీర్చబడింది. ఆ స్థితికి రాజకీయంగా కాని, ఇతర సాధారణ మానవులు కాని, ఎదగ గలరా? ఒక అత్యున్నత మానసిక శక్తిని మనచేతకాని తనానికి ఆలంబనగా, ఆయుధంగా స్వీకరించ గలమా? శక్తివంతుని హింస కంటే దుర్బలుని హింస తాత్వికంగా ప్రమాదాలకు దారి తీస్తుంది. మొత్తం నైతికతకే హాని కలిగిస్తుంది" అంటారు. జాగృతి అనుడి పత్రికలో.

మరొక ముఖ్యమయిన విషయం ఈ సృష్టి (1) పదార్థము (2) గుణము (3) కాలము, ఈ మూడింటితో కూడు కున్నది. అమ్మ ప్రకటించిన " సర్వాన్ని" అనటంలో కేవలం పదార్థానికి సంబంధించిన పంచభూతాలే కాక, గుణము, కాలమును కూడా జయించటం అనేడి అర్థం వస్తుంది. రావణాసురుడు పంచభూతాలను తాత్కాలికంగా జయించి స్వాధీనం చేసుకుని లోక కంటకుడైనాడు. కాని మరొక వైపు నుండి గుణాలకి, కాలాని, దాసుడైనాడు నాశనమైనాడు. కనుక అమ్మ చెప్పిన "సర్వాన్నీ స్వాధీనం చేసుకున్నదే సాధ్వి" అనేడి సూక్తి లోక కల్యాణ కారకమై సర్వానికి ఆధారమవుతుంది. ఎందువల్ల అంటే గుణం - కాలం వారి చేతిలోవి కనుక. సుమతి మహా పతివ్రత, సాధ్వీ. కాని అవసరమయినపుడు సృష్టిగా మనాన్నే

నిలిపింది. అయితే ఇది రావణాసురుని లాంటి అసుర శక్తి కాదు. రామునికి కోపం ఎప్పుడు ఎంత రమ్మంటే వచ్చేది. పొమ్మంటే పోయేది. కారణం గుణం వారి చేతి లోనిది కనుక. శ్రీరాముడు, శ్రీకృష్ణుడు మొదలైన అవతారమూర్తుల ధర్మశక్తి పరాక్రమించి విజేతలై లోక కల్యాణ కారకమయినది. అమ్మ ప్రతిఘటన లేని సహన శక్తియై లొంగ తీసుకుని,. విజేతయై విశ్వ జనీనమయిన విశ్వ జనని అయినది. ప్లహ్లాదుని భక్తి, శక్తి ప్రతిఘటించని, భయం, స్వార్ధం - నిర్వీర్యతవ వలేనిదయి నిలిచింది. ప్లహ్లాదుని భక్తి శక్తి ప్రతిఘటించింది. అయినప్పటికి నృశింహమూర్తి రూపంలో దివ్య శక్తి విక్రమించి హిరణ్యా కశిపుని సంహరించి, లయం చేసుకుంది. ప్రహ్లాదుని సాధు శక్తి వలన జరిగింది ఇది. కనుక ఇది బహుముఖాలు. సాధు శక్తి బహు ముఖమయింది. దేశం విషయలో కాని మరి ఏ ఇతర విషంలో కాని గ్రహించవలసింది, సాధుత్వం శక్తి సమన్వితంగా తీసుకోవాలి. సాధు మార్గంలో అహింసా విధానాలతో ప్రతిఘటనతో కూడుకున్నది. అయినప్పటికి దేశ ధర్మ సంస్కృతులను పణంగా పెడితే అది సాధుత్వం కాదు. దేశాన్ని చీల్చుకుని, ఇతర దేశం, చైనా లాంటివి ఆక్రమిస్తుంటే కుయుక్తులతో విధ్వంసం చేస్తుంటే, ఏమీ చేయలేని స్థితిలో వుండి, ఇదంతా సాధ్వీ తత్త్వంగా అవగతం చేసుకొన కూడదు. స్వాతంత్ర్య ఉద్యమంలో కాని తరువాత గాని దేశం అనుసరించిన అహింసా , సాధుత్వానికి వక్ర భాష్యం నిర్వీర్యత అయింది. అమ్మ సూక్తి, వ్యక్తికి జాతికి విశ్వానికి ఆదర్శం. దీనిలోని ధర్మ సూక్ష్మాన్ని ఎంతగానో అర్ధం చేసుకొన వలసి వుంది విక్రమించే శక్తి అయిన రామ కృష్ణాదుల అవతారాలు కాని, ప్రతిఘటన లేకుండా లొంగ తీసుకునే అమ్మకాని, తాను ప్రతిఘటించక, భయం - స్వార్ధం - నిర్వీర్యత లేనిదయిన ప్రహ్లాదుని సాధుశక్తి కాని, ఇవి ఏవైనా తమ లక్ష్య మార్గం నుండి తాము తప్పుకోకుండా నిలబడ్డారు. లక్ష్య సిద్ధిని సాధించారు. లక్ష్యం నుండి తప్పి లక్ష్యాన్ని సాధించకుండా,భయం స్వార్ధం నిర్వీర్యతతో ఏదో విధంగా ఫలితాన్ని పొందటం లక్ష్యాన్నే పణంగా పెట్టడం సాధ్వీ తత్త్వము కాదు. ఉదా :- దేశాన్ని చీల్చటం - చైనా ఆక్రమించిన భూమిని వదలటం.

కొందరు దేశ భక్తులు కాని, దైవ భక్తులు కాని ధ్యేయ మార్గంలో పయనిస్తూ, వ్యక్తులుగా వ్యధలు పడి హతులైన సంఘటనలు దేశ చరిత్రలో, ప్రపంచ చరిత్రలో కనపడుతుంది. ఇట్టి విషయంలో స్వామి వివేకానంద ఈ విధంగా చెప్తారు. "కొందరు మహాత్ములు హతులైన మాట వాస్తవమే. వారికి శ్రేయస్సు ఏమి జరిగింది? అంటే వారి జీవిత త్యాగం వలన కొన్ని

కోట్ల మందికి ఆ తత్వం అంది. ఎందరికో శ్రేయస్సు కలుగుతుంది. ఇందరి శ్రేయః ఫలమే వారి శ్రేయస్సు" అంటారు. ధ్యేయం మీద మనస్సు నిలచి అంతఃకరణ ధ్యేయ మయం అయినప్పుడు వ్యక్తులుగా వున్నప్పటికి "వ్యక్తిత్వం నశించి విశ్వత్వం సిద్ధిస్తుంది." అట్టి స్థితికి సంబంధించిన సంఘటనలు బాహ్యంగా ఒకటిగానే వుండవు. సర్వాన్నీ స్వాధీనం చేసుకున్న సాధు శక్తి, గుణం, కాలం అతిక్రమించిన స్థితి నుండి బాహ్యంగా అనుభూతి ఒకటిగా లేక అనేకత్వంగా వుంటుంది. ధ్యేయం నుండి ప్రక్కకు తప్పకుండా గుణానికి దాసులు కాకుండగా కాల పరిస్థితులకు అతీతంగా జీవించి హతులవటం భౌతికంగా అధీనం చేసుకొనటం కనపడక పోయినా ( అంటే రాముడు, శివాజీ మొ॥వారి లాగ) పదార్థం, గుణం, కాలం వారిని లొంగ తీసుకొనక పోవటమే వారి విజయ శక్తి. ఉదాహరణకి దేశ చరిత్రలో కొందరు ఘోరమయిన బాధలు పడి హతులైతే , కొందరు ధనానికి, అధికారానికి దాసులై భౌతికంగా సుఖాన్ని, విజయాన్ని తాత్కాలికంగా పొందినా, అది తుచ్ఛమయిన విషయం, వారి అంతరంగం వారిని వేధిస్తుంది. లోకం నిందిస్తుంది. ఇది తుచ్ఛమయిన శక్తి. నికృష్టపు విజయం. కనుక జాతీయ ఉద్యమాలలో సహితం జయాపజయాలకి, సంపద దారిద్ర్యా లకి, సుఖ దుఖాలకి అతీతంగా ఉన్నత విజయం సాధించటం అమ్మ సూక్తి లోని ధర్మ సూక్ష్మం. ధర్మ మార్గంలో హతులైన వారి స్ఫూర్తి ఎందరి హృదయాలలోనో వారి ధ్యేయ భావ తరంగాలు దావానంలా వ్యాపించి, వారి ఆశయ విజయ కేతనం అవనీ స్థలిపై ఆరోహణ మవుతుంది. ఇదే వారి స్వాధీన శక్తి. వారి విజయం, కనుక కొందరు లోకం విషయంలో ఎట్టి త్యాగం చేయక, భయం స్వార్థం, నిర్వీర్యతతో వారి వరకు వారు ఏ బాధ పడకుండా సుఖంగా వుంటే చాలు అనెడి భావంతో పైకి చూపే సాధుత్వం నయవంచన. గుణానికి, కాలానికి పదార్థానికి దాస్యమయిన స్థితే సాధుత్వంకాదు. వారి సాధుత్వం ఎండమావిలో నీరు.

దీనిని తెలియ చేస్తూ భారతంలో వ్యాసుల వారు ఈ విధంగా చెప్తారు. "అధర్మ రూపో ధర్మోహి కశ్చిదస్తి నరాధిప, ధర్మశ్చా అధర్మ రూపోస్తి తచ్చ జ్ఞేయం విపశ్చితా" కొన్ని అధర్మముల వలె కానవచ్చును. కాని ధర్మములై యుండును. కొన్ని ధర్మముల వలె కానవచ్చును. కాని అవివాస్తవమున అధర్మములు "దీనిలోని రెండవ కోవకి చెందిన వారు పైన వివరించిన నేతి బీరకాయలోని నెయ్యిలాంటి సాధుత్వాన్ని ప్రదర్శించెడి వారు. అహింస అంటే హింస జరగటానికి వీలు లేని స్థితిలో వుండటము. అంతేకాని సాధువులు, నిస్వార్థ

జీవులు, అమాయకులు, బలి అవుతుంటే, దాని దోహదం చేసే అహింస, హింస కంటే ఘోరం . ఇది అమ్మ చెప్పిన సాధుత్వం కాదు.

1) అమ్మలాగ ప్రతి ఘటన లేకుండా మేరు ధీరత్వంతో తానుగా నిలిచి, లొంగినట్లు కనపడి లొంగ తీసుకుండే విజేత అయి, శక్తే తానయిన, సహనం సహజమయిన సాధుత్వం ఒకరకం

(2) పరాక్రమించి విజేతలైన రాముడు - కృష్ణుడుదేశ భక్తులైన గురుగోవింద - రాణా - శివాజీ లాంటి వారి సాధ్వీతత్వం ఒక రకం.

(3) ప్రహ్లాదుని వలె భయం - స్వార్థం - నిర్వీర్యం లేని సాధు శక్తి మరొక రకం. ఇది పైన వివరించిన వారి వలె స్వసుఖాన్ని స్వార్థాన్నీ కోరుకుని నిర్వీర్యతతో సాధుత్వాన్ని ప్రదర్శించటం కాదు. తన విషయంలో అన్ని కష్టాలని, కష్టాలుగా కూడా అనుభవించని ఉజ్వల మానసిక శక్తి . తనధ్యేయం విషయంలో సర్వాన్ని పరిత్యజించి తన స్వ విషయంలో సర్వ కష్టాలను స్వాగతం పలకటం. ఇట్టి స్థితి నుండి విజేత అయిన సాధ్వీ శక్తి ప్రహ్లాదునిది.

(4) వ్యక్తులుగా హతులైన వారిని గురించి, పైన వివరించటమయినది. వారి సాధు శక్తి వలన స్వాధీనమవట మంటే ఏమిటో, విజేత లవటమంటే ఏమిటో తెలియచేయటమయినది కదా?

ప్రస్తుతం ఎక్కువ భాగం జన సందోహం ఈ నాలుగు తరగతుల వారు కాక పైన వివరించిన అయిదవ తరగతి వారు. ఇది సాధుత్వం కాదు.

భౌతిక జీవితంలో , ఆధ్యాత్మిక జీవితంలో, వ్యక్తి జీవితంలో, సమాజ జీవితంలో సాధుత్వాన్ని ఏ విధంగా అర్థం చేసుకోవాలో అమ్మ ప్రబోధమయిన "సర్వాన్నీ స్వాధీనం చేసుకున్నదే సాధ్వీ" అనెడి మహావాక్యం తెలియ చేస్తుంది. సాధుత్వం శక్తి విహీనతకి ప్రతీకం కాదని బహుముఖంగా తెలియచేయటమయినది. ముత్యపు చిప్ప సముద్రపు లోతులకు వెళ్ళి ఆ లోతుల వత్తిడికి ఓర్పుతో తట్టుకుని ముత్యమయి పైకి తేలుతుంది. అదే విధంగా ఎంతటి ధ్యేయ నిష్ఠ కలవారైనప్పటికి ఒక్కొక్క సందర్భంలో కొన్ని పరిస్థితులకు కట్టుబడి వుంటారు. అది నిర్వీర్యత కాదు. పాండవులు, శ్రీరాముడు 14 సంవత్సరాలు, 13 సంవత్సరాలు అరణ్య వాసం అనుభవించినట్లు. అలకి తలవంచి ఒకసారి, అల మీదగా ఒకసారి, ఈ జీవన కడలిలో, శక్తి యుక్తులతో లక్ష్య సాధన జరగాలి. వీటికి కూడా సాధు శక్తి కావాలి, అమ్మ మహావాక్యం జీవితానికి సాధుత్వాన్ని ఏ విధంగా అవగతం చేసుకుని జీవించాలో తెలియ చేస్తూ ఆదర్శానికి, పరిపూర్ణ తత్వానికి, సయన్వయం అయి నిలిచింది. ఆదర్శం,

మానవునికి ఉన్నతమయిన రీతిలో పయనించటానికి ఆచరణ యోగ్యమైనది. పరిపూర్ణత్వం మన పరిధులకు అందని విశిష్టతత్వం. ఉదాహరణకి కత్తులతో కోస్తున్నా గోరుముద్దలు పెట్టెడి అమ్మ తత్వం. తన విశిష్టతత్వాన్ని, ఆదర్శానికి కూడా సమన్వయమయిన రీతిలో అమ్మ ప్రకటించింది.

## దారిద్ర్య భోగాలకి భౌతిక స్థితి గతులు ప్రమాణాలు కావు

సాధారణంగా యోగ భోగాల విభజనతో తత్వాన్ని తెలియ చేస్తారు. భోగానికి ప్రమాణంగా భౌతికంగా అనుభవించే ఆర్థిక సుఖాలు, అధికారాలని మానవులు తీసుకుంటారు. అమ్మ ప్రబోధంలో విశిష్టతత్వం ఏమిటంటే, భౌతికాన్ని, ఆధ్యాత్మికాన్ని ఏక త్రితం చేస్తూ యోగం భోగం యొక్క తత్వాన్ని ఉన్నతంగా తెలియచేస్తూ "మహాయోగే మహాభోగి" అని తెలియచేసింది. యోగ స్థితిని తెలియచేస్తూ ఏది వున్నా సరిపడుతుంది కనుక భోగి అని, ఏ కోరిక వుండదు కనుక యోగి అని వివరించింది. ఎంత భౌతిక సంపద అధికారం వున్నా తృప్తి, సుఖం లేని స్థితిలో దరిద్రులే అవుతారు. ఉదాహరణకి పచ్చి భౌతిక ధన అధికారాలతో ఒక వ్యక్తి హద్దు మీరి స్త్రీలతో సంచరిస్తే అనేక దేహ రోగాలకి గురియై నిరంతర బాధలతో జీవనం గడుపుతాడు. ధనం కోసం నిలువు దోపిడి, అధికారం కోసం అకృత్యము చేస్తే, తిరిగి ఆ వ్యక్తి తన అకృత్యం వలన ప్రాణ భయం, తన ధనం విషయంలో దోపిడి భయం, విచ్చలవిడిగా తిరగటం వలన రోగ భయం, ఇట్లా అనేక వ్యధలు పడే దరిద్రుడు అవుతాడు. ఇది భౌతికంగా తీసుకున్నా భోగం కాదు. కారణం సుఖ సంతోషాదులు, నిజంగా లేవు కనుక. పెదవుల మీద, ముఖం మీద, పైపైన కనపడేవే కాని, నిజంగా లోలోతుల్లో లేవు. దీనికి కారణం ఎంతవున్నా, ఎన్ని వున్నా సరిపడదు కనుక. అదే ఒక యోగి, అవధూత వున్నారనుకుంటే వారు మండుటెండలో, ఇసుక నేలలో హాయిగా పడుకుంటారు. ఎయిర్ కండిషన్ హాలులో కూడా అంత హాయిగా డబ్బు వున్నవాడు పడుకుంటాడో, లేడో ఆ పరుపు, ఆ హాలు లేకపోతే నీటిలో నుండి బయటపడిన చేప లాగ గిలగిల కొట్టుకుంటాండు. యోగి తిండి వున్నా వుంటాడు, లేక పోయినా వుంటాడు. ఏ తిండి వున్నా వుంటాడు. అతనికి గుణాలు పాదాక్రాంతమయి కాలం వశమయి వుంటుంది. అపురూప సౌందర్యాలు, అష్టైశ్వర్యాలు వారిని చలింపచేయలేవు. చెత్త క్రింద కట్టినట్లు వారికి పాదాక్రాంతమవుతయ్ జనకుని కొలువులో శుకదేవుని లాగ. కారణం వీరి ఆత్మానందం పదార్థం మీద, గుణ కాలాల మీద ఆధారపడింది కాదు. అందువలన వీరే మహాభోగులు. అందుకే మహాత్ములందరూ ముక్త కఠంతో, సంపద దారిద్ర్యాలు, మంచి చెడులు, సుఖ సంతోషాలు, సాపేక్షాలు అంటారు. అంటే ఒకదాని మీద ఆధారపడినవి అని అర్థం. ఇవి

అన్నీ వారికి పాదా క్రాంతమయి, నిరపేక్షమయిన స్థితియే భోగైశ్వర్యం. ఇదే యోగి ఐశ్వర్యం. దేని మీద ఆధారపడని స్థితి నిరపేక్షం. అమ్మ వివరించిన ఈ సూక్తి ప్రకారం, పైన వివరించిన మూడింటికి దాసులైన వారందరూ, ఎటువంటి వారంటే వెయ్యి కోట్లు వున్న దరిద్రులు, 10 రూపాయల దరిద్రులు, ఏమీ లేని దరిద్రులు, అదే విధంగా అధికారం, ఇతర విషయాలలో కూడ పెద్ద అధికార దరిద్రులు, చిన్న అధికార దరిద్రులు. కారణం అందరూ సాపేక్షంలో వున్నారు కనుక. ఇది కావాలని కోరిక లేకపోవటం వలన యోగి అన్నారు అమ్మ. స్థిత ప్రజ్ఞత్వం అన్నా, జ్ఞానం అన్నా ఇదే. ఇదే గుణాన్ని, కాలాన్ని అతిక్రమించిన స్థితి. ఇటువంటి వారి స్థితి ఏక ముఖంగా వుండదు. ఒకసారి అరవింద యోగి ఈ విధంగా అంటారు. ఈ విశ్వంలో వున్న అన్ని రకాల శక్తులను (దుష్ట-మంచి) తమ దేహంలో నుండి దూసుకుని పోయే అవకాశాన్ని మహాత్ములు ఇస్తారని , అట్టి వారు పరమహంసలని విశదీకరించారు. బాహ్యంగా వారి స్థితి గతులను బట్టి వారి, అంతరంగిక జ్ఞానం, దివ్యత్వం సామాన్యులకు అర్థం కాదు. ఇది కావాలని కోరిక లేదు కనుక యోగులు. ఏది వున్నా సరిపడుతుంది కనుక భోగులు. " మహాయోగే మహాభోగి" అనెడి మహావాక్యం, "దారిద్ర్య భోగాలకి భౌతికమయిన స్థితి-గతులు ప్రమాణం కాదని తెలుస్తుంది". సామాజిక జీవితంలో ఆర్థిక, అధికారిక, మొదలైన వానికి వెఱ్ఱి ప్రాధాన్యత పెరిగి, ఇవి లేని వారిని న్యూనతగా చూసే ప్రవృత్తి, సాటి వారిని మానసికంగా బాధించెడి మానవత్వానికే చేటు అవుతుంది. అమ్మ ప్రబోధం, ఆధ్యాత్మిక ఔన్నత్యం సామాజిక ఔన్నత్యానికి సమన్వయం చేసి, ఏ ఆర్థిక అధికారాల అహంకారాలు, మానవుల మధ్య వ్యత్యాసాన్ని పెంచి ఆత్మీయతను తెంచటం జరుగుతుందో, వీనికి వెఱ్ఱి ప్రాధాన్యత లేని తత్వాన్ని అందజేసి, వీని వల్ల పెరిగిన అహంకారాన్ని త్రుంచి, మానవుల మధ్య గౌరవాన్ని ఆత్మీయతని పెంచెడి వారధియై ఆధ్యాత్మిక, సామాజిక ఔన్నత్యాన్ని ఒకటి చేసి. [illegible] అమ్మ మహావాక్యం.

## సమాజానికి వ్యక్తి సమర్పణలో ఔన్నత్యం అమ్మ తత్వం

సమాజానికి వ్యక్తి కొంత సమర్పించటం జరుగుతుంది. సముద్రంలో నీరు వానయై నదులు, వాగుల ద్వారా తిరిగి సముద్రంలోకి చేరినట్లు. వ్యక్తుల కూడలి సమాజం. సమాజం సముద్ర మయితే వ్యక్తుల సమర్పణ నదులు, వాగులై చివరికి సమాజమనే సముద్రానికి ఉపయోగపడాలి. దీనిలో ఈ సమర్పణ వివిధ రకాలుగా వుంటుంది. వ్యక్తి సమాజానికి సమర్పించెడి సమర్పణలో ఆదాయపు పన్ను మొదలైనవి చట్టపరంగా ఒకటి, దీనిలో ఎక్కువ భాగం దొంగ లెక్కలు చూపించి పన్ను ఎగవేయటం మొదలైనవి జరిగి, వ్యవస్థలు ఎన్ని వున్నా సమస్యలు అట్లాగే పెరగటం జరుగుతుంది. దీనిలో భౌతిక కాలుష్యం వుంటుంది,

రెండవది దానం, ధర్మం రూపంలో సమాజానికి సమర్పణ. దీనిలో ఇతః పూర్వం వివరించినట్లు భౌతిక కాలుష్యం లేకపోయినా నేను కాబట్టి ఇంత ఇస్తున్నాను అనెడి అహంకారం పెరగ వచ్చు. కీర్తి కాంక్ష అనెడి ప్రబల కాలుష్యం దీనిలో వుంటుంది. "కాంతా కనకాలను జయించిన సన్యాసులు సహితం కీర్తి కాంక్ష దగ్గర పడిపోతారు. " అని వివేకానంద అంటారు. ఇక ధనవంతులు, అధికారుల విషయంలో వేరే చెప్పనవసరం లేదు. ఈవిధమయిన భావ కాలుష్యం దీనిలో వుంటుంది. దీనికే ఒక రూపకం సృష్టించి తత్వాన్ని చెప్తారు. ఎవరు దానం చేసే వారిలో గొప్ప వారు? అంటే "మేఘుడు" అని అనుకున్నారు. వెంటనే ఒకరు అన్నారట "నిజమేనయ్యా! కాని ఒక విషయం వుంది, గల గల మని మోత చేస్తాడు. రెండవది కష్టపడి దున్ని విత్తనాలు నాటిన చోట, మంచినీటికి నోచుకోక బాధపడే చోట, ఈ విధంగా అవసరమయిన చోట కాక, అనవసరమయిన చోట వర్షిస్తాడు. మూడవది నల్లగా మొహం పెడతాడు."ఇవి, దాతకు పనికిరావు కదా? అన్నారట". దీని అర్థం మొదటిది కీర్తి కాంక్ష. రేడియోల్లో చెప్పి. టీవీలో చూపించి, మైకులో వారి పేరు గలగల మోగాలి. శిలా ఫలకాల మీద పేర్లు, ఇట్లా అనేకమయిన వాంఛలు. నేను కాబట్టి ఇంత ఇచ్చాను అనెడి అహంకారంతో విచక్షణా రహితంగా గల గల మని అరవటం. దానం ఇచ్చిన ఆయా రంగాలలో ఎవరిని వేలుపెట్టి చూపించాలి, కూడదు, అనేది చూడక, మానవతా ధర్మ సూక్ష్మాన్ని వర్జించి వ్యవహరించటం. రెండవది అవసరమైన చోట కాక అనవసరమైన చోట ఇవ్వటం. తనకి ఇష్టం కదా అని ఇవ్వటం, లేదా తనకి బాకాలు ఊది, అన్నదల్లా పడతారని ఇవ్వటం. మూడవది ఇవ్వ వలసి వచ్చిందే అని నల్లగా పెట్టడం. కొందరు పెట్టే ముఖాలు, ప్రకటించే హావ భావాలు, వంద శూలాలు గుండెల్లో పొడుచుకున్నట్లు వుంటుంది. ఏ మాట లేకుండానే అక్కడికి వెళ్ళలేరు. ఈ రకంగా మూడు రకాల ప్రవృత్తులను తెలియచేస్తూ, మేఘుడ్ని ఉదాహరణగా తెలియ చేశారు. ఇట్లా భావ కాలుష్యం దానం, ధర్మంలో వుంటుంది. అందుకే పుచ్చుకునే వానికి, దేవునికి ఇచ్చినట్లు ఇచ్చి నమస్కారం చేసే సాంప్రదాయం, దాన క్రియలో భౌతికంగా ఏర్పరచారు. ఒకరు చెప్పారు "దానం చేసేవాడు సిగ్గు పడుతూ ఇవ్వాలని పూర్వీకుల సూక్తిలో వున్నదని. అంటే ఇదంతా భగవంతునిది అయితే నేను దానం చెయ్యుట మేమిటి? అనెడి భావంతో నిరహంకారంగా సిగ్గు పడుతూ ఇవ్వాలని అర్థం.

మూడవది నిష్కామ కర్మ. వ్యక్తి సమాజానికి సమర్పించటంలో ఇది మహోన్నతం. దీనిలో దొంగలెక్కలు అనెడి భౌతిక కాలుష్యం, రెండవ దానిలోని భావ కాలుష్యం వుండవు. అమ్మలోని అనుపమానమయిన పవిత్ర మాతృవాత్సల్యం ఇట్టి స్థితి కలిగి వుంటుంది. "నేను

ఎవరికి ఏది ఇచ్చినా దానం అనుకోవటం లేదు. వారి వస్తువే నా దగ్గర వున్నది. వారిది వారికి ఇస్తున్నాను అనుకుంటున్నాను. ఇందులో నా వదాన్యత లేదు. ఔదార్యంలేదు. " అన్నారు అమ్మ. "తల్లి బిడ్డలకు పెట్టుకొనటం దానం ఎందుకు అవుతుంది.. అది తల్లి ధర్మం" అన్నారు మరొకసారి. స్వర్ణోత్సవానికి లక్షమంది ఒకే పంక్తిలో తిన్నారని గొప్పగా చెప్పుకుంటుంటే, అమ్మ "లక్ష మంది తిన్నారు అనే దాని కన్నా ఒకరు తినలేదు అన్నది బాధగా వుంటుంది." అన్నది. ఏ మాత్రం లవ లేశం అహంకారం లేని సర్వత్రా నిండిన వాత్సల్యం అమ్మది. ఇట్టి స్థితికి మానవ జాతి ఎదిగినప్పుడు సమస్యలు చూద్దామన్నా చూడం. భౌతికంగా భావ కాలుష్యంలేని ఉజ్వల సమర్పణ అయిన నిష్కామ నిరతి అమ్మ పునీత మాతృవాత్సల్యంనుండి సమాజానికి అందుతుంది. బుద్ధి జీవులైన మానవులు దీనిని ఆకళింపు చేసుకుని జీవించిననాడు,సమాజంలో అత్యున్నతమయిన నిష్కామ నిరతిని అతి సహజంగా నింపి సామాజిక స్థితి గతులను ఉజ్వలంగా నిర్మాణం చేస్తుంది. ఇట్టి వాత్సల్యం, నిష్కామ నిరతి, సమాజానికి సహజమయిన నాడు సమర్పణలో మొదటిది రెండవది అయిన, చట్ట బద్ధమయిన పన్ను, దాన ధర్మాలు మొదలైన వానిలోని కాలుష్యాలు తొలగి సమాజానికి అందవలసినది సక్రమంగా అంది సమాజ సమస్యలు తీరి సుభిక్షం అవుతుంది. ఈ సమర్పణ కేవలం ధనం, ధాన్యం రూపంలోనే కాక, విద్యా రంగంలో ప్రబోధాత్మకంగా ప్రభావితం చేయటం లోనూ, వైద్య రంగంలో సేవా తత్పరత రూపంలోనూ, ఇట్లా అన్ని రంగాలలో సుభిక్షాన్ని నింపి, సామాజికంగా సుఖ శాంతులు వర్ధిల్లి ఆధ్యాత్మిక సామాజిక సమన్వయ సారథ్య? అమ్మ మాతృత్వంలోని నిష్కామ కర్మ నిరతి.

ఈ విధంగా సమాజానికి వ్యక్తి సమర్పణలో ఔన్నత్యం అమ్మ తత్వమయింది. ఆధ్యాత్మిక శిఖరం అధిరోహానికి సోపానమయింది.

## భక్తి జ్ఞాన కర్మ యోగములకు ఆదర్శం ఆరాధ్యం అమ్మ

ఆధ్యాత్మిక చింతనలో నాలుగు యోగ మార్గాలు చెప్తారు. రాజయోగం, భక్తి యోగం, కర్మ యోగం , జ్ఞాన యోగం. నాలుగు మార్గాలలో అందరికి ఆదర్శం అమ్మ. భక్తి యోగానికి పునాది ప్రేమ తత్వం. అమ్మ యొక్క అద్వితీయ ప్రేమ తత్వం భక్తి యోగులకు ఆదర్శం ఆరాధ్యం. మాతృభావ భక్తి, మధుర భావ భక్తి, అర్చన, సేవా, దాస్య, స్మరణ, శ్రవణ, స్నేహ భావ, పితృభావ, ఈ రకంగా అన్ని రకాల భక్తి యోగాలకి అందుతూ , వీనిలోని అంటే భక్తి యోగంలోని మూల సూత్రమయిన ప్రేమ తత్వం తానయి, అందరికి ఆదర్శమయి, పరమపదం తానయిన ఆరాధ్య మూర్తియై విరాజిల్లింది అమ్మ.

జ్ఞానయోగం :- జ్ఞాన యోగానికి పునాది సదసద్వివేచన. ఏది నిత్యం, ఏది అనిత్యం అని వివేక వైరాగ్యలతో కూడుకున్న విచార మార్గం లేక వివేచన, అమ్మలోని వివేచనతో

కూడు కున్న తత్త్వ చింతన జ్ఞాన యోగులకు ఆదర్శం. ఆరాధ్యం అంతర్విచారం చేయుటం. ఒకసారి అమ్మ మన్నవలో చింత తోపుకు వెళ్తుంది. అప్పుడు చింతచెట్టు వంక చూస్తూ ఈ విధంగా విచారించటం జరిగింది. ఈ చింత చెట్టుకు చిగురు పూత పూస్తుంది. కాయలు కాస్తయ్ అవే దోర పండ్లు పండిన కాయలు అయి కాస్తయ్. కాని ఇవన్నీ ఒకేసారి రావు.దీనిలో ఇన్ని గుణాలు వున్నప్పటికి దేని కాలానికి దాని గుణం బయట పడుతుంది. అంటే గుణాలు కాలం చేతిలో వున్నయ్ అన్నమాట. ఈ సృష్టి కాలం, గుణం పదార్థం, యొక్క విభేధాల కలయికే అని భాగవతంలో వుంది. "పప్పంత ఉప్పు పోస్తే రుచిగా వుండదు, తినలేరు అందుకే ఈ విబేధం" అంటారు అమ్మ. పదార్ధం - గుణం కాలం చేతిలో వున్నయ్. ఈ విధంగా సృష్టి తత్వాన్ని విచార మార్గం ద్వారా జగత్తుకి అంద చేసింది. ఒక సందర్భంలో అమ్మ అంటుంది. "కనపడే అగ్ని లేనంత మాత్రాన అగ్ని తత్వము లేనట్లు కాదు, అగ్ని వేరు. అగ్ని తత్వము వేరు, మరొక సందర్భంలో ఆత్మ లోనిదే ఈ విశ్వమంతా అనెడి వేదాంత తత్వాన్ని ఈ విధంగా వివరిస్తుంది. "నేను నిద్ర లేచి కూర్చున్నాను. నా నెత్తి మీద పాము కనపడింది. ప్రక్కన ఎదురుకుండా చింత చెట్ల వంక చూస్తే అవికూడా అట్లాగే కనపడినవి. శివాలయం ధ్వజ స్తంభం వంక చూస్తే ద్వారం పొడుగునా భావన్నారాయణ స్వామి దేవాలయం వెళ్ళితే అక్కడా కనపడ్డది. చివరికి ఆ గుడిలో కూర్చుని ఆలోచిస్తే, ఇదంతా నాలోదే అని తేలింది." ఈ విధంగా తుది నిర్ణయం అంతా నాలోదే అని తేలింది. ఆత్మ లోనిదే ఇదంతా అనెడి తత్వాన్ని తన అనుభవంతో విచారించి సదసద్వివేచన ద్వారా ప్రకటించింది. ఇట్టి సద సద్విచారణ చేసేడి అమ్మలోని విచార మార్గం, జ్ఞాన యోగులకు ఆదర్శం - ఆరాధ్యం.

కర్మ యోగులకు ఆరాద్యం - ఆదర్శం :- కర్మ యోగానికి పునాది అనపేక్షమయిన త్యాగనిరతి నిస్వార్థ సమర్పణ. అమ్మజీవిత మంతా నిస్వార్ద సమర్పణయే. అమ్మచిన్నతనంలో తెనాలి రైల్వే స్టేషన్‌లో ఒక గుడ్డి ముసలవ్వ చిన్న పిల్లకి తన చేతికి వున్న బంగారు గాజు తీసి ఇచ్చి వేస్తుంది. దొప్పల పూడిలో తన దగ్గర వున్న బట్టలన్నీ ఒలిచి ఇచ్చి వేస్తుంది. బాపట్ల చిదంబరరావు గారి ఇంట్లో ఒకసారి అక్కడికి వచ్చిన భిక్షకులకు కిటికిలో నుండి బట్టలు అందచేస్తుంది. ఎవరికి ఎటువంటి సేవ చేస్తున్నా, ఏది ఇస్తున్నా ఎట్టి అహంకారం ప్రతిఫలాపేక్షలేని వాత్సల్యం తో చేసింది. ఎవరినో ఉద్ధరిస్తున్నాను అనో, సహాయం చేస్తున్నాను. అనెడి అహంభావం లవలేశమయినా లేకుండా, వారిదే వారికి ఇస్తున్నాను, అనెడి భావంతో దీనిలో తన ఔదార్యం ఏమీ లేదని సాటివారితో పరిపూర్ణ ఐక్యతాను సంధానంతో జరిగేది అమ్మ సేవించటం, ఇవ్వటం అమ్మలోని సహజ సిద్ధమయిన ప్రేమ, అనపేక్ష త్యాగనిరతి, కర్మ యోగానికి ఆదర్శం - ఆరాధ్యం.

4వది రాజయోగం : - రాజయోగానికి పునాది ప్రాణశక్తి. మనస్సేంద్రియనిరోధం. అమ్మ నెలల పిల్లగా వున్నప్పుడు ఒకసారి మన్నవలోను, మరొకసారి తెనాలి లోను శాంభవీ ముద్ర అమ్మకి వస్తుంది. శ్వాసలు కట్టుబడి మనస్సు అంతర్ముఖం అవుతుంది. ఎన్నోసార్లు సమాధ్యవస్థలు వస్తయ్. ఇవి అప్రయత్నంగా వచ్చేవి. ఒకసారి అమ్మ చిదంబరరావు గారితో ఈ విధంగా సంభాషణ చేస్తుంది.

అమ్మ :- తాతయ్య పిల్లి పోయింది అన్నారు. ఇక్కడే వుందిగా?

తాతయ్య (చిదంబరరావుగారు):- పిల్లి పోవటమంటే దాని ప్రాణం పోవటమమ్మా:

అమ్మ :- ప్రాణం పోవటమంటే?

చిదం :- శ్వాస ఆగి పోవటమమ్మా!

అప్పుడు అమ్మ పిల్లి ముక్కు దగ్గర చేయి పెట్టి చూపి దాని శ్వాస ఆగటం గమనిస్తుంది. తరువాత, తన ముక్కు దగ్గర చేయి పెట్టి చూసుకుని అట్లాగే శ్వాసను గమనిస్తుంది. అమ్మ శ్వాస ఆగిపోతుంది. అట్లా కొంతసేపు వుండి తరువాత మామూలు స్థితికి వస్తుంది. అప్పుడు అంటుంది. "శ్వాస ఆగింది కదా? మరి ప్రాణం పోలేదే?" అంటుంది. శ్వాస ఆగటానికి, ప్రాణం పోవటానికి సంబంధం లేదంటుంది. ఈ విధంగా అమ్మలోని ప్రాణ శక్తి - మనస్సేంద్రియ నిరోధం, ముద్రలు సమాధ్య వస్థలు అప్రయత్నంగా రావటం, వీని అన్నింటి మీద అమ్మకి కల ఆధిపత్యం రాజయోగులకు ఆదర్శం ఆరాధ్యం. ఈ విధంగా నాలుగు యోగముల వారికి అమ్మ ఆదర్శం ఆరాధ్యమై విరాజిల్లింది.

గుణ, భౌతిక సంపత్తులు -:- భౌతిక సంపత్తి, గుణ సంపత్తి విషయంలో ఒక కథ చెప్తారు. స్వాతంత్ర్యం వచ్చిన తరువాత జవహర్ లాల్ నెహ్రూ ఒక విషయం చెప్తూ వుండేవాడు. "స్వాతంత్ర్యం వచ్చింది. తేనెలు వర్షిస్తాయి. పాల నదులు ప్రవహిస్తాయి" అన్నారు. అదే విషయాన్ని పాఠశాలలో ఉపాధ్యాయులు వెల్ల వేయటం జరిగింది. అప్పుడు ఒక విద్యార్థి " పాల నదులు ప్రవహిస్తాయ్, తేనెలు వర్షిస్తయ్! బాగానే వుంది, వానిలో పురుగులు చీమలు పడ్తయ్ కదా? మరి నిరుపయోగం కదా?" అని ప్రశ్నించాడు, దీని అర్థం తేనెలే వర్షించినా, పాల నదులే ప్రవహించినా గుణాలు పురుగులు లాగ వుంటే సమాజం అస్తవ్యస్తంగా అవుతుందని తెలియ చేయటం. భౌతిక సంపత్తి ఎంతవున్నా ధర్మ నిష్ఠ, పవిత్ర వాత్సల్యం, త్యాగనిరతి, లాంటి ఉజ్వల గుణ సంపత్తి లోపిస్తే ఆ సంపదే సమాజంలో ఒకరినొకరు సాధించుకునే కసాయి వాని చేతిలో కత్తి అయి దురవస్థల పాలు చేస్తుంది. అందుకే అమ్మ భౌతికంలో దేనిని కాదనక, వానికి సక్రమంగా నడిపించే గుణ సంపత్తి, ఆధ్యాత్మిక నిరతికి కావలసినవి ఏర్పరచి ప్రబోధించింది. తను చేసినవి తనకు చేసినవినిరపేక్షమయిన ప్రవృత్తిలో చేసెడి పద్ధతి నెలకొల్పింది.అమ్మ వల్ల రక్షణ, పోషణ

జరుగుతుంది. అయినా ఇది వెఱ్ఱి తలలు ఎక్కకుండా పై విధానం. ఆచరణ యోగ్యమయిన ఆదర్శంతో, ఆధ్యాత్మిక, నిశ్రేయస్సు అంటే లౌకిక- ఆధ్యాత్మిక ప్రగతికి సుగతికి ఆధారభూతమయినది. బుద్ధి జీవులైన మానవులుగా దీనిని గ్రహించని పక్షంలో ఆదర్శ వ్యవస్థ అస్తవ్యస్తం అవుతుంది.

## ఆధ్యాత్మిక స్థితి గతులను నిత్య జీవితంలో ప్రవహింప చేయటం.

"ఆడేటప్పుడు బాల, లాలించేటప్పుడు లలిత, పంచభూతాల సమ్మేళనమే గాయత్రి' ' అని వివరించారు అమ్మ. లాలన, ఆదరణ ఎక్కడ వుందో అదే లలితా తత్వం. నిత్య జీవితంలో ఎందరో ఆదరణకి నోచు కోవలం లేదు. ఉదాహరణకి కేవటం పదార్ధం ఇవ్వటమే కాదు, ఏ తీపి పదార్ధమో ఇచ్చారనుకుంటే, ఇచ్చే వ్యక్తి విసురుగా కసురుకుంటూ అహంకారంతో చిట్లించిన మొహంతో ఇస్తే, ఆ పదార్ధం పుచ్చుకున్న వ్యక్తికి ఏ మాత్రం సంతృప్తి వుండక పోగా, ఆపదార్ధం కాల కూట విషంగా వుంటుంది. తీపి పదార్ధం చేతిలో పడినప్పటికి, నోటిలోకి వెళ్ళినప్పటికి హాయిని ఇవ్వదు. పదార్ధాన్ని న్యూనతా భావంతో (అల్పంగా తీసేసినట్లు) తీసుకోవటం మనిషిని కృంగదీస్తుంది. కేవలం బాహ్యమయిన క్రియ, పదార్ధమే కాక ఇచ్చే పద్ధతిలో ఉదాత్తమయిన ఆదరణ అనేడి భావాత్మక అనుభూతి ముఖ్యం. అప్పుడు పుచ్చుకునే వానికి న్యూనతా భావం వుండదు. సంతృప్తి వుంటుంది. దీనికి ఈ క్రింది కథ చక్కని, నీతిని తెలియ చేసే జ్ఞానాంజనమవుతుంది. కథ :- మహాభారతంలో ఒక సంఘటన. రాజసూయ యాగం జరుగుతూ వుంటుంది. భీముడు గద పట్టుకుని బంతుల మీద తిరుగుతూ వుంటాడు. "ఎవరైనా ఏ కాస్త పారేసినా వూరుకోను" అని భీకరంగా తిరుగుతూ వుంటాడు. అప్పుడు తినే వారంతా కాస్త ఎక్కువైతే ఏమవుతుందో ఏమోనని అర్ధ ఆకలితో లేస్తూ వుంటారు. లక్షమంది లేస్తే మ్రోగే ధర్మ గంట ఆగకుండా మ్రోగేది అంతకు ముందు అటు వంటిది భీముడు ఇట్లా తిరగటం మొదలు పెట్టిన తరువాత లక్ష మంది తిని లేస్తున్నా గంట మ్రోగటం మానేసింది. అందరూ ఏమిటిదని ఆశ్చర్య పడటం మొదలు పెట్టారు. విషయం తెలుసుకున్న కృష్ణ భగవానుడు భీముడ్ని పిలిచి ఇదేమిటి? ఈ విధంగా అయితే ఎవరికన్నా కడుపు నిండుతుందా? తిన్నప్పటికి అసంతృప్తి, భయంతో తింటే దానయాగఫలం ఎట్లా వుంటుందని? అడిగి భీముడ్ని అక్కడినుండి పంపిస్తాడు కృష్ణభగవానుడు. తరువాత ధర్మగంట మ్రోగుతుంది. కేవలం పదార్ధన్ని పెట్టడం కాకుండగ, ఎట్లా పెట్టాడు? అనేది ముఖ్యం. నిరహంకారంతో కూడుకున్న లాలన ఆదరణ అనేడి భావాత్మక స్ఫూర్తి, పవిత్ర ప్రేమ హృదయంతో కూడుకున్న వ్యవస్థకి ప్రతిరూపం అమ్మ ఉనికి, అమ్మ ద్వారా జరిగిన మహోత్కృష్ట కార్యక్రమాలు "లాలించేటప్పుడు లలిత" అనేడి అమ్మనోటినుండి ఒలికిన మహావాక్యం వెనుక ఇంతటి గంభీరార్ధం ఆధ్యాత్మికంగా,

సామాజికంగా ఉజ్వల స్థితిని నెలకొల్పుతూ, ప్రబోధిస్తూ వున్నది. రెండవది ఆడేటప్పుడు బాల అన్నారు అమ్మ. ఆటలలో తెలుసుకోవలసిన తత్వం "ఓడిపోయినా ఓడు పోకూడదు' ' అన్నది జీవితంలో పొందే పరాజయాలతో మనిషి కృంగి పోవటం కాక, నిలపడి జీవిత క్షేత్రంలో ఉన్నతుడు కావాలని తెలియచేయటం. ఉదాహరణకి ఒక చెక్క కుర్చీ వుందనుకుంటే అది లోపలంతా చెడిపోయి కూర్చుంటే విరిగి పోయెడి స్థితిలో వుంటే అది ఓడిపోవటం. దీనినే వ్యక్తి జీవితానికి, సమాజ జీవితానికి సమన్వయం చేసి జయాపజయాలకి కృంగిపోకుండా కర్మణ్యుడవ్వాలనితెలియ చేసింది. ధర్మరాజు మాయా జూదంలో ఓడిపోయి అరణ్యపాలై, ఎన్నో కష్టనష్టాలు వచ్చినప్పటికి తిరిగి విజేతలై ధర్మ రాజ్య స్థాపన చేశాడు. స్వామి వివేకానంద "అపజయాలే అందాన్ని ఇస్తయ్" అంటారు.రాణా ప్రతాప్ సింగ్ రాజ్యాన్ని కోల్పోయి అడవులలో తిరుగుతూ గడ్డి రొట్టెలు తింటూ స్వాత్మాభిమానంతో దేశభక్తి స్వాతంత్ర్య దీక్షని కోల్పోకుండా పోరాడి విజేత అయి రాజ్య స్థాపన చేశాడు. దైవ భక్తుల చరిత్రలు కోకొల్లలుగా ఇటువంటి స్థితిని తెలియ చేసెడివి వున్నయ్. అరవింద యోగి ఈ విధంగా చెప్తారు "అడ్డులేని కార్య సిద్ధి పొందటానికి అపజయ మనేది, కట్ట కడపటి తీవ్రావేగం అలవడటానికి అవరోధం అనేది, ఎంతగా అవసరమో నీవు గుర్తించ గలిగినప్పుడు, భగవంతుని కార్య పద్ధతులు మసక మసకగా ఏ కొంచమైనా నీకు అర్థం కావటం అనేదిప్రారంభవం అవుతుంది" అంటారు. "ఓడిపోయినా ఓడు పోకూడదు" అంటే ఇదే. ఇది ఆధ్యాత్మికంగాను, లౌకికంగాను వీగి పోని ప్రేరణను తెలియచేసే ఆదర్శ ప్రబోధం. బాల తత్వాన్ని ఈ విధంగా నిత్య జీవితంలో సకల సమాజానికి, వ్యక్తులకి సమన్వయం చేసి జీవితంలో గట్టితనాన్ని పెంచుకుని సత్ఫలితాలను సాధించెడి స్థైర్య సహనాన్ని, ఉత్సాహాన్ని ప్రసాదించటం జరిగింది బాల తత్వ ప్రబోధంలో "పంచభూతాల సమ్మేళనమే గాయత్రి" అన్నది పంచభూతాల సమ్మేళనం కానిదంటూ ఏమిలేదు. "విశ్వమసి విశ్వాయుః" అని గాయత్రీ ఆవాహనలో వుంది. ఈ విశ్వమంతా అయి వున్నదని, ఈ విశ్వ ఆయుఃకూడా అదేనని తెలియ చేశారు ఆర్యులు. విశ్వం పంచభూతాల సమ్మేళనమే. ఇదే విషయం గాయత్రీ అయిన అమ్మ నుండి వెలువడింది. స్థూలంగా చూస్తే ఎదురు కుండా కనపడే జగత్తు. తాత్వికంగా, సూక్ష్మంగా చూస్తే మనో బుద్ధి చిత్త అహంకారాలతోకూడుకున్న అంతఃకరణ చతుష్టయం, భావం ప్రేరణ అన్నీ వస్తయ్ వాయువు ఆకాశంతో మనస్సు, అగ్ని ఆకాశంతో బుద్ధి, జలం ఆకాశంతో చిత్తం, పృథ్వి ఆకాశంతో అగ్ని అహం నిర్మాణమయినవని తత్వవేత్తలు చెప్తారు. స్థూలంగా కనపడే దేహమే కాక, మనస్సు బుద్ధి, చిత్తం అహంకారమయిన, అంతరంగం కూడా పంచభూతాల యొక్క సూక్ష్మావస్థ అని తెలియ చేశారు. దీనికి మూలమయిన ప్రేరణ కూడా అదేనని చెప్తూ ఆయుః అన్నారు. ఆయుః అంటే ప్రాణశక్తి. మనకు వచ్చెడి సంకల్పం

అంతా ప్రాణశక్తికి ప్రతి రూపమని. మనం చూసే పదార్థమంతా ఆకాశానికి ప్రతిరూపమంటారు. ధ్యానంలో మనస్సుని ఏకాగ్రంగా నిర్మలం చెయ్యాలనేది ఇందుకే. ఆకాశం ప్రాణశక్తి యొక్క తాడనం వలన ఈ సృష్టి ఏర్పడింది అంటారు తత్వవేత్తలు. మనస్సుని ఏకాగ్రం చేసినప్పుడు శూన్యావస్థ ఏర్పడింది సంకల్పానికి మూలమయిన ప్రాణశక్తి నిరోధంతో సృష్టి ఏర్పడటానికి మొదటి దశకి వెళ్ళి అక్కడి నుండి మూలమయిన దివ్యత్వానుభూతి పొందటానికి ఆస్కారమవుతుంది. మరొకవిషయం పంచభూతాలకి మరొక వివరణ ఇస్తారు. శబ్దమేలక్షణంగా కలిగినది ఆకాశమని, స్పర్శయే లక్షణంగా కలిగినది వాయువు అని, రూపమే లక్షణంగా కలిగినది అగ్ని అని , రసమే అంటే రుచి (కేవలం ద్రవమని కాదు, అది కూడా లక్షణంగా కలిగినది జలమని, గంధమే లక్షణంగా కలిగినది భూమి (పృథ్వి) అని స్థూలమయిన పంచభూతాల వెనుక వాని సూక్ష్మ తత్వాన్ని వివరిస్తారు. ఇవి అన్నీ నిత్య జీవితంలో సర్వ సాధారణమయిన మానవులందరూ అనుభవించేవి. శిలగా వున్నది అది. శిల్పంగా మారింది అది. శిల్పంగా మార్చిన వ్యక్తి భౌతిక రూపం, వాని లోని ప్రేరణ కూడా అదే. నిరంతరం మనం దర్శించే ఈ జగత్తు రూపంలో ఆ తల్లి గాయత్రీ వున్నదని మన నిత్య అనుభవంలోని సకల విషయములతో ఆ దివ్యత్వాన్ని జోడించి తెలిచ చేసినారు అమ్మ. సర్వం తానయిన పరిపూర్ణ దివ్యమూర్తి, సర్వాన్ని సర్వంతో (అంటే దివ్యత్వంతో) సమన్వయం చేసి విశదీకరిస్తుంది కదా! ఈ విధంగా "ఆధ్యాత్మిక స్థితి గతులను నిత్య జీవితంలో ప్రవహింప చేసినది అమ్మ'

## అద్వైతం బహుముఖంగా సమన్వయం

అద్వైతం విషయంలో ఆధ్యాత్మికంగా అంతా ఆ బ్రహ్మతత్వమే అని చెప్తూ వుంటారు. "దృష్టి జ్ఞాన మయీం కృత్వాపశ్యేత్ బ్రహ్మ మయం జగత్" దృష్టి జ్ఞాన మయం అయినప్పుడు ఈ జగత్తు బ్రహ్మగా కనపడుతుంది."అని అద్వైతంలో చెపుతారు. ఇట్టి ఆధ్యాత్మిక పరాకాష్టని తెలియ చేస్తూ "నాకు ఎంత వెతికినా అది కానిదంటూ కనపడటం లేదు. అంతా అదే" అని ఘోషించింది. అదే అద్వైత తత్వాన్ని కటుంబపరంగా సమన్వయం చేస్తూ "కూతుర్ని కోడల్ని ఒకే రకంగా చూసుకోవటం అద్వైతం" అన్నారు అమ్మ. ఇది కటుంబపరమయిన సమన్వయం.

మరొక సందర్భంలో "నీ బిడ్డలో ఏది చూస్తున్నావో సాటివానిలో దానిని చూడడమే అద్వైతం" అని తెలియచేసింది. అమ్మ. ఇది సామాజికంగా అద్వైతాన్ని ప్రబోధించటం. ఈ విధంగా మన సామాజిక కుటుంబ స్థితి నుండి అద్వైతాన్ని నిలిపి ప్రబోధించినది. అద్వైతాన్ని వేదాంత పరంగానే కాక, ఆధ్యాత్మిక, సామాజిక, కటుంబ బహుముఖ కోణాల నుండి అద్వైతాన్ని ప్రవహింపచేశారు జగజ్జనని అయిన అమ్మ.

## ఆధ్యాత్మిక వ్యక్తిగత జీవితంలో గురుత్వాన్ని ప్రబోధించటం.

"గుర్తు చూపించిన వాడు గురువు" అన్నారు అమ్మ. దీని అర్థం ఆధ్యాత్మికంగా

దైవాన్ని గుర్తింపచేసినవాడని వివరించారు అమ్మ. అజ్ఞానమనే చీకటిని పారద్రోలే వాడని గురువుకి అర్థం చెపుతారు పూర్వీకులు. గుర్తించే గుర్త లేకపోతే దీపమున్నా గుర్తించరు అంటారు అమ్మ. చీకటి అనెడి పదం పూర్వీకులు వాడారంటే కేవలం బాహ్యమయిన చీకటిని కాదు. తెలియక పోవటం అని అర్థం. చీకటిలో వస్తువులున్నా ఏ వస్తువు ఏదో తెలియనట్లు, ఎంత వెలుతురు వున్నా రత్నాల షాపు వాడు నిజమయిన రత్నమేదో, రత్నం లాంటి రాయి ఏదో తెలుసుకోవటానికి ప్రత్యేకమయిన పరీక్షలు చేస్తాడు కదా? అమ్మ వివరించినట్లు గుర్తించే గుర్తు లేకపోతే దీపమున్నా గుర్తించ లేరు అనెడి విషయం ఇతః పూర్వం ఇచ్చిన ఉదాహరణ తెలియచేస్తుంది. గుర్తు చూపించే గురుత్వం లౌకిక రంగాలకి కూడా సమన్వయం అవుతుంది. ఈ ప్రకృతిలో వున్న జీవ జంతువుల దగ్గర్నుండి, ఎందరో గురువులు అవుతారు దత్తాత్రేయ స్వామికి. ఆయన స్వయంగా జగద్గురువు. ఉన్నతమయిన విషయ జ్ఞానాన్ని అందచేసిన జీవ జంతువులు, ప్రకృతి ఆయనకి గుర్తు చూపించిన గురువులు అయినయ్.

రెండవది " పరిస్థితులను మించిన గురువు లేదని ప్రకటించింది". మన నిత్య జీవితంలో ఎన్నో ఘట్టాలలో మనకు అప్పటికప్పుడు సమస్యను పరిష్కరించుకుండే ఆలోచనలు వస్తయ్. మనం ఇంతటి పనులు చేయగలమా? మనమేనా చేసింది? అనేటటువంటి అనుమానం వచ్చేటంతగా, కొన్ని కార్యాలు చేయగలగటం జరుగుతుంది. ఇతః పూర్వం మనం విన్న తత్వం మన హృదయానికి హత్తుకుని అర్థమయ్యేటట్లు కొన్ని పరిస్థితులు మనకు తెలియ చేస్తయ్. భౌతిక విజ్ఞాన శాస్త్ర వేత్తలు చేసెడి పరిశోధనలలో కూడా ఆయా ప్రయోగాలలో వచ్చెడి మార్పుల స్థితి గతులే కాదా? వారికి ఆ విషయ పరిజ్ఞానాన్ని ఇస్తున్నది. వ్యక్తి జీవితంలో, సమాజ జీవితంలో ఎదురయ్యే పరిస్థితులే గురువు అయి మార్గదర్శనం చేస్తుందని తెలియ-చేసింది అమ్మ. ఆధ్యాత్మిక, సామాజిక, వ్యక్తిగత, వైజ్ఞానిక రంగాలకి, విజ్ఞానమును కలుగ చేసేవి, చైతన్య ప్రదములయినవి, మూలంగా తీసుకొన వలసినో జాతిలో చైతన్యాన్ని కలుగ చేసి, అఖండ భరత వర్షం యొక్క ఏకాత్మతని జాగృతం చేసినవి, పరిస్థితుల యొక్క గురుత్వం సూక్ష్మమైనది. ఒక వ్యక్తి మరొక వ్యక్తికి చెప్పినట్లు స్థూలంగా చూపించగలిగేది కాదు. కాని అది సర్వ వ్యాపకమయినది. వెలుతురులో వ్యవసాయదారుడు తన పని చేసుకుంటాడు. అట్లాగే విద్యారంగం, వ్యాపార, కర్షక, కార్మిక ఈవిధంగా ఏరంగానికి ఆ రంగం తమ పనులను చేసుకుని ఫలితాలు పొందుతూ మనుగడని సాగించటం జరుగుతుంది. వెలుతురు ప్రత్యేకించి ఏ రంగం కాదు. కాని అన్ని రంగాలకి ఆధారమయి మానవ మనుగడకి కారణమయినది. ఒక్క మానవుడే కాదు, పశు పక్షి వృక్ష జంతు సంతులానికి జీవం పోస్తుంది. కాని అది అదిగా ఒక వ్యక్తి లాగ స్థూలంగా ఏది ఇస్తున్నట్లు కనపడదు. అది లేక దేనికి మనుగడ లేదు. అదే విధంగా అమ్మ ప్రకటించిన పరిస్థితులు కూడా సర్వ వ్యాపకమయిన

గురుత్వం అయినవి. ఆధ్యాత్మిక, వ్యక్తి గత జీవితంలో గురుత్వాన్ని సమన్వయం చేసి ప్రబోధించింది.

## వ్యక్తి శీలం, సమూహశీలం మాధవీయ హృదయ నిర్మాణానికి సందేశం

విశ్వ హిందూ పరిషత్ జనరల్ సెక్రటరీ శివ శంకర్ ఆప్టేజీ అమ్మని దర్శించినప్పుడు "ఏదైన సందేశమివ్వమని "అడిగారు. అప్పుడు అమ్మ "నీకున్నది తృప్తిగా అనుభవించు. ఇతరులకు ఆదరంగా పెట్టుకో, అంతా వాడే చేస్తున్నాడు అనుకో" అని సందేశం ఇచ్చింది. తృప్తి అనేది మనవునిలో చెలరేగే విపరీతపు స్వార్థాన్ని దురాశను తొలగిస్తుంది. తనకి వున్నంతలో సుఖంగా, శాంతంగా జీవించటానికి ఆధారమవుతుంది. ఈ విధంగా తన మనుగడను సాగిస్తూ సమాజానికి కీడు కలిగించే కంటకం కాకుండగ వుంటాడు. ఇది వ్యక్తి శీలాన్ని కలుగచేస్తుంది. సమూహానికి హాని చేయని వ్యక్తి శీలాన్ని నిర్మాణం చేసేది "నీకున్నది తృప్తిగా అనుభవించు" అనెడి సందేశం. రెండవది ఇతరులకు ఆదరంగా పెట్టుకొనమన్నది. కొందరు వ్యక్తి గతంగా తమ వరకూ స్వచ్ఛందంగా వుంటారే కాని సాటి వారు ఎంత బాధపడుతున్నా, చస్తున్నా పట్టించుకోరు. ఇది వ్యక్తిలో కఠోరత్వాన్ని పెంచుతోంది. ఆదరంగా పెట్టుకోవటం అంటే కేవలం అన్నమో, పండు ఫలం ఇవ్వటమే కాదు. కరుడు కట్టిన సంకుచిత హృదయం వికసించి సాటి సమాజంతో తాదాత్మ్యం చెందటం. కొందరు వ్యక్తులుగా పూజలు పునస్కారాలు చేస్తూ చీమకి కూడా హాని చేయనట్లు కనపడతారు. కాని డబ్బుకి దాసులై ఎటువంటి నైచ్యానికైనా దిగిజారుతారు, లేదా వారి అవసరాలకి సాటి వారిని అణచి తమ కోసం, సాటివారికి ప్రలోభాలు, దురాశలు చూపించి, పెట్టినట్లు కనపడతారు. స్వాతంత్ర్య సంగ్రామంలో దేశం కోసం ప్రాణాలు వొడ్డి పోరాడే విప్లవ వీరుల జాడలు, బ్రిటీష్ వారికి తెలియ చేసి దేశద్రోహులు అయిన వారు పైన వివరించిన చీమకైనా హాని చేయనట్లు కనపడుతూ డబ్బుకి, అధికారానికి, అవసరాలకి దాసులైన వారే. తమ అవసరాలకి ప్రలోభాలు చూపటం, లేక అవసరాలకి, అధికారాలకి ఇతరులకు హాని చేయుట ఆదరణ త్యాగనిరతి కాదు, అమ్మ ప్రబోధంలో ఆదరణ అనెడి పద ప్రయోగంలో వున్న ధర్మ సూక్ష్మమిదే. అందు వలన వ్యక్తి సమాజానికి కంటకం కాకుండగ వుండటమే కాక, సమాజ సుఖ శాంతులకు కల్యాణ కారకుడు అవ్వాలి. ఈ విధంగా వ్యక్తి సముహం పట్ల, సమూహం వ్యక్తి పట్ల పరస్పర సహకారంతో ఆత్మీయంగా జీవించే నిస్వార్థ మధురత్వాన్ని నింపేది " ఇతరులకు ఆదరంగా పెట్టుకో"నమని చెప్పటం. ఇది సమూహ శీలానికి సంబంధించిన ప్రబోధం.

మూడవది "అంతా వాడే చేయిస్తున్నాడనుకో". ఇతః పూర్వం వివరించినట్లు రెండు శీలములు వున్నప్పటికి, మంచి పని కూడా అహంకారం పెంచెతుంది, అది క్రమేపి ఎన్నో గుణాలకి దాస్యం అవుతుంది. అట్టి అహంకారం సామాజికంగా, ఆధ్యాత్మికంగా అనర్థాలకి

దారి తీస్తుంది. మానవునిలోని అహంకారం నశింపచేసేది " అంతా వాడే చేయిస్తున్నాడనుకోసుని" చేసిన ప్రబోధం.దైవ భావం, పవిత్ర భావం, విధేయతని పెంచి అహంకారం నశింపచేస్తుంది. దీనికి ఒక కథ చెప్తారు. దేవ దానవుల యుద్ధం జరిగిన తరువాత విజయం సాధించిన దేవతలు ఇంద్ర సభలో కొలువు చేశారు. అప్పుడు అగ్ని, వాయువు, ఎవరికి వారు విజయానికి నేను కారణమంటే, నేను కారణమని గర్వంగా ప్రకటించుకుంటారు. ఇంతలో ఆకాశంలో ఒక మెరుపు మెరుస్తుంది. అదేమిటో తెలుసుకుని రమ్మని అగ్నిని పంపుతాడు ఇంద్రుడు. అగ్ని వెళ్తాడు. ఆ దివ్యమూర్తి అగ్నిని "నీవు ఎవరు?" అని అడిచితే నేను అగ్నిని. ఈ జగత్తునంతా దగ్ధం చేయగలను. నా వల్లనే అన్నీ జీవిస్తున్నయ్"అంటాడు. అప్పుడు ఆ దివ్యమూర్తి " అట్లాగా?ఏది? ఆ గడ్డి పోచను దగ్ధం చెయ్యి" అంటుంది. అగ్ని తన శక్తి నంతా ఉపయోగించినా ఆ గడ్డి పోచ ఏ మాత్రం దహింపబడదు. ఏమీ చేయలేక నిర్వీర్యుడైన అగ్ని తిరిగి ఇంద్రుని దగ్గరికి వెళ్ళివిషయం వివరిస్తాడు. వెంటనే వాయువును పంపుతాడు ఇంద్రుడు, వాయువు వెళ్ళి "నేను వాయువును ఈ లోకాలన్ని కబలించి ఉఝ్ఝాతలూప గల బలవంతుడ్ని" అని చెప్తాడు. అప్పుడు ఆ దేవత "ఏదీ? ఆ గడ్డి పోచను కదిలించు" అంటుంది. వాయువు తన బలాన్నంతా ఉపయోగించి ప్రళయ ఝంఝూ మారుతమై, విలయ తాండవం చేసినా, ఆగడ్డి పోచ కదలదు. వాయువు తిరిగి వెళ్ళి ఇంద్రునికి చెప్తాడు. ఇధ్దే విధంగా అందరికి గర్వ భంగం కలుగుతుంది, అందరూ ఆశ్చర్యపోతారు. ఆ విద్యుత్తటీలత మాయ మవుతుంది. అప్పుడు పరమ శివుడు విజయం చేసి అంటారు "ఆ వచ్చినది ఎవరను కుంటున్నారు. అది శక్తి. ఆ శక్తి లేనిది మీరెవ్వరూ ఏమీ చేయ లేరు. మీరంతా నిమిత్త మాత్రులే" అంటారు. విజయ గర్వంతో విఱ్ఱ వీగిన వారంతా, అహంకారాన్ని వీడి చెంపలు వేసుకుంటారు. అంటే ఎంత మంచి పని కాని, దేవతలే అవ్వని, అహంకారం అనర్థాలకి దారి తీస్తుందని, అది కూడదని, దీని సారాంశం. మంచి-చెడు రెండూ సాపేక్షాలు. అంటే ఒక దానిని కోరుకునేవి, లేక ఆధార పడ్డవి అని అర్థం. రెండూ కూడా గుణం-పదార్థం-కాలపాశం మీద ఆధారపడ్డవి. మంచి సహితం అహంకారానికి దారి తీస్తే, అది (మంచి) దేని మీద ఆధారపడిందో అవి విశృంఖలంగా చెలరేగుతయ్. అనర్థాలకి దారి తీస్తుంది. దీని నుండి బయట పడాలంటే నిరపేక్షమయిన దివ్య స్థితిలో వుండాలి. దానికి అహంకారం నిర్మూలనమవ్వాలి. అది దివ్య భావం వలన కలుగుతుంది. మానవునిలో ధనం అధికారం, భౌతిక శక్తి వలన అహంకారం చెలరేగినప్పుడు దీనిని తొలగించేది "అంతా వాడే చేయిస్తున్నాడనే భావం. వాయువు తోనే అగ్ని జ్వలిస్తుంది. వాయువుతోనే అగ్ని ఆరిపోతుంది, అదే విధంగా అహంకార భావనను "అంతా వాడే చేయిస్తున్నాడనే" భావన తొలగిస్తుంది. ఇట్టి అహంకార నిర్మూలన మానవ సమాజం మధురంగా జీవిస్తూ, మధురత్వాన్ని అంద

చేస్తూ, ఆధ్యాత్మిక శిఖరాగ్రం అధిరోహించటానికి పట్టు కొమ్మ అవుతుంది. ఈ భావం స్వభావమయిన నాడు మధుర వాత్సల్య భావతరంగాల మలయ మారుతం విశ్వ వ్యాప్తమై, విశ్వ శాంతి జాహ్నవీ పరవల్లు త్రొక్కుతుంది.

"నీకున్నది తృప్తిగా అనుభవించు, ఇతరులకు ఆదరంగా పెట్టుకో. అంతా వాడే చేయిస్తున్నాడనుకో" అనెడి అమ్మ సందేశం వ్యక్తి శీలం, సమూహ శీలం అలవర్చుకుని సర్వత్రా అహంకార నిర్మూలనంతో కూడుకున్న మాధవీయ హృదయ నిర్మాణానికి మూల సూత్రం, ఆదర్శం అవుతుంది అమ్మ సందేశంలోని విశిష్టత ఇదే. వ్యక్తి శీలం, సమూహ శీలం, మాధవీయ హృదయ నిర్మాణం ఈ సందేశంలోని సారం.

## సర్వాంత ర్యామి అభివ్యక్తం

పరిపూర్ణ మూర్తి, ముక్తి ప్రదాయిని అయిన అమ్మ, పరిమితమయిన వ్యక్తిగా నిలిచి దరి చేర్చి మనలను తరింప చేసినది. 'పరిమితత్వం ఉన్నంత మాత్రన పూర్ణత్వానికి ఆటంకం లేదని" అమ్మ చెప్పినది. అట్టి దివ్య మాతృమూర్తి పరిమితమయిన దేహం ఉనికి సహితం సర్వాంతర్యామి అభివ్యక్తమే. దేహ చర్యల వర్ణన సకల ప్రకృతితో తాదాత్మ్యం చెందిన స్థితిని తెలియ చేయటమే అవుతుంది.

అమ్మకి సేవ చేస్తున్నప్పుడు ఒక్కొక్కప్పుడు కొండ రాయిలాగ, ఇనప రాడ్ లాగ అమ్మదేహం అవుతుంది. ఎంతో బలిష్టంగా వున్న వారం సహితం ఎంత పట్టు పట్టినా ఏ చలనం లేకుండగ, గుఱ్ఱు పెట్టి నిద్రపోయేది. మరొప్పుడు దూది, కుసుమంలా సున్నితంగా సుతి మెత్తగా వుంటుంది. అమ్మ అంటూ వుండేది "కొండలూ, కోనలూ అన్నీ నాలో వున్నాయ్" అని. ప్రకృతిలో అతి గట్టిగా వున్న తత్త్వం, మెత్తనైన తత్త్వం రెండూ కూడా అమ్మ దేహమందు ప్రతి స్పందించేది. అమ్మ ముఖములో రకరకాల రంగులు మారుతూ వుండేవి, ఎరుపు, గులాబి,నీలం, తెలుపు ఈ విధంగా ఎన్నో రకాల రంగులు మారుతూ వుండేవి. రకరకాల వాసనలు వస్తూ వుండేవి. ఎక్కడైనా పెద్ద పెద్ద భూకంపాలు కాని మరి ఏ ఇతరమయిన ప్రమాదాలు కాని వచ్చినప్పుడు అమ్మ చర్యలలో మార్పు వుండేది. 1966-67 మధ్యలో ఒక సంఘటన జరిగింది. ఒక రోజు సాయంత్రం 3-4 గంటల మధ్యలో ఒక అక్కయ్య బిల్డింగుల దగ్గరకి వచ్చి సమయం ఎతైందని అడిగి వెళ్ళింది. కొద్ది క్షణాల ముందే అమ్మ అన్నదట "నాకు శరీరమంతా కంపిస్తున్నది. సమయం ఎంతైందో కనుక్కుని రమ్మని పంపినది. అందువలన ఆవిడ వచ్చి టైమ్ అడిగి వెళ్ళింది. ఆవిడ అమ్మ దగ్గరకు వెళ్ళే లోగానే కొన్ని నిమిషాలలో బ్రహ్మాండమైన భూకంపం వచ్చింది. మరొకసారి 1980లో అమ్మకి ఊపిరి తిత్తుల సమస్య వచ్చి బాగా తీవ్రమయిన పరిస్థితి ఏర్పడింది. అందరూ అయోమయా వస్థలో పడ్డారు ఆక్సిజన్ సిలిండర్ తీసుకుని పైకి పరుగెత్తారు వైద్య సిబ్బంది. ఈ సందర్భంలో

కారు మబ్బులు కమ్ముకుని వచ్చి, విపరీతంగా పెనుగాలి వచ్చి చెట్లు ఊగిపోతూ ప్రకృతిలో అఖండమయిన మార్పు వచ్చింది. అదే సమయంలో మూడవ అంతస్తులో అమ్మ గదిలో వున్న డాక్టర్ ఇనజ కుమారికి , కిటికీ నుండి చూస్తే చాకలి చెరువు దగ్గర వున్న తాటి చెట్టు ఒకటి పూర్తిగా క్రిందకి పడుకొనటం, పైకిలేవటం, ఈ విధంగా కొంతసేపు జరిగి చివరికి నిలబడింది. ఇట్లా ఆమెకు కనపడింది. తరువాత కొద్దిగా వాన చినుకులు పడి ఆగి పోయింది. జగన్మాత అయిన అమ్మదేహం యొక్క ప్రకంపనలకి ప్రకృతి కంపించి కన్నీరు విడిచింది. 1985లో ఏడవ మైలులో సింహ ద్వారం ఊగటం మొదలు పెట్టింది. "ఇట్లా ఊగుతున్నది కదా?" అని ముందుకి వెనక్కి ఊగుతూ చూపించింది అమ్మ.

**1984** జనవరి ఒకటవ తారీఖున అమ్మ అర్ధరాత్రి పన్నెండు గంటలకి రావటానికి బదులుగా రెండు సెకండ్లు ఆలస్యంగా వచ్చారు. మరునాడు పేపర్లో విజ్ఞాన శాస్త్రవేత్తలు ఇచ్చిన సమాచారం వార్తా పత్రికలలో వచ్చింది. అదేమిటంటే భూగమనంలో రెండు సెకండ్లు ఆలస్యంగా తిరిగిందని. అందువలన క్రొత్త సంవత్సరం రావటం రెండు సెకండ్లు ఆలస్యమయినదని తెలియచేశారు. అమ్మ ఆలస్యానికి కారణమదని మరునాడు తెలుసుకున్నారు. ఎక్కడైనా ప్రకృతి వైపరీత్యాలు కలిగినా, ఎవరైనా గతించినా అమ్మ ప్రవర్తనలో మార్పు వుండేది. జిల్లెళ్ళమూడికి కబురు వచ్చిన తరువాత గాని అర్ధమయ్యేది కాదు, అమ్మ ప్రవర్తనలో ఆ విధమయిన మార్పు ఎందుకు వచ్చిందో, మనలాంటి పరిమితమయిన వ్యక్తిత్వం కాదు అమ్మది. విశ్వత్వంతో తాదాత్మ్యం కలిగిన వ్యక్తిం. అందువలన అమ్మ దేహ చర్యల వర్ణనలు సహితం సృష్టి స్పందనే స్వీయ స్పందనగా, విస్తరిల్లి విరాజిల్లినది. సర్వాంతర్యామి అభివ్యక్తం అయినది. ఇది కేవలం అనంతమయిన సృష్టి విషయం లోనే కాక అనంతమయిన సృష్టిలో జీవరాసుల విషయంలో కూడా ఒక సందర్భంలో అమ్మ ఆవరణలో వున్న ఆవు దూడ పోయింది. ఆవు దిగాలున పడి చూస్తూ వున్నది తన దూడని తీసుకుని వెళ్తుంటే. అదే సందర్భంలో అక్కడ వున్న వ్యక్తి ఆవు దగ్గరకు వెళ్ళి పాలు తీస్తున్నాడు. ఈ దృశ్యం చూసిన అమ్మ అన్నది "వాడు చూడు ఏ విధంగా పాలు తీస్తున్నాడో! ఒక వైపు బిడ్డ పోయి కన్నీరు కారుస్తూ తల్లి చూస్తుంటే చూడండ్రా ఎట్లా తీస్తున్నాడో, తీసుకుంటే తీసుకోండి మీ పాలు మీరు, నాకేమిటి అన్నట్లు నుల్చున్నది అది. తన దుఃఖ భారం అనుభవిస్తూనే, కసరకుండా వీరికి కావలసిన పాలు ఇస్తూ ఎట్లా వున్నదో చూడమన్నది" అంట ఒక స్థిత ప్రజ్ఞని స్థితి అయినది ఆ గోమాతది. అదీ కాక ఆ పరిస్థితిలో దాని అంతరంగం తానే వివరించింది. ఇట్టి సర్వాంతర్యామి యొక్క అభివ్యక్తం ఎన్నో సందర్భాలలో జరిగినది.

## పరిస్థితులకు అతీతమయిన సహజ స్థితి

పరిపూర్ణులైన మహాత్ములు ఉనికి భౌతికమయిన పరిస్థితులకు అతీతంగా వుంటుంది.

వారి సహజ ప్రేమ కాని, నిరహంకార ప్రవృత్తి కాని మారదు. కృష్ణ భగవానుడు ఎంతటి ఐశ్వర్య వంతుడు, పరాక్రమ, జ్ఞానవంతుడో అంతటి సహజ ప్రేమ, వినయ వంతుడు. అంతఃపురాలు, ఐశ్వర్యాల వల్ల ఆయన సహజ స్థితిని కోల్పోలేదు. దీనికి ఉదాహరణాగా చిన్ననాటి స్నేహితుడు కుచేలుడు వస్తే, తాను స్వయంగా పాదాలు కడిగి సేవించి అఖండ ఐశ్వర్యాలు ప్రసాదించాడు.

అమ్మ భౌతికమయిన స్థితిని చూసి, కొందరు ఎల్ల వేళల పొంగులు వారే అమ్మ ప్రేమని, సహజ స్థితిని తెలుసుకోలేరు. ఒకవైపు కిరీటం - త్రిశూలం, సర్వాభరణ భూషితమై వున్న అమ్మని దర్శించటం జరుగుతుంది. మరొకవైపు బాధపడే వృద్ధుల తోను, లేదా ఎవరు ఏ విధమైన బాధ పడుతున్నా వారి బాధలను పంచుకుని సేద తీరుస్తుంది. ఒకసారి అమ్మ కల్యాణ దినోత్సవానికి వేదిక అలంకారం విషయం వస్తే అమ్మ ఈ విధంగా అన్నది. "మీరు అలంకారాలు ఎంత గొప్పగా చేశారు అని నాకు వుండదు. అప్పుడే ఎవరైనా ఎండలో వచ్చారనుకో! వారికి ఏదైనా పెడతారా? లేదా? వీరందరికి ఆకలి వేస్తుంటే తొందరగా అన్నం పెడితే బాగుండును. ఈ విధంగా ఆలోచిస్తాను. ఈ అలంకారాలు మీకోసం - నాకు వీటి మీద మనస్సు వుండదు. " అన్నది. గోవిందరాజుల దత్తుగారు ఒక పుట్టినరోజున అమ్మచెంతకు పోయి "అమ్మా! నువ్వు ఒక గంట అలస్యంగా వస్తే బంతి ఒకటి లేస్తుంది.' ' అన అంటే "అంతకంటే కావలసినది ఏం వుంది నాన్నా! నా పూజ ముఖ్యంకాదు, వాళ్ళు భోజనం చెయ్యటం ముఖ్యం" అన్నది. నిరంతరం అమ్మ మనస్సు బిడ్డల ఆకలిని గురించి అందరియోగక్షేమాలని గురించి పరితపిస్తుంది.

అమ్మ నెల్లూరు వెళ్ళినప్పుడు జరిగిన సంఘటన. నెల్లూరులో వున్న జనులు, పరిసర ప్రాంతంలో వున్న వారంతా కూడా దర్శనానికి అని అక్కడికి వచ్చారు. అప్పటికి స్వర్ణోత్సవాలు జరిగినవి. లక్షమంది ఒకే పంక్తిలో భోజనం చెయ్యటం జరిగింది. ఇటువంటి మహత్తర కార్యక్రమాలు ఎన్నో జరిగినవి. నెల్లూరులో బ్రహ్మాండమయిన జనకోటి అమ్మని దర్శించారు. ఈ విధంగా ప్రశంసలు, కీర్తి, మహాజనం దర్శించటం వంటివి ఎన్నో జరిగినవి. ఇవి అన్నీ మానవునిలోని అహంకారాన్ని పెంచి సమతూకాన్ని, సహజ స్థితిని కోల్పోయేటట్లు చేస్తయ్ సాధరణ మానవునికి. కాని సర్వత్రా నిండిన మాతృత్వం, సహజమయిన అమ్మకి ఇట్టివి ఏమి చేస్తయ్?. ఆ సందర్భంలో అమ్మతో అనుసరిస్తూ కొంతమంది వెళ్ళారు. వారిలో సోదరుడు పరబ్రహ్మ మూర్తి ఒకరు. పరబ్రహ్మ మూర్తితో అమ్మ "ఇక్కడ మన వాళ్ళు ఎంతమంది వున్నారు" అన్నది. పరబ్రహ్మ మూర్తి 50 మందో 60 మందో అన్నాడు. అమ్మ మన వాళ్ళంటే వీళ్ళు కాదురా! మురికి వాడలలో వున్న వారు, ఫుట్‌పాత్ మీద వున్న యాచకులు, వీధులలో తిరుగుతున్నభిక్షకులు, వారంతా ఎంతమంది వున్నారో కనుక్కొనిరా!

వీళ్ళందరికి పులిహోర, దద్దోజనం కడుపు నిండా పెట్టుకోవాలని వున్నది" అని వివరించింది. తరువాత వారందరికి ఆ విధంగా పెట్టుకొనటం జరిగింది.1977 తుఫాను తరువాత అమ్మ దివి సీమ వెళ్ళి అందరికి ప్రసాదం పంచి పెట్టింది. తరువాత బాపట్లలో వున్నది అమ్మ. ఆ సందర్భంలో రాష్ట్రీయ స్వయం సేవక సంఘం చేస్తున్న సేవా కార్యక్రమాలలో పాల్గొంటున్న వ్యక్తి అమ్మ దగ్గరకు వచ్చారు. ఆ సందర్భాన్ని గురించి చెప్తూ అమ్మనాతో ఈ విధంగా అన్నది. "వాడు నాదగ్గరకు వచ్చాడురా! అప్పుడు నీవు చేస్తున్న సేవ ముఖ్యం. నాదగ్గరకు రావటం ముఖ్యం కాదు. అదంతా నా సేవే అన్నాను వాడితో'' అంటే ఎక్కడికక్కడ సకల సమాజంతో, అనంత విశ్వంతో తాదాత్మ్యం వున్న సహజ స్థితి అమ్మది.

ఎప్పుడో చాలా కాలం పూర్వం ఈ జన సందోహం జిల్లెళ్ళమూడి రాక ముందు ఒక సోదరునికి అమ్మ అతని వివాహానికి వస్తానని మాట ఇచ్చినది. అమ్మ పేరు ప్రఖ్యాతులు దశ దిశల వ్యాపించటం మొదలైన తరువాత అతను వివాహం చేసుకొనబోతూ జిల్లెళ్ళమూడి వచ్చి అమ్మని "అమ్మా! నీవు నావివాహానికి వస్తానని మాట ఇచ్చావ్ వస్తావా?అని గుర్తు చేస్తూ అడిగితే, అమ్మ "గుర్తు వుంది నాన్నా!. తప్పకుండా వస్తానని చెప్పి, తరువాత నలుగురైదుగురు మాత్రమే తనతో తీసుకుని నర్సరావుపేటలో జరిగిన అతని వివాహానికి వెళ్ళి శుభాశీస్సులు అందచేసి వచ్చింది. ఎందుకంటే అతను ఆర్థికంగా వున్నవాడు కానందున కొద్ది మందితో వెళ్ళి రావటం జరిగినది. కలిమిలేములకి అతీతమయిన మరపులేని మరపురాని దివ్య వాత్సల్యం అమ్మది. ఈ జనం రావటం, పట్టు చీనాంబరాలు, కిరీటం, మొదలైన సర్వాభరణాలతో పూజలు చేయటం, ఇటువంటి వాని వలన అమ్మ ఏమీ తొణికిసలాడదు. అందువలన పరిస్థితులకు అతీతమయిన సహజస్థితి అమ్మది కనుక ఆ విధంగా వెళ్ళి రావటం జరిగింది. అతనికి ఎనలేని సంతృప్తి, ఆనందం కలిగింది. ఇట్టి సంఘటనలు ఎన్నో. ఇదే పరిస్థితులకు అతీతమయిన సహజ స్థితి.

## వ్యక్తి ఆరాధన - తత్వారాధన విశ్లేషణ

ఈనాడు ఆధ్యాత్మిక, సామాజిక రంగాల నుండి ఆఖరికి రాజకీయ రంగం వఱకు వ్యక్తి ఆరాధన-తత్వారాధన చర్చ సాగుతున్నది. ఈ విషయానికి వచ్చేటప్పటికి లోతైన చింతనలేని వారు అమ్మది, వ్యక్తి ఆరాధన అనెడి భావం వ్యక్త పరుస్తారు. అది పూర్తిగా అర్థరహితం. అసలు ఆరాధనకి భూమిక ఏమిటి?. ఆరాధనయే వ్యక్తి . వ్యక్తి అంటే కేవలం ఒక మనిషని కాదు. పరిమితత్వం అని అర్థం. తాత్వికంగా తీసుకోవాలి. సంపూర్ణత్వం సిద్ధించిన వారికి ఆరాధనతో పనిలేదు. పరిపూర్ణమయిన దైవాన్ని మనం ఆరాధించటానికి, దానికి ప్రతిరూపంగా మనం ఏర్పరచుకున్న పరిమితమయిన రూపము లేక సృష్టించుకున్న ఆరాధనా వ్యవస్థ , ఆరాధనకి భూమిక అవుతుంది. "రూపం అంటే విగ్రహమే కాదు. భావం,

నామం కూడా రూపమే.'' ఇది అమ్మ ప్రబోధం. అటే ఒక ఆదర్శాన్ని, తత్వాన్ని భావించటం, నామాన్ని సృష్టించు కోవటం సహితం రూపమే. ఇదే పరిమితత్వం. ఇదే వ్యక్తి తత్వారాధకుటం అనుకునే వారి వ్యవస్థలో వారి అధినేతకి అచ్చు తీసినట్లు వారి పంథా కనపడుతుంది. అంటే ఒక రకంగా వారిది వ్యక్తి ఆరాధన.-ఈ వ్యక్తిని కూర్చొన పెట్టి, కిరీటం పెట్టి పూజ చేస్తున్నట్లు కనపడక పోయినా, అది వ్యక్తి ఆరాధనయే. వ్యక్తిగా పూజ చేసుకున్న అమ్మ యొక్క ఆరాధన తత్వారాధనయే. ఎందువల్లనంటే ఒక ఉజ్వల పరిపూర్ణమూర్తిగా అమ్మని ఆరాధించారు. కిరీటం, త్రిశూలం పెట్టి ఆరాధించటం కూడా జరిగింది. ఇది వ్యక్తి ఆరాధనకి భూమిక అనటం అవగాహన లేక పోవటమే. మనం ఆపాదించుకున్న తత్వానికి రూప కల్పన చేసుకుని పూజించటం తాత్విక భావం నిలవటానికి భౌతికమయిన రూప కల్పన మాత్రమే. కిరీటం, త్రిశూలం నాలుగు చేతులు దైవమని అమ్మ చెప్పలేదు. సర్వత్రా ఉన్న శక్తి, దైవం అని వివరించారు అమ్మ.

"పూజ చేసుకోండి'' అనే వారు అమ్మ. "పూజ చెయ్యండి'' అని ఎప్పుడూ అనేవారు కాదు. అంటే ఎవరికి వారు వారి మానసిక ఇష్టాన్ని బట్టి అర్చించుకునే అవకాశం కలుగ చేసినదే కాని, చేయించుకోవటం కాదు. ఎవరికి వారు వారి సహజ సిద్ధమయిన మానసిక స్థితి గతులకు కావలసిన మరమ్మత్తులకు వదిలి వేసే వారు అమ్మ. ఎవరిని ఒక నమూనాగా తయారు చేసెడి పద్ధతి కాదు. తను ప్రేమించటానికి ఎంత స్వేచ్ఛగా వుంటుందో, మనం ఆరాధించటానికి, ఆరాధించక పోవటానికి అంతటి స్వతంత్రతని వదిలివేస్తుంది. ఇట్టి మహోజ్జ్వల లక్ష్య లక్షణాలు కలిగిన సహజ స్థితియే తత్వారాధనకి భూమిక. కలకండ కొండ,తీపి రెండూ వేరు కానట్లు అలౌకిక మూర్తి అయిన అమ్మ - దివ్య మాతృత్వం వేరుకాదు. నీకు తీపి కావాలా? కలకండ కావాలా? అంటే ఒక దానికి అన్యంగా మరొకటి లేనట్లు , అమ్మ అనెడి వ్యక్తి అట్టి దివ్య మాతృత్వం అయినది. ఇట్టి మహనీయమయిన అమ్మ ఆరాధన తత్వారాధనయే. 'దేహం కూడా ఆత్మే అయిన అమ్మని ఆరాధించటం దివ్యాత్మ ఆరాధనయే' '. దీనికి సంబంధించిన విషయం వివరంగా తెలుసుకొనదలచిన వారు " అమృతవాహిని'' అనెడి పుస్తకంలో "వ్యక్తి ఆరాధన - తత్వారాధన'' అనెడి వ్యాసం అధ్యయనం చేయవలసింది. సూక్ష్మంగా మూల సూత్రం ఈ వ్యాసంలో వ్రాశాను. స్థూలంగా వివరణ కావాలంటే ఇతః పూర్వం తెలియ చేసిన వ్యాసం చదువవలసినదని తెలియచేయటమైనది.

"పరిపూర్ణులైన తరువాత స్వతంత్ర పరిచ్ఛేదాన్ని కల్పించుకుంటారు'' అంటారు వివేకానంద. అది పరిచ్ఛేదమే అయినా స్వతంత్రమయినది.



మన్నవ దత్తాత్రేయ శర్మ

అమ్మ సాన్నిధ్యంలో 1965 నుండి సేవలు

చేసుకుంటూ జీవితం గడుపుతున్నాను.

1985 జూన్ 12 న అమ్మ మహాసిద్ధి పొందిన

తరువాత అమ్మని గురించి

రచన చేయటమే జీవితం అయినది.

1984 సెప్టెంబర్‌లో నువ్వు కూడా రాయరా !

నువ్వు ఇక్కడ చూసింది, అనుభవించింది.

నీధ్యేయం నీ చింతనలో వచ్చిన మార్పులు రాయి అన్నారు.

"ఒకనాటి మాట మరొకనాటికి బాట అన్నారు అమ్మ".

తన సూక్తికి తగినట్లుగా 1984 సెప్టెంబర్‌లో అమ్మ సందేశం,

1985 జూన్ 12 తరువాత బాట అయి వ్రాయటం జరిగింది.

అమ్మ చింతనే జీవితం, జీవనమై నడుపుతున్న

అమ్మకి నమస్సుమాంజలులు సమర్పిస్తూ

ఇట్లు